# యోగవియోగములు

చింతలపాటి వెంకటసుబ్బ[illegible]
బహూకరించినది
1972

రవీంద్రనాథ ఠాకూర్

విశ్వభారతి ఏజన్సీ
490, తిరువట్టూర్ హైరోడ్
మద్రాసు

విశ్వభారతి గ్రంథమాల

ప్ర కా శ కు డు

కా రు మూ రి వై కుం ఠ రా వు

దొరకు చోటు:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి

బ్రాంచీలు: రాజమండ్రి, విశాఖపట్టణము, విజయవాడ

# యోగ వియోగములు

నేడు ఆషాఢ శుద్ధ సప్తమి, అవినాశ ఘోషాల్ పుట్టిన రోజు. అతనికి ముప్పై రెండేళ్లు. అతన్ని అభినందించే టెలిగ్రాములు, ఉదయమునుంచి వస్తున్నవి. మిత్రులు పూల బంతులు పంపుతున్నారు.

ఇదే కథా ప్రారంభము. కాని ఆరంభానికి పూర్వమే కథ ప్రారంభం అవుతుంది. దీపం వెలిగించడం చీకటి పడుతున్నప్పుడే. కాని దీపానికి అవసరమయే వత్తులు ముందుగానే తయారుచేసి ఉంచాలి కదా.

ఈ కథా ప్రారంభాన్ని కనిపెట్టే ఉద్దేశముతో పౌరాణికయుగాన్ని గాలించినట్లైతే ఘోషాల్ వంశంవారు ఒకానొకప్పుడు సుందరవన ప్రాంతంలో ఉండేవారనీ, పిమ్మట హుగ్లీ జిల్లాలోని నూర్ నగర్ కు వచ్చారనీ విశదమవుతుంది. ఇలా జరగడానికి కారణం లోపలనుండి సంఘము పొడిచిన పోట్లో లేక బయటను జరిగిన పోర్చుగీసువారి ఆక్రమణో చెప్పలేము. తాత తండ్రులనాటి వసతులను వదలుకొనిపోయినవాళ్లకే పౌరుషముతో కొత్త ఇళ్లు కట్టుకొనే శక్తికూడా ఉంటుంది. కనుకనే ఘోషాల్ వంశమువారు ఐతిహాసికయుగంలో, అనగా రెండో యుగంలో, గొప్పమేడలూ భవంతులూ, తోటలూ

భూములూ, పాడీ పంటలూ కలిగి బంధుపరివారాలతో కడు వైభవంగా జీవనయాత్ర చేయగలిగారు. వాళ్ల స్వగ్రామంలో సుమారు మూడు ఎకరాల విస్తీర్ణముగల చెరువు నేటివరకు ఉన్నది, దానిపేరు ఘోషాల్ చెరువు; నాచు అనే ముసుగు లోపలనుండి ఘోషాలు వంశంవారి గతగౌరవాన్ని ఆచెరువు ప్రకటిస్తూ ఉంటుంది. కాని ఆ చెరువు పేరుకుమాత్రమే ఘోషాల్ కుటుంబమువారిది, దానినీరు చాటర్జీవంశమువారిది. ఘోషాలుల పూర్వపురుషులప్రభావం ఎట్లాగు అంతరించిందో తెలుసుకోవలసిన విషయం.

వీరిచరిత్రయొక్క మధ్యమపరిచ్ఛేదంలో వీరికి చాటర్జీ జమీందారులతో కలహాలు పుట్టినవి. కాని ఆ కలహాలు ఆస్తులనుగురించి కాదు, దేవీపూజనుగురించి. చాటర్జీలను ధిక్కరిద్దామని వాళ్ల దేవీవిగ్రహంకంటె రెండుమూరలెత్తైన ప్రతిమను చేయించారు ఘోషాలులు. దానికి సరియైన జవాబిచ్చారు చాటర్జీలు; మర్నాడు దేవిని బయటికి తీస్తారు విసర్జనకు, రాత్రికిరాత్రి దారిపొడుగునా సరీగ విగ్రహము తలకు అడ్డువచ్చేటట్లు తోరణాలు కట్టించేశారు. పొడవు విగ్రహముగలవారు ఆ తోరణాలను తెంపుతామని బయలుదేరారు, పొట్టివిగ్రహము గలవారు పెద్దవిగ్రహముపీక నరుకుతామని లేచారు. దీని ఫలితముగా దుర్గాదేవికి ప్రతిసంవత్సరంకంటె ఆ ఏడు చాలా అధికంగా రక్తం ప్రాప్తించింది. కొట్టుకోడము తలలు పగలడము

జరిగి కోర్టులెక్కారు, కోర్టులనుండి బయట పడేటప్పటికి ఘోషాలు వంశంవారు దివాలాదాకా వచ్చారు.

నిప్పు చల్లారింది, కర్రలన్నీ ఖర్చయిపోయినవి, మిగిలినదల్లా బూడిదే. చాటర్జీలధనలక్ష్మీముఖము కూడా తెల్లబారి పోయింది. వేరుదారి లేదనుకొని సంధిచేసుకొంటే బాగుండును కాని దానివల్ల మనస్సుకు శాంతి కలుగదే! యుద్ధానంతరము చూచినప్పటికి జయించి నిలబడి ఉన్నవారి మనస్సులూ, వీగి కూలబడ్డ వారి మనస్సులూ ఇద్దరివీకూడా ఇంకా గుర్రు గుర్రు మంటున్నవి. చాటర్జీలు ఘోషాలులకు సాంఘిక-అస్త్రముద్వారా ఆఖరిపోటు పొడిచారు—'ఘోషాల్లు తక్కువ జాతి భంగజ బ్రాహ్మణులనిన్నీ వానపాములకు పడగలువచ్చి నాగుపాములయిన' వనిన్నీ చాటడం మొదలుపెట్టారు. ఈ పొడుపుమాట లాడించేశక్తి రూపాయలవల్ల కలిగినది. కనుకనే వీరన్నదానికి ప్రమాణంగా స్మృతివాక్యాలను ఏకరువు పెట్టుతూ డోలువాయించుకు తిరిగే పండితరత్నాలుకూడా దొరకారు. ఈకళంక నివారణానికి తగిన దక్షిణగాని ప్రమాణాలుగాని ఘోషాలుల చేతులలో ఆరోజులలో లేవు. కనుక సనాతన హిందూసంఘము కలిగించిన బాధలు సహించలేక తిరిగి వారు స్వగృహం విడిచిపెట్టుకోవలసి వచ్చింది. అప్పుడు రజబ్‌పూర్ అనే గ్రామంలో సామాన్యమైనవసతులు ఏర్పరుచుకొన్నారు.

దెబ్బకొట్టినవాళ్లు ఆ దెబ్బమాట మరిచిపోతారు. కాని దెబ్బతిన్నవాళ్లు అంతసులభంగా మరవలేరే! దుడ్డు చేతిలో నుండి జారిపోతుంటుంది గనుకనే మనస్సులో ఆ దుడ్డు సదా నాట్యం చేస్తూఉంటుంది. చేతులు చచ్చుపడిఉండడంచేత మానసికదండాలు వంశపరంపరగా వస్తూఉంటవి. మధ్యమధ్యను వీళ్లు చాటర్జీలకు కలిగించిన చీకాకులనుగురించి నిజమూ అబద్ధమూ కలిపిన కథలు అనేకంగా ప్రచలితమై ఉండెను. వర్షకాలం సంధ్యవేళ గడ్డింటిఅరుగుమీదను కూర్చొని పిల్లలు ఆ కథలన్నీ అతి వింతగా వింటూఉండేవారు. 'దాశు' అనే సర్దారు, బలానికి పేరుపడ్డవాడు, చాటూర్జీల పరివారంలో ఉండేవాడు. ఒకనాడు ఇరవై పాతికమంది ఘోషాలుల మనుష్యులు బాణా కర్రలతో చాటర్జీలఇంటికివెళ్లి ఆ సర్దార్‌ను తమకచ్చేరి అంగణంలోకి తీసుకువచ్చి రాత్రికిరాత్రి మాయం చేసేశారని నూరు సంవత్సరాయిలనా ఇప్పటికీ ఘోషాలుల ఇంట్లో చెప్పుకొంటూన్నారు. పోలీసువాళ్లు భోగట్టాకని వచ్చారట; గ్రామనాయుడు, భువన్ విశ్వాస్, బహునిర్లక్ష్యంగా జబాబు చెప్పాడు—"ఔను వాళ్ల సర్దార్ ఏదో తన పని మీద వచ్చాడు, నిజమే; మాచేతిలోపడ్డాడు, గనుక వెధవకు తగిన అవమానం జరిగించి పంపించేశాము, సిగ్గుభరించలేక పారిపోయి బైరాగి అయిపోయినాడట." కాని కలక్టర్‌గారికి మాత్రం నమ్మకం కలగకపోవడం చూచి భువన్ అన్నాడట— "ఒక్క సంవత్సరంలోగా వాడెక్కడఉన్నది హాజోర్ వారికి

నేను తెలియపరచలేకపోతే నాపేరు భువన్ విశ్వాస్ కాదు మహాప్రభూ," అని. ఎక్కడెక్కడో వెదికి సరిగ దాశుఅంత పొడవైన గుండా ఒకణ్ణి జాగ్రత్తపెట్టారు. వాణ్ణి ఢాకా పంపించి అక్కడ వాడిచేత ఒకచెంబును దొంగలాడించారు. పోలీసువాళ్లు పేరడిగినప్పుడు తనపేరు దాశరథి మండల్ అని చెప్పాడు. చోరీచేసినందుకు మాసం ఖైదయింది. వాడికి జైలు నుండి విడుదల అవబోయే రోజున భువన్విశ్వాస్ కలక్టర్ గారి దగ్గిరికివచ్చి, సర్దార్ ఢాకాజైలులో ఉన్నాడని రిపోర్టు ఇచ్చాడు. ఫోగట్టా చేయగా దాశు జైలులో ఉండెననీన్నీ, విడుదలపొందిననాడు జైలుఎదుట నుండే బయలుమీద తన దుప్పటి పారేసి వెళ్లిపోయినాడనిన్నీ తెలిసింది. ఆ దుప్పటి దాశు సర్దార్ దే నట. అటుతరువాత మరి దాశు ఎక్కడికి పోయినాడో తెలుసుకొనే బాధ్యత భువన్విశ్వాసుది కాదు.

ప్రస్తుతం దివాలాఅవస్థలో ఉన్నవారు వెనుక తాము గొప్పగా బ్రతికినరోజులనాటి బ్యాంక్ చెక్కులు చూపించి సంతోషిస్తున్నట్టుగా ఘోషాల్లు ఇటువంటికథలతో ఇప్పుడు మనశ్శాంతి కలుగచేసుకొంటున్నారు. వాళ్లగౌరవం అంతరించింది. కనుకనే గౌరవంమాట ఇంతబిగ్గరగా చెప్పుకోవలసిన అవసరము వచ్చింది.

ఎట్లాగైతేనేమి, చమురు అయిపోయి దీపం ఆరిపోయి నట్లుగానే రాత్రికూడా తెల్లవారుతుంది కదా. అవినాశుని తండ్రిఅయిన మధుసూదనుని అదృష్టబలంవల్ల ఘోషాల్ వంశంమీాద సూర్యోదయం అయింది.

౨

మధుసూదనుని తండ్రి, ఆనంద ఘోషాల్, రజబ్ పూర్ అడితిదారుల దగ్గిర గుమాస్తాగా ఉండేవాడు. ముతకబట్ట, ముతక బియ్యపు అన్నముతోనే అతని రోజులు గడిచిపోయి నవి. ఆడవాళ్ల చేతులకుండే ఆభరణాలు శంఖపుగాజేలు, *ఇనప గాజేలు; పురుషుల మెడలను ఇత్తడి తాయెత్తులు, మూరేడు ముద్దతో తోమిన తెల్లని జంద్యాలు. వీరికి ప్రాప్తించవలసిన బ్రాహ్మణ మర్యాదలు క్షీణిస్తూవచ్చినకొలదీ వీరి యజ్ఞోప వీతాలు పొడవౌతూ వచ్చినవి. మధుసూదనుని విద్యా ప్రారంభం పల్లెటూరి బడిలో. ఇదికాక ఏటిబడ్డునా, అడితుల ఎదుటా, చేకుబేళ్ల మీాదను కూర్చొని డబ్బుఖర్చులేకుండా నేర్చుకొన్న విద్యా ఉండనే ఉండేది. సరుకు నాణ్యంచూడ డానికివచ్చిన ఖరీదుదారులమధ్యనూ వాళ్లతోవచ్చిన బళ్లవాళ్ల మధ్యనూ ఆటవిడుపుగా తిరిగేవాడు మధు. టిన్ రేకుతో కట్టిన పాలల్లో బెల్లపుకుండలు బల్లలమీాద పేర్చి ఉండేవి. అక్కడ ఉండే పొగాకు కట్టలూ, సీమదుప్పట్ల మూటలూ, ఆవాల కుప్పలూ, కెరసీన్ డబ్బాలూ, మినుగుల బస్తాలూ, అంగణములో వేలగట్టిన పెద్ద కాటాబల్లలూ—వీటి అన్నిటిమధ్యను తిరు గుతూ మధు, పూలతోటలో తిరిగి సంతోషించినట్టుగా, సంతో షించేవాడు. పిల్లవాడు ముందుకు పనికివచ్చినవా డవుతాడని

---

*హిందూధర్మంప్రకారం, బంగాళాదేశంలో వివాహితస్త్రీలు సన్నని ఇనపగాజేలూ, శంఖంతోచేసిన గాజేలూ పెట్టుకోవాలి.

తండ్రికి తట్టింది. ఏలాగో రెండుమూడు క్లాసులు పాస్ చేయిం చేస్తే ఏ-మాస్టరీ ఉద్యోగములోనో లేక ప్లీడరీలోనో చేరి, మర్యాదస్థులకు తగిన రేవుచేరుకొంటాడని తండ్రికి ఆశకలి గింది. మిగతా ముగ్గురు తమ్ముళ్లగతి ఎడ్లబండిగ తేను, వాళ్లు గుమాస్తాగిరి దాటివెళ్లేటట్లు కనపడలేదు, వాళ్ల భాగ్య రేఖను పట్టిచూడగా. వీళ్లలో ఒకడు అడితిగుమాస్తాగాను, ఒకడు తాలూకా కచేరిలో చెవిలో కలముదోపుకొని పని నేర్చుకోవడము ప్రారంభించారు. ఆనందఘోషాల్ సంపద బహు స్వల్పము, దానినే ఆధారంచేసుకొని మధుసూదన్ కలకత్తావెళ్లి ఒక *మెస్‌లో చేరాడు.

మధుసూదన్ కాలేజికి పేరుతెస్తాడని ప్రొఫెసర్లందరూ ఆశిస్తున్నారు. అంతలో తండ్రి కాలంచేశాడు. పుస్తకాలు నోటుబుక్కులు తనవద్దనుండే మిగతా అన్నివస్తువులూ అమ్మేసి ఉద్యోగంలో ప్రవేశిస్తానని పట్టుపట్టుకు కూర్చున్నాడు మధు సూదన్. పుస్తకాలుఅమ్మి పనిలో ప్రవేశించాడు. అమ్మ చాలా వడ్చింది - పిల్లవాడు పరీక్షలు పాస్‌అయి మర్యాదస్థుల వ్యూహములోకి మెల్లిగా దూరిపోగలుగుతాడనీ, మధు పెద్ద గుమాస్తా ఉద్యోగం సంపాదిస్తాడనీ, ఘోషాల్ - వంశ దండము పైని ఉద్యోగ - జయపతాకం ఎగరడం ప్రారం భిస్తుందనీ తల్లికి చాలా ఆశగా ఉండెను.

---

* కాలేజి పిల్లవాళ్లు భోజనానికి బసకు చేసుకొనే ఏర్పాటు; mess = మెస్.

సరుకు నాణ్యంచేయడములో చిన్నప్పటినుండి ఆరితేరిన వాడు మధుసూదన్. అదేవిధంగా మిత్రులను ఎంచుకోవడములో కూడా నేర్పరి - ఈవిషయములో అతను ఎన్నడూ మోసపోలేదు. అతని విద్యార్థిమిత్రులలో ముఖ్యుడు. కనాయ్ గుప్త, అనేవాడు ఒకడు ఉండేవాడు. ఇతని తండ్రి తాతలు గొప్ప వర్తకులవద్ద మేనేజర్ ఉద్యోగంలో ఉండేవారు. ఇతని తండ్రి పేరుపడ్డ కెరసనాయిల్ కంపెనీ ఆఫీసులో పెద్దపనిలో ఉండేవాడు.

అదృష్టవశాత్తు అతని కొమార్తెకు పెళ్లికావడం తటస్థించింది. మధుసూదన్ నడ్డిబిగించి పనిచేయడం మొదలు పెట్టాడు—పాలలు వేయించడమూ పందుళ్లు తోరణాలతోను పూలమాలలతోను అలంకరించడమూ, అచ్చుఆఫీసులో నిలబడి బంగారుసిరాతో శుభలేఖలు అచ్చువేయించడమూ, తివాసీలు కుర్చీలు అద్దెకు తీసుకొని రావడమూ, ద్వారమువద్ద నిలబడి వచ్చినవాళ్లకు మర్యాదాచేయడమూ, గొంతు పగలగొట్టుకొని భోజనాల దగ్గిర కేకలు వేయడమూ—మొదలైన అవసరమైన పనులు - ఒక్కటైనా విడువక అన్నీ బహునిపుణతతో చేశాడు. ఇతని బుద్ధీ తెలివితేటలూ చూచి, రజనీబాబు చాలా సంతోషించాడు. అతను సర్వమూ ఎరిగినవాడు, మధు ముందుకు పనికివస్తాడని పొల్చుకొన్నాడు. తన స్వంతడబ్బు *డిపాజిట్ గా

*Deposit.

పెట్టి రజబ్‌పూర్‌లో కెరసనాయిల్ ఏజన్సీ పెట్టించి మధు సూదన్‌ని దానికి పెద్దచేశాడు.

మధుసూదనుకి అదృష్టము తోసుకువచ్చింది. ఇప్పటి సౌభాగ్యంలో ఆకెరసనాయిల్ డిపో ఏమూలా కనపడదు. చిత్రాలలో జమవైపున ఉండే రూపాయలసంఖ్య పెద్దదయి పోతున్నది. ఆ అంకెల మీదుగా వర్తకం మీదికిలేచిపోతూ వచ్చింది. సందులలోనుంచి రాజమార్గంలోకీ చిల్లరబేరంలో నుంచి టోకు వ్యాపారంలోకీ, దుకాణంలోనుంచి ఆఫీస్‌లోకీ— ఉద్యోగపర్వంనుంచి స్వర్గారోహణవరకు వర్తకం వృద్ధి అయి పోయింది. "దీనినే అంటారు అదృష్టం అని" అంతా అను కున్నారు. అనగా పూర్వజన్మలో దాచి ఉంచిన * స్టీమ్ బలము వల్ల ఇప్పుడు †బండి నడుస్తున్నది అన్నమాట. భాగ్యదేవత తనకు హానిచేయవలెనని చేసేప్రయత్నాలకు లోటులేదని మధుసూదన్ ఎరుగును. కాని ఎన్నడూ లెక్కతప్పుచేయని ఇతని లెక్కలో పరీక్షకులు తప్పుపెట్టలేక పోయినారు. తప్పులలో నేర్పరులైనవాళ్లు దిద్దేవాళ్లను పక్షపాతులని అంటూఉంటారు!

మనస్సు విప్పి ఏమీ చెప్పేస్వభావం కాదు మధుసూద నుది, తననుగురించి ఎవరితోనూ ఏమీ అనేవాడుకాడు. అయినా ఎండిపోయిన నదిపాయలోకి వరదలువచ్చి పడ్డవని

---

* స్టీమ్ = Steam = ఆవిరి. † రైలుబండి.

ఊహావల్ల పోల్చుకోవచ్చు. మనసంఘాలలో సహజంగా పెరిగి ఇట్లాంటి స్థితిలోకివచ్చిన వాళ్లెవరైనాకూడా పెళ్లిమాట అనుకోకమానరు. మనం గతించినతరువాత మనబిడ్డలు వంశ పరంపరగా మన ఆస్తులు అనుభవిస్తూ ఉండవలెనని మనదేశ స్థుల కోరిక. పెళ్లికాని కొమార్తెలతండ్రులు మధుసూద నునిలో వివాహోత్సాహం పుట్టించవలెనని చాలా ప్రయత్నాలు చేశారు. కాని వాళ్లందరికీ ఈవిధంగా అతను జబాబు చెప్పే వాడు— "మొదట ఒక కడుపు నిండనియ్యండి, తరువాత రెండోకడుపు నింపేపూచీ నెత్తిమీద పెట్టుకోవచ్చును." మధు సూదనుని హృదయం ఎటువంటిదైనా అతని కడుపు మాత్రం చిన్నది కాదని అతని జబాబునుపట్టి తెలుస్తున్నది.

ఈ సమయంలో మధుసూదనుని తెలివితేటలవల్ల రజబ్ పూర్ చేకుకు మంచిపేరు వచ్చింది. ఈసంగతి గ్రహించి అందరికంటె ముందు మధుసూదనే ఆ ఊరు నది ఒడ్డున ఉండే ఖాలీజాగా అంతా పూర్తిగా కొనేశాడు. జాగా ఖరీదు అప్పుడు చాలా తక్కువ.

తరువాత ఏమూల చూచినా ఇటిక బట్టీలు, నేపాల్ నుంచి వచ్చిన పెద్దపెద్ద గుగ్గిలపు దూలాలు, సిలేట్ నుంచి సిమెంటు, కలకత్తానుంచి రైలు వాగన్లనిండా కారుగేటెడ్ ఐరన్ షీట్లు. వర్తకులు ఇది చూచి ఆశ్చర్య పోయినారు. "ఔను, చేతిలో నాలుగుపైసాలు చేరాయి, భరించి కూర్చోడం

ఎట్లా! ఇక అజీర్తి ప్రారంభం అవుతుంది. అతని వర్తకానికి ఆఖరు రోజులు వచ్చాయి," అని అన్నారు చూచిన వాళ్లందరూ.

కాని మధుసూదన్ పొరపాటు పడలేదు. చూస్తూ ఉండగానే రజబ్‌పూర్ చేకువ్యాపారానికి ఒక గొప్ప కేంద్రం అయిపోయింది. సుడిగుండంలోవచ్చి పడ్డట్టుగా, అక్కడికి దలారులు వచ్చి పడ్డారు. తరువాత ఒక మార్వాడీ బృందం, తరువాత కూలీదండులు. గోనె ఫాక్టరీలు తయారయినవి. ఫాక్టరీ చిమ్నీలపొగ చుట్టలు చుట్టలుగా ఆకాశాన్ని నింపింది.

జమాఖర్చుల చిత్రాలు చూడకుండానే ఇప్పుడు అందరికీ మధుసూదనుని మహిమ కళ్లకు కనబడేది. ఆవేటకు అతను వణాధిపతి అయిపోయినాడు. ఎత్తు ప్రహారీలతో రెండంతస్తుల భవంతి ఒకటి లేచింది, "మధుచక్రం" అని పేరుచెక్కిన రాతిపలక గేటుమీద తాపించబడ్డది; తన కాలేజీ సంస్కృత పండితుడుచేసిన నామకరణం అది. పండితునికి మధుసూదనుని యెడల పూర్వంకంటె గాఢమైన అనురాగం కలిగింది.

తల్లి—విధవ—ఒకనాడు అతనిదగ్గిరికివచ్చి భయపడుతూ భయపడుతూ, "ఏ క్షణానికి నాకు మృత్యువు వస్తుందో తెలియదు నాయనా, కోడలిని కళ్లతో చూచిపోనియ్యవురా తండ్రీ!" అని అన్నది.

"ఎంతో సమయం వ్యర్థపుచ్చితేగాని పెళ్లి కాదు, చేసుకొన్న తరువాతకూడా ఎంతో సమయం వ్యర్థపుచ్చాలి, అంత

సమయం ఎట్లా వ్యర్థపుచ్చి పనిమానుకోగలను?" అని అతి గంభీరంగా జబాబు చెప్పాడు కొడుకు.

కొడుకును బలవంతపరిచేటంత సాహసం తల్లికి లేక పోయింది. 'సమయం' అనే దానికి బజారుధర ఉన్నదని మధుసూదన్ ఎరుగును. అంతేకాక అతను ఇన్నిమాటలు చెప్పవలసినవాడు కాడు.

మరికొంతకాలం గడిచింది, వ్యాపార ప్రవాహం గట్లు తీసి పారుతున్నది, గ్రామమునుండి ఆఫీసు కలకత్తానగరంలోకి వచ్చింది. మనుమలుమనమరాళ్ల ఆశ వదులుకొని తల్లి పరలోకానికి వెళ్లిపోయింది. ఘోషాల్‌కంపెనీపేరు దేశదేశాల వ్యాపించిపోయింది, పేరుపడ్డ విదేశీకంపెనీలతో సమానపదవిని సంపాదించించిది. ఘోషాల్‌కంపెనీలో అన్ని *డిపార్టుమెంట్లలోనూ దొరలే మేనేజర్లుగా ఉన్నారు.

అప్పుడు మధుసూదన్ తానే అన్నాడు—పెళ్లిచేసుకోడానికి ఇప్పుడు వ్యవధి చిక్కుతుంది అని. పెళ్లి-బజారులో ఇతనికి ఉండే పరపతి మరి ఎవ్వరికీలేదు. ఎంత అహంకారముగల ధనీగృహస్థులకైనా సిగ్గుతెప్పించగల స్థితిలో ఉన్నాడు మధుసూదన్ ఇప్పుడు. నాలుగు వైపులనుండి వధువుల వార్తలే, అందులో అనేకులు కులవతులు, రూపవతులు, గుణవతులు, ధనవతులు, విద్యావతులు ఉన్నారు. అందరిమాట విని

---

* Department = విభాగం

గర్వంతో కళ్లు ఇటూ అటూ తిప్పి, "ఆ చోటర్జీల అమ్మాయిని పెళ్లాడతాను," అని మధుసూదన్ అన్నాడు.

దెబ్బతిన్న కుటుంబము దెబ్బతిన్న పులిమాదిరే—బహు భయంకరమైనది!

## 3

ఇక వధువు పక్షమువాళ్ల సంగతి కొంచెము చూదాము. నూర్‌నగర్-చోటర్జీల అవస్థ ఏమీ బాగులేదు. గట్లుతెగిపోయిన చెరువులోని నీళ్లమాదిరి వాళ్ల ఐశ్వర్యం చెదిరిపోయింది. ఆరణాల వాటాపంచుకొని వేరుపడ్డ వంతుదారులు ఇప్పుడు వీళ్లమీదికి లాఠీలు చేతపుచ్చుకొని తిరగపడడానికి సిద్ధంగా ఉన్నారు. రాధాకాంతస్వామి దేవాలయానికి ధర్మకర్త లెవరు అని వాళ్లకీ వీళ్లకీ తగాదా జరుగుతున్నది. సూక్ష్మవాదనతో కలహం జరుగుతున్నది. వకీళ్లఇళ్లకు చేరుతున్న రూపాయలమూటలభారము రోజుకురోజు అధికమవుతున్నది. ఆఫీసర్లకు గుమాస్తాలకు ముట్టవలసింది ముదుతూనే ఉన్నది. దావాలు ముగించేసరికి నూర్‌నగర్ ఖ్యాతి క్షీణించింది, రాబడి తగ్గిపోయింది, ఖర్చు నాలుగింతలయింది. సాలిపురుగు పట్టుఅల్లుకు వచ్చినట్టుగా పన్నెండణాలవడ్డీ నాలుగువైపులా అల్లుకు వచ్చేస్తున్నది.

చోటర్జీలు ఇద్దరన్నదమ్ములు ఐదుగురక్కచెల్లెళ్లు. కొమార్తెలు అధికంగా ఉన్నందుకు చెల్లించవలసిన జరిమానా

ఇప్పటికీ పూర్తిగా చెల్లించడం కాలేదు. తండ్రి ఉంటూఉండగానే నలుగురుకుమార్తెలకు కులీనులకు ఇచ్చి పెళ్లి చేశారు. వీళ్ల ఆస్తుల పరిమాణము నేటికాలపుది - సామాన్యము, ఖ్యాతిమాత్రం పూర్వకాలపుది - గొప్పది. వీళ్లపూర్వపు ఖ్యాతికి నష్టములేకుండా ఉండేటట్టున్నూ, కులీనులైన అల్లుళ్ల మర్యాదకు లోటులేనట్లున్నూ, పెద్దపెద్ద కట్నాలతో పెళ్లిళ్లు చేయవలసివచ్చింది. దీనివల్ల పీకకుకట్టిఉన్న పన్నెండణాలవడ్డీ రూపాయవడ్డీగా పెరిగి ఉరిగా పరిణమించింది. తమ్ముడు తల ఆడించుకొంటూ, "నేను సీమవెళ్లి బారిస్టరీపాస్ అయివచ్చి డబ్బు గడించకపోతే వీలులేదు," అని అన్నాడు. అతను సీమ వెళ్లాడు. సంసారం నడిపించేభారమంతా అన్న, విప్రదాస్, నెత్తిమీద పడ్డది.

రెండు పతూలవాళ్లు ఎగరవేస్తున్న గాలి పడగల దారాలు ఒకదానితో ఒకటి చిక్కుపడినట్టుగా, ఘోషాలుల అదృష్టమూ చాటర్జీల అదృష్టమూ కలుసుకొన్నవి. ఆకథ వినదగినదే!

బడాబజార్‌లో ఉన్న తన్‌సక్‌దాస్ హాల్‌వాయ్‌లకు చాటర్జీలు పెద్దమొత్తం బాకీ ఉన్నారు. షరతుప్రకారం వడ్డీ ఇచ్చేస్తూవచ్చారు, ఎట్లాంటి తకరారూ లేకుండా రోజులు గడిచిపోతున్నది. విప్రదాస్‌తో చిన్నప్పుడు చదువుకొంటూఉండే అమూల్యధన్ అనే స్నేహితుడొకడు మిత్రుని చూదామనే అభిమానంకొలదీ విప్రదాసుగారి ఇంటికి వచ్చాడు. అమూల్య

కలకత్తాలో ఒక పెద్ద అటార్నీ దగ్గర *ఆర్టికిల్డ్ క్లార్కుగా ఉన్నాడు. ఈ బంగారు సులోచనాలు ధరించిన యువకుడు పక్కచూపులతో నూర్‌నగర్ చాటర్జీల అవస్థ బాగా కని పెట్టాడు. ఇతనూ కలకత్తా తిరిగి వెళ్లిపోయినాడు, తన్‌సుక్ దాస్ తాను అప్పిచ్చిన రూపాయలు ఇచ్చేయమని తొందర పెట్టడం మొదలుపెట్టాడు. తాను ఒక పెద్ద చీనీఫ్యాక్టరీ కట్టించ బోతున్నాననిన్నీ, రూపాయలు చాలా అవసరమనిన్నీ కబురు పంపాడు. విప్రదాస్ తలను చేతులలో పెట్టుకొని ఆలోచిస్తూ కూర్చున్నాడు.

ఆరోజులలోనే చాటర్జీ - ఘోషాలుల పేర్లు తిరిగి కలుసు కొన్నవి, ద్వంద్వసమాసములాగు. ఇంతకు పూర్వమే సర్కార్ వారి దగ్గరనుండి 'రాజా' అనేబిరుదు సంపాదించాడు మధు సూదన్. పైచెప్పిన సహాధ్యాయి, అమూల్యదే, విప్రదాస్ దగ్గిరికి వచ్చి, 'రాజాబహాదూర్ గారు చాలా ఆనందంగా ఉన్నారు, సులభమైన షరతులపైని అప్పుదొరకవచ్చును. అని సలహాఇచ్చాడు. అట్లాగే దొరికింది కూడాను. మధుసూదన్ దగ్గిర ఏడు లక్షలరూపాయలు, నూటికి ఏడురూపాయలు వడ్డీ చొప్పున, తీసుకువచ్చి చిల్లరఅప్పులన్నీ దిద్దడం జరిగింది. విప్రదాసు బ్రతికాను అనుకొంటూ నిట్టూర్పు విడిచాడు.

కుముదిని అతని ఆఖరిచెల్లి, పెళ్లికావలసి ఉన్నది ఈమె ఒకతే—నిజమే, గాని వాళ్ల అవస్థకూడా ఆఖరుదశలోనే

---

* Articled Clerk

ఉన్నది. వరుణ్ణి వెదకడంమాట, కట్నం రూపాయలు జత పెట్టడంమాట జ్ఞాపకం వచ్చేసరికి విప్రదాసుకి దిగులు కలిగేది. అమ్మాయి బహురూపవతి. సన్నంగా పొడవుగా రజనీగంధ పుష్పవృంతంవలె ఉండేది. కళ్లు అట్టే పెద్దవి కావు కాని తుమ్మె దలవలె నల్లగా ఉండేవి. మొగ్గవలె తీరిన చక్కని ముక్కు, శంఖమువంటి దేహచ్ఛాయ, సున్నని మృదువైన చేతులు—ఆ చేతులుచేసేసేవ లక్ష్మీప్రసాదమని కృతజ్ఞతతో అందుకోదగినటు వంటిది. వేదనతోను కరుణతోను నిండి ఉన్న ఆమె ముఖము, చూచిన వాళ్లమనస్సులను కరిగించక మానదు.

తననుచూచి తానే జడిసేది కుముదిని, తాను ఒక అశు భమువంటిదానని ఆమె నమ్మకము. పురుషులు తమశక్తివల్ల సంసారం నడుపుతూ ఉంటారనిన్నీ, స్త్రీలకు కేవలము అదృష్ట బలమువల్ల లక్ష్మీప్రాప్తి కలుగగలదనిన్నీ ఆమె నమ్మకము. తనకు లక్ష్మీప్రసాదం దొరకలేదు. తనకు జ్ఞానము వచ్చినప్పటినుండి చూస్తున్నది, ఎటువైపుచూచినా దురదృష్టమే. తన అవి వాహితావస్థ తమఇంటిమీద భరించరాని భారమయి కూర్చు న్నది. దానివలన తనకు కలుగుతున్న బాధకు తనఇంటికి కలుగుతున్న అవమానానికి మితిలేదు. చేతితో నెత్తిసి బాదు కోవడంతప్ప తాను చేయగలదేమీ లేదు. ఉపాయము కని పెట్టేశక్తి భగవంతుడు స్త్రీలకియ్యలేదు. అతనిచ్చినది కేవలము బాధననుభవించేశక్తే. ఏ దేవత వరంవల్లనో, ఏ యక్షుని ధనం

వల్లనో, పూర్వజన్మలో బాకీ ఉన్నది ఎవరో హఠాత్తుగా దిద్దడంవల్లనో—అసంభవమైనదే దైనా జరగ దెందుకో! ఒకొక్క నాడు అర్ధరాత్రి వేళ లేచి ఇంటి తోటలోకి వెళ్ళి సరుగుడుచెట్ల సంగీతము వింటూ చెట్లశిఖరాలు చూస్తూ కూర్చొని తనలో తాను ఈలాగు అనుకొంటూఉండేది—"నా రాజపుత్రు డెక్కడో! ఏవీ అతని ఏడు రాజ్యాల మణి మాణిక్యాలు! నా అన్నలను రక్షించు రాజపుత్రా, యావజ్జీవమూ నీకు దాసినై ఉంటాను."

తమ ఇంటి దుర్గతికి తానే కారణమని అనుకొంటూ సుధాపాత్రవంటి ఆమె హృదయంలో ఉండే సోదరీ ప్రేమ తన అన్నగార్లమీద ఒంపేస్తూ ఉండేది. దుఃఖము గాఢమయి ద్రవీభవించిన ప్రేమ అది. అన్నలు తమ కర్తవ్యం చేయలేక పోతున్నామని తలచి మిక్కిలి దుఃఖిస్తూ ఆమెను తమ ప్రేమలో చుట్టి ఉంచేవారు. పితృమాతృహీనఅయిన తమ చెల్లెలికి అందవలసిన ప్రేమ అందలేదు. భగవంతు డిటువంటి అన్యాయం చేసినందుకు ఆ కొరతను పూర్తిచేదామని అన్నలు సదా ఉత్సాహంతో ఏదో చేస్తూ ఉండేవారు. అంధకారంవంటి వారి దారిద్ర్యావస్థను వెన్నెలవంటి మాధుర్యంతో నింపుతున్న చంద్రుడు ఆమె. ఇంటి దురవస్థకు తానే కారణమని నమ్మి అప్పుడప్పుడు "కుము" తనను తాను నిందించుకొనేది, విప్రదాస్ చిరునవ్వు నవ్వుతూ అనేవాడు, "నీవే మాకున్న సౌభాగ్యము చెల్లీ, నీవు లేకపోతే మాకు ఉన్న సిరి ఏదీ?"

కుముదిని శిక్షణా, విద్యాభ్యాసమూ కేవలము ఇంటి లోపల లభించినది, బయటి లోకముతో ఆమెకు ఎట్టి సంబంధమూ లేదనే చెప్పవచ్చును. పురాతన - నూతన యుగాలకు చెందిన చీకటి - వెలుతురులే ఆమె వాసస్థానం. ఆ జగత్తు ఛాయా నిర్మితము. అక్కడ రాజత్వముచేసేవారు, సిద్ధేశ్వరి, గంధేశ్వరి, ఘంటాకర్ణుడు, షష్టి మొదలైన దేవతలు— ఎన్నడోగాని చంద్రకాంతి పడని ప్రదేశం అది, శంఖానాదంతో గ్రహదోషాన్ని తొలగిస్తూ ఉండాలి. జగత్తులో ఎన్నోరకాలపూజలూ, ఎన్నో తరహాల నోములూ వ్రతాలూ చేస్తూ, తాయెత్తులు కట్టుకొని మంత్రపఠనము వల్లనూ, స్వస్తివచనసహాయమువల్లనూ దురదృష్టాన్ని దూరంగా తరిమివేసే ప్రయత్నంచేస్తూ ఉండాలి. ఇన్నిచేసినా మాటిమాటికి ఆశాభంగం కలుగుతూ ఉంటుంది. శుభలగ్నాన శుభఫలం ఫలించదు, అయినా మూఢనమ్మకాలు మాత్రం మనను విడిచిపెట్టవు, స్వప్నాలవల్లకలిగే మోహాన్ని ప్రమాణాలవల్ల చెదరకొట్టేశక్తి సత్యానికి లేదు. స్వప్నలోకంలో తర్కానికీ, బుద్ధికీ తావులేదు. అక్కడ మనము చేయవలసినది విధికి లోబడిఉండడమే. విధిచే పాలించబడుతున్న ఈ ప్రపంచంలో బుద్ధిని వినియోగించి పనిచేయడము అసందర్భమనీ మంచిచెడ్డలు ఎంచుతుండడము అర్థములేనిపని అనీ కుముదిని ఎరుగును. ఈ జ్ఞానము వలన కలిగినభావమే ఆమె ముఖమున ఆవరించిఉన్న కరుణారసానికి కారణము. తనది ఎట్టిఅపరాధమూ లేకపోయినా తనకు

అవమానం తప్పదని కుముదుని ఎరుగును. ఇప్పటికి ఎనిమిది సంవత్సరాలయింది తండ్రి మృత్యువువల్ల తమ ఇంటికి జరిగిన అవమానంఅంతా పూర్తిగా తనదే అనినమ్మి ఓర్చి ఉన్నది.

౪

పూర్వాచారాలతో నిండిఉన్న ధనికుల గృహము మిక్కిలి దిట్టగా కట్టబడిఉన్న కోటవంటిది. అందులో కాపురం ఉన్నది పురాతనయుగం, నూతనయుగం అనేక ద్వారాలు దాటనిదే ఆకోటలోపలికి ప్రవేశించలేదు. నూతనయుగం లోనికి రావడానికి ఆకోట లోపలనుండేవాళ్లకు చాలాకాలం పట్టుతుంది. విప్రదాసుతండ్రి, ముకుందలాల్, పరుగెత్తుకు పోతున్న నూతనయుగాన్ని పట్టుకోలేక పోయినాడు.

పొడవైన విగ్రహం; మల్లిపువ్వువంటి దేహచ్ఛాయ; పొట్టిగా కత్తిరించినగేరా; పెద్దపెద్ద కళ్లు, ఆ కళ్లదృష్టి ఆతని అధికారానికి అడ్డురాగలవారెవ్వరూ లేరని తెలుపుతున్నట్టు ఉండేవి. అతని కేక గర్జనలాగు వినబడేసరికి నౌకర్లు వణికిపోయేవారు. జీతానికి పైల్వాన్ని ఒకణ్ణి ఉంచి రోజూ కుస్తీ అభ్యాసంచేసేవాడు. మంచి బలశాలి, అయినప్పటికీ అతని సుకుమారశరీరంలో పరిశ్రమ చిహ్నాలేవీ కనబడలేదు. పలచని ఉల్లిపొర మజిలిన్ చొక్కా తొడుక్కొనేవాడు. నేలకుతగిలేటట్టు సన్నని

*ఢాకాఢోవతి కట్టుకొనేవాడు. ప్రశస్తమైన † పెరిషియన్ అత్తరపు వాసన, అతను మనకంట పడకముందే, అతని రాకను తెలియచేసేది. బంగారు పాన్‌దాన్ పట్టుకొని మనిషి ప్రక్కను ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండేవాడు, ద్వారందగ్గర డవాలి బంట్రోతు, సింహద్వారందగ్గర ముసలిజమాదార్ తమాక్ ముద్ద చేస్తూ చేస్తూ మధ్యమధ్య తన పెద్దదాడీ దువ్వి రెండుపాయలుచేసి చెవులమీద దోపుకుంటూఉండేవాడు. అతనిక్రిందనుండే దర్వాన్‌లు కత్తులుపట్టుకొని పారాఇస్తుండే వారు. చావిడిలో నానారకాల వంకకత్తులు, పూర్వకాలపు తుపాకులు, బల్లెములు గోడలమీద వేలాడుతుఉండేవి.

ముకుందలాల్ ముందుకచేరీహాల్‌లో ఎత్తైన ఆసనం మీద కూర్చొనేవాడు. వెనుకను బాలీసు. క్రిందనూ ఎదుటా, ఈప్రక్కనూ ఆప్రక్కనూ, ఉద్యోగస్థులు కూర్చొనేవారు. సముఖస్తులలో ఎవరికి ఎటువంటి హుక్కాదాన్ ఇయ్యవలెనో, ఎవరికి గుడుగుడు ఇయ్యవలెనో నౌకర్లు ఎరుగుదురు. ప్రభువుకు గులాబీనీటితో నింపిన విలువైన హుక్కాదాన్ ఇచ్చేవారు.

దొరలు ఉపయోగించే పద్ధెనిమిదో శతాబ్దపు కుర్చీలు టేబిళ్లు వగైరా సరంజాములతో అలంకరించబడ్డ గది ఇంట్లో మరొకవైపున ఉండేది. ఎదుట పెద్ద అద్దమొదటి - పాతగిల్లి

---

* Decca - పలచని నాజూకు మజ్లీనులకు పేరుపడ్డ బంగాళా పట్టణము.

† Persian = పెరిషియాదేశంలో తయారైన.

నల్లని డాగులుపడిఉన్నది, దాని ఫ్రేముకు అంటి రెక్కలపై ఎగురుతున్న దేవకన్య విగ్రహాలు రెండువైపులా ఉన్నవి— వాటిచేతులలో అగరు వత్తిదానులు. మూలలను బంగారు రంగుతో చిత్రించబడ్డ నల్లరాతి ఘటాలు. కొన్ని టేబిల్ల మీద గాజుబొమ్మలు. కుర్చీలు సోఫాలు, మీదినుండి వేలాడు తున్న గాజులస్టర్లు - అన్నీ *హాలెండ్ గుడ్డ బురకాలతో మూయబడి ఉన్నవి. పూర్వపురుషుల †ఆయిల్ పెయింటింగులు. నేలను, గదినిండా రంగురంగుల పువ్వులల్లిన సీమతివాసీలు. పెద్దదొర ఎవరైనా పనిమీద వచ్చేటప్పుడు ఈసామానుల మీదనుండే బురకాలు తీస్తూఉండేవారు. ఆధునిక యుగానికి చెందినది ఇంటిఅంతటికీ ఈ ఒక్కగదే, కాని ఈగదే అన్నిటి లోకి దయ్యాలుదేవుల్లాడేటట్టు ఉండేది. ఎల్లప్పుడూ మూసి ఉండడముచేత పుట్టే ముక్కువాసన గదిలో ప్రవేశించే వాళ్లకు ఊపిరి తిరగకుండాచేసేది; దైనికజీవనయాత్రతో సంబంధము విడిన మూగి దానివలె కనపడేది ఈగది.

ముకుందలాల్ అనుభవిస్తూఉండే భోగము ఆకాలంలో అత్యంత అవసరమైనది, అలాగు నిర్భయంగా ధనం వ్యయం చేస్తేనేతప్ప ధనానికి గౌరవం ఉండేదికాదు. అనగా ధనం నెత్తి మీద బరువై కూర్చోక కాళ్లక్రింద బానిసఅయి ఉండేది అన్నమాట. వాళ్లవైభవం ఎట్లాంటిదంటే లోపల దాన దక్షి

---

* బురకాలకు ఉపయోగించే చవుకరంగుబట్ట.

† Oil paintings - వివిధ రంగులతో చిత్రించబడ్డ పటాలు.

ణాలు జరుగుతుండేవి, బయట భోగవిలాసాలు నడుస్తుండేవి - రెండూ భారీగానే జరిగేవి. ఒకప్రక్కను ఎట్టిలోభమూ లేకుండా ఆశ్రితులకు ఉపకారంచేస్తుండేవారు. రెండోవైపున ఎవరిలోనైనా ఏమాత్రం పొగరుబోతుతనము కనబడ్డా అది అణగతొక్కనిదే ఉండలేకపోయేవారు. మహారాజావారి తోట మాలికొడుకు ఏదో అపరాధం చేసినందున హఠాత్తుగా ధనికుడైన పొరుగాయన ఆ కుర్రవాడిచెవి నులిపాడట. అతని పొగరు అణచడానికి మహారాజా బహదూర్ వారు చేసినఖర్చు ఈ రోజులలో పిల్లవాళ్ల కాలేజీచదువుకైనా ఖర్చుచేయము. అట్లాగనిచెప్పి వాడిఖర్మంవాడిదే అని పిల్లవాణ్ణి వదిలి పెట్టేయ లేదు. పిల్లవాడికి కొరడాతో మహారాజావారు రెండు తగల నిచ్చారు. కుర్రవాడు మంచం ఎక్కాడు. కోపావేశంవల్ల దెబ్బలు జోరుగా తగిలినందుకు పిల్లవాడికి మేలయింది. రాజా వారు తమ స్వంతడబ్బుతో కుర్రాడికి చదువుచెప్పించారు. అతనిప్పుడెక్కడో * ముక్త్యార్‌గా ఉన్నాడట.

పూర్వకాలపు ధనవంతుల పద్ధతిని అనుసరిస్తుండే ముకుందలాల్ జీవితంలో రెండు వేరువేరు భాగాలుఉండేవి - గార్హస్థ్యము మొదటిది స్వేచ్ఛావిహారము రెండోది. అనగా లోపల దశకర్మలు, బయట ఏకాదశ అ - కర్మలు. ఇంట్లోపల ఇష్టదేవత, గృహిణి. అక్కడ కనపడేవి పూజపునస్కారాలు, అతిథిసేవ, పండగ పర్వాలు, వ్రతాలు ఉపవాసాలు, బ్రాహ్మణ

* ముక్త్యార్ = తక్కువశ్రేణి ప్లీడరు.

భోజనాలు, బీదసాదలకు ధర్మము; ఇరుగుపొరుగువాళ్లు, గురువులు, పురోహితులు. ఇతనిస్వేచ్ఛావిహారము ఇంటిబయటిభాగములో, అక్కడకిరాకపోకలు చేసేవారు పరస్త్రీలు. ఈసంపర్కము ఆకాలపు ధనికులు సుశిక్షణకు సాధనమని అనుకొనేవారు. ఇట్టి పరస్పర విరోధముగల పనుల నన్నింటినీ ఇంటిఇల్లాలు సహించి ఉండవలసి వచ్చేది. కాని ముకుందలాల్ బాబుగారి భార్య, నందరాణి, పౌరుషముగల ఇల్లాలు, సహించి ఉండడం ఆమెకు పూర్తిగా అలవాటు కాలేదు. దానికి కారణం ఉండేను—పాటలో చరణం ఎంతపొడవుగా సాగినా, పాట ఎంత పెద్దదైనా చివరకు తిరిగి పల్లవిదగ్గిరికి రాకతప్పదు. అదే మాదిరి భర్తఎక్కడికిపోయినా ఎన్నాళ్లుతిరిగినా ఇంటికి రానిదే ఉండలేక పోతాడు. కనుక భర్త తన మనస్సులో ఉండేప్రేమను అనాదరణచేయడం చూచి భార్య సహించి ఊరుకోలేదు, చివరకు అట్లాగే, సహించలేక పోవడమే జరిగింది.

౨

రాసపౌర్ణమి సందర్భంలో, ముకుందలాల్‌గారి ప్రాసాదంలో గొప్పసందడిచేసేవారు. కలకత్తానుండి కొన్నీ ఢాకానుండి కొన్నీ నాటకదళాలు, యాత్రాదళాలు వచ్చేవి. ఇంటి అంగణములో కృష్ణలీల ఒకనాడు, కీర్తన ఒకనాడు జరుగుతూఉండేది, చూడడానికి ఊరిప్రజ లనేకంగా వచ్చేవారు, ఇరుగుపొరుగుల స్త్రీలు వచ్చేవారు, తామసిక వినోదాలు ముందుహాల్‌లో జరిగేవి. అంతఃపురంలోకి, తలుపుల సందులలోనుంచి,

బయట జరుగుత్తులో జరుగుతున్న సందడి కొంచెము కొంచెము దూరివచ్చేది, అంతఃపురంలోని వారికి నిద్ర ఉండేదికాదు, మన స్సులో అమితబాధగా ఉండేది. ఈమారు భోగంమేళం మీాదికి రాజావారి మనసుపోయింది - నదీజలంమీాద పెద్ద పడవమీాద మేళం ఆడించాలని నిశ్చయించారు.

అక్కడ ఏమిజరుగుతున్నదో తెలుసుకొనే మార్గం లేక నందరాణి మనస్సులో గొప్పఆందోళనపుట్టింది. ఇవతల ఇంటి పనులు, వచ్చినవాళ్లకు భోజనంపర్పాట్లు చేయాలి, నవ్వుముఖంతో అందరినీ పలకరిస్తూఉండాలి, ఇటుకదిలినా అటు కదిలినా కాలిలోగుచ్చుకున్న ముల్లుబాధ లాగు, మనస్సులోని బాధ వదలకుండాఉన్నది. రాణికి లోలోపున ఉక్కిరి బిక్కిరిగాఉన్నది, కాని అదిఎవరికీ తెలియదు. అవతల, వచ్చిన వాళ్లందరూ మిక్కిలికృతజ్ఞతతో "ధన్యురాలు మహారాణి," అని కేకలువేస్తూ అభినందిస్తున్నారు. చివరకు ఉత్సవం ముగిసింది. వచ్చినవారందరూ వెళ్లిపోయినారు. ఇళ్లు ఖాళీఅయిపోయినది. చిరిగిపోయిన అరటిఆకులు, విరిగినసిబ్బులు, మట్టిగ్లాసులు, కుండలు కుప్పలుకుప్పలుగా పడిఉన్నవి. వీటిమీాద కాకులూ, కుక్కలూ మూగి కొట్లాడుకుంటూ గొప్ప కోలాహలంచేస్తూ ఉత్తర కాండ జరుపుతున్నవి, నౌకర్లు నిచ్చెనలు వేసుకొని గ్లోబులాంత ర్లను, చాందినీని విప్పుతున్నారు, మిగిలిన మైనపువత్తిముక్కల కొరకూ జిలుగు పువ్వులకోసమూ ఊళ్లోని పిల్లవాళ్లు నాకు కావాలి నాకుకావాలి అని తగవులాడుకొంటూ ఆకాశం బద్ద

లయేటట్లు కేకలు వేస్తున్నారు. ఇంటిలోపల మిగిలిఉన్న అన్నముకూరలకుప్పలలోనుంచి పాచివాసన లేస్తున్నది. లోపల అంతా అశుభ్రం, నిరుత్సాహం, క్లాంతి. ఆ ముకుందబాబు ఇప్పటికీ ఇంటికి తిరిగి రాకపోవడంవల్ల ఇంటి శూన్యత భరించ రానిదిగా ఉన్నది. అతన్ని కలుసుకొనే మార్గంలేకపోవడంచేత నందరాణి మరి సహించి ఉండలేకపోయింది.

దివాన్‌జీని పిలిపించి రాణి పరదా వెనుకనుండి, “బృందావనంలో అమ్మకు ఒంట్లో బాగులేదు, అక్కడికి వెళ్లుతున్నానని మహారాజావారికి తెలియచేయండి,” అని అన్నది.

దివాన్ బట్టతల తడుముకొంటూ, “రాజావారికి తెలియచేసినతరువాత వెళ్లితే బాగుంటుంది మహారాణి, ఈవాళో రేపో వచ్చేస్తారని విన్నాను అమ్మగారూ,” అని అన్నాడు.

“ఆలస్యం చేయడానికి వీలులేదు,” అని అన్నది రాణి.

ఆమెకూడా విన్నది, ఈవాళో రేపో రాజావారు తిరిగి వచ్చేస్తారని; కనుకనే బయలుదేరిపోదామని ఇంత తొందర. రాజాగారు వచ్చి కొంచెము దుఃఖమూ పశ్చాత్తాపమూ కనపరచగానే అంతా సరుదుకుపోతుందని ఆమె ఎరుగును, ప్రతిమారూ ఆలాగే జరుగుతున్నది. అతనికి తగిన శాస్తికి ఎన్నడూ అవకాశం దొరకలేదు. కాని ఈమారుమాత్రం అట్లాగు కానియ్యకూడదు. కనుక సరిఅయిన శిక్షకు ఏర్పాటు చేసి ముందుగా పారిపోవలెనని దండనదాత నిశ్చయించు

కొన్నది. బయలుదేరబోయింది కాని ముందుకు అడుగుపడ లేదు. పడకగదిలోకి పరుగెత్తివెళ్లి మంచంమీద బోర్లపడి వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించింది. అయినా ప్రయాణం మాత్రం ఆగలేదు.

కార్తికమాసంలో ఒకనాటి మధ్యాహ్నం, రెండు ఘంటలవేళ. ఎండకు గాలివేడెక్కి ఉన్నది. దారిప్రక్కనున్న ఇరిడిచేవచెట్లఆకులమర్మరంతో కలిసి పగిలిన కంఠంతో కూస్తున్న కోయిల కూత వినబడుతున్నది. పల్లకీ పోతున్నది, పైరుతో నిండిఉన్న పొలాలకు అవతలనున్న నది కనబడుతున్నది. నందరాణి ఉండలేక పల్లకీ తలుపు తెరిచి బయటికి చూచింది. అవతలి ఒడ్డున కట్టిఉన్న పడవ ఆమె కంటపడ్డది, కొయ్య చివరను జండా ఎగురుతున్నది. పడవ టాపుమీద తానెరిగి ఉన్న నౌకరు, గోపి, కూర్చున్నట్టు ఆమెకు తోచింది - వాడి పగిడీకి కట్టిఉన్న ఇత్తడిబిళ్ల, సూర్యకిరణాలు పడి, తళతళ మెరుస్తున్నది. రాణి పల్లకీతలుపు గభాలున మూసి మనసురాయి చేసుకొన్నది.

౬

తుపాను దెబ్బకు తెరచాప చిరిగిన ఓడవలె రేవు చేరు కొన్నారు ముకుందలాల్ మహారాజావారు. అపరాధజ్ఞానంవల్ల గుండె బరువుగా ఉన్నది. కడుపు పట్టినంతా మెక్కినవాడికి మిగిలిఉన్న అన్నం చూచేసరికి అసహ్యం కలుగుతుంది, అదే

మాదిరి రాజావారికి గతించిన నాలుగు రోజుల ప్రమోద వినోదాలు జ్ఞప్తికి రాగానే అమితంగా అసహ్యం కలుగుతున్నది. వారికి ఆ ఉత్సాహం కలిగించినవాళ్లు గాని, ఆసరంజాములలో పాల్గొన్నవాళ్లు గాని అప్పుడు రాజా వారి కంట పడిఉంటే, వాళ్లకు తప్పక కొరడా దెబ్బలు తగిలి ఉండును. ఆయన చింపిరిజుట్టు, నిప్పువలె కాలుతున్న కళ్లు, శుష్కించిన ముఖము చూచి వారితో రాణిగారి మాట చెప్పడానికి ఎవరూ సాహసించలేదు; భయపడుతూ భయ పడుతూ ఆయనే అంతఃపురంలోనికి వెళ్లారు. "రాణి, క్షమించు, అపరాధం అయింది, మరి ఎన్నడూ ఇట్లాంటిది జరగదు," అని మనస్సులో అనుకొంటూ అనుకొంటూ పడకగది ద్వారందాకా వచ్చి, కొంచెము నిలుచుకొని, మెల్లమెల్లగా గదిలో ప్రవే శించారు. రోషంకొద్దీ భార్య పరుపుమీద పడి ఉంటుందని అతని ఊహ. హఠాత్తుగా వెళ్ళి ఆమెకాళ్లు పట్టుకొంచామని ఉద్దేశించి గదిలో ప్రవేశించేసరికి గదిలో ఎవ్వరూ లేదు. రాజా వారి గుండె నిలిచిపోయింది. నందరాణి గదిలో కనబడిఉంటే స్వాభిమానంకలదిఅయినా ఆమె చివరకు అతనిఅపరాధాన్ని క్షమిస్తుందిఅని రాజావారి ధైర్యం. ఆమె గదిలో లేక పోవడంతోనే ఆయనకు తెలిసిపోయింది తనకు కాబోయే ప్రాయశ్చిత్తం కఠినమైనది, దీర్ఘమైనది అని. ఆనాడు రాత్రిదాకా ఆమెకొరకు ఎదురుచూస్తూ ఉండవలెను కాబోలు అని అను కొన్నారు—లేక ఆమె తిరిగి రావడానికి ఇంకా ఆలస్యం అవ్వ

తుందో! కాని అంతసేపు ఓర్చిఉండడం అతనికి సాధ్యముకానిపని. ఆమె విధించేశిక్ష మనసార అనుభవించనిదే మంచినీళ్లైనా తాగ నని నిశ్చయించుకొన్నారు. మూడుజాములు అయిపోయింది. స్నానపానాదులు ఇంకా కాలేదు. ఇది చూచి ఆ సాధ్వీమణి సహించి ఊరుకోగలదూ ? రాజావారు గదిలోనుండి బయటికి వచ్చి చూచారు, రాణీగారి దాసి, ప్యారి, వరండామీద మూలను ముసుగువేసుకొని నిలుచున్నది, "మీ రాణిఅమ్మ గారెక్కడ?" అని అడిగారు.

"తల్లిని చూచి వస్తామని మొన్నను బృందావనం వెళ్లారు."

దాసి అన్నది బాగా బోధపడనట్టుగా, "ఎక్కడికి ?" అని మళ్లీ అడిగారు రాజావారు రుద్ధ కంఠంతో.

"బృందావనం - రాణిఅమ్మ తల్లిగారి ఒంట్లో బాగు లేదట."

రాజావారు వరండా పిట్టగోడ పట్టుకొని కొంచెము సేపు నిలుచున్నారు. తరువాత బయటి కచేరి చావిడిలోకి వచ్చి కూర్చున్నారు. ఒక్కమాట ఎవరితో అనలేదు, ఆయన దగ్గి రికి వెళ్లడానికి ఎవరూ సాహసించలేదు,

దివాన్‌జీ వచ్చి భయపడుతూ భయపడుతూ, "రాణి గారిని తీసుకురావడానికి మనుష్యులను పంపుమని ఆజ్ఞా ?" అని అడిగారు.

రాజావారు జవాబు చెప్పక చేతి సౌంజ్ఞతో తెలియ చేశారు వద్దని. దివాన్‌జీ వెళ్ళిపోయిన తరువాత వంటవాడు, 'రాఘు'ని పిలిచి, *" బ్రాండీ లే ఆవ్," అని అన్నారు.

ఇంట్లో అందరికీ మతిపోయింది. భూగర్భంలోనుండి భూకంపం లేస్తూఉంటే దానిని నొక్కిపెట్టి ఉంచే ప్రయత్నం వృథా, ప్రపంచం అంతా విరిగి పడిపోతూ ఉంటే అది సహించి ఉండడంతప్ప వేరే ఉపాయంలేదు - ఇప్పుడు ఇంటి అవస్థకూడా అటువంటిదే.

రాత్రీపగలూ బ్రాండీ, నీళ్ళైనా కలపకుండా, తాగే వారు. ఉత్తబ్రాందీ తప్పవేరేదిలేదు - భోజనం లేనే లేదని చెప్పవచ్చును. అసలే శరీరం శీర్ణించిపోయిఉన్నది. దాని పైని ఈ అపథ్యం. రక్తవమనాలు ప్రారంభం అయినవి, స్మారకం తప్పి పలవరింతలు ఆరంభించినవి.

కలకత్తానుంచి పెద్దడాక్టరొకడు వచ్చాడు, రాత్రింబగళ్లు తలమీాద మంచుముక్కలు ఉంచమన్నాడు.

ఎవరు కంటపడ్డా రౌద్రులైపోతున్నారు రాజావారు, ఇంటిలోని వాళ్ళందరూ తనమీాద ఏదో కుట్రపన్నుతున్నారని అతని భ్రమ; లోలోపల "పిళ్లు రాణీని ఎందుకు వెళ్లనిచ్చారు?" అని గొణుగుతున్నారు.

ఆ గదిలోనికి రాగలిగినది ఒక్క కుముదిని మాత్రమే. ఆమె వచ్చి తండ్రిపక్కను కూర్చొనేది. తండ్రి ఆమె ముఖం

---

* బ్రాండీ తీసుకొనిరా

వంక కళ్లు చికిలిస్తూ చూస్తూండేవాడు. కొమూరైకు కళ్లల్లోనో లేక ఇంకెక్కడో గాని తల్లిపోలిక ఉన్నదని కాబోలు తండ్రి చూస్తుండేవాడు. మధ్యమధ్య ఆమె ముఖాన్ని తన గుండె మీద పెట్టుకొనేవాడు, అతని కళ్ల కొలికెలవెంట నీళ్లు కారేవి, కాని ఒక్కమారైనా తల్లిమాట అడగలేదు. ఇవతల బృందావనంకు టెలిగ్రాం వెళ్లింది. ఆ మర్నాడే రాణిగారు తిరిగి రావలసింది, కాని రైల్‌రోడ్డు ఎక్కడో కొట్టుకు పోయిందట.

౭

ఆనాడు తదియ. సాయంకాలం అయింది. తుపాను గాలి ప్రారంభంఅయింది. తోటలో చెట్లకొమ్మలు పెళపెళ విరిగి పడుతున్నవి. ఉండిఉండి వర్షపుజల్లు కోపంగా విసరి కొడుతున్నది. ఉత్సవప్రజ కోసమని వేయించిన సాలలమీది టిన్‌రేకులు ఎగిరి చెరువులో పడుతున్నవి. బాణం తగిలిన పులి బొబ్బరిస్తూ తోక ఎగరవేసుకొని పరుగెత్తుతున్నట్టుగా గాలి ఆకాశాన హోరుమని శబ్దంతో వీస్తున్నది. ఒకపెద్దగాలి విసురికి కిటికీలతలుపులు ద్వారాలతలుపులు ఒక్కసారిగా కొట్టుకోడం మొదలుపెట్టినవి. ముకుందలాల్ కుముదిని చేయి పట్టుకొని అన్నాడు, "భయపడకు తల్లీ, నీవేమీ అపరాధం చేయలేదు, అదిగో చూడు, పళ్లుకొరుకుతూ వస్తున్నారు, నన్ను చంపుదామని." తండ్రితలమీద మంచుముక్కల సంచీ ఇటూ అటూ తిప్పుతూ కుముదిని, అన్నది— "చంపడానికి రావడం కాదు నాన్నా, గాలివాన పట్టింది, ఇప్పుడే ఆగిపోతుంది."

"బృందావనమా! బృదావన...చంద్ర...చక్రవర్తి! నాన్న కాలంనాటి పురోహితుడు, అతను చచ్చిపోయినాడే! చచ్చిపోయి భూతమయి ఉన్నాడు బృందావనంలో, ఎవరంటున్నారు అతను వస్తాడని ?"

"మాట్లాడకు నాన్నా, కొంచెము నిద్ర..."

"అదిగో. ఎవరినో జడిపిస్తున్నారు 'ఖబర్దార్' అంటూ !"

"అదేమీ కాదు నాన్నా, గాలి విసురువల్ల శబ్దం అవుతున్నది."

"వాళ్లకు అంతకోపం ఎందుకు? నేను అంత అపరాధం ఏమైనా చేశానా, నీవే చెప్పు తల్లీ?"

"నీవేమీ తప్పుచేయలేదు, కొంచెము నిద్రపోనాన్నా."

"'బిందు - దూత' వేషం వేసేవాడు మధుఅధికారి." ఈలాగుఅంటూ తనలోతాను శ్రీకృష్ణునిమీద పద్యం ఒకటి వర్లించి, "రాధా, బ్రాండీ లే ఆవ్," అని అన్నాడు.

కుముదిని తండ్రి ముఖంవైపు వాలి, "ఏమిటినాన్నా ఆలాగంటున్నావు?" అని అన్నది. ముకుందలాల్ కళ్లు విప్పి చూచి నాలుక కరుచుకొన్నాడు.—ఒంటిమీద స్మారకం తప్పినప్పుడు కూడా కుముదిని దగ్గరఉంటే బ్రాండి తాగడానికి వీలు లేదని ఎరుగును.

మరి కొంచెముసేపు ఊరుకొని తిరిగి తనలో తానేదో పాట మొదలు పెట్టాడు.

ఆపాట—గొణగొణ విని కుముదినిగుండె బద్దలుచేసు కొంటున్నది - ఆమెకు తల్లిమీద అమితకోపం వస్తున్నది. అమ్మ తరఫున క్షమాపణ కోరుతున్నట్టుగా తండ్రిపాదాల మీద తలఉంచింది.

హఠాత్తుగా "దివాన్‌జీ, "అని కేకవేశాడు ముకుంద లాల్.

దివాన్‌జి రాగానే "ఏమిటా టక్కుటక్కు శబ్దం?" అని అడిగాడు.

"గాలికి తలుపులు టక్కుటక్కుమని కొట్టుకొంటున్న" వని దివాన్‌జి అన్నాడు.

"ఆ ముసలి బృందావన్ వచ్చాడు, ఆబట్టతలా, చేతిలో లాఠి, భుజంమీద కండువా - చూచి రమ్మా - ఒకేవరసను టక్కుటక్కు మంటూ ఏమిటాశబ్దం, లాఠీశబ్దమా పాంకోళ్ల శబ్దమా?"

రక్తవమనాలు కొంతసేపు ఆగినవి, కాని మూడుఘుం టలరాత్రికి తిరిగి ప్రారంభం అయినవి. ముకుందలాల్ చేతులతో పరుపు తడుముతూ, "రాణీ, ఇల్లు ఇంత చీకటిగా ఉన్నది, దీపం ఇప్పుడైనా వెలిగించవూ?" అని బహు మృదుస్వరంతో అన్నాడు.

ముకుందలాల్ పడవదిగి వచ్చిన తరువాత భార్యను సంభోషించడం ఇదే మొదటిమారు, ఇదే ఆఖరుమారు కూడాను.

నందరాణి బృందావనం నుండి వచ్చి గడప దగ్గరనే కూలి పడ్డది, ఒంటిమీాద స్మారకం లేదు. ఆమెను మోసుకొనిపోయి మంచంమీాద పడుకోపెట్టారు. ప్రపంచంలోఉండే అన్నిటి యెడలా ఆమెకు విముఖతకలిగింది, కళ్లనుండి ఒక్క అశ్రుబిందువు రాలలేదు. కొడుకులను కోమార్తెలను చూచిఅయినా సాంత్వనం పొందలేదు. గురువుగారు వచ్చి శాస్త్రాలలోనుంచి శ్లోకాలువల్లించి వెళ్లిపోయినారు కాని ఆమె అటు ముఖమైనా తిప్పలేదు. చేతులకుఉండే *ఇనపగాజులు తీయలేదు, "నాకు వైధవ్యం లేదని జ్యోతిషులన్నారు, జ్యోతిషులన్నది ఎన్నడూ అబద్ధం కానేర" దని అన్నది.

వరసకు వదిన అవుతుంది 'క్షేమ'—ఆమె కళ్లుతుడుచుకొంటూ వచ్చి, "జరగవలసిందేదో జరిగింది, ఇక సంసారం కొంచెము చూచుకో, పోయేటప్పుడు ఆయన "ఇంట్లో దీపం ఇంకా పెట్టవా," అని అడుగుతూ వెళ్లిపోయినారు," అని అన్నది.

రాణి లేచి పరుపుమీాద కూర్చొని మతిలేనిదానివలె చూస్తూ, "ఆహా దీపం వెలిగిస్తాను, ఇక మరి ఆలస్యంచేయను," అని అన్నది. నోట ఆమాట వచ్చేటప్పటికి పాలిపోయి కృశించి

* భర్తమరణానంతరం తీసివేయడం బంగాళీస్త్రీల ఆచారం.

ఉన్న ఆమె ముఖాన కాంతి ఆక్రమించింది; దీపంపట్టుకొని ఆ క్షణమే బయలుదేరుతున్నట్టు కనిపించింది.

సూర్యుడు ఉత్తరాయణానికి వచ్చాడు, ఆనాడు మాఖ శుక్లచతుర్దశి నంకరాణి నొసటను పెద్ద కుంకుమబొట్టు పెట్టుకొని, ఎర్రబనారసుచీర కట్టుకొని సంసారం విడిచి పెట్టి వెళ్లిపోయింది.

౮

తాము ఆశ్రయించిఉన్న చెట్టుయొక్క వేళ్లు తన తండ్రి మరణానంతరం పుచ్చి ఉన్నవని విప్రదాస్ తెలుసుకొన్నాడు. దొంగ ఇసుకమీద నిలబడిఉన్నవానిలాగు తమ ఆస్తిఅంతా రుణాలమీద నిలిచిఉన్నదని అతను కనిపెట్టాడు. విధివిధా నాలు తగ్గించుకొని జాగ్రత్తగా సంసారం గడుపుకుంటేనే గాని వీలులేదని పోల్చుకొన్నాడు. 'కుము'కు పెళ్లి ఎట్లాగు చేయడం అని మాటిమాటికి జ్ఞాపకం వస్తుండేది, దానికి జబాబు నోటరాకుండా ఉన్నది. చివరకు నూర్‌నగర్ విడిచి సకుటుంబ ముగా కలకత్తాకువచ్చి బాగ్‌బజారు ప్రాంతంలో బసచేసు కొన్నాడు.

పాత ఇంటిలో ఉన్నంతకాలము కుముదిని సజీవమైన పరిసరాల మధ్యనుండెను. నాలుగువైపులా పువ్వులు, పళ్లు, వరిచేలు, ఆవులసాలలు, ఇంట్లో పూజపునస్కారం, ఎటుచూచినా మనుష్యులు. ఇంటివెనకనుండేతోటలో పువ్వులుకోసి సజ్జనింపేది, కొట్టినపచ్చిరేగికాయలు ఉప్పు మిరపకాయలగుండ నంచు

కొని తినేది, ఇల్లెక్కి పుల్లగుమ్మిడికాయలు తీసేది, జ్యేష్ఠ వైశాఖాలలో గాలికిపడ్డ మామిడికాయలు ఏరుకు తెచ్చేది. తోటలో తూర్పుదిక్కున ఢెంకీ-సాల ఉండేది, అక్కడ ఆడవాళ్లందరూ కూర్చొని మిఠాయిఉండలు చేస్తుండేవారు, వాళ్లు చేస్తుండే కోలాహాలలో ఆమెకూ వంతుఉండేది. ఇంటివెనుక చెరువు చుట్టూ ఉండే పిట్టగోడ నాచుతో పచ్చగా ఉండేది, చుట్టూ దట్టంగా చెట్లు ఉండేవి, ఆ చెట్లలోనుండే కోయిలలు, పావురాలు మొదలైన పక్షులకూతలతో ఆప్రదేశం ప్రతిధ్వనిస్తూ ఉండేది. ఆచెరువులో ఆమె రోజూ ఈతకొట్టేది. చెరువులోనుంచి కలవపువ్వులు తామరపువ్వులు తీసేది, గట్టుమీద కూర్చొని నాలుగువైపులా చూస్తుండేది. పరధ్యానంగా కూర్చొని పూలుతో అల్లుతుండేది.

ఋతువు ఋతువుకు, నెలనెలకు సృష్టిలో జరిగే ఉత్సవాలతో కలిపి మనుష్యసంఘంలోకూడా పండగా పర్వాలు ఉంటవి—అక్షయ తృతీయ మొదలు దోలాయాత్ర, వసంతోత్సవం వరకు ఎన్నోపండగలు కదా! మనుష్యుడు ప్రకృతితో కలిసి సంవత్సరాన్ని చిత్ర విచిత్రమైన ఉత్సవాలతో అలంకరించినట్లు తోస్తుంది. కాని సంవత్సరం పొడుగునా సుఖమూ ఆనందమూ పొందుతుంటామని మాత్రం అనుకోకూడదు. పండగనాడు పిండివంటలు ఉంటవి నిజమే, కాని సంసారంలో అంతా పండగేకాదు. ఇంటి ఇల్లాలు పక్షపాతం కనపరచవచ్చును. పిల్లవాళ్ల కలహాలలో తల్లి తప్పు నిర్ణయించగానే

పిల్లలలో ఒకరిమీద ఒకరికి ఈర్ష్యకలుగుతుంది. కేకలువేస్తూ తిరగపడతారు. ఇరుగుపొరుగులవారు ఒకరిమీద ఒకరు చాడీలు చెప్పవస్తారు. ఒకరినొకరు అవమానపరుచుకోడంకూడా జరగవచ్చు—ఇవన్నీకూడా పండగలతోకలిసి సంవత్సరం పొడుగునా రావలసినవే కదా. ఇవికాక దినదిన సంసార యాత్రకు చేస్తుండవలసిన ప్రయత్నాలు, మనం పడవలసిన తాపత్రయాలు ఉన్నవి. ఒకొక్కనాడు ఇంటిపెద్ద ఏదో తొందరపని చేస్తూఉండగా, కచేరిచావిడిలో ఏదో గొడవ ప్రారంభం అయేది. ఆరంభమైనతరువాతమాత్రం రోజుల కొలది గొడవజరుగుతుండవలసిందే; ఇంట్లో శాంతి ఉండేదికాదు. కుముదిని గుండె దబదబ కొట్టుకొంటూ ఉండేది. అమ్మ గదిలో కూర్చొని కళ్ల నీరుపెట్టుకొనేది, పిల్లవాళ్ల ముఖాలు వాడి ఉండేవి. ఇటువంటి సుఖదుఃఖాలతోను, శుభాశుభాలతోను అందోళిత ంఅయిఉంటుంది సంసారయాత్ర.

వీటి మధ్యనుండి కలకత్తాకు వచ్చింది కుముదిని. కలకత్తా ఒక గొప్ప మహాసముద్రము, కాని దాహంతీర్చే నీరు ఒక్క చుక్కలేదు. తాను ఇంతవరకు ఉంటూఉండే పల్లె ప్రదేశంలో భూమి ఆకాశము—అంతా తానెరిగినదే అని తోస్తుండేది. గ్రామంలో దిగంతంవైపు చూచేసరికి ఒకవైపున దట్టమైన అడవులు కనబడేవి, ఒకవైపున ఇసకదిబ్బలు, దూరాన నదీజలరేఖ, మందిరశిఖరము, ఒకవైపు పెద్ద ఖాళీమైదానము, మరి ఒకవైపు సరుగుడు చెట్లగుంపులు, మరి ఒకదగ్గిర ఏటిబడ్డున పడవవాళ్లు

తాడులాగేదారి——ఈవిధంగా అనేక రంగులతో నానావిధాల చిత్రించబడ్డ దిగంతమూ ఆకాశమూ ప్రత్యేకించి తనవే అయి పోయినవని కుముదినికి తోచేది. అక్కడ సూర్యకాంతికూడా వేరేమో స్తరుదని ఇప్పుడు ఆమెకు అనిపిస్తున్నది. దగ్గర ఉండే చెరువు, వరిచేలు, పేముపొదలు, జాలారిపడవల బురదరంగు తెరచాపలు, వెదురు రొమ్మలకున్న నున్నని ఆకులు, దట్టంగా ఉన్న పనసాకులరంగు——వీటి అన్నిటితో కలిసిపోవడంచేత అక్కడి సూర్యకాంతికి ఒక విశేషత్వం కలిగింది. కలకత్తా నగరములోని మేడలూ, డాబాలూ, గోడలూ తమతమ కఠిన రేఖలతో ఆకాశాన్నీ దిగంతాన్నీ ముక్కలు ముక్కలుగాచేసి కుముదినివైపు, ఎవరో అపరిచితుడు చూస్తున్నట్టుగా, చూస్తున్నవి. దేవతలుకూడా ఆమెతో సంబంధము వదలుకొన్నారు.

విప్రదాస్ కుమును తనకుర్చీదగ్గర కూర్చోపెట్టుకొని, "ఏమమ్మా కుమూ, నీకు ఇక్కడ బాగులేదు కదూ!" అని అన్నాడు.

"ఔను అన్నయ్యా, ఏమీ బాగులేదు." అని కుము అన్నది నవ్వుతూ.

"మ్యూజియమ్ చూచి వస్తావమ్మా చెల్లీ?"

"ఆహా వెళ్లుతాను."

కుము కనపరిచిన ఉత్సాహము స్వాభావికము కాదని, విప్రదాసు మగవాడు కాకపోయి ఉంటే తత్‌క్షణమే పోల్చు

కొని ఉండును. కుముకు మ్యూజియమ్‌కు వెళ్లవలెనని లేనే లేదు. బయటి ప్రజలమధ్యకు వెళ్లడము ఆమెకు అలవాటు లేదు, కనుక మిక్కిలి సంకోచంతో కాళ్లుచేతులు వణకడం ప్రారంభించినవి. కళ్లువిప్పి ఏదీ బాగా చూడనే లేకపోయింది.

విప్రదాస్ కుముకు చదరంగంఆట నేర్పాడు. తాను మంచి ఆటకాడు, చేతకాని చెల్లెలి ఆట చూస్తూఉంటే అతనికి చాలా ఆమోదంగా ఉండేది. కొన్నాళ్లకు కుము బాగా ఆట నేర్చింది, విప్రదాసు ఆమెతో ఆడేటప్పుడు చాలా జాగ్రత్తగా ఆడవలసి వచ్చేది. కుముకు తనతోటి అమ్మాయిలెవరూ కలకత్తాలో జతపడలేదు; కనుక అన్నా చెల్లెళ్లు, అన్నాతమ్ముల వలె అయిపోయినారు. సంస్కృతమంటే గొప్పఆశక్తి విప్రదాసుకు. అన్నదగ్గిర సంస్కృతవ్యాకరణం శ్రద్ధతో నేర్చుకొన్నది కుముదిని. కుమారసంభవం చదివింది. అప్పటినుండి శివపూజచేసినప్పుడల్లా తపస్విని అయిన పార్వతియొక్క తపోధనమైన ఆ మహాతాపసి, శివుని చూడగలిగింది. ఆమె ధ్యానం చేస్తూఉండేటప్పుడు తనకు లభించబోయేవరుడు పవిత్రదైవ జ్యోతిలో తేలుతున్నట్లు కనపడేవాడు.

ఫోటోగ్రాఫులు తీయడమంటే చాలాసరదా విప్రదాస్‌కు. కుము అన్నదగ్గిర ఫోటోతీయడం నేర్చుకొన్నది. ఒకరు ఫోటోతీసేవారు ఒకరు దానిని కడిగి అచ్చువేసి తయారు చేసేవారు. మంచివేటకాడు విప్రదాస్, ఏదోపండగకని స్వగ్రామానికి వెళ్లినప్పుడు, కొబ్బరిడిప్పలు, మారేడి డిప్పలు,

అఖోర్టు కాయలు మొదలైనవి ఇంటివెనుక చెరువులో తేల వేసి వాటిని గురిచూడడం చెల్లికి నేర్పాడు.

అన్నకు ఇష్టమైన పనులన్నీ మిక్కిలి శ్రద్ధతో నేర్చుకొనేది కుము. అన్నదగ్గిర ఎస్‌రాజ్ వాద్యం నేర్చుకొన్నది, "కాని చివరకు నేను నీతో చాలలేనే చెల్లీ," అని అన్న ఒప్పుకోవలసి వచ్చింది.

చిన్నప్పటినుండి ఈవిధంగా అన్నయెడల బహుభక్తికలిగి ఉండేది. కలకత్తా వచ్చినప్పటినుండి ఆ అన్న ఆమె హృదయానికి మరీ దగ్గిరవాడైనాడు. కనుక కలకత్తా రావడము ఆమెకు సార్థకమైనట్లే. కుము సహజంగానే ఏకాకి. పర్వత వాసినిఅయిన ఉమవలెనే ఊహాతపోవనంలో ఆమె నివాసము, మానస సరోవరం అంచున. ఈవిధంగా పుట్టుకనుండీ ఏకాకిఅయి ఉన్నవాళ్లకు అవసరమైనవి, నిర్జనత అడ్డులేని ఆకాశము, వీటి మధ్యనుఉంటూ తన సమస్తప్రాణాన్ని సమర్పించి భక్తిచూపగల వారెవరైనా ఒకరు. చుట్టుప్రక్కలనుండే సంసారంలో మునిగి ఉండక ఈవిధంగా ఏకాకిగా ఉండడము స్త్రీలకు స్వభావ విరుద్ధమని నమ్మడంచేత స్త్రీలకెవరికీ ఇటువంటి స్వభావము నచ్చదు; ఇదిచూచి అహంకారమో లేక హృదయహీనతో అనుకుంటారు. కనుక స్వగ్రామంలో ఉన్నంతకాలము కుముదినికి ఎవరితోనూ అట్టే ఆంతరంగికత కుదరలేదు. తండ్రి జీవించి ఉన్నప్పుడే విప్రదాసుకు పెళ్లినిశ్చయం అయింది. పెళ్లి ముహూర్తానికి రెండురోజులుముందు జ్వరంతగిలి వధువు

చనిపోయింది. అప్పుడు జాతకం చూపించగా కొన్నాళ్లవరకు అతనికి మంచి రోజులు రావని తేలింది. కనుక వివాహ ప్రయత్నాలు ఆగిపోయినవి, అంతలో తండ్రిగారి మృత్యువు తటస్థించింది. అప్పటినుండి పెళ్లిమాటలకై ఈ ఇంటికి రావడానికి ఎవరికీ వీలుచిక్కలేదు. అయినా ఒకనాడు ఎవడో మధ్యవర్తి వచ్చి పెద్దకట్నందొరికే ఆశచూపించాడు; హుక్కా పీలుస్తున్న విప్రదాసు గొట్టమును నోటిలోనుంచి తీసి గోడకు చేరవేసి నిలుచున్నాడు కోపంతో - అది చూచి పరుగెత్తాడు వచ్చిన మధ్యవర్తి.

౬

సీమలోనున్న సుబోధ్ దగ్గిరనుండి ప్రారంభంలో ఉత్తరాలు వస్తూఉండేవి. ఇప్పుడు మొదటిలాగు సరిగా రావడం లేదు. కుము పోస్టుకోసము ఆతురతతో ఎదురుచూస్తుండేది. ఈమారు నౌకరు ఉత్తరంతెచ్చి కుముచేతికే ఇచ్చాడు. విప్రదాస్ అద్దంఎదుట నిలుచుకొని క్షవరంచేసుకొంటున్నాడు, కుముపరుగెత్తుకువెళ్ళి, " చిన్నన్నయ్యా ఉత్తరం ఇదిగో అన్నయ్యా, "అని అన్నది.

గడ్డం గీసుకోవడంఅయిన తరువాత కుర్చీమీద కూర్చొని విప్రదాస్ భయపడుతూ భయపడుతూ ఉన్నట్టుగా ఉత్తరం విప్పాడు. చదవడం ముగించి ఏదైనా బాధను మనము గట్టిగా నొక్కిపెట్టిఉంచినట్టుగా ఆ ఉత్తరాన్ని చేతిలో గట్టిగా నొక్కిపట్టుకొన్నాడు.

భయపడి కుముదిని అడిగింది— "చిన్నన్నయ్యకు జబ్బేమీచేయలేదు కదా ?"

"లేదు కులాసాగానే ఉన్నాడు."

"ఏమిటి వ్రాశాడన్నయ్యా ?"

"చదువును గురించి."

కొన్నాళ్లబట్టి సుబోధ్ ఉత్తరాలు కుముచేతికి విప్రదాస్ ఇయ్యడంలేదు, అక్కడక్కడ చదివి వినిపిస్తున్నాడు, ఈ మారు అదికూడా లేదు, ఉత్తరం ఇయ్యమని అడగడానికి ఆమెకు ధైర్యం లేకపోయింది, అయినా మనస్సు కొట్టుకు పోతున్నది.

మొదటిలో సుబోధ్ బాగా ఆలోచించనిదే ఖర్చు చేసేవాడు కాడు. ఇంటి దుఃఖం అప్పుడు మనస్సులో తాజాగా ఉండెను. అది నీడలాగు అస్పష్టమౌతున్న కొలదీ ఖర్చు జాస్తీ అయిపోతున్నది. "పెద్దవాళ్లతోకలిసి ధారాళంగా ఖర్చు చేస్తుంటేనేగాని ఇక్కడ పైకి రావడం కష్టము, అట్లాగు చేయలేనప్పుడు ఇక్కడికి రావడమే వృథా," అని వ్రాశాడు.

ఇప్పటికి అప్పుడే విప్రదాస్ ఒకటి రెండుసార్లు అధికంగా డబ్బు పంపాడు, ఇప్పుడు మళ్లీ *నూటయాభై పౌనులు చాలా అవసరమని సుబోధ్ వ్రాశాడు.

---

* అప్పటి లెక్కప్రకారం సుమారు 2250 రూపాయలు.

విప్రదాస్ తల తడుముకొంటూ "ఎక్కడ తెచ్చేది?" అన్నాడు. "ఒంట్లోని రక్తం నీరుచేసి కుము పెళ్ళికోసమని రూపాయలు కూడబెడుతున్నాను—చివరకు ఆరూపాయలలో నుంచే పంపించేయాలా ఏమిటి ! కుముకు గతిలేకుండా చేసి ఆరూపాయలలోనుంచి ఇయ్యవలసివస్తే లాభమేమిటి. ఏమి లాభం సుబోధ్ బారిస్టర్ అయి వస్తే?"

ఆరాత్రి అంతా విప్రదాస్ వరండామీద పచారిచేస్తుం డెను. కుముదినికూడా కళ్ళుమూయలేదు ఆరాత్రి, అది అన్న ఎరగడు. ఆఖరికి మరి ఊరుకోలేక కుము పరుగెత్తివచ్చి అన్న చెయ్యి పట్టుకొని ఇట్లాగన్నది— "చిన్నన్నయ్యకు ఏమయింది చెప్పు అన్నయా, నీ కాళ్లమీద పడి అడుక్కొంటున్నాను, నా దగ్గిర ఏమీ దాచకు అన్నయ్యా."

దాచడంవల్ల కుముభయం మరింత అధికమవుతున్నదని గ్రహించి, కొంచెముసేపు ఊరుకొని, "సుబోధ్ రూపాయలు పంపమన్నాడు, అంత డబ్బు తెచ్చేశక్తి నాకు లేదు."

అన్న రెండుచేతులూ పట్టుకొని కుము, "నేనొక్కమాట చెబుతాను కోప్పడనంటే," అని అన్నది.

"కోపంతెప్పించే మాట చెబితే కోప్పడకుండా ఉండ గలనూ?" అని అన్నాడు విప్రదాసు.

"హాస్యంకాదు అన్నయ్యా, అమ్మనగలు నాకోసం ఉంచావు, అవి—"

"చాలు చాలు, నీ నగలమీద మేము చెయ్యి వేయవచ్చా?"

"నేను వేయగలను."

"నీవూ వేయలేవు. సరే ఆమాటలన్నీ ఇప్పుడు ఉండనీ, ఇకవెళ్లి పడుకో."

కలకత్తానగరంలో రాత్రి తెల్లవారింది. కాకుల అరుపులతోను, మ్యూనిసిపల్ చెత్తబళ్ల శబ్దంతోను, దూరంనుండి మధ్య మధ్య స్టీమర్లకూత, ఫ్యాక్టరీల కూత వినబడుతున్నవి. ఎవడో కూలివాడు నిచ్చెనవేసుకొని 'జ్వరారి' అనే జ్వరం మందు నోటీసుకాగితాలు గోడలమీద అంటిస్తున్నాడు, బండివాడి కొరడాదెబ్బలకు జడిసి ఖాలిబండిని లాగుకొని జోరుగా ఎడ్లు పరుగెత్తుతున్నవి. పైపునీళ్లకని ఒక హిందూస్తాని స్త్రీకీ ఒడియాబ్రాహ్మడికీ కలహం జరుగుతున్నది. విప్రదాస్ గుడుగుడు పీలుస్తూ వరండామీద కూర్చున్నాడు, విప్పని వార్తాపత్రిక ఆ ప్రక్కనే పడి ఉన్నది.

కుముదగ్గిరికివచ్చి "లేదనకు అన్నయ్యా" అని అన్నది.

"నాకు అధికారం ఉన్నవాటిలో నీవు దూరకు. నీవు చెప్పావని రాత్రిని పగలుచెయ్యమన్నావా, 'లేదు'ను 'ఔను' చెయ్యమన్నావా?"

"నామాట విను అన్నయ్యా; ఆ నగలు తీసుకో, మనకు మరేకష్టాలూ ఉండవు."

"నిన్ను ముసలమ్మా అని అందుకే అంటూఉంటాము. నీ నగలు అమ్మేసినంతమాత్రాన మనచిక్కులన్నీ విడిపోతవని నీ వేలాగు పోల్చుకొన్నావు ?"

"అదిఅంతా నాకు తెలియదు, కాని నీ బాధచూచి నేను సహించి ఊరుకోలేను."

"బాగా ఆలోచించి చిక్కులు విప్పుకోవాలి. నిన్ను మోసపుచ్చి చిక్కులు పరిష్కారం చేయబోతే ఒకదాని కొకటి అవుతుంది. కొంచెము ఓర్పి ఉన్నావంటే ఏదో ఏర్పాటు చేస్తాను."

ఆనాడు టపాలోనే జబాబు పంపాడు—"డబ్బు కావలె నంటే కుమునగలు అమ్మి పంపాలి - అది ఎన్నటికీ కానేరదు," అని ఆ ఉత్తరంలో తెలియచేశాడు.

సుబోధ్ జవాబు వ్రాశాడు. కుము కట్నం రూపాయలు తనకు అక్కర లేదనిన్నీ ఆస్తిలో తన భాగం అమ్మి రూపాయలు పంపమనిన్నీ తెలియచేస్తూ దానికి అవసరమైన *పవర్ ఆఫ్ అటార్నీ ఉత్తరంతోనే పంపాడు.

ఆ ఉత్తరం బాణంవలె విప్రదాసు గుండెలో గుచ్చుకొన్నది. సుబోధ్ అంత కఠినమైన ఉత్తరం ఎట్లాగు వ్రాయగలిగాడు! తత్క్షణమే దివాన్‌ని పిలిపించి, "భూషణ్‌రాయ్

* Power of attorney

కరీమ్‌హాటి తాలూకా కావలెనని అంటూఉండెను కదూ, ఎంతకి కొంటానన్నాడు ?" అని అడిగాడు.

"ఇరవై వేలవరకు ఇయ్యవచ్చు," అని దివాన్ అన్నాడు.

"భూషణ్ రాయ్‌కి కబురుపంపండి, అతనితో మాట్లాడాలి."

విప్రదాసు కుటుంబానికి జ్యేష్ఠుడు, అతను పుట్టినప్పుడు తాతగారు ఆ తాలూకాను ప్రత్యేకంగా అతనిపేర వ్రాసేసారు. భూషణ్ రాయ్ పెద్దలక్షాధిపతి, ఇరవై పాతిక లక్షల వడ్డీ వ్యాపారం ఉన్నది అతనికి. కరీమ్‌హాటి అతని జన్మస్థానం, కనుక కరీమ్‌హాటి ఏలాగైనా సంపాదించాలని చాలాకాలం నుండి ప్రయత్నిస్తున్నాడు. డబ్బు అవసరం ఉండబట్టి విప్రదాసు మధ్య మధ్య దానిని అమ్మేస్తానని అనేవాడు, కాని గ్రామప్రజ, "మేమెన్నటికీ అతనిని మాజమీందారుగా అంగీకరించము," అని మొరపెట్టేవారు. కనుక ప్రస్తావన అంతటితో నిలిచి పోయేది. కాని ఈమారు విప్రదాసు మనస్సు కఠినంచేసుకొని కూర్చున్నాడు. సుబోధ్ డబ్బు పంపమనడం ఇంతటితో ఆగదని విప్రదాస్ ఎరుగును - ఈతాలూకా అమ్మకంవల్ల వచ్చిన డబ్బంతా సుబోధ్‌కోసం ఉంచి, తరువాత చూదాం ఏమవుతుందో అని తనలో తాననుకొన్నాడు.

విప్రదాసు ఎదుట లేదనడానికి దివాన్‌జీ సాహసించలేదు, కుముదగ్గిరికి రహస్యంగా వెళ్లి, "అమ్మడం చాలా అన్యాయం, వద్దని చెప్పమ్మా," అని ఆమెతో అన్నాడు.

విప్రదాస్‌అంటే ఇంట్లో అందరికీ బహుప్రేమా, భక్తీ; అతను తన హక్కును వదులు కుంటున్నాడంటే ఎవరూ ఇష్టపడరు.

ఆలస్యం అయిపోతున్నది, ఆతాలూకాకు సంబంధించిన కాగితాలు తిరగవేస్తున్నాడు విప్రదాసు, ఇంకాస్నానము భోజనము కాలేదు. ఉండిఉండి రమ్మని కబురు పంపుతున్నది కుము. అన్న ఇంట్లోకి వచ్చాడు ఆఖరికి, ముఖం ఎండిపోయి ఉన్నది, పిడుగుపడి ఆకులు కాలిపోయిన చెట్టులాగు కనబడు తున్నాడు, కుముగుండెలో బాణం గుచ్చుకొన్నది.

స్నానం భోజనం అయినవి, బాలీసుమీద చేరబడి కర్ర మంచంమీద కాళ్లు చాచుకొని గుడు గుడుపీలుస్తున్నాడు విప్ర దాసు. కుము అన్న తలవైపుకూర్చొని అతనిజుట్టులోవేళ్లు దూర్చి తలనిమురుతూ, "నీతాలూకా అమ్మడానికి వీలులేదన్నయ్యా," అని అన్నది.

"సిరాజుద్దౌలా - నబాబు-దయ్యం నీకు పట్టిందా ఏమిటి చెల్లీ! ప్రతిదానిలోనూ నీపెద్దరికమేనా!"

"లేదుఅన్నయ్యా, నేనుఅన్నది అలాగు తుడిచేసి పారే యకు."

విప్రదాసు మరి ఊరుకోలేక, లేచి కూర్చొని చెల్లిని తన తలవైపునుంచి లేవమని ఎదుట కూర్చోపెట్టి, దగ్గి, గొంతుక సవరించుకొని, "సుబోధ్ ఏమిటి వ్రాశాడో ఎరుగుదువా, ఇదిగో చూడు,"అని అన్నాడు.

అంటూ జేబులోనుంచి సుబోధ్ వ్రాసిన ఉత్తరం తీసి కుముచేతికి ఇచ్చాడు. కుము ఉత్తరంఅంతా చదివి ముఖం చేతులలో దాచుకొని, "ఓయిబాబు చిన్నన్నయ్య ఈలాంటి ఉత్తరం వ్రాయగలడని నేనెన్నడూ అనుకోలేదు, "అని అన్నది.

"వాడు తనఆస్తివేరు నాఆస్తివేరు అని అనగలిగేటప్పుడు నాతాలూకా వేరుగా ఉంచగలనూ? నాన్న లేడు, వాడికి అవసరమైనప్పుడు డబ్బు నేనుకాక మరిఎవరిస్తారు?"

కుము జబాబు చెప్పలేక తలవాల్చుకు కూర్చున్నది, రెండుకళ్ల వెంబడి బొటబొట నీళ్లు కారడం మొదలుపెట్టినవి, విప్రదాసు బాలీసుపై చేరబడి కళ్లు మూసుకొని కూర్చున్నాడు.

చాలాసేపటివరకు అన్నకాళ్లు నొక్కుతూ కూర్చొని, కుము చివరకు ఇట్లాగుఅన్నది— "అమ్మనగలు ఇంకా అమ్మవే కదా అన్నయ్యా, ఆనగలు అమ్మి"—

విప్రదాస్ ఉలికిపడి లేచి కూర్చొని జబాబు చెప్పాడు - "ఒక సంగతి నీకు బోధపడలేదు కుమూ. నీవస్తువులమ్మి సుబోధ్" అక్కడ నాటకాలూ * కాన్సర్ట్‌లూ చూచివస్తే నేను వాణ్ణి ఎన్నటికీ క్షమించలేను. వద్దు, వాడు ఇక ముఖమెత్తుకు తిరగలేడు - వాడిమీద అంత కఠినశిక్ష ఎందుకు విధిస్తావు కుమూ?"

కుము జబాబుచెప్పలేదు, ఊరుకున్నది.

---

Concerts = సంగీతవాద్యప్రదర్శనాలు సభలు.

ఇటువంటి అవస్థలలో, ఇంతకు పూర్వం అనుకొన్నట్టుగానే, ఇప్పుడూ అనుకొన్నది - అసంభవమైనదేది జరగదేమి! అంతరిక్షాన్న ఉన్న ఏగ్రహమో ఏనక్షత్రమో ప్రతిబంధకాలన్నింటినీ విరగకొట్టలేదూ? కాని ఇప్పుడొక శుభశకునం కనబడు తున్నది - కొన్నాళ్లబట్టి ఆమె ఎడమకన్ను బెదురుతున్నది, ఇంతకు పూర్వంకూడా ఎడమకన్ను బెదిరింది కాని అప్పుడు శకునాలను గురించి ఆలోచించవలసిన అవసరం రాలేదు. ఈ మారుమాత్రం శకునాన్ని పట్టుకొని కూర్చున్నది - శుభశకునం సఫలంఅయి తీరవలెనని ఆశించడం మొదలుపెట్టింది.

౧౦

ముసురు ప్రారంభం అయింది. విప్రదాసు దేహస్థితి బాగులేదు. పలచని రొజాయి కప్పుకొని వార్తా పత్రిక చదువుతున్నాడు. కుము ముద్దుపిల్లి కాళ్లవైపున రొజాయి మూలలను గుండ్రంగా ముడుచుకొని నిద్రపోతున్నది. విప్రదాసు ముద్దు వేటకుక్క రెండో వైపు పడుకొని నిద్రపోతూ ఉండి ఉండి, ఈర్ష్యతో కలలో గుర్రుమంటున్నది.

ఆ సమయంలో ఇంకొక పెళ్ళివిషయమై మాట్లాడడానికి మరిఒక మధ్యవర్తి వచ్చాడు.

"నమస్కారం."

"ఎవరు నీవు?"

"మీపెద్దలు నన్నెరుగుదురు మహారాజా! (వట్టి అబద్ధం) అప్పుడు మీరు పసిపిల్లవాళ్లు, నాపేరు *నీలమణి ఘటక్, గంగామణి ఘటక్ మాతండ్రి."

"ఏమి పనిమీద వచ్చావు?"

"మంచి వరుడు ఒకడున్నాడు, మీ ఇంటికి అల్లుడు కాదగినవాడు."

విప్రదాస్ లేచి కూర్చున్నాడు. రాజాబహదూర్ మధుసూదనుని పేరు చెప్పాడు ఆ ఘటక్.

విప్రదాసు ఆశ్చర్యపోయి, "కుచ్రితరహాగా మాట్లాడుతున్నట్టున్నావే?" అని అన్నాడు.

ఘటక్ నాలుక కరచుకొని జవాబు చెప్పాడు—"ఊహింపరాని ఐశ్వర్యం. ఆయన ఇప్పుడు వ్యాపారం స్వయంగా చూడడం మానేశారు. గృహస్థాశ్రమంలోకి దిగవలెనని నిశ్చయించుకొన్నారు."

విప్రదాస్ కొంతసేపు గుడుగుడు పీల్చి, కొంచెము చీకాకు పడుతున్నట్టుగా, "అతని ఈడుకు కుదిరేవారెవరూ మాఇంట్లో లేరే!" అని అన్నాడు.

ఘటక్ వదలలేదు. మితిలేని అతని ఐశ్వర్యాన్నీ, గవర్నర్లతో ఆయనకు గల స్నేహాన్నీ చిన్నెలు వన్నెలతో వర్ణించడం మొదలుపెట్టాడు.

---

* ఘటక్ అనే బంగాళీపదానికి అర్థం పెళ్ళి కుదిర్చే కమీషన్ ఏజంటు.

విప్రదాసు మరికొంచెముసేపు మాటలాడక కూర్చొని, మొదటివలె జోరుగా మళ్లా అన్నాడు— "ఈడు కుదరదు."

"ఆలోచించి చూడండి. నాలుగైదు రోజులలో తిరిగి వస్తాను," అని ఘటక్ అన్నాడు.

పెద్దనిట్టూర్పు విడిచి విప్రదాసు మళ్లా పడుకున్నాడు. వేడి టీ పట్టుకొని కుము అన్నగదిలో ప్రవేశించబోతూ ద్వారం దగ్గిర గావంచా ముడివేసిన తడిగొడుగూ, బురద స్లిప్పర్లూ, చూచిఆగిపోయింది. లోపలజరిగిన సంభాషణ చాలాభాగం ఆమె చెవినిపడ్డది. అప్పుడు ఘటక్ అంటున్నమాట ఇది—"రాజా బహదూర్ వారికి ఒకసంవత్సరంలోగా మహారాజా అనే బిరుదు ఇయ్యబోతున్నారని గవర్నర్ గారు స్వయంగా చెప్పారు. మహారాణి స్థానం ఖాళీగా ఉండకూడదని రాజావారు స్థిర పరిచారు. మాఇంటిగ్రహాచార్యుడు, కిను భట్టాచార్యులు, నాకు కావలసినవాడు. అతని దగ్గర అమ్మాయి జాతకం చూచాను. బహుచక్కగా అన్నీకుదిరినవి. కలకత్తానగరంలోని సంబంధా లన్నీ పరిశీలించి చూచాను. అమ్మాయిల జాతకాలన్నీ చూచాను, ఒక్కటైనా విడువకుండా. మీ అమ్మాయి జాతకం లాంటిది ఒక్కటి నాకు కనపడలేదు. నేను చెపుతున్నాను నమ్మండి. ఈ సంబంధం అయితీరుతుంది, బ్రహ్మవశంకాదు తప్పించడం."

సరిగా ఆవేళకే కుము ఎడమకన్ను అదిరింది. శుభాన్ని సూచించే నిదర్శం అంతకంటె గట్టిదేమి ఉంటుంది. కిను

భట్టాచార్యులు ఆమె చెయ్యి చూచి ఆమె రాణిఅయితీరుతుందని చాలాసార్లు అన్నాడు—చేతిలో కనబడుతున్న శుభఫలం నేడు తనంతటతానే కోరివచ్చి ఆమె ద్వారందగ్గర నిలుచున్నది. వాళ్ల గ్రహాచార్యులు తన వార్షికం పృచ్ఛకుందామని నాలుగు రోజు లయింది కలకత్తా వచ్చాడు. ఈ ఆషాఢ మాసంనుండి రాజ సన్మానం, శత్రునాశనం, స్త్రీలద్వారా ధనలాభం—మొదలైనవి వృషరాశి ఫలాలనిచెప్పాడు. భార్యకు జబ్బు పత్నీవియోగమూ మొదలైన ఆపదలుకూడా సంభవించవచ్చును. విప్రదాసుది వృషరాశి అప్పుడప్పుడు జబ్బుచేయవచ్చునని కూడా ఉన్నది. శాస్త్రంలో చెప్పినదానికి ప్రమాణంగా ముందురోజు రాత్రినుండి అతనికి కొంచెం రొంపగాకూడా ఉన్నది. ఆషాడం వచ్చింది ఇక వృషరాశి—విప్రదాసుకి పత్నీ వియోగం కలుగుతుందనిగాని అతనిభార్యకు జబ్బుచేస్తుందని గాని భయపడవలసిన పనిలేదు కదా. కనుక ఇది శుభసమయం, సందేహంలేదు.

కుము అన్నదగ్గిరకూర్చొని, "తలనొప్పిగా ఉన్నదా అన్నయా?" అని అడిగింది.

"లేదు," అన్నాడు అన్నయ్య.

"టీ చల్లారిపోయిందికాబోలు, గదిలో ఎవరో ఉన్నారని నేను లోపలికి రాలేదు."

కుముముఖం చూస్తూ విప్రదాసు పెద్ద నిట్టూర్పు విడిచాడు. భాగ్యదేవత చక్రాలు కదలని బంగారురథాన్ని తీసుకొని

వచ్చి ఇంటిఎదుట నిల్చోపెట్టడముకంటె క్రూరకార్యం ఏమున్నది? అన్న ముఖంలో స్పష్టంగా కనపడుతూఉండే ఆందోళన కుముదకు మిక్కిలి బాధ కలిగించింది. భగవంతుడియ్యబోయే దానం అందుకోడానికి అన్నయ్య కింత సంకోచమెందుకో ఆమెకు బోధ పడలేదు. వివాహ విషయాల్లో ఒకరి ఇష్టాయిష్టాలను గురించి ఆలోచించడం కేవలం అనవసరమైన పని అని ఆమెనమ్మకము. నలుగురు అక్కలకీ ఒకరితరువాతఒకరికి పెళ్లికావడం చిన్నప్పటి నుండి చూస్తూవచ్చింది. కులీనులకు ఇచ్చి పెళ్లిచేశారు. వరులకు కులంఉన్నదా లేదా అనేమాటతప్ప ఆలోచించవలసినది వేరేదీ లేకపోయింది. పిల్లలుపాపలతో వాళ్లు సంసారం చేస్తున్నారు, రోజులు గడిచిపోతున్నవి. ఆపద వచ్చినప్పుడు దానితో పోరాడరు, భరించిఉండడంతప్ప వేరుమార్గం ఉండ గలదని వాళ్లు ఊహించలేరు. తల్లి పిల్లలను కన్నప్పుడు ఎంచి కంటుందా? తనకడుపున పుట్టినవాడే తనబిడ్డ—వాడు కుపుత్రుడు కానీ సుపుత్రుడు కానీ. భర్తవిషయములో కూడా అంతేను. భగవంతుడు దుకాణంపెట్టుకు కూర్చోలేదే, అక్కడికి వెళ్లి ఎంచుకుందాము అనడానికి. అదృష్టానికి మంచేమిటి చెడ్డేమిటి?

ఇన్నాళ్లకు కుముదినిని ముట్టడించిఉన్న మందభాగ్యాన్ని దాటి రాజపుత్రుడువచ్చాడు ఛద్మవేషంతో, అతని రథచక్ర శబ్దం కుముదినికి తన హృదయస్పందనంలో వినబడుతున్నది. ఛద్మవేషం విప్పించి అతనియథార్థరూపాన్ని తెలుసుకోవలెనని ఆమెకోరలేదు.

తక్షణం గదిలోకివెళ్లి పంచాంగం విప్పిచూచింది. ఆవాళ *మనోరథ విదియ. ఇంటి నౌకర్లలో బ్రాహ్మణుల్ని పిలిచి సాయం కాలం ఫలహారంపెట్టి దక్షిణ ఇచ్చింది. ఆమె రాణి కావలె ననీ గొప్పసంపదతోనూ బిడ్డలతోనూ ఆమెఇల్లునిండి ఉండా లనీ అందరూ ఆశీర్వదించారు.

ఘటక్ ఇంకొకసారి వచ్చాడు విప్రదాసు దగ్గిరికి. బిగ్గరగా ఆవలించి చిటికెలు వేస్తూ "శివశివా" అనుకొంటూ గదిలో ప్రవేశించాడు. ఈమారు లేదు అని చెప్పిపంపేయ డానికి విప్రదాసు సాహసించలేదు—నెత్తిమీద గొప్పపూచీ కూర్చున్నదని అతనికి తోచింది. ఇది అన్నిటికంటె మంచి సంబంధంకాదని ఎట్లాగు నిశ్చయించగలడు? తిరిగి ఎల్లుండి కనపడుమని ఘటక్‌ని పంపివేశాడు.

౧౧

మేఘాలుకమ్మి ఉండడంచేతను, వర్షధారలవల్లను సాయం కాలం చిట్టచీకటిగా ఉన్నది. కుముగదిలో సామాను ఆట్టే లేదు. ఒకప్రక్కను కర్రమంచమొకటి, బట్టలస్టాండుమీద రెండు చీరెలు, ఒక జేగురురంగు గావంచా, మూలను పనస కర్రపెట్టె, అందులోనే ఆమె బట్టలన్నీ ఉన్నవి. మంచంకింద తాంబూలసామగ్రి, దానిప్రక్కనే తలదువ్వుకొనే సామాను పెట్టి, గోడబీరువా అరలలో నాలుగు పుస్తకాలు, కలం-

* మనోరథాలు సఫలంచేసే విదియ.

సిరాబుడ్డి, ఉత్తరాలువ్రాసే కాగితాలు. ఇంకొక అరలో నాన్న రోజూవాడుతండే స్లిపర్లజత—అమ్మ తనచేతితో అల్లి ఇచ్చినది. మంచము తలవైపున యుగళరూప రాధాకృష్ణపటము. గదిమూలను గోడకు చేరవేసి ఎస్‌రాజ్ ఒకటి.

గదిలో దీపంలేదు. కుము కర్ర పెట్టెమీద కూర్చొని కిటికీలోనుంచి బయటికి చూస్తున్నది. ఉక్కువలె గట్టిదయి బ్రహ్మాండమైన పెద్ద కాయముగల ఆదిమ జంతువువలె కలకత్తా నగరముయొక్క ఇటికల కళేబరము, వర్షధారల లోపలనుండి మసకమసకగా కనబడుతున్నది. మధ్యమధ్యను చుక్కలవలె దీపపు మిణుకుర్లు. అప్పుడు కుముమనస్సు అదృష్ట నిరూపితమైన తన భవిష్యత్తుయందు విహరిస్తున్నది. అక్కడి మనుష్యులూ, ఇళ్లూ, వాకిళ్లూ—అన్నీ కేవలము ఆమె ఊహచే నిర్మించబడ్డవే. వాటి మధ్యను తాను గృహలక్ష్మిగా ప్రతిష్ఠింపబడి ఉన్నది. ఇల్లు భక్తితోను పూజతోను సేవతోను నిండి ఉన్నది. ఆమె తల్లియొక్క పుణ్యజీవితానికి ఒకచోట పెద్ద గాయం తగిలింది—భర్త అపరాధం చేసినందువల్ల మధ్య నొకమారు ఆమె ఓర్పువిడిచింది. నా జీవితంలో అటువంటి పొరపాటు ఎన్నడూ జరగనియ్యనని కుము అనుకొంటున్నది.

అడుగుల చప్పుడు విని కుము ఉలికిపడి, విప్రదాసు కనపడగానే, “దీపం వెలిగించేదా అన్నయ్యా?” అని అడిగింది.

"అవసరంలేదు కుమూ," అని అంటూ పెట్టిమీద ఆమె ప్రక్కనే అతను కూర్చున్నాడు. కుము తక్షణమే నేల చతికిల బడి అన్న కాళ్ళ మీద చేతులు ఉంచింది.

"పై మనిషి ఉండడంచేత ముందుగదిలోకి నిన్ను రమ్మన లేదు. ఇంతసేపూ ఒంటరిగా కూర్చొని ఉన్నావు!" అని అన్న అతి మృదువుగా అన్నాడు.

"లేదు క్షేమ - అత్త ఇప్పటిప్పటిదాకా ఇక్కడే ఉండెను," అని కుము సిగ్గుపడుదూ జబాబుచెప్పి ప్రసంగం మారుద్దామని, "ముందుగదిలోకి వచ్చింది ఎవరు, అన్నయ్యా?" అని అడిగింది.

"చెపుదామని వచ్చాను. మొన్న జ్యేష్ఠమాసానికి నీకు పద్ధెనిమిది నిండాయి, పందొమ్మిదిలో కాలుపెట్టావు కదూ?"

"ఔను అన్నయ్యా, దానిలో దోషము ఉన్నదా?"

దోషం అనలేదు. ఇవాళ నీలమణి ఘటక్ వచ్చాడు.—సిగ్గుపడకు చెల్లీ, నాబంగారు తల్లివి. నాన్న బ్రతికి ఉంటూ ఉండగా నీకు పదోవడు వచ్చింది. పెళ్లికి రమారమి అంతా సిద్ధం అయింది. ఆ వయస్సులో నీ అభిప్రాయం ఏమిటి అని ఎవరూ అడగరు. నేను ఇప్పుడు ఆలాగు చెయ్యలేను కదా. రాజా మధుసూదన్ ఘోషాల్ పేరు నీవు వినే ఉంటావు. వంశమర్యాదలలో అతనిది చాలా ఉచ్చస్థానం, కాని వయస్సులో నీకంటె చాలా పెద్ద, నిన్ను పెళ్లాడుదామని అతని కోరిక కాని నే నెన్నటికీ ఒప్పుకోను—నీనోటితో లేదు అని

పించి 'వద్దని' చెప్పేదామని చూస్తున్నాను. సిగ్గుపడక నీ అభిప్రాయం చెప్పు చెల్లీ.

"లేదు, సిగ్గుపడను," అని జవాబుచెప్పి కొంచెం ఊరుకొని, "నీవు ఎవరిమాట చెబుతున్నావో ఆయనతో నాపెళ్లి స్థిరం అయిపోయింది అన్నయ్యా," అని అన్నది. ఈమాటలు, ఆనాడు ఆఘుటక్ ఆడిన మాటల ప్రతిధ్వని—అవి అప్పుడే వచ్చి ఆమె మనస్సులో నాటుకొన్నవి.

"ఎట్లాగు స్థిరం అయింది," అని అడిగాడు విప్రదాసు ఆశ్చర్యపడుతూ.

కుము జవాబు చెప్పలేదు.

ఆమె తలనిమురుతూ, "కుర్ర తరహాగా మాటలాడకు చెల్లీ," అని విప్రదాస్ అన్నాడు.

"నీకు బోధపడ దన్నయ్యా, ఇది ఎంతమాత్రం కుర్ర తరహా కాదు," అని కుముదిని జవాబు చెప్పింది.

అన్నగారియెడల అమితభక్తి కుముదినికి, కాని దైవ వాణిలో నమ్మకంలేదు అన్నయ్యకు, అన్న బుద్ధిలో ఉండే లోటు ఇదే, ఈసంగతి చెల్లి బాగా ఎరుగును.

"నీవు అతనిని చూడనైనా లేదే!" అని విప్రదాస్ అన్నాడు.

"చూడకపోతే నేమి—నేను నిస్సందేహంగా చెప్ప గలను."

ఇట్టి విషయాలలో తనకూ చెల్లెలికీ గొప్ప భేద మున్న దని విప్రదాసు ఎరుగును. కుము మనస్సులోనున్న అంధ కార గహ్వరంలో అన్నకు ఆమెపై ఎట్టి అధికారమూ లేదు. అయినా మళ్ళా అన్నాడు విప్రదాస్— "చూడు కుమూ, ఇది ఒకరోజుతో వదులుకొనేది కాదు, యావజ్జీవమూ ఉండవలసిన బంధము—ఆటగా ఛటీమని ఏదో ఒకటి చేయనిశ్చయించు కొని పట్టుపట్టుకు కూర్చోకు."

"ఆట కాదన్నయ్యా, బాగా ఆలోచించుకొన్నాను. నీపాదాలు ముట్టుకు చెపుతున్నాను, ఆయన్ని తప్ప మరెవరినీ పెళ్ళాడలే నన్నయ్యా."

విప్రదాసు ఉలికిపడ్డాడు. కార్య-కారణ సంబంధము లేనిచోట తర్కం ఏమిచేయగలదు? అమావాస్యతో ఎవ రైనా కుస్తీపట్టి ప్రయోజనం లేదు. కుము ఏదో శుభశకునాన్ని పట్టి నిశ్చయించుకొని కూర్చున్నదిఅని విప్రదాసు గ్రహిం చాడు. అదే నిజముకూడాను—ఆరోజు ఉదయాన్నే లేచి కుము ఒక పని చేసింది—బేసి సంఖ్యగల పువ్వులు కొన్నీ సరిసంఖ్య గల పువ్వులు కొన్నీ, వేరు వేరురంగులవి, తెచ్చింది; రెండేసి జత చేసి తీసివేయగా మిగిలిన పువ్వది శ్రీకృష్ణుణి విగ్రహంవలె నీలిరంగు అయినట్లైతే తాను అతనినే పెళ్ళాడవలెనని భగవంతునిఇచ్ఛ అని దేవుని స్మరించి తనలో తాననుకొన్నది. అలాగే, చివరకు నీలి అపరాజిత పుష్పం మిగిలింది.

అక్కడికి దగ్గరగా ఉన్న మల్లిక్ గారి ఇంటి సంధ్యాహారతి ఘంట ఆసమయములోనే వినబడుతున్నది. చేతులు జోడించి కుము నమస్కారం చేసింది. చాలాసేపటివరకు విప్రదాసు అక్కడే కూర్చుండబడ్డాడు. ఉండిఉండి ఆకాశాన్న మెరుపు కనబడుతున్నది. విరామములేకుండా వర్షం కురుస్తున్నది.

౧౨

కుముదినికి అంతా చక్కగా బోధపరిచి చెప్పవలెనని విప్రదాసు మరికొన్నిసార్లు ప్రయత్నించాడు, కాని కుము జబాబు చెప్పక పైటచెంగు పోగులుతీస్తూ తలవాల్చి నిలబడుతుండేది.

పెల్లి నిశ్చయంఅయింది కాని వివాహం ఎక్కడ జరగవలెనన్న విషయమైమాత్రం ఇరుపక్షాలవారికీ ఇంకా మాటలు జరుగుతున్నవి. విప్రదాసు కోరిక కలకత్తాలో జరగవలెనని, నూర్ నగర్ లో జరగవలెనని గట్టిగా పట్టుపట్టాడు మధుసూదన్—చివరకు మొగపెల్లివాళ్లమాటే నెగ్గింది.

పెల్లిఏర్పాట్లకై ముందుగానే మనుష్యులు నూర్ నగర్ రావలసి వచ్చింది. వైశాఖ జ్యేష్ఠమాసాల ఎండల తరువాత ఆషాఢమాసంలో వర్షాలుపడి మనం చూస్తూఉండగానే నేలంతా పచ్చికతో నిండి నిగనిగలాడుతున్నట్టుగా ఒక నూతన ప్రాణం కుమును లోపలా బయటా నింపింది. తాను కల్పించిన ప్రియునితో కలిసిఉన్నట్టు ఊహించుకొంటూ ఉండడంవల్ల కుము హృదయం సదా పులకితమయి ఉండేది.

శరత్కాలపు ఎండ పసిడి బంగారు ఛాయలతో వచ్చి కనుసంజ్ఞలమూలంగా మాటలాడుతూ అనంతకాల హృదయవార్తను ఆమెకు తెలియచేసేది. పడకగదిముందరివరండాలోకి పక్షులువచ్చి కుము చల్లిఉంచిన మురీలు తింటూ ఉండేవి. ఆమె అక్కడక్కడ చిన్నచిన్న రొట్టెముక్కలు ఉంచేది, ఉడతలు బెదురుచూపులతో చూస్తూ గబగబ పరుగెత్తుకువచ్చి, తమ తోకలపై కూర్చొని, ముందుకాళ్లతో ఆరొట్టె ముక్కలు పట్టుకొని కొరికి తింటూ ఉండేవి. కుము వాటిని రహస్యంగా తలుపు వెనుకనుంచి చూస్తూ ఆనందించేది. కుము హృదయం ఇప్పుడు సమస్త జగత్తుయెడల దయతో నిండి ఉన్నది. మధ్యాహ్నంవేళ ఇంటి చెరువులో స్నానంచేస్తూ మెడబంటి నీటిలో మునిగి నెమ్మదిగా నిలుచుండేటప్పుడు ఆనీరు ఆమెసర్వాంగాలను స్నేహంతో నిమిరేది. రెండోపూట సూర్యకిరణాలు చెరువుపడమటిగట్టుమీదనుండే బత్తాయిచెట్టుమీదనుండి ఏటవాలుగా క్రిందనున్న నల్లని నీటిమీద పడేటప్పుడు ఆనీరు సువర్ణకాంతిరేఖలతో తళుకుతళుకు మనేది. ఆకాంతి ఆఛాయ చూస్తూ కూర్చుంటే కుము ఒళ్లు పులకరించేది. మధ్యాహ్నంవేళ డాబామెట్ల గదిలో కూర్చుండేటప్పుడు ఆపక్కనుండే నేరేడిచెట్లనుండి పావురాల 'గూఁ గూఁ' శబ్దం వినబడేది. కుము నేడు తనయౌవనమందిరంలో వరిస్తున్న దేవత రూపు సద్భావరసంతో నిండి కృష్ణారాధికల యుగళరూపమాధుర్యం కలిగి ఉన్నది. ఎస్రాజ్ తీసుకొనివచ్చి అన్నయ్య నేర్పిన పాట వాయిస్తూ మెట్లగదినీడను కూర్చొన్నది.

రాత్రి పడుకోబోయేముందు ప్రణామము చేస్తుండేది, ఉదయం లేస్తూనే ప్రణామం చేసేది. ఆచేసే ప్రణామము ఎవరికో స్పష్టంగా ఆమెకే తెలియలేదు, నిరవలంబ భక్తియొక్క స్వతః స్ఫూర్త ఉచ్ఛ్వాసము అది—ప్రత్యేకం ఎవరినో ఉద్దేశించి కనపరచినభక్తి కాదు, అది. హృదయంలోనే పుట్టి హృదయాన్ని నింపేది. కాని ఆ ఊహానిర్మితమైన దేవతయొక్క మందిర ద్వారము శాశ్వతకాలమూ మూయబడి ఉండదు కదా. నాలుగువైపులనుండి లేచిన గుసగుసల తాపంవల్లా, విసురువల్లా లోపునఉన్న మూర్తియొక్క సౌందర్యం మాడిపోతూ వచ్చింది. భక్తురాలి అవస్థ బహు శోచనీయం అవుతూ వచ్చింది.

ఒకనాడు తెలకల వీధి ముసిలిది కుముదిని దగ్గిరికి వచ్చి ఇలా అన్నదట—"చివరికి మా కుము నొసటిరాత ఎలా ఉందో చూడు, ఎలాంటి రాజు దొరికాడో చూడు! అవాళ ఎరకలి వాళ్లు పాటపాడుతుంటే విన్నాను—'కుక్కనాకిన బ్రహ్మచెముడు మట్టలతో సింహాసనం చేశాడట!' ఈ రాజూ ఆ బ్రహ్మచెముడు డొంకల రాజే! అతనెవడో తెలుసునా, ఆ రజబ్‌పూర్ "ఆందో - గుమాస్తా" కొడుకు 'మధు', ఆ కరువుపట్టిన సంవత్సరం రంగంనుంచి బియ్యం తెప్పించి అమ్మి డబ్బుకూడబెట్టాడు. కాని అంత కూడబెట్టినా చచ్చేవరకూ కన్నతల్లిచేత నానారకాల ఇంటి పాచిపనులు చేస్తుండేవాడు."

"పెళ్లికొడుకుని నీవు ఎరుగుదువా?" అని దగ్గిరనున్న ఆడవాళ్లందరూ ఆ ముసిలిదాన్ని అడిగారు.

"నేనెరగనూ! వాళ్ల అమ్మ మా పేటలోని పురోహితులు చక్రవర్తుల అమ్మాయే కదూ...." ఇంతవరకు అని ముసిలిది గొంతుదించి మెల్లిగా మాట్లాడడం ప్రారంభించింది—అసలు సంగతి ఏమిటి అంటె, మంచికులంవాళ్లెవ్వరూ వీళ్లకు పిల్లనివ్వరు—అయితే నేమి, లక్ష్మి ఎవరింట్లోనైనా ప్రవేశించబోయేటప్పుడు ఇంటివాళ్లది ఏజాతి అని ఆలోచించి ప్రవేశించదు."

కుము మనస్సు ఈకాలపు యువతుల మనస్సువంటిది కాదు. 'జాతి' 'కులము' అనేటటువంటివి వాస్తవమైనవస్తువులు ఆమెకు. నలుగురూ వరుని జాతిని నిందిస్తూ ఉండేవారు. కుము మనస్సుకు బాధకలిగి, ఆ నిందించేవాళ్లపైని కోపగిస్తుండేది, వాళ్లమాటలు వినలేక గదిలోనుంచి బయటికి పారిపోయి ఏడుస్తూ కూర్చుండేది, అందరూ వెటకారంగా ఒకరినొకరు పొడుచుకుంటూ, "ఓయి బాబు, ఇప్పుడే అంతప్రేమ! దక్ష-యజ్ఞంలోని సతీదేవిని మించిపోయిందే!" అనేవారు.

విప్రదాసు పూర్వకాలపువాడు కాడు, అతని నమ్మకాలు ఆధునికకాలానికి చెందినవి, అయినా కులమూ జాతీ అంటే ఆదరణ పోలేదు, కనుక మధుసూదనుని జాతినిగురించి నలుగురూ అనుకొనే మాటలు బయటికి రాకుండా సాధ్యమైనంతవరకు అణచిపెట్టి ఉంచాలని ప్రయత్నించాడు. కాని చింకి బాలీసును నొక్కిపెట్టి ఉంచుతున్నకొలదీ లోపలినుంచి దూది మరీ బయటికి వస్తుంటుంది, అదేమాదిరి అయింది ఈవిషయంలోకూడా.

విప్రదాసుదగ్గిరికి తమ ముసలి రయితు, దామోదర విశ్వాస్, ఒకనాడు వచ్చి వెనుకటి ముచ్చట్లు చెపుతూ కూర్చు న్నాడు—ఘోషాలులు పూర్వం నూర్‌నగర్ పక్కనున్న శేయాకులి గ్రామానికి మాలుక్‌దారులట. ఆ గ్రామం ఇప్పుడు చాటర్జీవంశంవారి అధీనంలో ఉన్నది. దుర్గపూజ దావాల మూలంగా ఘోషాల్‌లు తమ ఆస్తి అంతా పోగొట్టుకొన్నారు. తరువాత చాటర్జీ ప్రభువులు—ఎన్నో యుక్తులు పన్ని ఘోషాల్‌లను దేశంనుండి తరమకొట్టడమే కాకుండా సంఘములోనుండికూడా బయటికి పంపగలిగారు." ఈకథలన్నీ చెపుతున్న దామోదరునిముఖము ఉల్లాసంతో పొంగిపోయింది. ఘోషాల్‌లు చాటర్జీలతో కులంలోనూ ధనంలోనూ సమా నులు అన్నది సువార్తే, కాని తామిప్పుడు చేయబోయే వివాహంకూడా, అపూర్వపు వ్యాజ్యాల మిగులు కాదుకదా!

౧౩

మార్గశిరమాసంలో పెళ్ళి. ఆశ్వయుజంలో లక్ష్మీపూజ అయి మూడురోజులయింది. ఘోషాల్ కంపెనీ ఇంజనీరింగు డిపార్టుమెంటు ఓవర్‌సీరొకడు నానారకాల సామానుతోనూ, డేరాల సరంజాముతోనూ అనేకమంది కూలీలతోకలిసి 'శేయాకులీకి' వచ్చాడు. పెళ్లివారు పెళ్లికి కొన్నిరోజులు ముందుగానేవచ్చి శేయాకులీలో డేరాలలో ఉంటారట.

"ఇదేమిటి?" అన్నాడు విప్రదాస్, "వాళ్లు ఎన్నాళ్లు ముందుగానైనా రావచ్చు, ఇష్టంవచ్చినన్నాళ్లు ఉండవచ్చును,

దానికి తగిన ఏర్పాట్లన్నీ మేము చేయిస్తాము - మాకు వేరేగా ఇళ్లుకూడా ఉన్నవి, అవన్నీ ఖాళీచేయిస్తాము.”

“రాజావారి ఆజ్ఞ అయింది.” అని ఓవర్‌సీరు జబాబు చెప్పాడు. “చుట్టుఉండే అడివి కొట్టించి జాగాఅంతా బాగు చేయించమని కూడా ఆజ్ఞ అయింది. మీరు ఇక్కడి జమీందారులు సెలవు ఇస్తే పని ప్రారంభిస్తాను.”

విప్రదాసు ముఖము ఎర్రచేసుకొని, “అది సబబేనా? అడివి నేనూ కొట్టించగలను,” అని అన్నాడు.

ఓవర్‌సీరు జబాబు చెప్పాడు—“రాజా బహాదూర్ వారి పూర్వులు ఇక్కడ ఉండేవారు. కనుక తామే ఇదిఅంతా బాగుచేయించి కొన్నాళ్లు బసచేసుకొని ఉందామని వారికి కోరిక కలిగింది.”

ఇది కేవలం అసందర్భమైన మాటకాదు. అయినా అక్కడి వారికి అది న్యాయమని తోచక గొణగడం మొదలుపెట్టారు. “మా జమీందారుగారికంటె తాను గొప్పవాడని నలుగురికీ తెలియాలి, హఠాత్తుగా ఖజానా పెరిగిపోయింది, దానిని కప్పి ఉంచలేకుండా ఉన్నాడు, డోలు వాయిస్తూ నలుగురికీ చాటిం చాలి. ఇదే పూర్వం అయిఉంటేనా! పెళ్లివాళ్లనూ పెళ్లి కొడుకునూ - అందరినీ వైతరణి దాటించేసి ఉందుము, మాచిన్నబాబుగారు ఉంటే చూచిఉందురు వీళ్ల గుడారా లెక్కడ ఉండేవో వీళ్లెక్కడ ఉండేవారో!”

"వాళ్ళపాటి మాకు చేతకాకపోదు మహారాజా! మాచేతిసొమ్ముపెట్టి మేమే చేస్తాము చేయవలసినదంతా," అని అన్నారు గ్రామస్థులంతా.

'ఆరు - అణాల'—భాగం తీసుకొని వేరుపడ్డ నవగోపాల్ అన్నాడు—"వంశానికి అమర్యాద జరిగితే సహించి ఊరుకోలేము. మనవాళ్లు పూర్వం ఒకనాడు ఘోషాల్‌లను ఎముకలు విరగగొట్టి పంపేశారు, ఆ ఘోషాల్‌లే నేడు మన తాలూకాలోకి వచ్చి రూపాయలు గలగల్లాడించాలనుకుంటున్నారు, నీవేమీ భయపడకు అన్నయ్యా, ఖర్చుపెట్టడానికి మేమూ ఉన్నాము. ఆస్తిపంచుకొన్నాము కాని మానమర్యాదలు పంచుకోలేదే!"

ఇలాగుఅంటూ నవగోపాల్ ముందుకు తోసుకొని వచ్చి నడ్డి బిగించాడు.

నాలుగు రోజులనుంచి విప్రదాస్ కుము దగ్గిరకి వెళ్లలేదు, ఆమె ముఖంవైపు చూడలేక పోతున్నాడు. మొగపెళ్లివారి పొగరుబోతుతనం కుముకు తెలియకుండా ఉంచుదామనే బుద్ధి ఎవరికీ లేకపోయింది, ఉండేది పదింతలుచేసి అందరూ ఆమెతో చెపుతూఉండేవారు. ఆడవాళ్ల కోపమంతా కుము మీదనే, తండ్రితాతలకు తలవంపులు కలగడము ఈమెవల్లనే—"రాణి ఔదామనేనా ఇంతసందడి — ఔదువుగాని ఉండు ఉండు!"

మొగపెళ్లివారి జాతి తమజాతికంటె తక్కువ—భక్తి ప్రయోగంవల్ల దీనిని పైకిరాకుండా నొక్కిపెట్టి ఉంచింది కుము. కాని ధనవంతులమని బడాయి కొట్టుకొని అత్తవారిని అవమానపరచాలని వాళ్లు చేస్తున్న ప్రయత్నాలు చూచి ఆమె చాలా దుఃఖించింది, ఎవరికీ కనపడకుండా ఎక్కడికో పోయేది. వాళ్ల నడవడి చూచి సిగ్గుపడేది—వాళ్లకుసిగ్గు కలగవలసిన విషయాలమాట అనుకొంటే తనకే సిగ్గుకలిగేది. అన్న వచ్చి తనతో మాట్లాడతాడని ఎదురుచూచేది, కాని అన్నయ్య కనబడడమే లేదు, కొన్నాళ్లబట్టి భోజనానికైనా అంతఃపురంలోకి రావడం లేదు.

ఒకనాడు వంటసాలకై ఏర్పాటుచేదామని విప్రదాస్ ఇంటివెనుక తోటలోకివచ్చాడు. కుము చెరువు దిగువుపావంచా మీద కూర్చొని తలదించుకొని నీటివైపు చూస్తున్నది. అన్న కనపడగానే లేచి పైకివచ్చి, రుద్ధకంఠంతో, "నాకేమీ బోధపడకుండా ఉన్నదన్నయ్యా," అంటూ పైటచెంగుతో కళ్లు నొక్కుకొని ఏడవడం మొదలు పెట్టింది.

అన్న చెల్లెలి వీపుమీదచెయ్యివేసి, "వీళ్లూవాళ్లూ అన్న మాటలన్నీ నమ్మకు చెల్లీ," అని నెమ్మదిగా అన్నాడు.

"కాని ఇదంతా వాళ్లు చేయించడం ఎందుకు, మీం మర్యాద నిలపనక్కరలేదా?"

"వాళ్లపక్షంనుంచి కొంచెము చూడు చెల్లీ—వాళ్ల తండ్రితాతల జన్మస్థానం, అక్కడికి వచ్చేటప్పుడు కొంత వైభ-

వంగా రావాలని వాళ్లకుఉండదా, కేవలం ఒక్క పెళ్లిమాటే అనుకోక అంతా కొంచెమాలోచించి చూడు చెల్లీ."

కుము జబాబు చెప్పలేదు. విప్రదాసుకు బాధకలిగి, మరి ఊరుకోలేక, "నీకు ఏమాత్రం సంకోచంగాఉన్నా చెప్పు చెల్లీ, ఇప్పుడైనా పెళ్లి ఆపుచేసేయగలను."

కుము తీవ్రంగా తల ఆడిస్తూ," ఛీఛీ, ఎంతమాట," అని జబాబుచెప్పింది.

"అంతర్యామి ఎదుట, హృదయంలో వాస్తవమైన ముడి పడిపోయింది, మిగతా ఉన్నదికాస్తా కేవలం బయటి లాంచము మాత్రమే కదా !"

విప్రదాసు పూర్వకాలపు మనిషి కాడు, ఇటువంటి నిష్ఠ అతనికి నచ్చక, దానికి జబాబు చెప్పాడు, "బంధానికి ఇద్దరు అవసరము, ఇద్దరిలో ఒకరు నిశ్చయించుకొన్న మాత్రాన సరిఅయిన బంధమేర్పడదే. శృతివేసిన వీణ ఉండీ ప్రయోజన మేమిటి, చేయి అపస్వరముగా తప్ప వాయించలేనప్పుడు? పురాణాలలో చూడు—రాము డెట్లాంటివాడో సీతా అట్లాంటిదే, శివు డేలాంటివాడో సతీ ఆలాంటిదే, అరుంధతి వంటివాడే వశిష్టుడు కూడాను. నేటి కాలపువాళ్లకి నీతీలేదు, ధర్మమూలేదు, కనుకనే పాతివ్రత్యం అంత ప్రచారణ చేస్తుంటూరు, ప్రమిదెలలో చమురు ఉండదు, వత్తులు వెలుగుతూ ఉండాలి అంటారు. ఇగిరిపోయిన ప్రాణాలు, చమురులేని

వత్తులు కాలికాలి బూడిదయిపోయినట్టుగా, కాలి చావక ఏమవుతవి ?"

కుముకు ఇట్లాంటివి చెప్పి లాభంలేదు. లోలోపల ఆమె మరీ గాఢజపం చేయడం మొదలుపెట్టి, మంచిఅయినా చెడ్డఅయినా అతనే నా సర్వస్వము అని కూర్చున్నది.

దుఃఖేష్వను ద్విగ్నమనాః, సుఖేషు విగతస్పృహాః,
వీతరాగ భయ క్రోధః—

ఇది కేవలం యతి ధర్మలక్షణమే కాదు, సతీధర్మలక్షణం కూడాను—అది సుఖదుఃఖాల కతీతమైనది, దానిలో క్రోధం గాని భయంగాని ఉండవు—కాని అనురాగమో ? అనురాగం అత్యంతావసరమైనది కాదు ! అనురాగం ఉన్నచోట ఇచ్చిపుచ్చుకోవడాలు ఉంటవి—జమాఖర్చులలెక్కమో స్తరు—భక్తి దానికి మించినది, భక్తి ఉన్నచోట ఆవేదన ఉండదు, నివేదన మాత్రమే ఉంటుంది. సతీధర్మము వ్యక్తిగతమైన వస్తువుకాదు, అది నిర్వ్యక్తికమైనదని చెప్పవచ్చును—ఇంగ్లీషులో దానిని †ఇమ్‌పెర్సనల్ అంటారు. మధుసూదన్ అనే వ్యక్తిలో దోషా లుండవచ్చును, కాని భర్త అనే పేరు గల భావపదార్థము నిర్వికారమైనది, నిరంజనమైనది. ఆవ్యక్తిత్వ రహితమైన భావరూపానికి కుము ఏకాగ్రచిత్తముతో తనను సమర్పించుకొన్నది.

† Impersonal

## ౧౪

ఘోషాల్ - కోనేరుచుట్టూ ఉండే అడివి ప్రదేశం అంతా కొట్టి బాగుచేయబడ్డది. ఇది ఆ జాగాఅని ఇప్పుడు పోల్చుకోనేలేము. జాగాఅంతా ఎత్తు పల్లాలులేకుండా చక్కగా చదునుచేశారు, సుర్కీకొట్టి ఎర్రని రోడ్లువేశారు, మధ్య మధ్య ఇటుప్రక్క అటుప్రక్క దీపాల స్తంభాలు, చెరువులో నాచుఅంతా తీయించేశారు, రేవులో రెండు చిన్న నావలులను ఉంచారు—ఒకదాని తెరచాపమీద "మధుమతి" అని అల్లిఉన్నది, రెండోదాని పేరు "మధుకరి." రాజాబహాదూర్ వారు బసచేయబోయే గుడారానికి ఎదుట "మధుచక్రం" పేరుకుట్టిన పసుపుబణాతుగుడ్డ ఫ్రేమ్‌తో వేల కట్టి ఉన్నది. స్త్రీల బసకొరకు వేయించిన గుడారం దగ్గరనుంచి చెరువురేవువరకు రెండుప్రక్కలా తడకలు కట్టబడి ఉన్నవి. గట్టునఉన్న పెద్ద వేపచెట్టునుండి "మధుసాగరం" అని వ్రాసిన పెద్దబల్ల వేలబడుతున్నది. అక్కడక్కడ తయారుచేసిన చిన్న చిన్న మళ్లలో రజనిగంధ, సూర్యముఖి మొదలైన ఇంపైన పూలమొక్కలు పాతించారు. చిన్న కర్రతొట్లలో చక్కని సీమపూల మొక్కలు, అక్కడక్కడ సిమెంటుకుండీలు, వాటి మధ్యను నిలబడిఉన్న ఇత్తడి స్త్రీవిగ్రహాల నోళ్లలో శంఖాలు. ఆ శంఖాలలోనుండి నీళ్లధారలుపడే ఏర్పాటు జరగబోతుంది. ఈ జాగాపేరు "మధుకుంజం". అన్నిటికంటె ముందు నగిషీపని చేసిన పెద్ద సింహద్వారం ఉన్నది, ఆద్వారంపైని ఎగురుతున్న

జండామీద "మధుపురి" అని కుట్టి ఉన్నది. ఎటుచూచినా "మధు" "మధు" అన్నమాటే. నానారకాల బట్టలతోను, కనాతులలోను, రంగురంగుల పూలతోను, చీనాబుట్టలతోను హఠాత్తుగా నిర్మించబడ్డ ఈ మధుపురిని చూడడానికి దూర దూరాలనుంచి గ్రామస్థులు గుంపులు గుంపులుగా వస్తున్నారు. ఎర్రంచు పసుపుపాగాలు పెట్టుకొన్న చప్రాసీలు, జరీలేస్‌కుట్టిన ఎర్రబనాతు డవాలీలు వేసుకొని, బూట్సుశబ్దం చేసుకొంటూ, ఇటూ అటూ పచారిచేస్తున్నారు; సాయంకాలం కాగానే ఖాలీతోటాలు పేలించి పహరా ఇస్తున్నారు, రాత్రీపగలూ ఘంటలు కొడుతున్నారు. మొలల్లోని చర్మం పటకాలలో నుంచి వేలబడుతున్న సీమకత్తులు నేలను రాస్తూ సిపాయిలు ఇటూ అటూ తిరుగుతున్నారు. పాతపడిపోయిన దుస్తులు ధరించిన చాటర్జీల నౌకర్లు సిగ్గుచేత బయటికే రాలేకుండా ఉన్నారు. ఈసందడి చూచేసరికి చాటర్జీ పరివారంవాళ్లకు ఒళ్లుమండుకుపోతున్నరి. నూర్‌నగర్-గుండెలోగుచ్చిన బల్లెం పైని ఘోషాల్‌ల జయపతాకం నేడు ఎగురుతున్నది.

శుభ వివాహ సూచన ఇదే కాబోలు!

## ౧౫

విప్రదాస్ తమ్ముణ్ని పిలిచి, "నవా, డాబులో వాళ్లతో పోటీకి లేవకు, అది అధములలక్షణం," అని అన్నాడు.

నవగోపాల్ జవాబు చెప్పాడు—"చతుర్ముఖుడు తన కాళ్లధూళిని దులపడం ద్వారానే మానవకోటిలో అధిక భాగాన్ని సృజించాడు. అతని చతుర్ముఖాలూ కేవలం పెద్దపెద్ద మాటలు అంటూఉండడానికి మాత్రమే, లోకంలోఉండే మనుష్యులలో ముప్పాతిక మూడువంతులు అధములే, వాళ్ల ఎదుట మర్యాద నిలుపుకోవాలంటే ఆ అధముల పద్ధతి అవలంభించడం తప్ప వేరుమార్గం లేదు."

"ఆవిధంగా నీవు వాళ్లను పీగకొట్టలేవు," అని విప్రదాస్ అన్నాడు. "అంతకంటె సాత్వికంగాఉండి మనం చేయవలసిన ప్రకారం కార్యంజరిపించడం ఉత్తమం. సరిఅయిన బ్రాహ్మణ పండితుని పిలిపించి మన కులాచారప్రకారం సామవేదాన్ని అనుసరించి అనుష్ఠానం జరిపిద్దాము. వాళ్లు రాజులు, వాళ్ల పనులు ఆడంబరంగా జరిపించుకోనీ, మనం బ్రాహ్మణులం, మనం చేయవలసినది పుణ్యకర్మ."

"నీవు పంచాంగం చూస్తూఉండడం లేదేమో, అన్నయ్యా. ఇది సత్యయుగం కాదు. నీటిమీద నడవవలసిన నావను బురదలో నడిపిస్తానంటావు! నీప్రజ—అనగా భాదూ పరమాణిక్, కమరుద్దీవిశ్వాస్, పంచు మండల్ మొదలైనవాళ్లు నీపాడి మెతుకులతత్వమూ, నీసాత్వికతలో ఒక అక్షరం బోధపరుచుకోలేరు. వాళ్లు యాజ్ఞవల్క్యుని మనవలని అనుకొంటున్నావేమో? గుండెలు బద్దలుచేసుకొనిచస్తారు. నీవేమీ

చేయనక్కరలేదు. మాటాడకుండా కూర్చో, చేయవలసిన దంతా వాళ్లేచేస్తారు."

ప్రజతో కలిసి పని ప్రారంభించాడు—నవగోపాల్. నౌకర్లు, పాయక్‌లు, గుమస్తాలు, మేనేజర్లు—"మీరేమీ భయపడకండి," అని ఛాతీలు విరుచుకొంటూ అనేవారు. అందరిమీద కొత్తదుస్తులు కనబడుతున్నవి. నహబత్ ఖానా బాగా ఎత్తుగాకట్టించి ఎర్రబణాతుతో ముస్తాబుచేసారు. ఏడుక్రోసులదూరంనుంచి కూడా అది కనబడుతున్నది. పేరు పడ్డ వంతుదారులుఇద్దరు నాలుగేసి ఏనుగులను ముస్తాబు చేయించి పంపించారు. ఏమీపనిలేనిదే అవి తొండాలాడించు కుంటూ ఘోషాల్ చెరువుప్రక్కను ఇటూ అటూ తిరుగు తున్నవి. వాటి మెడలకు వేలగట్టిన ఘంటలు ఠంగు ఠంగు మని శబ్దంచేస్తున్నవి. "వాళ్లేమిచేయగలరో చేసుకోనీ, చేకు బేళ్లలో నుంచి ఏనుగులను పుట్టించలేరు కదా!" అని అంటూ విప్రదాసు గారిప్రజ తొడలు వాయించి పకపక నవ్వుతుండేవారు.

మార్గశిరమాసంచివరను పెళ్లిముహూర్తం, ఇంకా పన్నెండురోజులు వ్యవధిఉన్నది. రాజావారు బంధుమిత్ర సపరి వారంగా వస్తున్నారని తెలిసింది. తామిప్పుడు చేయవలసిన దేమిటి అని వీళ్లల్లో వీళ్లకు ఆలోచనపడ్డది—మధుసూదన్ వీళ్లకా మాట తెలియచేయలేదు. మర్యాద కనపరచడం సాధారణుల కర్తవ్యంకాని రాజోచితం కాదని కాబోలు వాళ్లమతం. అటువంటప్పుడు తామే కోరి వారిని తీసుకురావ

డానికి స్టేషన్‌కు వెళ్లడం మంచిది కాదేమో ! ముందు తెలియ జేయకుండా వస్తున్నందుకు సరిఅయిన జబాబు వాళ్ల రాకను గురించి తెలుసుకోక పోవడమే.

అదిఅంతా నిజమే, కాని తర్కంద్వారా ప్రపంచంలో దుఃఖాన్ని ఆపలేము. విప్రదాసుకు కుముయెడల అగాధప్రేమ, ఆమెమనస్సుకు బాధకలుగుతుందేమో అని తోచేటప్పటికి అన్ని ఆలోచనలు నిలిచిపోయేవి. స్త్రీలకు బాధ కలిగించడం మిక్కిలి సులభము, వాళ్లహృదయాలను కాపాడగల అస్త్రాలు ఏవీలేవు. దుర్మార్గ దేవత చేతిలోఉన్నది కొరడా, దిక్కులేని వాళ్ల వీపులమీద కొరడాదెబ్బలు పడుతున్నప్పుడు వాటిని ఆపగల దయాధర్మాలు ప్రపంచంలో లేవు. అట్టిపరిస్థితిలో కేవలం తనగొప్పకై ఇతరుల బాధను అధికంచేసేవాడు కాపురుషు డని విప్రదాసుని మతము.

ఎవరికీ తెలియకుండా విప్రదాసు గుర్రంఎక్కి స్టేషన్‌కు వచ్చాడు. బండి వచ్చేటప్పటికి ఐదు ఘంటలయింది. సెలూన్‌లో నుంచి సపరివారంగా మధుసూదన్ రాజావారు దిగారు, విప్ర దాసును చూచి శుష్కనమస్కారం చేస్తూ, "ఇదేమిటి ! మీరు వచ్చారే శ్రమపడి, "అని క్లుప్తంగా అన్నారు.

"మంచిమాటే, మాదేశం వస్తున్నారు మొదటిమారు, మర్యాదచేసి తీసుకువెళ్లక్కరలేదా?" అని విప్రదాస్ జబాబు చెప్పాడు.

మధుసూదన్—"మీరనుకున్నది పొరపాటు, ఇప్పుడు రావడం మీ ఊరికి కాదు, మీ ఊరికి పెళ్లినాడు వస్తాను."

ఆ మాటలఅర్థం బోధపడలేదు విప్రదాసుకు, కాని స్టేషన్‌లో జనసమ్మర్దంమధ్య తర్కించడం మంచిదికాదని తోచి "రేవులో పడవ ఉన్నది దయచేయండి," అని అన్నాడు.

"అవసరంలేదు, మా 'స్టీమ్ లాంచ్' వచ్చింది," అని మధుసూదన్ అన్నాడు.

సంగతి బాగులేదని కనిపెట్టాడు విప్రదాస్; అయినా ఇంకొకమారు, "ఫలహారాల ఏర్పాట్లకై ప్రత్యేకంగా వేరే పడవకూడా ఏర్పాటుచేయించాను," అని అన్నాడు.

"ఇంత గడిబిడ పడుతున్నారెందుకు? ఏమీ అవసరం లేదు. ఒక్కమాట మరిచిపోకండి, నేనిప్పుడు రావడం మాతండ్రితాతల జన్మస్థానానికి, మీ దేశానికి కాదు, పెళ్లి ముహూర్తానికి మీ గ్రామానికి వస్తాను."

అతను మెత్తబడడని పోల్చుకొన్నాడు విప్రదాస్. స్టేషన్ వైటింగ్ రూమ్‌లోకి వచ్చి కుర్చీమీద కూలబడ్డాడు. శీతకాలపుసంధ్య త్వరగా చీకటి పడుతున్నది. ఉత్తరదిక్కు నుంచి మరిఒక బండి వస్తున్నది, ఘంట వాయించారు, స్టేషన్‌లో దీపాలు ముట్టించారు, విప్రదాస్ లేచి, గుర్రంఎక్కి పరధ్యానంగా కళ్లెం వదిలాడు, గుర్రం తనఇష్టప్రకారం ఇంటికి వచ్చి చేరేటప్పటికి బాగా రాత్రిఅయింది. తానెక్కడికివెళ్లినదీ, ఏమిటిజరిగినదీ, అతనెవరితోనూ చెప్పలేదు.

చలిగాలి తగిలి ఆరాత్రే అతనికి దగ్గు ఆరంభం అయింది. అది క్రమంగా అధికమయింది, అశ్రద్ధచేయడంవల్ల మరీ ముదిరింది.

ఎంతో బోధపరిచి మంచిమాటలు చెప్పి, కుము అన్న పడుకొని విశ్రాంతి తీసుకొనేటట్టు చేయగలిగింది. విధానాలు చేయించే భారంఅంతా నవగోపాల్ మీద పడ్డది.

౧౬

రెండురోజులు గడిచాయి, నవగోపాల్ అన్నదగ్గరకు వచ్చి, "నీసలహా కావాలి అన్నయ్యా," అన్నాడు.

విప్రదాస్ కంగారుపడి, "ఏమిటి సమాచారం?" అని అడిగాడు.

రాజాగారితో కొంతమంది దొరలు వచ్చారు, ఏ కంపెనీ యొక్క దలారులు కావచ్చును, లేదా బ్రాందీ దుకాణదారులు అయి ఉండవచ్చు. నిన్నను వాళ్లు మన పీర్‌పూర్ వైపు వెళ్లి రెండువందలకు తక్కువ లేకుండా పూలుగులను కొట్టి తీసుకు వచ్చారు. ఇవ్వాళ †'చందన్‌దహ' వైపు వెళ్లుతున్నారు. శీత కాలం ఆచెరువులో దేశంలోఉండే నీటిబాతులన్నీ కూడి ఉంటాయి, రాక్షసక్రీడతో సరిపోల్చగల జీవహత్య జరుగు తుందని నా అనుమానం. అహిరావణుడు, మహిరావణుడు, హిడింబ, ఘటోత్కచుడు, కుంభకర్ణుడు మొదలైనవాళ్లందరికీ

† ఆపేరుగల పెద్దచెరువు.

కూడా విందుచేసినా తరగనన్ని పక్షులను వధించి కుప్పచేస్తారని నా నమ్మకం."

విప్రదాస్ నిర్ఘాంతపోయి చూస్తూ కూర్చున్నారు, ఏమీ అనలేదు.

"ఆ చెరువులో ఎవరూ పక్షులవేట చేయకూడదని నీఆజ్ఞే అన్నయ్యా. వెనకటికి ఒకమారు జిల్లాకలెక్టరుగార్ని కూడా మనవాళ్లు అడ్డుచేశారు, రాజహంస అనుకొని దొరగారు నిన్నే గుండుతో కొట్టేస్తారేమో అని మేమంతా భయపడ్డాము, కాని దొరగారు మర్యాదస్థులు వెళ్లిపోయినారు. కాని వీళ్లకంటికి గోవులు మృగాలు ద్విజులు—అన్నీ సమానమే అయినట్టు కనపడుతున్నది. నీవు'వద్దు' అనకపోతే మేము వెళ్లి--"

"వద్దు వద్దు, మీరేమీ అనకండి," అని విప్రదాస్ తడబడుతూ అన్నాడు.

విప్రదాస్ పులివేటకాడు, పెద్దపులుల వేటలో ఇతనికి మించినవాడు జిల్లాలోలేడు. వేటాడుతూ వేటాడుతూ ఒకమారేదో పక్షిని కొట్టాడట—మనసుకు ఎంతో బాధకలిగి అప్పటినుండి తన ఎస్టేట్లో ఎవరూ పక్షులను కొట్టకూడదని ఆజ్ఞాపించాడట.

కుము అన్నతలదగ్గర కూర్చొని అన్నతల నిమురుతుండెను; నవగోపాల్ వెళ్లిపోగానే ముఖము కొంచెము కఠినం చేసి, "వద్దని కబురుపంపు అన్నయ్యా," అన్నది.

"ఏమిటి వద్దనేది ?"

"పక్షులను చంపడం."

"తప్పభిప్రాయపడతారు కుమూ. సహించి ఊరుకోలేరు."

"పడితే పడనీ, మానావమానాలు వాళ్ల ఒక్కరికేనా?"

విప్రదాసు కుముముఖంవైపు చూస్తూ తనలోతాను నవ్వుకొని, కుము లోలోపల బహునిష్ఠతో సతీధర్మం పాలిస్తున్నదని అనుకున్నాడు—'ఛాయేవానుగతా స్వచ్ఛా.' చివరకు సాధారణమైన చిన్నపిట్టకోసమని దేహానికీ ఛాయకు ఎడబాటు కలుగదు కదా!

విప్రదాసు ముద్దుగా ఇలాగన్నాడు—"కోపగించకు కుమూ, నేనుకూడా ఒకప్పుడు పిట్టలను చంపేవాణ్ణి, ఆపని అన్యాయమని అప్పుడు నాకు తట్టనేలేదు, వాళ్లదికూడా ఇప్పుడాదశే!"

అత్యుత్సాహంతో జరిగింది పక్షిషికారు, తరువాత *పిక్‌నిక్, తరువాత బ్యాండువాయిద్య సహాయంతో దొరల †డాన్సు. సాయంకాలం టెన్నిస్, అదికాక మధుసాగరంలో నావపరుగులు పరిగెత్తించారు, పోటీలు జరిగాయి; ఇది చూడడానికి చెరువుగట్లమీద ఊరిప్రజ జమకూడారు. రాత్రి విందు ముగిసిన తరువాత, ‡"ఫర్ హి ఇజ్ ఎ జాలి గుడ్ ఫెలో," అని

---

* Picnic † Dance

‡ For he is a jolly good fellow

కేకలువేసుకుంటూ గొప్పసందడి చేశారు. దీనిలో ముఖ్య నాయికానాయకులు దొరసానులు దొరలే, బహువింతగా చూస్తూ నిలుచున్నారు గ్రామస్థులు—హాట్లు నెత్తిమీద పెట్టుకొని చేపలుపట్టుతూఉండడంకూడా పల్లె గ్రామస్థులకు వినోదకరంగానే ఉన్నది. వీటిముందర రెండోపక్షంవాళ్లు ఏర్పాటుచేయించిన కుస్తీపందెములు, హరికథలు, భాగవతాలు, బాణాతిప్పించడం—మొదలైనవి ఏమూల ?

*'గాయె హలుద్' విధానం పెళ్లి రెండురోజులు ఉన్నదనగా జరిగింది. గొప్పవిలువైన నగలతో ప్రారంభించి ఆట బొమ్మలవరకు నానారకాల వస్తువులు విడిదిఇంటినుంచి బయలు దేరినవి. ఆ సందడి చూచి ఆశ్చర్యపోనివాడు లేడు—వాటిని పెళ్ళికూతురింటికి మోసుకువచ్చినవాళ్ల సంఖ్య ఏమైనా తక్కువా ! వీళ్లకు బహుమతుల రూపంగా విప్రదాస్ చాలా ఖర్చుపెట్టవలసి వచ్చింది.

వేడుకచూడడానికి వచ్చిన జనానికి విందుచేయించడం ఉండనే ఉన్నది—దీనితో వైవాహిక కురుక్షేత్రంలోని ద్రోణ పర్వం ప్రారంభం అయిందని చెప్పవచ్చు.

ఆనాడు 'టామ్‌టామ్'ద్వారా చాటించారు, మధుపురిలో మధుసాగరతీరాన విందు జరుగుతుందని. రవాహంతులు

---

*గాయె - హలుద్ = ఒంటికి పసుపు - వధువుకు పసుపురాసి స్నానం చేయిస్తారు.

అనాహూతులు—అందరూ భోజీకి రావచ్చునట. విని నవగోపాల్ అగ్నిహోత్రుడైనాడు—"ఏమిటీ పొగరుబోతుతనము! జమీందారులము మేమూ, మా జమీందారీలో మధుపురి పెట్టడానికి వీడెవడు ?"

విందు ఏర్పాట్లు సామాన్యమైనవి కావనే వార్త నలుదిక్కులా అల్లుకుపోయింది. తెప్పించిన చేపలు, మైదా, చీనీ, పాలు, పెరుగు, నెయ్యి, మిఠాయిలకు మితిలేదు. చెట్లక్రింద పెద్దపెద్ద గాడీపొయ్యిలు, వంటకు అనేకసైజుల హండాలు, బిందెలు, గిన్నెలు, తప్పేలాలు, పెనాలు, మూకుళ్లు; ప్రక్కను ఎడ్ల బళ్లవరస—బళ్లనిండా బంగాళాదుంపలు, వంకాయలు, అరటికాయలు మొదలైన కూరకాయలు. విందు సాయంకాలం కాబోతుంది—లైట్లు వెలిగించిన తరువాత.

ఇవతల—మధ్యాహ్నభోజనాలు చాటర్జీగారి ఇంట. అతని ఇలాకాలోని మనుష్యులు గుంపులు గుంపులుగా వచ్చి చేయవలసిన ప్రయత్నాలన్నీ తామే చేశారు. హిందువులకు ముసల్మాన్లకు వేరువేరు స్థలాలలో ఏర్పాటుచేశారు. హిందువులకంటె సాయిబులసంఖ్య అధికం. తెల్లవారకముందే హండాలు పొయ్యిలమీద కెక్కినవి. విందు ఏర్పాట్లకు పదిరెట్లు జయధ్వనులు వినబడుతున్నవి. సాయంకాలం సుమారు ఐదుఘంటలవరకు భోజనం లేకుండా నవగోపాల్ తానే స్వయంగా వడ్డనలు వగైరా చేయించాడు. తరువాత బీదసాదలకు భోజి. చేయవలసిన దానధర్మాలు ఎస్టేటులోని పెద్దవాళ్లు

చేయించారు. ఆకాశాన సముద్రమథనం జరుగుతున్నదా అన్నట్లు నాలుగువైపులా జయధ్వని, కలకలధ్వనులు.

మధుపురిలో రోజంతా వంటలు జరుగుతున్నవి; ఎంతో దూరందాకా వాసన ఎగిరిపోతున్నది. సిబ్బులు, పళ్లెములు అరటిఆకులు పర్వత ప్రమాణంగా పడిఉన్నవి. పారేసిన కూరగాయలు, చేపముక్కల కోసము కాకులు చేస్తున్న కలరవానికి విరామంలేదు. దేశంలోని కుక్కలన్నీవచ్చి వాటిమీదపడి కొట్లాడుతున్నవి. సాయంకాలమయిపోయింది, స్తంభాలకు వేలగట్టిన పెద్ద లైట్లన్నీ వెలుగుతున్నవి, కలకత్తా †మెటియాబురుజ్ నుండి వచ్చిన సనాయిమేళంవాళ్లు కల్యాణి రాగంతో ప్రారంభించి కేదారదాకా పాడుకువచ్చారు. అనుచరులు, పరిచారకులు తడబడుతూ ఉండిఉండి వచ్చి రాజాబహదూర్ చెవిలో చెబుతున్నారు, భోజనానికి ఆట్టేమంది ఇంకా రాలేదని— ఆనాడు సంతరోజు అవడంచేత, ఆకులువేసి ఉండడం చూచి ఏదో భోజి అని గ్రహించి సంతకువచ్చినవాళ్లు కొందరు కూర్చున్నారు—బీదసాదలు కూడా ఆట్టేమంది జమకాలేదు.

మధుసూదనుని ముఖం మాడిపోయింది, 'హుం' అని మూలుగుతూ గుడారంలోకి దూరి ఒంటరిగా కూర్చున్నాడు.

చిన్న తమ్ముడు—'రాధూ'— వచ్చి, "ఇకనెందుకు పద వెళ్లిపోదాం," అన్నాడు.

---

† సనాయిమేళాలకు ప్రసిద్ధిచెందిన కలకత్తాలో విభాగం.

"ఎక్కడికి ?"

"కలకత్తా వెళ్లిపోదాము, వీళ్లు దగుల్బాజీలుగా ఉన్నారు. నీవు వేలితో సంజ్ఞ చేస్తేచాలును, గొప్పగొప్ప వాళ్లు తమ అమ్మాయిలను నీకు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నారు—నీవు ఒక్కమారు 'తూతూ' అని పిలుస్తే చాలును."

"వెళ్లు, పో!" అని గర్జించాడు మధుసూదన్.

వందసంవత్సరాలక్రితం జరిగినదే ఇప్పుడూ జరిగింది—ఒక పక్షంవాళ్ల ఆడంబరం రెండోపక్షంవాళ్ల ఆడంబరంకంటె మీదికి తల ఎత్తింది, ఇప్పుడు కూడా రెండోపక్షంవాళ్లు మొదటి పక్షంవాళ్లకు దారిని వెళ్ల నివ్వడంలేదు. కాని దీనిలోని జయాపజయాలు బయటనుండి బోధపడవు, యుద్ధభూమి కంటికి కనబడేది కాదు.

చాలూర్జీలప్రజ బాగానవ్వుకున్నారు. విప్రదాసు జబ్బుతో మంచంమీద పడిఉన్నాడు. ఇదివదీ అతని చెవిని పడలేదు.

## ౧౭

పెళ్లినాడు పెళ్లికూతురుఇంటికి వెళ్లేటప్పుడు ఉత్సవమేమీ వద్దని రాజాగారి ఆజ్ఞ అయింది. దివిటీలు లేవు, లైట్లు లేవు, బాజాబజింత్రీలు లేవు. పురోహితుడు, ఇద్దరు భత్రాజులతోమాత్రమే బయలుదేరాడు పెళ్లికొడుకు. నిశ్శబ్దంగా పల్లకీతో ఒంటరిగా వచ్చేటప్పటికి కథ ఎవరికీ బోధపడలేదు.

అవతల మధుపురిలో లైట్లువెలిగించి బ్యాండుసనాయి వాయిద్యాలతో మొగపెళ్లివాళ్లు ఉత్సవం జరుపుతూ విందు చేసుకొంటున్నారు. ఇది వాళ్ల తిరుగు జబాబని నవగోపాల్ పోల్చుకొన్నాడు. ఆ పరిస్థితులలో, కన్యపక్షంవాళ్లు చేయ వలసినది వరపక్షంవాళ్ల చేతులు పట్టుకొని ప్రార్థించడం. నవగోపాల్ అది చేయలేదు సరికదా సమాచారం ఏమని అయినా అడగలేదు.

కుము ముస్తాబయింది, వివాహ సభలోనికి వెళ్లకముందు అన్నగారికి ప్రణామం చేవామని వచ్చింది. ఆమె దేహ మంతా వణకడం మొదలు పెట్టింది. విప్రదాసు కప్పుడు నూటా ఐదు డిగ్రీలు జ్వరం. కుము వచ్చి అన్నపాదాలకు తన తలను తగిలించి మరి ఊరుకోలేక వెక్కి వెక్కి ఏడవడం మొదలు పెట్టింది. "క్షేమ-అత్త" ఆమెనోటిపైన చెయ్యి వేసి," "అట్లాగు ఏడవకూడ దమ్మా," అని అన్నది.

విప్రదాసు లేచి చెల్లిని చెయ్యిపట్టి లేవదీసి పక్కను కూర్చోపెట్టుకొని ఆమె ముఖంవంక చూస్తూ కూర్చున్నాడు కొంచెమునేపు. అతని రెండు కళ్లవెంబడి బొట బొట నీళ్లు కారడం మొదలు పెట్టినవి. క్షేమఅత్త వచ్చి, "వేళ అయిందమ్మా," అన్నది.

విప్రదాసు చెల్లెలి తలపైని చెయ్యి ఉంచి, "సర్వసు భాలను ఇచ్చే సర్వేశ్వరుడు నీకు సుఖం ఇచ్చును గాక!" అని రుద్ధ కంఠంతో అంటూ పరుపుమిద కూలబడ్డాడు.

విధానం జరుగుతున్నంతసేపు కుముదం రెండు కళ్ళ వెంట నీరు జర జర కారుతూనే ఉన్నది. వరుని చేతిలో చెయ్యి ఉంచి నప్పుడు ఆమె చెయ్యి చల్లబడిపోయి గజగజ వణుకుతున్నది. శుభదృష్టి అప్పుడు ఆమె వరుని ముఖము చూచిందో లేదో సందేహమే. వాళ్ళ నడవడి చూచేసరికి భర్త అంటే భయం పుట్టిపోయింది ఆమె మనస్సులో. తనకు లభించబోయేది గూడు కాదు ఉరి అని పక్షికి భయం కలిగింది.

మధుసూదన్ కురూపి కాడు. కాని బహు కఠోరమైన ఆకారం అతనిది. అన్నిటికంటె చూచేవాళ్ళ కంట మొదట పడేది అతని నల్లని ముఖంలో ఉన్న పక్షిముక్కు వంటి పెద్ద వంకర ముక్కు, పెదవులదాకా దిగి పెదవులకు పారా ఇస్తున్నట్టున్నది. విశాలమైన నుదురు, గట్లు తీసి పారుతున్న నదీ ప్రవాహంవలె ఉన్న కనుబొమ్మలు, వీటికిందను తిర్యక్ దృష్టితో చూస్తున్న చిన్న కళ్ళు, క్షవరం చేసుకొన్న గడ్డాలు మీసాలు, బిగపెట్టి ఉన్న పెదవులు, పొట్టిగా కత్తిరించి నూనిరాసి దువ్విన నీగ్రోల జుట్టువంటి బిరుసైన ఉంగరాలజుట్టు. గట్టిశరీరం, మంచి చక్కదనము, అసలు వయస్సుకంటె చాలా చిన్నగా కనపడతాడు, చంపలమీదమాత్రం వెండ్రుకలు కొంచెం పండిఉన్నవి. మనిషి పొట్టివాడు, రమారమి కుముదినిఅంత పొడవే, దేహానికి తగిన పొడవులేదు చేతులకు. చూచేవాళ్ళకు మొత్తంమీద అతనొక నిశ్చలస్వభావంగల కఠినమైన మనిషి అని తోస్తుంది. ఆమూలాగ్రం ఏదో ప్రతిజ్ఞచేసుకొని తుపాకితో గురిచూస్తూ

కూర్చున్నవానివలె ఉంటాడు. భాగ్యదేవతయొక్క తుపాకిలో నుంచి కొట్టబడి ఏకాగ్రచిత్తముతో నిర్దిష్టస్థానానికి పరుగెత్తుతున్న గుండు అని అతనిని వర్ణించవచ్చును. పనికిమాలిన వాళ్లతో అనవసరప్రసంగాలు మాట్లాడుతూ కాలం వ్యర్థం చేయడానికి వ్యవధిలేనివానివలె కనపడతాడు.

చూచినవాళ్ల కెవ్వరికీ పెళ్లి ఆనందం కలిగించలేదు. వివాహంలో ఉభయపక్షంవాళ్లూ మొట్టమొదట కలిసినప్పుడుండవలసిన ఉత్సవసంగీతం ఏ అడుగునో పడ్డది. కుముదిని హృదయంలో మాత్రం ఒక ప్రశ్న మాటిమాటికి పుట్టేది—"అయితే భగవంతుడు నన్ను మరిచిపోయినాడా?" యావచ్ఛక్తిని ప్రయోగించి తనసంశయాన్ని అణచుకో ప్రయత్నంచేస్తున్నది. తలుపులు మూసి గదిలోకూర్చొని ఉండి ఉండి తల నేలకు తగిలించి భగవంతునికి ప్రణామంచేస్తున్నది. 'మనస్సు దుర్బలం కానియ్యకు తండ్రీ' అని ప్రార్థిస్తున్నది. కాని తన సంశయం అన్నకు తెలియకుండా ఉంచడం అన్నిటికంటె అసాధ్యమయింది.

తల్లిపోయినప్పటినుండి అన్నసంరక్షణభారం కుముమీద నేఉండెను, ఇంటి సొవరు, బట్టాపాతా, పుస్తకాలబీరువా, గుర్రందానా, తుపాకీతోమడం, కుక్కసేవ, క్యామెరా జాగ్రత చెయ్యడం, సంగీతయంత్రాలు జాగ్రత్తపెట్టడం, పడకగదీ ముందుగదీ పరిశుభ్రంగా ఉంచడం—అంతా కుముదిని చేతులలోనే ఉండేవి. అన్నీ ఆమె చేస్తుండడంచేత ఆమెచేయిలేనిదే అన్నకు ఏదీ రుచించేదికాదు. పెళ్లికి పూర్వమే అన్న జబ్బుతో

మంచంమీద పడిఉన్నాడు, రాత్రింబగళ్లు కుము సేవచెయ్య వలసి వచ్చింది, తన మనస్సును కెలకెలపెడుతున్న తలంపులేవీ అన్నకు తెలియకుండా ఉండవలెనని కుము చాలా ప్రయత్నం చేసింది. చెల్లెలి ఎస్‌రాజ్ వాద్యం విని విప్రదాసు బహుగర్వ పడేవాడు. సిగ్గుకొలదీ వాయించడానికి సంకోచించేది కుము. కాని రెండురోజులయింది, ఇప్పుడు తానే కోరి అన్నయ్యకు కన్నడ, మలయమారుతం రాగాలమీద ఆలాపన వినిపిస్తున్నది. ఆ ఆలాపనలోనే దేవుని కామె చేస్తున్న స్తవము, ఆమె ప్రార్థన, ఆమె ఆత్మనివేదన, అందులోనే ఆమెమనస్సును ఆవరించిఉన్న భయంకూడా ఉండెను. విప్రదాస్ కళ్లుమూసు కొని మధ్యమధ్య చెబుతుండేవాడు తరువాత పాడవలసిన రాగాలు—సింధు, బేహాగ్, భైరవి - అంటూ; అవి ఎడ బాటువల్ల కలిగే దుఃఖాన్ని సూచించే రాగాలు. ఆ పాట లోనే వారిద్దరిదుఃఖమూ ఏకమయింది. ఒకరి నోటవెంటా మాటలేదు, ఒకరినొకరు ఓదార్చుకోలేదు, దుఃఖాన్ని తెలియపరచుకోలేదు.

విప్రదాసుకి జ్వరము, దగ్గు, గుండె నొప్పి—ఏదీ తగ్గ లేదు. పైగా అధికంఅయింది కూడాను. ఇన్‌ఫ్లుయన్‌జా అన్నాడు డాక్టర్, న్యూమోనియా కింద దించవచ్చు నన్నాడు, చాలా జాగ్రత్తగా ఉండవలెనట.

పెళ్లైన తరువాత జరపవలసిన విధానం అక్కడే జరిపి తరువాత కలకత్తా వెళ్లవలెనని మొదటి ఏర్పాటు, కాని హఠా

త్తుగా ఏమి ఆలోచించుకున్నాడో మధుసూదన్ తక్షణమే కలకత్తా వెళ్ళిపోవలెనన్నాడు. ఇది ప్రేమకోలదీచేసినది కాదు, అవసరమని వెళ్లడం కాదు, వంశధర్మంఅని కాదు, కేవలం తన అధికారాన్ని తెలియచేయాలని మధుసూదన్ చేసిన ఆజ్ఞ ఇది. అట్లాంటప్పుడు పౌరుషం వదులుకొని దయాభిక్ష కోరవలసినది కాదు కుముదిని. ఐనా, సిగ్గు విడిచి గద్గదస్వరంతో పెళ్ళినాటి రాత్రి భర్తను వేడుకొన్నది—మరిరెండు రోజులు తాళి అన్న జ్వరం తగ్గగానే వెళ్లుదామని. క్లుప్తంగా జబాబు చెప్పాడు భర్త—"ఏర్పాట్లన్నీ జరిగిపోయినవి." ఎంత కఠినమైన ఏర్పాట్లో గాని ఆమె కోరికకు, ఆమె సుఖదుఃఖానికి వాటిలో తావులేకపోయింది. అటుపైని ఆరాత్రి మధుసూదన్ కుముతో మాట్లాడవలెనని ప్రయత్నించాడు, ఆమె ఒక్కమాటకు జబాబుచెప్పలేదు, ముఖమటువైపు తిప్పి పడుకొన్నది.

ఇంకాతెల్లవారలేదు, పక్షుల అరుపు వినబడీ వినబడక మునుపే కుముు లేచి బయటికి వెళ్ళిపోయింది.

విప్రదాసుకు రాత్రి నిద్రలేదు, జ్వరంతో పరుపుమీద ఇటూఅటూ కొట్టుకుంటున్నాడు, సాయంకాల జ్వరంతోనే వివాహ సభకు వెళ్లుతానని పట్టుపట్టాడు, డాక్టరు అతి కష్టం మీద అతన్ని ఆపిఉంచాడు. క్షణక్షణానికి మనిషినిపంపి పెళ్ళి సభలోని వార్తను కనుక్కొంటుండేవాడు. వచ్చినవార్తలు యుద్ధవార్తల మాదిరివే, చాలాభాగం కల్పితం. "పెళ్ళికొడుకు

ఎప్పుడు వచ్చాడు, బాజాబజింత్రీల సందడిలేదే!" అని అడిగాడు విప్రదాసు.

కబరుతెచ్చినవాడు 'శివు'; వా డన్నాడు—"అల్లుడూ బహుబుద్ధిమంతుడు, ఇంటిలోని జబ్బుమాట విని సందడంతా ఆపుచేశాడు, మొగపెళ్ళివాళ్ల అడుగుల చప్పుడైనా వినబడకుండా చేశాడు."

"మనము తెప్పించిన సామాన్లు సరిపోయాయా, శివూ? చాలవేమో అని నాకు భయంగా ఉండెను, ఇది కలకత్తా కాదు, ఎప్పుడు కావాలంటే అప్పుడు తెచ్చుకోడానికి."

"సరిపోలేదంటారా! ఎన్ని మిగిలిపోయాయి, మరి అంత మందికి భోజనాలు పెట్టవచ్చు అవసరముంటే.'

"వాళ్లు ఆనందించారా?"

"ఒక్కరి నోటివెంటా నేనేమీ వినలేదు. నేను ఎన్నో పెళ్ళిళ్లు చూచాను, ఉభయపక్షాలవాళ్లు కాట్లాడుకోడం, చివరకు పెళ్ళికూతురుపక్షంవాళ్లు మూర్ఛపోవడం జరిగేది, వీళ్లు ఉన్నారోలేదో తెలియనంత నిశ్శబ్దంగా అంతా జరిగించారు."

విప్రదాస్—"వాళ్లది పట్నవాసం, నాగరికతగలవాళ్లు. అత్తవారింటి అవమానం తమకుజరిగిన అవమానమే అని వాళ్ల అభిప్రాయం."

"మీరన్న మాట వాళ్ల మనుష్యుల చెవిని వేస్తాను, అధికార్లు విని సంతోషిస్తారు," అని శివు అన్నాడు.

అన్న జబ్బు ముదిరేటట్టున్నదని నిన్న సాయంకాలమే విన్నది కుము. ఐనా అన్నకు సేవచేయలేనన్న తలంపు, ఉరిలో చిక్కుకున్న పక్షివలె, ఆమె మనస్సులో కొట్టుకుంటూ ఆమెకు బాధ కలిగిస్తున్నది. తనచేతితో చేసినసేవ అన్నకు ఔషధం కంటె ఎక్కువమేలు చేస్తుందని ఆమె ఎరుగును.

స్నానం చేసి దేవతార్చన చేసి అన్నగదిలోకి కుము వచ్చేసరికి ఇంకా సూర్యోదయం కాలేదు. కఠిన రోగంతో పోరాడి పోరాడి అలసి పడి ఉన్నవానిలో ఒక విధమైన వైరాగ్యం పుట్టుతుంది. ఇప్పుడు విప్రదాసు అట్టి శిథిలావస్థలో ఉన్నాడు. అటువంటి వానికి దేనియందూ ఆసక్తి ఉండదు, సంసారచింత ఉండదు, ధాన్యంకోసేసిన పొలం మాదిరి అంతా ఎండిపోయి ఉంటుంది. రాత్రి కిటికీతలుపులు వేసిఉండెను, తెల్ల వారుజామున తూర్పువైపునఉన్న కిటికీతలుపులు డాక్టరు తెరిచాడు. మంచుతో తడిగాఉన్న రావిఆకుల మధ్యనుండి ఆకాశాన కనబడుతున్న అరుణకాంతి మెల్లి మెల్లిగా తెల్లనౌ తున్నది, రేవులోనున్న ఓడతెరచాపల మాసికలు కనబడు తున్నవి, ఆచాపలు గాలికి పొంగి ఆకాశానికి అడ్డుగా వస్తు న్నవి. మనస్సులో జాలిపుట్టించే రామకేళీ ఆలాపన సనాయి మీద వినబడు తున్నది.

కుమ పక్కను కూర్చొని కృశించిఉన్న అన్నగారి వేడి చేతులు తన చల్లని చేతులలో ఉంచుకొన్నది. విప్రదాసు †టెరియర్ - కుక్క నిరుత్సాహంగా మంచంకింద పడిఉండెను. కుమ కూర్చోగానే కుక్క లేచివచ్చి ముందు కాళ్లు రెండింటినీ కుమమీద నుంచి ఆర్తనాదంతో ఏదో మెల్లిగా ప్రశ్నిస్తున్నట్టు నెమ్మదిగా అరిచింది.

విప్రదాసుమనస్సులో ఏదో ఆలోచన లోలోపున నడుస్తుండెను. హఠాత్తుగా ఆటంకం కలగడంవల్ల ఆ ధోరణి తెగింది; ఆట్టే సందర్భంలేకుండా మాటలు ప్రారంభించాడు— "అసలేమీలేదు చెల్లీ. ఎవరుపెద్ద ఎవరుచిన్న, మీద ఎవరు, కింద ఎవరు—ఈ ప్రశ్నలన్నీ మాయప్రశ్నలు, పొంగులో నున్న బుడగలలో దేని స్థానమెక్కడో నిర్ణయించడంలో అర్థమేమైనా ఉన్నదీ? నీకు సహజమైనట్టుగా నీవు ఉండు చెల్లీ, నిన్నెవ్వరూ ఏమీ చేయలేరు."

"నన్ను దీవించు అన్నయ్యా," అని అంటూ కుమ తన రెండుచేతులతో కళ్లు నొక్కుకొని ఏడుపు ఆపుకొన్నది.

విప్రదాసులేచి బాలీసుమీద చేరపడి కుమముఖాన్ని దించి ఆమెతలను ముద్దు పెట్టుకొన్నాడు.

† ఒక మంచిజాతి కుక్క.

డాక్టరు గదిలో ప్రవేశించి, "మరి వద్దు కుము - *దీదీ అతని మనస్సుకు శాంతి చాలా అవసరం అమ్మా."

కుము అన్న బాలీసు ఇక్కడా అక్కడా కొంచెము నొక్కి ఒంటిమీద శాలువును సరిది, పక్కనున్న †టీపాయ్ మీదనున్న వస్తువులను సవిరించి, అన్న చెవిలో తీపతీప మాటలతో నెమ్మదిగా, "నీ జ్వరం తగ్గగానే కలకత్తా రా అన్నయ్యా, వస్తే తరుచు నాకు కనబడుతుంటావు," అని అన్నది.

విప్రదాసు అనురాగంతో నిండిన రెండు పెద్దకళ్లను కుము ముఖంమీద నిలిపి జబాబు చెప్పాడు—"తూర్పున ఉండే మేఘాలు పశ్చిమానికి వెళ్లుతుంటాయి, పశ్చిమానఉండే మేఘాలు తూర్పుకు వస్తూఉంటాయి, ఇదంతా గాలివల్ల జరుగుతుంటుంది. సంసారంలో కూడా ఆ గాలే వీస్తుంటుంది, అంతా మేఘనిర్మితం అనే అనుకుంటూ ఉండు చెల్లీ, ఇప్పటి నుండి మమ్ముల్ని గురించి అంతగా ఆలోచిస్తూ ఉండక నీవెక్కడికి వెళ్లుతున్నావో అక్కడ గృహలక్ష్మివై శుభం వెదజల్లుతూ ఉండు—ఇదే నా హృదయపూర్వకమైన ఆశీర్వాదం చెల్లీ—మేము కోరేది అంతే."

కుము అన్నపాదాల దగ్గర తలనుఉంచి నేలనుకూర్చున్నది. "నేటినుంచి ఇక్కడివాళ్లు నావద్దనుండి ఏమీకోరరు, ఇక్కడి

---

* దీది = చెల్లి, అక్క, ఆదరంకొద్ది పేరుకు కలిపే పదము.

† Teapoy - చిన్న మేజాబల్ల.

జీవనయాత్రతో నాకెట్టి సంబంధమూ ఉండదు కదా—" అని అనుకొంటూ విచారిస్తున్నది. ఇంత పెద్ద విచ్ఛేదానికి లోబడి పోడానికి మనస్సెంతమాత్రం ఒప్పుకోకుండా ఉన్నది. తుపానుగాలి ఓడను రేవునుండి లాక్కుపోతున్నప్పుడు నేలకు తగిలి ఉన్న లంగరు నేలను అంటిపెట్టుకొనే పోతూ ఉంటుంది. అన్నకాళ్లను అంటిపెట్టుకొనిఉన్న కుముయొక్క అనురాగ బంధము కూడా అలాంటిదే. డాక్టర్ మళ్లావచ్చి, "ఇక వద్దు †కుము-దీ," అన్నాడు, అంటూ తానూ కళ్లు తుడుచుకొన్నాడు.

కుము అన్నగదిలోనుంచి బయటికి వచ్చి అక్కడనున్న కుర్చీమీద కూలపడి చీరచెంగుతో కళ్లు నొక్కుకొని నిశ్శబ్దంగా ఏడవడం మొదలుపెట్టింది. అన్నగుర్రానికి స్వయంగా తన చేతితో తినిపిద్దామని నిన్నరాత్రి గోధుమపిండిలో బెల్లం కలిపి రొట్టెచేసి ఉంచింది. ఆమెకు ఆ మాట హఠాత్తుగా జ్ఞప్తికి వచ్చింది. ఇవ్వాళ గుర్రపువాడు గుర్రాన్ని ఇంటివెనుక కొలను దగ్గిర కట్టి ఉంచాడు. కుము వెళ్లి చూచేసరికి గుర్రం ఉసిరిక చెట్టుకింద గడ్డి మేస్తున్నది, దూరంనుండి కుము అడుగుల చప్పుడు పోల్చి ఆమె వంకచూచి చెవులు నిక్కపొడుచుకొని 'చిఁహిఁహి' అంటూ సకిలించింది. కుము ఎడమచెయ్యి గుర్రం మెడమీద ఉంచి కుడిచేతితో రొట్టెని తినిపించింది. తింటూ తింటూ అది తన పెద్దపెద్ద నల్లని కళ్లను బహుప్రేమతో

† దీ = దీదీ = దిది.

కుముపై నిలిపింది. తినిపించిన తరువాత కుము గుర్రం నుదుటను ఒక ముద్దుపెట్టి గంతులు వేసుకుంటూ ఇంట్లోకి వెళ్లిపోయింది.

౧౮

మధుసూదన్ కొద్దిరోజులలో వచ్చి తనను చూచి పోతాడని విప్రదాసనుకొన్నాడు. అట్లాగు జరగకపోగానే, వివాహమే ఈ రెండు కుటుంబాలకు విచ్ఛేదం కలిగించిన ఒక ఖడ్గం అయిందని పోల్చుకున్నాడు. రోగంతో అంత పీడింపబడుతున్నప్పటికీ ఈ సంగతి శాంతమైన మనస్సుతోనే బోధపరుచుకొన్నాడు. డాక్టర్‌ను అడిగాడు, "కొంచెము ఎస్‌రాజ్ వాయించుకోవచ్చునా డాక్టర్ గారూ?" అని.

"ఇవ్వాళ వద్దండి," అని అన్నాడు డాక్టర్.

"అట్లాగైతే కుమును పిలిపించండి, ఆమెను కాస్సేపు వాయించనియ్యండి—ఆమె వాయిద్యం తిరిగి ఎన్నాళ్లకు వింటానో!"

"వాళ్లు ఉదయం తొమ్మిది ఘంటలబండిలో వెళ్ళిపోవాలి, లేకపోతే సాయంకాలంలోగా కలకత్తా చేరుకోలేరు. కుముకు వేళేదీ మరి?"

పెద్ద నిట్టూర్పువిడిచి విప్రదాస్ అన్నాడు—"అవును ఆమెకు ఇక్కడ ఉండవలసిన రోజులు ముగిసాయి, పందొమ్మిది సంవత్సరాలు ఉండగలిగింది, ఇంకొక్క ఘంటైనా ఉండడానికి వీలులేదు."

వెళ్లిపోయే టప్పుడు భార్యాభర్త లిద్దరూ కలిసి ప్రణామం చేదామని వచ్చారు. "అయ్యో, మీ ఒంట్లో బాగులేదే!" అని మధుసూదన్ మర్యాదకు అన్నాడు.

దానికి జవాబియ్యక విప్రదాసు, "భగవంతుడు మీకు సుఖం ఇచ్చుగాక!" అని వాళ్లను ఆశీర్వదించాడు.

"జబ్బు నిర్లక్ష్యపెట్టకు అన్నయ్యా, కొంచెము శ్రద్ధ పుచ్చుకో," అని అంటూ అన్న కాళ్లకు మరొకమారు ప్రణామం చేసి ఏడవడం మొదలుపెట్టింది కుము.

స్త్రీలు ఉల్లాలు పోశారు, ఆశబ్దమూ, శంఖాలశబ్దమూ, నహాబత్ శబ్దమూ కలిసి గొప్ప తుపానువలె వినబడ్డది. భార్యాభర్తలు సెలవుతీసుకొని వెళ్లారు.

పైటచెంగూ ఉత్తరీయమూ ముడిపెట్టుకొని వెళ్లుతున్న భార్యాభర్తలదృశ్యం కనపడగానే ఎందుచేతనోగాని, నేడు విప్రదాసుకి భయంకలిగింది. పూర్వము తైమూర్, జంగీస్ ఖానులు మనుష్యుల ఎముకలతో స్తంభాలు కట్టించారని ప్రాచీనదేశచరిత్రలలో చదువుతున్నారు. కాని పైటచెంగులకు ముడివేసిన ఉత్తరీయాలతో కట్టబడ్డ జీవనమరణముల జయ తోరణం కొలిచిచూచినట్లైతే దానిరెండోచివర నరకద్వారం అందుకొంటుంది అని తెలుస్తుంది—అయితేమాత్రం విప్రదాసు మనస్సులోకి నేడు ఇట్లాంటి తలంపులన్నీ ఎందుచేత వస్తున్నవో.

పూజా అర్చనలలో విప్రదాసుకు ఏనాడు నమ్మకం లేదు. కాని నేడెందుచేతనో చేతులు జోడించి ప్రార్థించాడు విప్రదాసు. ఉలికిపడి లేచి డాక్టరుగారితో, "దివాన్‌జీని ఒక్కమారు పిలిపించండి డాక్టరుగారూ," అన్నాడు.

కొన్నాళ్ళక్రితం జరిగిన సంగతి ఒకటి విప్రదాసుకు హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది. పెళ్లిమాటలు నాలుగురోజులలో ప్రారంభంఅవుతవనగా సుబోధకు రూపాయలు పంపడాన్ని గురించి చీకాకు పడుతున్నాడు. చర్త్రాలు తిరగవేసి తిరగవేసి విసుక్కొంటున్నాడు. పదకొండు ఘంటలవేళ-అలాంటప్పుడు మరామత్తులేని ఇల్లుమాదిరి కనపడుతున్న దిక్కుమాలిన నిరుపేద ఒకడు అతని ఎదుటకు వచ్చినిలుచున్నాడు. ఎండిపోయిన ముఖము, క్షవరంలేక ముళ్లలాగు పొడుచుకు వస్తున్నగడ్డంవెంద్రుకలు, లోపలనుంచి పొడుచుకువస్తున్న ఎముకలు, పొంగిన చేతిసిరాలు. ఒంటిమీాద చిరిగిపోయిన మురికి కండువా, ముడుకులు దిగనిపంచ, చింకి చెప్పులు.

విప్రదాసు కొంచెము నిదానించి చూచి, "వైకుంఠం కాదు కదా!" అన్నాడు.

విప్రదాసు చిన్నప్పుడు చదువుతూండే బడికి అంటిఉన్న చిన్నఇంట్లో వైకుంఠుని దుకాణం ఉండేది. స్కూల్‌పుస్తకాలు, నోట్‌బుక్కులు, కాగితాలు, కలాలు, కత్తులు, చిన్నబ్యాట్లు, బంతులు, బొంగరాలు, వేయించిన చీనా-బాదమ్ పొట్లాలు అమ్ముతూండేవాడు. పెద్ద కుర్రవాళ్లు ఇతనిఇంట్లో చేరేవారు

బాతాఖానికి—అసంభవమైన కథలు అసందర్భమైన వినోదాలు చెప్పడానికి వైకుంఠంతో సరిపోయేవాడు లేదు.

"నీకు ఈదశపట్టిందెట్లా?" అని విప్రదాసు ఆశ్చర్య పడుతూ అడిగాడు.

కొన్నాళ్ళక్రితం అమ్మాయికి స్థితిపరులఇంట్లో ఇచ్చి పెళ్లిచేశాను. కట్నానికి ఆశించవలసిన అవస్థకాదు అత్తవారిది; కనుకనే పెద్దకట్నానికి నేను ఒప్పుకోవలసివచ్చింది. రెండువేల రూపాయలూ, యాభైతులాలు బంగారమూ ఇవ్వడానికి ఒప్పుకొన్నాను. రూపాయలు ఒక్కమారు జతపరచలేక పోయినాను, అందుకని పిల్లను బాధపెట్టి బాధపెట్టి తండ్రి రక్తం పీల్చేశారు. నాకిక ఏ ఆధారమూ లేదు, ఇంకా రెండు వందల యాభై రూపాయలు బాకీఉన్నాను. వాళ్ల దౌర్జన్యమూ అవమానమూ మరి భరించలేక అమ్మాయి మాఇంటికి పారిపోవచ్చింది. దీనివల్ల ఆమె అపరాధం మరీ అధికమై పోయింది. జైలులోని ఖైదీ జైల్లోనుంచి బయటికి పారిపోయి నట్టే కదా! ఇప్పుడు ఏలాగైనా ఆరెండువందల యాభై రూపాయలు వాళ్లముఖాన పారేసి పిల్లను రక్షించగలిగితే తండ్రికి తన చావునుగురించి ఆలోచించుకోడానికి కొంచెము వీలు చిక్కుతుంది. కథ విని విప్రదాసు పొడినవ్వు నవ్వాడు. చేయదగినసాయం చేయవలసిన అవస్థలో అప్పుడు తాను లేడు. కొంచెముసేపు తడబడి ఇటూ అటూ చూచి, లేచి పెట్టెలో

నున్న *పర్సుతీసి, దానిని దులిపి నేలపడ్డ పదిరూపాయల నోటు వైకుంఠంచేతిలో పెట్టాడు; "మరి రెండుమూడు చోట్ల ప్రయత్నంచెయ్యి, నాకు ఇంతకుమించినది ఇప్పుడు సాధ్యం కాదు," అని అన్నాడు.

అతని మాట వైకుంఠం లేశమైనా నమ్మలేదు. కాళ్లు ఈడ్చుకొంటూ మెల్లిగా బయటికి వెళ్లాడు, చింకి జోళ్ల శబ్దాన్ని పట్టి చాలా అప్రసన్నుడై వెళ్లుతున్నాడని విప్రదాసుకు స్పష్ట మయింది.

ఆనాటి కథ విప్రదాసు ఆనాడే మరిచి పోయినాడు, కాని అది ఈవాళ హఠాత్తుగా జ్ఞప్తికి వచ్చింది. దివాన్‌జీని పిలిపించి, నేడే వైకుంఠకు రెండువందల యాభైరూపాయలు పంపించమని చెప్పాడు. దివాన్‌జీ మాటాడలేదు, తల గోక్కుంటూ నిలుచున్నాడు. పంతాలమీద ఖర్చుచేసి పెళ్ళి ముగించడమయింది, ఆ అప్పు తీరేసరికి ఎన్నాళ్లౌతుందో తెలియదు. అట్టి అవస్థలో రెండు వందలయాభైరూపాయలు చిన్న మొత్తం కాదు.

దివాన్‌జీ ధోరణి కనిపెట్టి విప్రదాస్ తన వేలినిఉన్న వజ్రపు ఉంగరాన్నితీసి దివాన్‌జీ చేతిలోపెట్టి అన్నాడు— "చిన్నబాబు పేరను బ్యాంకులో ఉన్న రూపాయలలో నుంచి ఈ రెండువందలయాభైతీసి, దానికిబదులు ఇది తనఖాగా ఉంచు. ఆరూపాయలు వైకుంఠంకు కుము పంపినట్టు పంపించాలి."

---

* Purse = రూపాయలు ఉంచే చిన్నచర్మం సంచి.

౧౬

వివాహంయొక్క లంకా కాండలోని చివర అధ్యాయం ఇంకా పూర్తికాలేదు.

ఉదయం హోమం ముగించుకొని వధూవరులు వెళ్లవలెనని మొదట నిశ్చయించారు, దానికి కావలసినవన్నీ సిద్ధం చేసి ఉంచాడు నవగోపాల్. కాని విప్రదాసుదగ్గర సెలవు తీసుకొని బయటికివస్తూనే రాజాబహదూర్, "హోమమూ మొదలైనవన్నీ ఇక్కడకాదు వరునిబస, మధుపురిలో," అని అన్నాడు.

ఆ మాటలపొగరుచూచి సహించి ఊరుకోలేకపోయినాడు నవగోపాల్. ఇంకెవరైనా అయితే పోట్లాటలు పోలీసు కేసులు అయిఉండును. నవగోపాల్ ఘాటైనమాటలు ప్రయోగించాడు. వీళ్లఅనుచరులు వాళ్లఅనుచరులు కొట్టుకొనేటంతవరకు వచ్చి ఆగిపోయింది.

ఈ అవమానం స్త్రీలకు మిక్కిలి బాధ కలిగించింది. దూరదూరాలనుండి వచ్చిన బంధువులున్నారు, వాళ్లలో కొందరు శత్రువులుకూడా ఉండక పోరు—అటువంటివాళ్ల ఎదుట ఇట్లాంటి అవమానమా ? క్షేమఅత్త ముఖము గంభీరం చేసుకొని మూలకూర్చున్నది. భార్యాభర్తలు వెళ్ళిపోయేముందు ఆశీర్వాదంకోసం ఆమె దగ్గిరికివచ్చినప్పుడు ఆమె నోట ఒకంతట మాట రాలేదు. "ఈకార్యం కలకత్తాలోనే

చేసుకొన్నప్పుడు ఇతరు లనవలసినదేమీ ఉండేనికాదే !" అని అంతా అన్నారు. పుట్టింటికి కలిగిన అవమానం కుమును చాలా బాధించింది, తండ్రి తాతల ఎదుట, అపరాధిఅయి నిలుచున్నట్లు ఆమెకు తోచింది, ఉండిఉండి హృదయంలో ఉన్న దేవతను అడిగింది—"నే నేమి అపరాధం చేశానని నాకు ఇట్లాంటి శాస్తి ఇస్తున్నావు? నిన్నే నమ్మి నీవు ఇచ్చేదంతా శిరసా వహిస్తున్నానే !"

బండి ఎక్కి భార్యాభర్తలు విడిదికి వచ్చారు. కలకత్తానుంచి మధుసూదన్ పంపిన బ్యాండుమేళంవాళ్లు బిగ్గరగా *డాన్సట్యూన్ ఒకటి వాయిస్తున్నారు. పెద్ద †శామియానాక్రిందను హోమానికై ఏర్పాటు జరిగిఉన్నది, అతిథులుగా వచ్చిన దొరలు దొరసానులు, మరికొందరు, మెత్తా కుర్చీల పైని కూర్చున్నారు, కొందరు దగ్గరగా వచ్చి వంగి విధానం చూస్తున్నారు. ఇంతలో వాళ్లకొరకు టీ, బిస్కట్లూ వచ్చినవి. ఒకటేపాయ్‌పైని పెద్ద ‡వెడింగ్ కేక్ ఒకటి ఉంచారు. అనుష్ఠానం ముగిసిన తరువాత అభినందించడానికి అందరూ దగ్గిరికివచ్చారు. కుము ముఖం ఎర్ర చేసుకొని తలవాల్చుకొని నిలుచున్నది.

---

* Dance Tune = దొరలు దొరసానులు కలిసి నాట్యంచేసేటప్పుడు వాయించే వరస.

† పందిరమాదిరి గుడారం

‡ Wedding Cake = దొరల పెళ్ళివిధానం; పెళ్లికొడుకుచేత కోయించి అంతా తింటారు.

లావుపాటి దొరసాని ఒకామె కుము బనారస్ చీరచెంగు చేతితో పట్టుకొని పరీక్షచేసింది, దండనున్న బాజుబందు వింతగా తిప్పుతూ దానిపనివాడితనాన్ని మెచ్చుకొన్నది. దొరల గుంపొకటి మధుసూదన్‌ని ముట్టడించి ఆనందిస్తూ *"హౌ ఇంట్‌రెస్టింగ్ !" అన్నారు, మరికొందరు ఆమాటే మరొక విధంగా అన్నారు—"ఇజ్ ంట్ ఇట్ ?"†

తన అన్నగారితోను, ఇతర బంధువులతోను మధుసూదన్ సంభాషణచేస్తుండగా కుము చూచింది, నేడు ఆతను దొరలతో సంభాషించడం చూచింది. దొరలతో మాట్లాడు తున్నప్పుడు ఎంతమర్యాద, ఎంత వినయం, ఎంత ఆప్యాయం—ముఖంలో సదా ఏమి వికాసం! చంద్రుడికి ఒక ప్రక్కను కాంతి మరి ఒకవైపున అంధకారం, అదేమాదిరి మధుసూదన్‌కి కూడా రెండు వేరువేరు స్వభావాలు ఉన్నట్టు ఆమెకుతోచింది. పూర్ణచంద్రునిలో ఉండే కాంతి చల్లదనమువలె అతనిలో ఉండే మాధుర్యం దొరలముందు వ్యక్తమయేది. బంధువుల ఎదుట కనబడేది రెండోప్రక్క, దుర్గమమైనది, చూడ శక్యముకానిది, గడ్డకట్టిన మంచువలె అభేద్యమైనది.

## ౨౦

దొరలతో కలిసి మధుసూదన్ సెలూన్‌బండిలో ఎక్కాడు, కుము స్త్రీలందరితో కలిసి ప్రత్యేకం రిజర్వుచేసి

* How interesting ! ఎంత వినోదకరంగా ఉన్నది !

† అవా, కాదూ మరి ! = Is'nt it ?

ఉంచిన మామూలు పెట్టెలో ఎక్కింది. ఆమె ముఖాన్ని మీదికి ఎత్తి రూపుచూచిన ఆమె ఒకతె, రూపం వర్ణించే ఆమె ఇంకొకతె, ఎంత పోడవమ్మా అమ్మాయి అని ఒకతె, సన్నంగా రువ్వలాగున్నదని మరిఒకతె, మరిఒకతె అతిఅమాయకంగా, "ఏమమ్మాయి, ఒంటికి ఏమిరంగు రాసుకుంటూ ఉంటావు, మీ అన్నయ్య సీమ వెళ్లాడట కదూ, అక్కడనుంచి ఏదో పంపిస్తున్నాడు కాబోలు!" అనీ అంటున్నారు. చివరకు అంతాకలిసి స్థిరపరిచారు—ఆమెకళ్లు చిన్నవట, ఆడవాళ్ల పాదాలకంటె చాలా పెద్ద పాదాలట అమ్మాయివి. ఆమె ఒంటిమీదఉన్న ప్రతి ఆభరణమూ చేతితో ఆడించి చూచి నిశ్చయించారు—

"పూర్వకాలపు నగలు, బోలెడుబరువు, కాని అసలు బంగారం, ఆహా ఏమిసొంపు!"

స్టేషన్ వైపు కాక రెండో వైపునఉన్న కిటికీ తీసి ఉన్నది, కుము దానిలోనుంచి బయటికి చూస్తూ ఆ అక్కలమ్మల మాటలు వినకుండా ఉందామని ప్రయత్నం చేసింది. బయట, కాలు తెగిపోయిన కుక్క ఒకటి నేల వాసనచూస్తూ, మూడు కాళ్లమీద ఎగురుతూ నడుస్తున్నది—"చేతిలో ఏమైనాఉంటే దానికి తినడానికి వేసిఉందునే—ఒకకాలు పోవడంచేత సులభంగా దొరకవలసినదేదీ దానికి దొరకదు పాపం!" అని కుము తనలో తాను అనుకొంటున్నది. ఆసమయంలో సెలూన్ బండి కిటికీదగ్గిర ప్లాట్‌ఫారంమీద నిలుచొని ఎవరో పెద్దమనిషి వేడుతున్నాడు— "అయ్యా చూడండి, ఈ కాపువాన్ని, పాపం; ఎమిగ్రేషన్

ఏజంటెవడో మాయమాటలు చెప్పి తీసుకువచ్చేశాడు, ఎలాగో తప్పించుకొని వచ్చేసింది, 'గోయలందా'వరకు టిక్కెట్టుకు డబ్బు ఉన్నది, దాని ఊరు డుమ్రా, టిక్కెట్టుకొరకు డబ్బుసహాయం చేశారంటే దాన్ని బ్రతికించినవాళ్లౌతారు." ఈప్రార్థనకు జవాబుగా సెలూన్ గాడీలోనుండి "ఫో" అని పెద్దకేక వచ్చింది. అది విని కుము మరి ఊరుకోలేక ప్లాట్ ఫారమ్‌వైపునఉన్న కిటికీతలుపు ఎత్తి, తన చిన్న పూసలసంచిలో ఉన్నడబ్బును బెంచీమీద వంపి, దానిలోనుంచి పదిరూపాయలు తీసి కూలిదాని చేతిలో పెట్టి కిటికీ దించేసింది. పెట్టెలోనున్న స్త్రీ ఒకామె అది చూచి, "కోడలుది భారీచెయ్యి," అన్నది. "అట్లాంటివాళ్ల ఇంట్లో లక్ష్మి నిలవదు," అని ఇంకొకామె అన్నది. "ఇవ్వడం నేర్చుకున్నది కాని ఉంచుకోడం నేర్చుకుంటే పనికి వస్తుంది," అని మరొకామె అన్నది. "ఇదిఅంతా బడాయి" అని అంతా సిద్ధాంతపరిచారు. మొగుడు ఒక్కదమ్మిడీ ఇయ్యలేదు ఆమెచేతికి, ఎందుకో ఈగర్వం, గణగణలాడించి ఈలాగు రూపాయలు విసిరేయడం! చిరకాలంనుండి ఘోషాల్ - ఛాటర్జీలకు జరుగుతున్న పోటీ యుద్ధంలోని ఒక అంగమే ఇది అని ఆ బండిలోని ఆడవాళ్లందరూ నిశ్చయించారు.

అప్పుడు రెండోమూలనున్న ఒక అమ్మాయి కుము పక్కకువచ్చి కూర్చున్నది — లావుగా ఉన్నది, పెద్దపెద్ద కళ్లు, రమారమి కుము వయస్సే—కూర్చొని కుము చెవిలో మెల్లిగా అన్నది—"నీకు కష్టంగా ఉంది కదూ అక్కా, వాళ్ల

మాటలు వినిపించుకోకు, రెండురోజులు ఈలాగు వేలివేలి, కంఠంలోని విషం కక్కేసిన తరువాత, ఊరుకుంటారు," అని అన్నది. ఈమె కుముతోటికోడలు, నవీన భార్య, 'నిస్తారిణి' ఆమె పేరు. అందరూ "మోతీ - తల్లి" అని పిలిచేవారు. 'మోతీ' నిస్తారిణి కొడుకు.

"నూర్‌నగర్ వచ్చిననాడు మీ అన్నయ్యను స్టేషన్‌లో చూచాను కదా..." అని మోతీతల్లి ప్రారంభించేసరికి కుము ఉలికిపడ్డది. అతిథులను సన్మానించడానికని స్టేషన్ కానాడు అన్నయ్య వెళ్లినట్లు కుము ఎరగనే ఎరగదు.

"ఆహా ఏమిటా రూపు! నేనెన్నడూ చూడలేదు!" ఆక్షణంలోనే కుము హృదయం కరిగిపోయింది, ముఖాన్ని కిటికీ వైపు తిప్పుకున్నది. కళ్ల వెంబడి నీళ్లు బొటబొట కారినవి. బయళ్లు, పొలాలు, చెట్లు, ఆకాశము—అన్నీ మేఘాక్రాంతం. కుము హృదయమధ్యమందున్నది ఎవరో, మోతీతల్లి ఒక్క క్షణంలో పోల్చుకొని, అన్ననుగురించే అనేక విధాల మాట్లాడుతూ చివరకు అన్నకు పెళ్లి అయిందా అని అడిగింది.

"లేదు," అన్నది కుము.

"అయ్యో, నిజమే! మన్మథునివంటి రూపు! ఇల్లు ఇంకా ఖాళీ అంటున్నావే! ఇటువంటి వరుడు దొరికే అదృష్టం ఎవరి నొసటనున్నదో!"

కుము తనలో తాను అనుకొన్నది. "అభిమానం దిగ మింగి అన్న కేవలం నా మేలే ఆలోచించి వెళ్లాడు. తరువాత అన్నయ్యను చూడడానికి ఒకమారైనా వీళ్లు రాలేదు. డబ్బు పొగరువల్లనే గదా అటువంటి వానినిగూడా అవమానపరచ సాహసిస్తున్నారు. అందుచేతనే కాబోలు అన్నయ్య జబ్బు ముదిరి పోయింది."

కలత కలిగి కుము ఉండిఉండి తనలో తాను ఈవిధంగా అనుకో సాగింది—'అన్నయ్య ఎందుకు స్టేషనుకు వెళ్లాడో! తనను తానింత చిన్న చేసుకున్నాడెందుకు? నాకోసము కాబోలు! నాకు చావెందుకు రాలేదో!

జరిగిపోయినదానిని మరి మార్చలేము—ఈ మాటే అనుకొంటూ తలబాదుకొంటున్నది కుము. రోగంతో కృశించిన అన్న శరీరము, అతని ప్రశాంత ముఖదృశ్యం ఒక్క అర నిమిషంపాటైనా ఆమె మనస్సును విడవడంలేదు. ప్రేమతో నిండి ఆశీర్వదిస్తున్న అతని కళ్లురెండూ ఆమె వంకనే చూస్తున్నవి. రైలుబండి కలకత్తావచ్చి చేరేటప్పటికి సాయంకాలం నాలుగు ఘంటలవేళ అయిఉంటుంది. చీరచెంగూ, కండువా ముడివేసుకొని భార్యాభర్తలుఇద్దరూ *బ్రూహామ్ బండి ఎక్కి కూర్చున్నారు. పగటిపూట కలకత్తా నగరంలో వేడుక చూచే వాళ్లు లెక్కలేనంత మంది. కుము సంకోచంతో ముద్ద అయి కూర్చున్నది. కుముదుని అవివాహితావస్థలోనుండిన

* Brougham = గుర్రపు బళ్లలో ఒక మోస్తరు.

పందొమ్మిదేళ్లూ ఆమె సర్వాంగాలపైని 'శుచి' అనదగిన భావం ఒకటి ఆవరించి ఉండెను. కర్ణుని కాపాడుతుండే సహజకవచం వంటి ఈ భావాన్ని కుము హఠాత్తుగా ఎలాగు పారవేయగలదు ! ఆ కవచం దానంతట అదే జారిపడిపోయినట్లు చేసే మంత్రం ఒకటి ఉండవచ్చును. కాని కుము ఆమంత్రం ఎరగదు, దానిమాట నేటివరకు ఆమె వినలేదు. బండిలో తన పక్కనుకూర్చొని ఉన్న పరపురుషుడు ఆమె హృదయానికి మాత్రం పరాయివానివలె తోస్తున్నాడు. అతనిని తనవానిగా చేసుకోలేకుండా ఉన్నది ఆమె—అతని వైపునుండి ఇప్పటి వరకు వస్తున్నవి అడ్డంకులే! అతని ఆచరణలోను, అతని వ్యవహారాలలోను, స్పష్టమవుతూఉండే కరుకుతనము కుమును అంతకంతకు దూరంగా తోసేస్తున్నవి.

ఇవతల మధుసూదనుకు కుము ఒక నూతనంగా కనిపెట్టిన వింతవస్తువువలె ఉన్నది. సదా పనిలో మునిగిఉన్న మధుసూదనుకు స్త్రీజాతితో పరిచయం కలిగేటంత వ్యవధి ఇప్పటివరకు చిక్కలేదనే చెప్పవచ్చు. అతను, వర్తకుడు అతని ప్రపంచం విక్రయశాల; కాని దేహాలను విక్రయించుకొనే స్త్రీల స్పర్శ నేటివరకు అతను ఎరుగడు. అయినా, ఏస్త్రీగాని అతని మనస్సు నెన్నడూ చంచలింప జేయలేదనడం నిజంకాదు. భూకంపం పుట్టింది కాని మేడను కదల్చలేకపోయింది. మధుసూదన్ స్త్రీలనుగురించి ఎరిగినది చాలాతక్కువ; చూచినవాళ్లు ఇంటి కోడళ్లు ఇంటి ఆడబిడ్డలు మాత్రమే. స్త్రీలు ఇంటి పనులు

చేస్తూ ఉంటారనీ, పోట్లాడుకుంటూ ఉంటారనీ, తిట్టుకుంటూ ఉంటారనీ, అతి స్వల్ప కారణాలకని ఏడుస్తూఉంటారనీ——ఇంతే అతనికి స్త్రీలనుగురించి తెలిసిన దంతా. మధుసూదన్‌కు వీళ్లతో బహుస్వల్ప సంబంధముండేది. తనభార్యకు కూడా ఆస్త్రీజగత్తులోనే ఉంచబడుతుంది, ఆమె కూడా అంతఃపుర ప్రహారీల వెనుక, మామూలు చిన్న చిన్న ఇంటిపనులు చేసుకొంటూ, ఒకఛాయవలె భర్త ఆజ్ఞానుసారం నడుచుకొంటూ, ఆడబ్రతుకు బ్రతుకుతుందని తప్ప మధుసూదన్ వేరేమీ అనుకోలేదు. మధుసూదన్ లోక వ్యవహారాలలో పండిన చెయ్యి, ముందూ వెనకా ఆలోచించగలవాడు. కాని భార్యతో చక్కగా వ్యవహరించవలెనంటే కళానైపుణ్యంవంటి సూక్ష్మశక్తి ఒకటి అవసరమనేతలంపు కాని, దాంపత్య జీవితంద్వారా గొప్ప విలువగలది ఏదైనా పొందవచ్చును, లేదా పోగొట్టుకోవచ్చును అనేతలంపుగాని అతనితలలో ఏమూలనూ ఎన్నడూ దూరలేదు. సీతాకోకచిలుక మొక్కకు అనవసరమైనదేకాని చెట్టు దానికిలోబడి ఉండక తీరింది కాదు. మధుసూదన్‌కూడా తనభార్య సీతాకోక చిలుకవంటి అనవసరపదార్థమనే అనుకున్నాడు.

పెళ్ళి అయినతరువాత కుమును మొట్టమొదట కలుసుకొన్నప్పటికి ఇది అతని మనోధోరణి. కుముదుని సౌందర్యము అసాధారణమైనది, అపురూపమైనది, దేవతలకుండవలసినది, కంట పడినప్పుడల్లా కొత్తగానే కనపడేది. సూర్యోదయానికి

ముందు కనపడే వేగుచుక్క వంటిది ఆమె—రాత్రికి చెందినదీ కాదు, ఉదయానికి అందినదీ కాదు. ఆమె తనకంటె ఉత్తమురాలని మధుసూదన్ బహిరంగంగా ఒప్పుకోలేదు కాని తనకు తెలియకుండానే తనమనస్సు తెలుసుకొన్నది. అందు చేతనే ఆమె విషయంలో ఏవిధంగా ప్రవర్తించాలి, ఆమెతో ఏమి మాట్లాడాలి ఎట్లాగు మాట్లాడాలి అనే సమస్యలు అతని మనస్సులో పుట్టినవి.

ఆలోచిస్తూ ఆలోచిస్తూ, "ఈ ప్రక్కనుంచికదూ ఎండ పడుతున్నది?" అని హఠాత్తుగా అన్నాడు.

కుము జవాబియ్యలేదు, మధుసూదన్ కుడికిటికీకి అడ్డుగా పరదా లాగాడు.

మరికొంతసేపు మాటలులేవు. తరువాత మళ్లీ హఠాత్తుగా, "చలివేయడం లేదూ?" అని అడిగాడు. అడిగి జవాబుకోసం ఆగక ఎదుటి బెంచిమీదనున్న సీమరగ్గును తీసి ఇద్దరికాళ్లపైని కప్పాడు. ఒక్క ఆవరణలో కుముతో తనకు ఈవిధంగా సంపర్కము కలిగినందుకు అతని సర్వాంగాలూ మనస్సూలోను పులకరించినవి. కుము ఉలికిపడి రగ్గు తోసివేయ బోయింది, కాని మనస్సును వశపరచుకొని, సీటుమూలకు జరిగిపోయింది.

మరికొంచెము సేపైనతరువాత మధుసూదన్ కుము వైపు తిరిగేసరికి అతని కళ్లు కుముచేతిమీద పడ్డవి.

"ఏదీ చూడనీ," అంటూ తత్‌క్షణమే ఆమెచేతిని మీదికెత్తి పట్టుకొని, "నీవేలిని ఉన్నది ఏమి ఉంగరం? ఆ రాయి నీలం లాగున్నదే!" అని అన్నాడు.

కుము జబాబు చెప్పలేదు.

"నీలం అంటే నాకు చాలా అయిష్టం, అవి నీవు పెట్టుకోవడం మానేయాలి."

కొన్ని సంవత్సరాలక్రితం మధుసూదన్ నీలం ఒకటి కొన్నాడట. ఆ సంవత్సరంలోనే, నిండా చేకు వేసుకొని వస్తూ ఉన్న ఓడ ఒకటి †హౌరాడా వంతెనకు తగిలి మునిగిపోయింది. అప్పటినుండి నీలం అంటే అతనికి అమితకోపం.

కుము మెల్లిగా చెయ్యిని విడిపించుకొన ప్రయత్నం చేసింది, కాని మధుసూదన్ చెయ్యిని వదలక, "ఆ ఉంగరం తీసేస్తాను," అని అన్నాడు.

కుము ఉలికిపడుతూ, "వద్దు ఉండనీ," అన్నది.

ఒకనాడు చదరంగంలో కుము అన్నగారిని ఓడించింది, ఆనందం కొలదీ అన్న తనచేతినిఉన్న ఉంగరాన్ని చెల్లెలికి పారితోషికంగా ఇచ్చాడు—ఈ ఉంగరం అదీ.

ఉంగరం అంటే ఆమెకు గల ఆసక్తి చూచి ఆమె తనకు సరిఅయిన సహధర్మిణి అని తెలుసుకొని మిక్కిలి ఆనందించాడు. ఏ సందర్భంలోనైనా ఆమెకు తనమీద కోపం

---

† కలకత్తాలో గంగపారే స్థలం.

వచ్చినట్లైతే, ఏ హారమో, బంగారు గాజులో, జాజిబందులో, కొప్పుగొలుసులో ఇచ్చి మరిపించడానికి సులభమైన దారి కనబడ్డదనుకొని సంతోషించాడు. వయస్సుమీరినవాడైనా ఇటువంటివాటిలో అతనితో సమానులు లేరని ఆమె ఒప్పుకోక తీరదు.

ప్రశస్తమైన వజ్రంతాచిన ఉంగర మొకటి అతని వేలిని ఉండెను, దానిని తీసి నవ్వుతూ, "భయపడకు, నీ ఉంగారానికి బదులు ఇంకొక ఉంగరం నీ వేలికి పెడతాను," అని అన్నాడు.

కుము మరి ఓర్చి ఉండలేక ప్రయత్నంచేసి ఎలాగో మెల్లిగా తన చెయ్యిని విడిపించుకొన్నది. మధుసూదన్ కోపం ఆపుకోలేక పోయినాడు—తన అధికారానికి ఎటువంటి అడ్డు వచ్చినా సహించవలసినవాడు కాడు అతను—కర్కశ స్వరంతో, "ఇదిగో చూడు, ఆ ఉంగరం నీవు తీసేయక తీరదు," అని అన్నాడు.

కుము ముఖ మెర్ర చేసి తలదించుకొని కూర్చున్నది.

మధుసూదన్ మళ్లా అన్నాడు—"వినబడ్డదా, ఆ ఉంగరం తీసేయడం మంచిది, దానిని నా కిచ్చేయి," అని అంటూ ఆమెచెయ్యిని తిరిగి పట్టుకోబోయినాడు.

కుము చేతిని అటువైపుపెట్టి, "నేనే తీస్తాను," అన్నది. తీసేసింది.

"దానిని నాకియ్యి."

"నేనే దాచేస్తాను," అన్నది కుము.

"ఉంచుకొని లాభమేమిటి?" అని చీకాకు పడుతూ అన్నాడు మధుసూదన్. "అది గొప్ప విలువైనదని అనుకొంటున్నావు కాబోలు—అది నీవెంతమాత్రం పెట్టుకో డానికి వీలులేదు, చెబుతున్నాను జ్ఞాపకముంచుకో."

"పెట్టుకోను," అని అంటూ ఆమె దానిని తన పూసల సంచిలో ఉంచింది.

"ఆ పనికిమాలిన వస్తువుమీద నీకెందు కంతప్రేమ! చాలా మూర్ఖపు పట్టే నీది!"

మధుసూదనుని కంఠస్వరం మిక్కిలి కరుకైనది, హాంసు కాగితంతో గీస్తున్నప్పుడు అయే గరగరలాగు వినబడేది. ఆమాటలు చెవినిపడగానే కుము ఒంట్లో గగుర్పుపుట్టింది.

"ఆ ఉంగరం నీకెవరిచ్చారు?"

కుముదిని మాటాడలేదు.

"మీ అమ్మా?"

జబాబియ్యకతీరదు అనితోచి, వినీ వినబడని కంఠంతో "అన్నయ్య," అన్నది.

"అన్నయ్యా! బోధపడ్డది!" అన్నగారి అవస్థ మధుసూదన్‌కు బాగా తెలుసును. దొంగచేతిలో ఉన్న గునపం

మాదిరి, శనిచేతిలోనున్న నునపం మీ అన్నయ్యగారి ఉంగరం. అటువంటివస్తువును ఇంట్లోకి తీసుకు రాకూడదు. కాని కుముదినికి అందరికంటె అన్నగారే ప్రియం అన్నసంగతి శూలం అయి మధుసూదనుని మనస్సును పొడిచింది. అన్నను ప్రేమించడం స్వభావసిద్ధమైనగుణమని తెలుసుకొని ఊరుకోలేకపోయినాడు. పురాతన జమీందారుల సంస్థానాన్ని ధనవంతుడైన వర్తకు డొకడు వేలాంలో కొనుక్కుంటాడు, ప్రజ పూర్వపు ముచ్చట్లు జ్ఞప్తికి తెచ్చుకొని నిట్టూర్పువిడుస్తే కొత్తఅధికారి ఒళ్లు మండుకు వస్తుంది—ఇదీ అదే మాదిరి. నేటినుంచి కుముదినికి సర్వమూ తానొక్కడేఅని ఆమె ఎంత త్వరలో గ్రహిస్తే అంత మంచిదని మధుసూదనుని అభిప్రాయం. ఇదికాక పెళ్లికి ముందురోజున, 'గాయేహలుద్' విందునాడు వరునికిజరిగిన అవమానంలో విప్రదాసుకు వంతులేదని మధుసూదన్ ఎంతమాత్రం నమ్మలేదు. పెళ్లిఅయిన మర్నాడు నవగోపాల్, "వివాహవిధానం ఎట్లాగుజరిగిందో అన్నయ్య కేమీ తెలియదు; సూచావాచాఅయినా అన్నయ్యకు తెలియనియ్యకండి, అన్నయ్య ఒంట్లో ఏమీ బాగులేదు," అని అందరినీ వేడుకొన్నాడు కూడాను.

ఉంగరంమాట మధుసూదన్ ఇప్పటిమట్టుకు నిలిపాడు, కాని మరవలేదు.

కుముదినివెల హఠాత్తుగా పెరగడానికి ఆమెసౌందర్యం కాక మరిఒకకారణంకూడా కనబడ్డది. మధుసూదన్ పెళ్లి

కొరకు నూర్ నగర్ కి వచ్చిఉన్నాడు, సరిగా పెళ్లినాడే టెలిగ్రాం ద్వారా అతనికి అవిసిగింజల ఎగుమతిలో ఇరవై లక్షల రూపాయలు లాభంవచ్చిందని తెలిసింది. ఈ సిరికి కారణం కొత్తపెళ్లికూతురే—అందుకేమీ సందేహంలేదని మధుసూదనుని నమ్మకం. భార్యద్వారా సంపద కలుగుతుందని జ్యోతిషుడు చెప్పినదానికి వెంటనే ప్రమాణము కనబడ్డది. రాబోవు లాభంయొక్క దలారివలె దేవుడిచ్చిన కుముదినిని బండిలో తనపక్కను కూర్చోపెట్టుకొని మిక్కిలి పరితృప్తుడై ఇంటికి వచ్చాడు. ఆ ఆనందంవల్లగాని లేనియెడల అబ్రాహామ్ - రథయాత్రలో ఏదో అవాంతరం జరిగి ఉండేదే!

౨౧

" 'రాజా' అనే బిరుదు రాగానే మధుసూదన్ తన కలకత్తా ఇంటిపైని "మధుప్రాసాదం" అని పేరుచెక్కించాడు. ఆ ప్రాసాదంయొక్క ఇనపగేటు ప్రక్కను ఇవాళ నహూబత్ వాయిస్తున్నారు. ముందరనున్న ఉద్యానంలో ఇంగ్లీషు బ్యాండువాళ్లు బ్యాండ్ వాయిస్తున్నారు. గేటుమీాదను ఆర్చి ఆకారంగా గ్యాసుదీపాలు వెలుగుతున్నవి. గేటుదగ్గరనుంచి ఇంటివరకుఉన్న కంకరరోడ్డుకు రెండుప్రక్కలా దేవదారు ఆకులతోను, బంతిపూలతోను తయారుచేసిన తోరణాలు కట్టారు. ఎత్తైన అరుగులమీాదికి ఎక్కే సావంచాలపైని ఎర్రని శాలువులు పరిచారు. వధూవరుల బండి బంధుమిత్రుల గుంపుగుండా వచ్చి బళ్లు-నిలిచే వరండావద్ద నిలిచింది.

శంఖాలు, డోళ్లు, రమ్‌డోళ్లు, బ్యాండు, నహబత్, సనాయి - అన్నింటినీ ఒక్కమారే వాయించడం మొదలుపెట్టారు. పది పన్నెండు గుఱ్ఱుబండీలు ఒకదానినొకటి గుద్దుకున్నవా అనిపిస్తున్నది విన్నవాళ్లకు. బండి ఆగగానే ఆదగ్గరకు ముసలామె ఒకతె వచ్చింది. మధుసూదనుకు అమ్మమ్మ ఔతుంది వరసకు, బహుశ వృద్ధురాలు, వెంట్రుకలు రాలి వెడల్పైపోయిన పాపిటిని వెడల్పాటి సిందూరరేఖతో నింపింది, చేతిని దుక్క బంగారపుగాజులు, వెడల్పాటి శంఖపుగాజులు ఉన్నవి. ఈమె వెండిచెంబుతో తెచ్చిన నీళ్లు వధువుపాదాలమీద చల్లి, పాదాలను తన చెంగుతో తుడిచింది, వధువుచేతులకు †ఇనపగాజులు తొడిగించింది, వధువునోటికి కొంచెము తేనెను రాసి "ఇన్నాళ్లకు మా నీలాకాశాన పూర్ణచంద్రుడు ఉదయించాడు. మానీల సరోవరంలో సువర్ణపద్మం వికసించింది," అని అన్నది. వధూవరులు బండిదిగారు. వచ్చినవాళ్లలో యువకబృందానికి చాలా ఈర్ష్యకలిగింది. అందులో ఒకడు, "దైత్యుడు స్వర్గం కొల్లపెట్టి అప్సరసను బంగారుగొలుసుతో కట్టి తీసుకువచ్చేశాడు రా," అన్నాడు, మరిఒకడు, "పూర్వకాలంలో అయితే ఇట్లాంటి రూపవతికొరకు రాజులు ఘోరయుద్ధం చేసిఉందురు. ఈరోజులలో అవిసిగింజల వ్యాపారంద్వారా అంతా సాధించవచ్చును. రానురాను గ్రహనక్షత్రాలది వైశ్యకులమైపోయింది," అని అన్నాడు.

---

† పెళ్లికాగానే వధువులకు తొడిగిస్తారు బంగాళీలు.

తరువాత జరగవలసిన విధాలన్నీ పూర్తిఅయేసరికి రాత్రి అయిపోయింది.

తమఇంట్లో జరిగిన పెళ్ళిళ్లలో కుముకు, ఒక్క అక్క పెళ్ళి మాత్రమే జ్ఞాపకం ఉన్నది. కాని తమఇంటికి క్రొత్త పెళ్ళికూతురును తీసుకురావడం ఆమె ఎరగదు. ఆమెయౌవనారంభానికి పూర్వమే అన్నయ్యతో కలకత్తా వచ్చేసింది, అన్నగారి నిర్మల ప్రేమమధ్యనే పెరిగింది. సంసారంలో మోటు అచ్చులతో సాధారణంగా తయారవుతున్న పదార్థాలు ఆబాలికయొక్క ఊహాప్రపంచంలో లేవు. బాల్యకాలంలో పతిని కోరుతూ శివుని పూజిస్తున్నప్పుడు ఆమెకు కనబడుతూండేది, ఆ మహాతపస్వి అయిన శివుడే. స్త్రీలలో ఆమె ఎరిగినది ఆదర్శస్వరూపమైన సాధ్వీమణి, తన తల్లిమాత్రమే; ప్రేమతోనిండిన ప్రశాంత హృదయం ఆమెది—ఎంత ఓర్పు, ఏమి భక్తి! విసుగులేని సేవ, ఉపకారబుద్ధి. భర్త నీతిమార్గం తప్పనివాడు కాడు, అతనిలో లోపాలు అనేకం ఉండేవి, కాని గొప్ప ఔదార్యంకలవాడు, దృఢమైన పౌరుషంకలవాడు—దానిలో ఎట్టి నీచత్వంగాని కపటంగాని ఉండేది కాదు. అతనిలోఉండే గౌరవజ్ఞానాన్ని పూర్వకాలపు పురాణాలలో కనబడే ఆదర్శాలతో సరిపోల్చవచ్చును. మానం ప్రాణంకంటె గొప్పదనిన్నీ, డబ్బుకంటె ఐశ్వర్యం విలువైనదనిన్నీ ప్రతిదినమూ అతని జీవనంలో రుజువయేది. అతని మనస్సు, ఆ శ్రేణికి చెందిన వారి మనస్సులవలెనే బహు విశాలమైనది. తనకు తానే హాని

కలిగినా తనమానానికి హాని కలగనిచ్చే వాడుకాడు, మర్యాద కాపాడుకొనేవాడేకాని డబ్బు కాపాడుకొనేవాడుకాడు.

కుము ఎడమకన్ను బెదిరిననాడు ఆత్మసమర్పణకై సంపూర్ణ సంకల్పంతో సిద్ధపడ్డది; ఏవిధమైన ఆటంకము రావచ్చు ననిగాని, ఆశాభంగం కలుగవచ్చుననిగాని ఆమెకు తట్టనే లేదు. నలుని వరించాలని దమయంతి ముందునుండే ఎరుగును; ఆసందేశం మొట్టమొదటనే ఆమె మనస్సులోనికి వచ్చిచేరింది—కుముకు కూడా అట్లాంటి వార్త అందలేదా? వివాహప్రయత్నాలన్నీ జరిగినవి, వరుడూ వచ్చాడు, కాని మనస్సులో అంత స్పష్టంగా కనబడుతుండే వరుడు ఆమెకు పెళ్లిలో దొరకినవరుడు కాడే! దొరకినవాడు రూపులోనూ అతనితో సమానుడు కాడు, వయస్సులోనూ కాడు. ప్రాప్తించినవాడురాజే, కాని ఆ నిజమైన రాజేడీ?

తరువాత—నేడు, అనుష్ఠానాలద్వారా వచ్చిన ఆహ్వానంలో అంత పవిత్రమనదగిన మంగళధ్వని వినబడలేదే! గంభీరతలేని ఆ ధ్వనిద్వారా ఆకాశానఉండే సప్తమహార్షుల ఆశీర్వాదం ఆమెకు వినబడలేదే! అన్ని అనుష్ఠానాలకు పరిపూర్ణత నిస్తూ ఉదాత్తస్వరంతో,

"జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ"

అంటూ వందనగీతిక వినబడ లేదే!

వాక్యము దాని అర్థముతో ఏకమై ఉన్నట్టుగా స్త్రీ పురుషునితో ఏకమై ఆ "జగతః పితరౌ" లో ఉన్నాదా?

౨౨

మధుసూదన్ మొదట కలకత్తాలో కాపురం పెట్టుకోం దామని రాగానే, అక్కడ ఒక పాత ఇల్లు కొన్నాడు, ఆనాలు గిళ్ల భవంతే నేడతని అంతఃపురం అయింది. తరువాత దానికి ఎదుటనే ఇప్పటి ఫ్యాషన్‌లో పెద్ద మేడఒకటి కంటించాడు, ఇదే అతని 'బైఠక్ ఖానా'— పగలు కూర్చుండే గది. ఈ రెండిళ్లూ కలిసే ఉన్నవి, కాని రెండూ వేరువేరు జాతులవి. బయటిఇంటినేల మార్బుల్‌తో తయారైనది, సీమ తివాసులు పరిచి ఉన్నవి, గోడలమీద నానారకాల పటాలు వేలాడు తున్నవి, అందులో కొన్ని ఆయిల్ పేంటింగులు, కొన్ని *ఓలియోగ్రాఫ్‌లు, కొన్ని †ఎన్‌గ్రేవింగులు. వాటిలో చిత్రింప బడ్డ విషయాలు, వేట కుక్కలు లేళ్లను వెంటబెట్టడము, డార్బీ గుర్రపు పందెములు, విదేశి ‡ల్యాండ్‌స్కేపులు, ఒంటి మీద బట్టలులేకుండ స్నానంచేస్తున్న స్త్రీలు— మొదలైనవి. ఇవి కాక గోడలను చీనా పళ్ళేలు, ఎనేమల్ పనిచేసిన మురాదాబాద్ ఇత్తడి పళ్లేలు, జపాన్ పంకాలు, టిబెట్ చామరాలు—ఒకదానితో ఒకదానికి సంబంధంలేని వస్తువులు ప్రపంచంలో ఎన్ని ఉండగలవో అన్నీ ఇక్కడా అక్కడా కలగాపులగంగా తగిలించబడి ఉన్నవి. ఇవి కాక మొఖమల్ బురకాలువేసి ఉంచిన కుర్చీ, సోఫాల అరణ్యం ఒకటి ఉన్నది. అద్దాల బీరువాలనిండా చిత్రవిచిత్రంగా బైండు

* Olioggraphs † Engravings ‡ Landscapes

చేయబడిన ఇంగ్లీష్ పుస్తకాలు——కుంచి చేతపుచ్చుకొని ధూళి ఎగరగొట్టే నౌకరు తప్ప వేరెవడూ వాటిని ముట్టడు. టీపాయి మీద ఆల్బమ్‌లు ఉన్నవి, కొన్నిటిలో ఇంటివాళ్ళ ఫొటోగ్రాఫులు మరికొన్నిటిలో విదేశీనటుల ఫొటోగ్రాఫులు.

అంతఃపురంలో క్రిందనున్న చమ్మగదులలో వెలుతురన్న మాటలేదు. మీదినుండి నల్లనిసాలిపట్లు వేలబడుతున్నవి. మధ్యనున్న అంగణంలో ఇంటిచెత్త; అక్కడే కొళాయి ఉన్నది, దాని దగ్గరనే అంట్లు తోమడమూ బట్టలుతకడమూ జరుగుతుంటవి. అవసరం లేనప్పుడు కూడా కొళాయి విప్పే ఉంటుంది. మీది వరండాపైనుండి ఆడవాళ్ల తడిచీరలు వేలాడుతుంటవి, వరండా దడిమీద కూర్చొని కాకులు వేసే రెట్టలు అంగణం నిండా పడుతుంటవి, వరండా గోడలమీద తాంబూలం ఉమ్ములు మొదలైన అక్షయ మలినచిహ్నాలు. అంగణానికి పశ్చిమంవైపున వంటిల్లు, అక్కడనుండి వస్తున్న పొగా, వంటవాసనా మేడ గదులన్నిటిలోకి ప్రవేశిస్తుంటుంది. వంటింటికీ ప్రహారీకీ మధ్యనున్న చిన్నఖాళీజాగాలో బొగ్గులు, బూడిద, విరిగిపోయిన కుండపెంకులు, చిరిగిపోయిన బుట్టలు, జల్లెళ్లు, చేటలు వగైరా పడిఉన్నవి. ఒక మూలను రెండు మూడు ఆవులూ దూడలూ కట్టి ఉన్నవి. నేల గడ్డీ పేడతో నిండిఉన్నది, ప్రక్కను గోడ నిండా గుండ్రని పిడక డాగులు. ఒక ప్రక్కను లేత చెట్టొకటి మాత్రమే ఉన్నది, ఆవును కట్టుతుండడంవల్ల దాని మాను నుండే తొక్క ఊడిపోయింది, ఆకులు తెంచి తెంచి చెట్టును

మొరుడు చేసేశారు. అంతఃపురంలో ఉన్నది ఈ కాస్త జాగా మాత్రమే, ఇంటి ఖాళీజాగా అంతా ఇంటికి బయటనే. దీనిలో ఇంపైన పూలమళ్లు, లతలు, అందమైన చిన్నచిన్న చెట్లు, సుర్కీతో సదునుచేయబడ్డ దారులు, ప్రక్కను అక్కడక్కడ రాతి విగ్రహాలు, ఇనపబెంచీలు.

అంతఃపురం మూడో అంతస్తులో కుముదిని పడకగది. పెద్ద †మహాగొని మంచం, దాని పందిరికి దోమతెర కట్టి ఉన్నది, దాని పైనుండి పట్టుజాలరు వేలాడుతున్నది. మంచంకాళ్ల వైపున నిలువుటెత్తు పటం ఒకటి ఉన్నది, బట్టలేని స్త్రీ చేతులతో గుండెను కప్పుకొని సిగ్గు నటిస్తున్నది. తలవైపున మధుసూదనుని ఆయిల్ పేంటింగ్ ఉన్నది—అందులో అన్నిటికంటె చూచేవాళ్లకంట ముఖ్యంగా పడేది అతను వేసికొన్న కాశ్మీర్ శాలువ నగిషీఅంచు. గదిలో ఒక ప్రక్కను బట్టలు ఉంచుకొనే దొంతులబీరువా ఉన్నది, దానిపైని అద్దం ఒకటి, అద్దానికి రెండుపక్కల కొవ్వువత్తులు ఉంచే తెల్ల చీనామట్టి స్టాండులు, స్టాండ్ల ముందు పళ్లెంలో పౌడరుడబ్బా, వెండి కట్టు కట్టిన దువ్వెన, మూడు నాలుగురకాల ఎసెన్సులు, పన్నీరుకొట్టే పిచ్‌కారి—మొదలైన విలాస వస్తువులు. ఈ వస్తువులన్నీ ఎంచి కొన్నవాడు, మధుసూదన్ కింద ఉద్యోగంచేస్తున్న దొర ఒకడు. అనేక శాఖలుగల గులాబీరంగు గాజు ఫూల్‌దాన్‌లో పువ్వులు ఆకులు పెట్టి ఉన్నవి. గదికి ఇంకొక పక్కను వ్రాసు

† Mahagony = మంచిజేవవలె ఉండే గొప్పజాతి కర్ర.

కుండే టేబిలు, దాని పైని విలువైన రాతి సరాబుడ్డి, కలము, కాగితాలు కోసే కత్తి. ఇక్కడా అక్కడా మెత్తా కుర్చీలు, సోఫాలు. ఒకచోట టీపాయ్ ఒకటి, అది టీ తాగేటప్పుడు ఉపయోగపడుతుంది, పేకఆటకు కూడా పనికివస్తుంది. నూతన మహారాణిగారి శయ్యాగృహం ఏవిధంగా ఉంచితే తన పదవికి తగినట్టుగా ఉంటుంది అని మధుసూదన్ చాలా ఆలోచించ వలసివచ్చింది. చివరకు తయారు అయినది, మాసికల రొజాయి కప్పుకున్న ముష్టివాని బంగారు జరీపాగా ఒకటి.

ఆనాడు చిట్టచివరకు సందడిఅంతా చల్లారి బాగా రాత్రి అయినతరువాత కుము ఆ పడకగదిలోకి వచ్చిచేరింది. ఆమెను ఆగదిలోకి తీసుకువచ్చినది మోతీ - తల్లి. ఆమె కుముతోనే పడుకుంటానని చెప్పింది. వీళ్లతో కలిసి స్త్రీబృందం ఒకటి రాబో తుండెను, వాళ్ల కుతూహలానికి అంతు లేకపోవడం చూచి మోతీ - తల్లి వాళ్లను మెల్లగా సాగనంపింది. గదిలోకి రాగానే మోతీ - తల్లి అతి ముద్దుగా కుముబుగ్గలను నొక్కుతూ, "నేనీ పక్కగదిలోనికి వెళ్లి రెండునిమిషాలలో వస్తాను, నీవు ఒంట రిగా కూర్చొని ఒక్కమారు వద్దోయి చెల్లీ, లేకుంటే కన్నీటితో నీగుండె బద్దలైపోతుంది," అని అంటూ బయటికి వెళ్లింది.

కుము దగ్గరఉండే కుర్చీమీద చతికిల పడ్డది. ఏడవడం తరువాత చేయవచ్చును, ఇప్పుడు చేయవలసినది మనస్సును స్తిమిత పరుచుకోడము. తన కవమానము కలిగిందనే భావము

ఆమెకు లోలోపల అన్నిటికంటె అధికంగా బాధిస్తున్నది. ఇన్నాళ్లబట్టి చేసుకొన్న సంకల్పానికి విరుద్ధంగా తిరగబడ్డది ఆమె మనస్సు. దానిని వశపరుచుకోడానికి కొంచెమైనా వ్యవధి దొరకకుండా ఉన్నది. కూర్చొని దేవుని ప్రార్థించింది, "నాకు బలం ఇయ్యి సర్వేశ్వరా, నాకు బలంఇయ్యి, నాజీవితానికి కళంకం రానియ్యకు, నేను నీదాసిని, నాకు జయంకలగనీ, నా జయం నీదే కదా!"

ఆ సమయంలో యువతిఒకతె కుముగదిలో ప్రవేశించింది-చక్కనితీరు, దేహసౌష్ఠవము, చామనఛాయగలది, రూపవతి, విధవ. గదిలోకి వచ్చి మాటలు ప్రారంభించింది. "మోతీ-తల్లి నిన్ను విడిచిపెట్టి వెళ్లింది, కొంచెము సందు దొరికిందనుకొని వచ్చాను. ఎవ్వరినీ నిన్ను ముట్టుకోనివ్వదు, చుట్టూ గోడలు కట్టి ఉంచుతుంది, ఆగోడకు కన్నంవేసి నిన్ను దొంగిలించుకు పోవడానికి సదా గునపం ఒకటి పట్టుకు తిరుతున్నా ననుకొంటు న్నది. నేను నీతోటికోడల్ని, శ్యామాసుందరి నాపేరు, నీభర్త నాకు మరిది, చివరవరకు కూడా జమాఖర్చుల చిత్తాయే అతనికి భార్యగా ఉండిపోతుందని అనుకొన్నాము. ఆ చిత్తాలో మంత్ర గాడున్నాడు చెల్లీ, ఈ వయస్సులో ఇంత రూపుఉన్న భార్య దొరకడం ఆచిత్తాబలంవల్ల నేకదా. దొరికినదానిని జీర్ణంచేసుకో గలిగితే అతను అదృష్టవంతుడే, కాని అక్కడ చిత్తా - మంత్రం పారదేమో!—నాతో నిజంచెప్పు చెల్లీ, మాపెద్దమరిది నీకు నచ్చాడా?" ఏమి జబాబు చెప్పాలో తోచక నిర్ఘాంతపోయి

చూస్తూ కూర్చున్నది కుము. అప్పుడు శ్యామ తిరిగి ప్రారంభించింది,—"ఔను, నచ్చకపోతే మాత్రం ఏమి చెయ్యగలవు, సప్తపది జరిగింది—అటుపిమ్మట వెనుక్కు ఇరవై ఒక అడుగు వేసినా పాశం తప్పించుకోలేవు కదా!"

"అదేమిటి అక్కా, అలా అంటున్నావు!" అని కుము అన్నది.

శ్యామా జబాబు చెప్పింది—"మనస్సు విప్పి మాట్లాడితే తప్పా చెల్లీ! నీముఖం చూచి బోధపరుచుకోలేనా? కాని అందులో నీ అపరాధం ఏమున్నది, మనవాడని చెప్పి మహా మంచివాడు అని అంటూ కూర్చున్నా ననుకున్నా వేమో! మహాకఠినమైనవానిచేతిలో పడ్డావు, ముందూ వెనుకా బాగా ఆలోచించుకొని నడుచుకోవాలి!"

అంతలో మోతీ-తల్లీ గదిలోకి రావడం చూచి ఆమెతో ఈలాగు అన్నది—"భయపడకమ్మా బొగడపువ్వా, భయపడకు, నేనిప్పుడే వెళ్లిపోతున్నా, నీవు లేవు, ఆపాటి వ్యవధి దొరికిందని కొత్త తోటికోడల్ని ఒక్కమారు చూచి వెళ్లుదామని వచ్చాను. లోభి తన ధనాన్ని కాపడుకొనేటట్లు కాపడి ఉంచుకోవలసిన ధనమే ఈమె, నిజంగా. నే స్తంతో ఏమంటున్నానో ఎరుగుదువా? బావగారికి పార్శ్వనొప్పి పట్టుకొన్నది, భార్య దొరకడం ఎడమ పార్శ్వనొప్పి, ఆమెను ఉంచుకోగలిగితేనే కుడి పార్శ్వనొప్పి లభించినట్లు అని అన్నాను."

ఈలాగు అంటూ గదిలోనుంచి బయటికి వెళ్ళి, ఒక్కనిమిషంలో తిరిగివచ్చి, "బీడా ఒకటి తీసుకో, మసాలా అభ్యాసం ఉంది కదూ?" అని అన్నది.

కుము లేదన్నది, అప్పుడు మసాలా కొంచెం తననోట్లో వేసుకొని శలవుతీసుకొని మందగమనంతో నిష్క్రమించింది.

"†'బద్దీ' మాసీకి భోజనంపెట్టి పంపి ఇప్పుడే వస్తా" నని చెప్పి మోతీ-తల్లి వెళ్ళిపోయింది.

శ్యామాసుందరి కుము మనస్సులో గొప్ప అరుచి పుట్టించింది. నేడు అన్నిటికంటె కుముకు అవసరమైనది మాయ, ఆ మాయనే తనచుట్టూ అల్లుకో ప్రయత్నిస్తుండెను. ఎవని లీల స్వర్గమర్త్యలోకాలలో నానారంగుల రూపాలు ధరిస్తున్నదో అతనికే సహాయపడదామని కుము ప్రయత్నిస్తుండెను. ఆ సమయంలో శ్యామా వచ్చి కుము అల్లుతున్న స్వప్నజాలాన్ని తెంచివేసింది. కుము కళ్ళు మూసుకొని జోరుగా తనలోతాను ఈ విధంగా అనుకోసాగింది—"భర్త వయస్సుముదిరినవాడు, అని అతనిని నేను ప్రేమించలేదనడం ఎన్నటికీ నిజం కానేరదు—సిగ్గు సిగ్గు! పాపం! అది అధము లనవలసినమాట." సతి శివుని పెళ్ళాడడం మాట ఆమె ఎరగదా? శివుని నిందించేవాళ్ళు అతని వయస్సునుగురించి ఎన్నోవిరకాలుగా అన్నారు, కాని ఆమాటలను సతి చెవిని పడనివ్వలేదే!

---

† 'బద్దీ' - పిన్ని

భర్తవయస్సునుగురించిగాని, రూపునుగురించిగాని కుముం ఇప్పటివరకు ఏమీ అనుకోనేలేదు. ఎటువంటిప్రేమ ఉన్న యెడల వివాహం నిజమైనవివాహం ఔతున్నదో ఆవిషయమై గాని, ఆప్రేమలో రూపము, గుణము, దేహము, మనస్సు— అన్నీకలిసి ఉంటవనిగాని; నిజమైన వివాహానికి ఇవన్నీ అవసరమని గాని కుముకు తోచలేదు. ఏలాగో ఇష్టపడ్డది పెళ్లి చేసుకోండా మని, దానితో మనస్సును తృప్తిపరచుకొని మిగిలిన తలంపు లన్నిటినీ అణగదొక్క కోరింది.

ఆ సమయంలో రంగుబుటాలచొక్కా తొడుక్కొని చిన్న జరీదోవతి కట్టుకొన్నకుర్రవాడొకడు గదిలోకి వచ్చి కుముపై చేరబడి నిల్చున్నాడు. అబ్బాయికి ఏడేళ్లు ఉంటవి. పెద్దపెద్ద కళ్లను మీది కెత్తి, భయపడుతూ భయపడుతూ, ముద్దుమాట లతో దొడ్డమ్మా అన్నాడు. కుము అతనిని ఒడిలో కూర్చుండ బెట్టుకొని, "నీపేరేమిటి నాయనా?" అని అడిగింది. పిల్లవాడు అతిడాబుగా 'శ్రీ'అనే పదమైనా విడవకుండా, శ్రీ మోతీలాల్ ఘోషాల్ అని చెప్పాడు, పిల్లవాణ్ణి అందరూ పిలవడంమాత్రం 'హాబ్ లూ'అని - కనుకనే తన మానసంరక్షణార్థం, అవకాశం దొరికినప్పుడల్లా, పేరుఅంతా పూర్తిగా చెప్పవలసివస్తున్నది. అప్పటికి కుము గుండె బితుకు బితుకు లాడుతుండెను, ఆ పిల్లవాణ్ణి గుండెమీద పెట్టి నొక్కుకొన్నది, నొక్కుకోగానే పోయినప్రాణాలు తిరిగివచ్చినవి. ఎన్నాళ్లనుండో ఆమె రోజూ గోపాలునికి పూజచేస్తున్నది, ఆ గోపాలుడే ఈపిల్ల

వాడిలో దాంగొని వచ్చి తన ఒడిలో కూర్చున్నాడని కుముకు తోచింది. కుము సరిగా భగవంతుని స్మరిస్తున్నప్పుడే వచ్చి, "ఇదిగో నేను ఉన్నాను నిన్నోదార్చడానికి," అని అన్నట్టు ఎందుచేతనో కుముకు తోచింది. మోతీ మెత్తని బూరిబుగ్గలు నొక్కుతూ, "పువ్వులు పుచ్చుకుంటావా గోపాల్?" అని అడిగింది.

కుము నోటివెంట గోపాల్ అనే పేరు తప్ప వేరేదీ రాలేదు. పేరు మారడం చూచి గోపాల్ ఆశ్చర్యపడ్డాడు, కాని ఆ కంఠస్వరంలో ఏమున్నదో గాని పిల్లవాడికి అది విని అభ్యంతర పెడదామని బుద్ధి పుట్టలేదు.

అంతలో కుర్రవాడిగొంతుక విని తల్లి పక్కగదిలోనుంచి పరుగెత్తుకు వచ్చి, "ఇదిగో కొత్తఅబ్బాయి వచ్చినట్టున్నాడు," అన్నది. మోతీలాల్ ఘోషాల్ మానం మరి నిలిచిందికాదు, ఫిర్యాదు కళ్లతో తల్లివంక చూస్తూ దొడ్డమ్మ పైటుచెంగు పట్టుకొని నిలుచున్నాడు. కుము హోబ్‌లూను తన ఎడమచేత్తో కూడ దీసి, "ఆహా పాపం, ఉండనీ" అన్నది.

"వద్దమ్మా చాలారాత్రి అయింది. ఇక పడుకోనీ! వీడు దొరకాలంటే నీవు ఏమీకష్టపడ నక్కరలేదు. ఈ ఇంటిలో వీడిఅంత చవకవాడింకెవ్వడూలేడు, అని అంటూ, కుర్రవాడు రాను అంటూఉంటే, తల్లి వాణ్ణి లాక్కుపోయింది. ఈపాటి దానితో కుముహృదయంలోని భారం తగ్గిపోయింది, ప్రార్థనకు జవాబు వచ్చిందని ఆమెకుతోచింది, తన చిక్కులన్నీ ఒకొక్కటి సులభంగా విడిపోతవని ఆమెకు నమ్మకం కలిగింది.

## ౨౩

మోతీతల్లికి అర్ధరాత్రివేళ తెలివివచ్చి చూచేటప్పటికి కుము చేతులుజోడించి ఒడిలో పెట్టుకొని పరుపుమీద కూర్చొని ఉన్నది. ధ్యానంలోఉన్న ఆమె కంటికేదో కనబడుతున్న ట్లుండెను. మధుసూదనుని తన భర్తగా హృదయంలో అంగీక రించడానికి అడ్డు వస్తున్నకొలది కుము అతనిని తనదేవతలో నిమగ్నం చెయ్యవలెనని మరీ గట్టిప్రయత్నం చేస్తున్నది. భర్తను మనస్సుఎదుట పెట్టుకొని తనను దేవునికి సమర్పించు కొంటున్నది. పూజ బహుకఠినంగా ఉన్నది, కనబడుతున్న దేవ విగ్రహంలో స్వచ్ఛత లేదు - అయితే నేమి, దేవుడు ఆమెభక్తిని పరీక్షచేస్తుండవచ్చును! సాలిగ్రామం బయటికేమీ కనపరచదు కదా! భక్తి తన బలంవల్ల ఆరూపహీనతలో వైకుంఠనాథుని చూస్తుంది. "కనబడనిదానిలో చూడగలగడం——ఇదే నాసాధన అవుగాక! భగవంతు డెక్కడ దాగిఉంటాడో అక్కడికి వెళ్లి అతని పాదాలకు నన్ను సమర్పించుకుంటాను, అతను నన్ను తప్పించుకు పారిపోలేడు," అని అనుకుంటూ అన్నదగ్గర నేర్చుకొన్న మీరాబాయి కీర్తన.

"మోరె గిరిధరగోపాల, ఔర్ నహీం కోహీం"

మనస్సులో పాడుకుంటున్నది.

మధుసూదనుని మోటువ్యవహారం ఒక లెక్కలోనిది కాదనీ, నీటిమీద బుడగవంటిదనీ నిశ్చయించి మనస్సులోనుండి

తరిమివేయాలని ప్రయత్నిస్తున్నది. అనాదినుండి ఎవడు సత్యమై ఉన్నాడో, అతనే అన్నిటినీ ఆవరించి ఉన్నాడు, "ఔర్ నహీ కోహీ ఔర్ నహీ కోహీ"—మరెవ్వరూ లేదు, మరేదీ లేదు. తన ప్రాణానికి బాధ కలుగజేస్తున్న శూన్యతను కూడా మాయ అనుకోవలెనని ప్రయత్నిస్తున్నది—అది శూన్యత! నేటివరకు ఏదేది సత్యమని నమ్మి, వేటివేటితో తనను నిర్మించుకు వచ్చిందో, దేనిని వదిలివేయడంవల్ల జీవనం అర్థహీనమై పోతుందో వాటి నన్నిటినుండి కూడా విచ్ఛేదం కలిగింది. ఆ శూన్యతను కూడా పరిపూర్ణత అంటున్నది. తండ్రి విడిచి పెట్టాడు, తల్లి విడిచిపెట్టింది బంధుమిత్రులు విడిచిపెట్టారు, కాని చిరకాలంనుండి వాళ్లలో దాగి ఉన్నవాడు విడిచి పెట్టలేదే! ఎవ్వరూ లేకుండా చేశాడు, భగవంతుడు; అంతా శూన్యంచేశాడు—ఆ శూన్యాన్ని తాను నింపుదామనే కదా! నేను అతన్ని అంటిపెట్టుకొనే ఉంటాను, ఏమి అనవలసిఉంటే అది కానీ! నోరుతెరిచి ఆ పాట బయటికి ఎప్పుడు పాడడం ప్రారంభించిదో తానే ఎరగదు—రెండు కళ్లవెంబడీ నీళ్లు కారడం మొదలు పెట్టినవి.

మోతీతల్లి మాటలాడలేదు, చూస్తున్నది, వింటున్నది. కుము చాలా సేపటివరకు చేతులు జోడించి ప్రణామంచేసి కూర్చొని పెద్ద నిట్టూర్పువిడిచి పడుకున్న తరువాత మోతీతల్లి ఆలోచించడం మొదలుపెట్టింది. ఇంతకు పూర్వ మెన్నడూ ఆమె తలలో ఇట్లాంటి తలంపులు పుట్టలేదు.

ఆమెకు తన పెళ్ళిమాట జ్ఞాపకం వచ్చింది—"పెళ్ళి అయినప్పటికి నేను పసిపిల్లను, 'మనస్సు' అనే అనవసరపదార్థమేదీ అప్పుడు నాలో లేనేలేదు. పసిబాలుడు కసురుకాయను ఏ ఆలోచనాలేకుండా నోటిలో వేసేసుకొంటాడు, అదేమాదిరి సంసారం మమ్మల్ని ఏ ఆలోచనా లేకుండానే నోట్లో వేసుకొని మింగేసింది, దానివల్ల మాకేమీ కష్టమనిపించలేదు. దీని విషయమై సాధనగాని ప్రయత్నంగాని చేయవలసిన అవసరం కూడా ఉండేదికాదు—రోజులు లెక్కపెట్టుకొంటూ ఎన్నడూ మేము కూర్చోలేదు, ఏనాడు శోభనం అంటే ఆనాడే శోభనం—శోభనం అన్నదానికి అర్థం ఉండేదికాదు, అన్నీ ఆటలమోస్తరు అదీ ఒక ఆటే. రేపు శోభనపు ముహూర్తం. అందుకు కాబోలు ఈమెకు ఇంత భయం. బావగారు ఇంకా పరులు తన వారు అనడానికి చాలాకాలం పట్టుతుంది. ఎట్లాగు అతన్ని ముట్టుకొంటుంది? అతను ముట్టుకొన్నట్లైతే ఆ అవమానం సహించి ఎట్లా ఊరుకోగలదు? ధనంకోసం బావగారు ఎన్నాళ్లో ప్రయత్నిస్తూ ఓర్చిఉండవలసివచ్చిందే! ఆమె మనస్సు కోసం రెండురోజులు ఓర్చి ఉండలేడా? ఆ లక్ష్మీకటాక్షం కోసము ఎన్నాళ్లో ఆమె గడపదగ్గిర పడిఉండలేదు, ఈ లక్ష్మి గడపదగ్గిర ఒక్కమారైనా చెయ్యిచాచ నక్కరలేదా!"

ఈ తలంపులన్నీ మోతితల్లికి తట్టిఉండకపోను, కాని తట్టడానికి కారణమేమిటంటే, కుమును చూచినప్పటినుంచి ఆమెను మనసార ప్రేమించడం మొదలుపెట్టింది. మోతీతల్లి

విప్రదాసును పెళ్లికి పూర్వం స్టేషన్‌లో మొట్టమొదట చూచిన నాడు ఆ ప్రేమయొక్క భూమిక ప్రారంభం అయింది. విప్ర దాసును చూడగానే మహాభారతంనుండి భీష్ముడు అవతరించాడా అని ఆమెకు అనిపించింది. వీరునివంటిమూర్తి, తాపసుని ముఖశ్రీ—వీటితో కలిసి దుఃఖమువల్ల కలిగిన నమ్రతకూడా ఉండెను, ఎవరు ఏమి అనుకుంటారో అని సంకోచించింది కాని ఒక్కమారువెళ్లి అతని పాదాలు స్పర్శించి వద్దామని బుద్ధి పుట్టింది. ఆనాడు ఆమె కంటపడ్డ రూపం నేటి వరకు ఆమెకంటికి కట్టినట్టే ఉన్నది. తరువాత కుము కనబడ గానే, "అన్న చెల్లెలే" అని తనలో తా ననుకొన్నది.

సాంఘికం కాని జాతిభేదం ఒకటి అన్నది, అది రక్తానికి చెందినది. ఈ జాతి ఏమిచేసినా ఏవిధంగానూ పోవలసినది కాదు. ఈరక్తగతజాతివలనకలిగే అసామంజస్యము స్త్రీలలో ప్రాణాం తకబాధను పుట్టిస్తుంది. కాని పురుషులను అంతగా బాధించదు. మోతీతల్లికి చిన్నప్పుడే పెళ్లి అయిపోయింది. కనుక ఇటువంటిది తెలుసుకోడానికి ఆమెకు అవకాశం చిక్కలేదు. కాని ఇప్పుడు కుముద్వారా బోధపరచుకొని అనుభవించగలిగింది. అనుకున్నప్పుడల్లా ఆమె వంట్లో గగుర్పు పుట్టుతున్నది. భయం-కరదృశ్య మొకటి కంటి ఎదుట కనపడేది—ఎప్పుడూ కంట చూడని జంతువొకటి ఒక అంధకార గహ్వారంలో నోరు తెరచుకొని కూర్చున్నట్టూ, ఆ గహ్వారం ఎదుట నిలుచొని కుము భగవంతుని ప్రార్థిస్తునట్టు మోతీతల్లి ఊహించు

తున్నది. కోపంతో మండిపడి మోతీ తల్లి తనలోతాను దేవుని నిందిస్తున్నది—"పాడు దేవుడు, వాడి ముఖంమీద బుగ్గి పొయ్య! ఆమెను నడి సముద్రంలో దించిన దేవుడు ఆమెను రక్షిస్తాడా!"

## ౨౪

మర్నాడు ఉదయమే కుముకు అన్నయ్యవద్దనుండి టెలిగ్రాం వచ్చింది—"భగవంతుడు నిన్నాశీర్వదించును గాక." ఆ టెలిగ్రామును జాకెట్లో దాచుకొన్నది, టెలిగ్రాం రాగానే అన్నయ్య దక్షిణహస్తంతో ఆమె నాశీర్వదిస్తున్నాడని కుము ఊహించుకొన్నది. కాని అన్నయ్య తనశరీరస్థితినిగురించి ఏమీ వ్రాయలేదే! జబ్బు ముదిరిందేమో! క్షణక్షణానికి అన్నయ్యకు ఏలాగున్నదో ప్రత్యక్షంగా చూస్తుండేది, ఇప్పు డేదీ కంటికి కనబడదే?

నేడు †పూలశయ్య ఇంట్లో జనారణ్యం, దగ్గరబంధువులువచ్చి మాట్లాడుతున్నారు, పలకరిస్తున్నారు, ముద్దుగా బుగ్గలు నొక్కుతున్నారు; ఒంటరిగా ఉందామంటే కుముకు వీలు చిక్కకుండా ఉన్నది, నేడే ముఖ్యంగా కొంచెముసేపైనా ఏకాంతంగా కూర్చోవలసిన అవసరము.

పడకగది పక్కనే స్నానాల గది, అందులోనే కొళాయి. కుము కొంచెము వీలుచేసుకొని తనపెట్టెలోనుండి ఫ్రేమ్ కట్టిన

---

†శోభనంనాటి విధానాలకు బంగాళీల నామకరణం.

కృష్ణమూర్తి పటము బయటికి తీసి స్నానంగదిలోకి వెళ్లి తలుపులు మూసుకొన్నది, స్నానంచేసే తెల్లమార్బుల్ బెంచిమీద పటంపెట్టి ఎదుట నేలమీద కూర్చొని మనస్సులో ఈవిధంగా అనేకసార్లు అన్నది, "నేను నీదాననే, ఇవాళ నీవు నన్ను అందుకో, అతను మరెవరూ కారు, నీవే అతను నీవే అతను. నీ యుగళస్వరూపమే నాకు ప్రత్యక్షమవుగాక."

విప్రదాసుని ఇన్‌ఫ్లుయన్‌జా న్యుమోనియాకింద దించిందని డాక్టర్లన్నారు. పూలశయ్యనాడు పంపవలసిన సారె అందచేయడానికని నవగోపాల్ ఒక్కడే కలకత్తా వచ్చాడు. పంపవలసినవన్నీ భారీగా పంపాడు, విప్రదాసే కలకత్తాలో ఉన్నయెడల ఇంత సందడి చేసి ఉండడు.

నలుగురు అక్కలను పెళ్లికి తీసుకురమ్మని మనుష్యులను పంపారు, కాని ఘోషాలులది సద్‌బ్రాహ్మణకులంకాదన్న వార్త నలుదిక్కులా వ్యాపించిపోవడంవల్ల అత్తగార్లు అక్కలను పంపలేదు. మూడో అక్కమాత్రం భర్తతో పోట్లాడి పెళ్లి అయిన మర్నాటికి కలకత్తా చేరుకొన్నది. అయినా నవగోపాల్ ఆమెబసకు వచ్చి, "పెళ్లివాళ్ల ఇంటికి రావద్దు, వస్తే మనమర్యాద దక్కదు," అని చెప్పాడు. నూర్ నగర్‌లో పెళ్లి నాటిరాత్రి జరిగిన కథ అతను మరువలేదు, ఆప్తసంబంధంలేని నలుగురు అమ్మాయిలచేత, ఒక ముసలిదాన్ని సాయమిచ్చి, సారెపంపి ఆనాటి విధానం జరిపించాడు. ఇప్పటికీ సంధి కాలేదని కుము పోల్చుకొన్నది, ఏనాటికీ కాదేమో!

కుముకు ముస్తాబుచేయించారు, హాస్యాలాడవలసినవాళ్లు హాస్యాలాడారు, భోజనాలు ప్రారంభమైనవి. అట్టే ఆలస్యం కానియ్యకూడదని మొట్టమొదటే మధుసూదన్ అన్నాడు, మర్నాడు అతనికేదోపని ఉన్నదట. తొమ్మిదిఅయేసరికి దిగువను, అంగణంలో ఘంట వాగింది పెద్దశబ్దంతో; ఇక ఒక్కనిమిషమైనా జాగుచేసే సాహసం ఎవరికీ లేదు—సభ ముగిసింది. మీద ఎగురుతున్న డేగ నీడ కనబడగానే పావురానికి వణుకుపుట్టి నట్టుగా, కుము గుండెలో భయం పుట్టింది, చల్లబడ్డ కాళ్లుచేతుల పైని చెమట కమ్మింది, ముఖం తెల్లపారిపోయింది. గదిలోనుంచి బయటికివచ్చి మోతీతల్లితో, "కొంచెముసేపు నన్ను ఒకమూలకి ఎక్కడికైనా తీసుకొనివెళ్లు; ఒక్క పదినిమిషాలు ఒంటరిగా కూర్చుంటాను," అని అన్నది. మోతీతల్లి ఆమెను తన పడక గదిలోకి పంపి, తలుపుమూసి తాను బయటనిలుచొని కళ్లు తుడుచుకొంటూ, "నీకేమి దురదృష్టమమ్మా!" అని తనలో తాను దుఃఖిస్తున్నది.

పది నిమిషాలయింది, పదిహేను నిమిషాలయింది, సాధ్య మైనంతసేపు కుమును ఒంటరిగా కూర్చోనిద్దామని మోతీతల్లి కోరిక. వరుడు పడకగదిలోకి వెళ్లాడని అమ్మలక్కలు చెప్ప వచ్చారు. కాని కుము కానరాలేదు. మోతీతల్లి, "అంత తొందరపడుతున్నా రెందుకు, పెళ్లికూతురు చీరమార్చుకో వద్దా, నగలు తీసేయక్కరలేదా?" అని అడిగింది. కబురుమీద కబురువచ్చింది, ఇంకా ఆలస్యంచేయడానికి మరి వీలులేదని

కనిపెట్టి గదితలుపు తీసేటప్పటికి కుము స్మారకం తప్పి నేలమీాద పడిఉన్నది.

అంతా కంగారు పడ్డారు, మెల్లగా పట్టుకొని కుమును మంచంమీాద పడుకోపెట్టారు. ముఖంమీాద నీళ్లు చల్లారొకరు, మరిఒకరు విసురుతున్నారు. కొంతసేపటికి కుముకు తెలివి వచ్చింది. కాని తానెక్కడ ఉన్నది పోల్చుకోలేక పోయింది. "అన్నయ్యా" అని మాత్రం అన్నది. మోతీతల్లి చప్పున ఆమె ముఖంమీాదికి వంగి, "భయపడకక్కా, నేనిక్కడే ఉన్నాను," అని అంటూ కుము ముఖాన్ని తన గుండెమీాద నొక్కుకున్నది; దగ్గరనున్నవాళ్లతో, మీారంతా ఇక్కడ మూాగకండి నేను ఆమెను తీసుకువస్తాను," అని చెప్పి, తిరిగి కుముచెవిలో, "భయంలేదమ్మా, భయపడకు," అని అన్నది. కుము మెల్లిగా లేచి, మనస్సులో భగవంతుని స్మరిస్తూ ప్రణామంచేసింది; ఆగదిలోనే మరొక మూలను మంచంమీాద గాఢనిద్రలోఉన్న హాబ్లూదగ్గిరికివచ్చి అతనిని ముద్దుపెట్టుకొన్నది. మోతీ తల్లి కుమును తీసుకొని పడకగదిదాకా వచ్చి, "ఇంకా భయంగా ఉన్నదా అక్కా?" అని అడిగింది.

కుము పిడికిళ్లు బిగించి, నవ్వుతూ, "నేనేమీా భయపడలేదే!" అని జబాబుచెప్పింది. "అభిసారికను నేను బయటఅంతా అంధకారము, లోపున వెలుతురు," అని తనలోతాను అనుకొన్నది.

"మోరె గిరిధరగోపాల ఔర్ నహీ కోహీ."

౨౫

ఈలోగా శ్యామాసుందరి ఊపిరి అందనంతవడిగా పరుగెత్తివచ్చి మధుసూదనుకు పెళ్లికూతురు మూర్ఛపోయిందని తెలియచేసింది. మధుసూదన్ మండిపడి, ఏమిటయింది ఆమెకు?" అని అడిగాడు.

"నే నెట్లా చెప్పగలను. అన్నయ్యా అన్నయా అని తపిస్తున్నదట—ఒక్కమారు నీవు చూసివస్తే బాగుంటుందేమో!"

"నేను వెళ్లి ఏమి లాభం, నేను అన్నయ్యను కానే!"

"ఆమాత్రం దానికి కోపగిస్తా వెందుకు అబ్బాయి, పెద్ద ఇంటి పిల్లలను మచ్చిక చేసుకోడానికి కొంచెము సమయం పట్టుతుంది కదా!"

"రోజూ ఆమె మూర్ఛపోతుంటుంది, నేను ఆమె నెత్తికి తైలం మర్దనా చేస్తుంటాను—అందుకేనా నే నామెను పెళ్లాడింది?"

"నీ మాటలు వింటే నవ్వువస్తుంది అబ్బాయి—మా కాలంలో గొప్పఇంటి అమ్మాయిల గర్వం మాటిమాటికీ భంగంచేయవలసివచ్చేది, ఈరోజులలో మూర్ఛ పోగొట్టాలి, దానిలో తప్పేమిఉన్నది?"

మధుసూదన్ ముఖం ముడుచుకు కూర్చున్నాడు, శ్యామాసుందరి కరుణతో కరిగిపోతూ దగ్గిరికివచ్చి మరిదిగారి

చెయ్యి పట్టుకొని, "నీవు ఆలాగు మనస్సును కష్టపెట్టుకుంటూ ఉంటే నేను సహించి ఊరుకోలేను, అబ్బాయి," అని అన్నది.

శ్యామసుందరి ఇంతకు పూర్వ మెప్పుడూ మధుసూదన్‌కు అంతదగ్గరగా వచ్చి ఓదార్చ సాహసించలేదు. శ్యామ వేలుడుకాయే, కాని మధుసూదన్ దగ్గిరఉన్నప్పుడుమాత్రం నోరు ఎన్నడో గాని విప్పేదికాదు, ఆట్టే మాటలాడేవాళ్లను చూస్తే అతనికి కోపము. స్త్రీలకుండే సహజబుద్ధివలన నేటి మధుసూదన్ ఆ మధుసూదన్ కాడని శ్యామ పోల్చుకొన్నది. నేడు ఆతనిలో ఉండే బలం పోయింది, మర్యాద కాపాడుకొనే జాగ్రత అతనిలో లేదు. మధుసూదన్ చేతిలో శ్యామ చెయ్యి పెట్టింది, అతనికి అయిష్టంగా ఉన్నట్టు కనబడలేదు. నవ వధువు అతని మర్యాదకు హానికలిగించింది. శ్యామఓదార్పు అతని మనస్సుకు కొంతసుఖాన్ని ఇచ్చింది. ఎవరేమిచేసినా శ్యామ మాత్రం అతనికి అనాదరణచేయదన్న స్వల్పవిషయం కాదు. శ్యామ రూపు కుముదురూపుకంటె తక్కువ కాదే. ఆమెకంటె కొంచెము నలుపు, అంతే కదా! కాని శ్యామ కళ్ళేమిటి! ఆమె జుట్టేమిటి! సరసమైన ఆమె పెదవులేమిటి!

"అదిగో పెళ్లికూతురు వస్తున్నది, నిక పోతాను. కాని అబ్బాయి, ఆమెమీద కోపగించకమ్మా, చిన్నది పాపము!" అని అంటూ శ్యామ వెళ్లిపోయింది.

కుముదు గదిలో ప్రవేశించగానే మధుసూదన్ కోపం పట్టిఉంచుకోలేక, "అమ్మగారి ఇంటినుంచి మూర్ఛకూడా తెచ్చి

నట్టున్నావు," అని అన్నాడు. "కాని అటువంటివి ఇక్కడ పనికిరావు, నీ నూర్‌నగరు వేషాలు వదిలేయవలసిఉంటుంది."

కుము ఆశ్చర్యపడుతూ, రెప్పవేయక చూస్తూ, నిలుచున్నది, నోరు తెరవలేదు.

జబాబులేక పోవడం చూచి మరీ మండిపడ్డాడు మధుసూదన్, ఆమె అనురాగాన్ని సంపాదించవలేనని అతని మనస్సులో అట్టడుగున తీవ్రంగా ఉన్నకోరికే ఈ నిప్పుల కోపానికి కారణం. "చేయవలసిన పని నాకు ఎల్లప్పుడూ ఏదో ఉంటూఉంటుంది. నా కుండే వ్యవధి చాలతక్కువ. హిస్టీరియా జబ్బుతో ఉన్న అమ్మాయిలను బుజ్జగిస్తూ కూర్చో డానికి నాకు వేళఉండదు ఇప్పుడే చెప్తున్నా జ్ఞాపకం ఉంచుకో," అని మధుసూదన్ గర్జించాడు.

కుము నెమ్మదిగా జబాబుచెప్పింది, "నీవు నన్ను అవమానపరచాలని చూస్తున్నావు, కాని గెలవలేవు, నీవుచేసే అవమానాలు నా మనస్సును తాకనివ్వను."

ఈ మాటలు కుము ఎవరితో అంటున్నదో తెలియనట్టుగానూ, తన ఎదుట నిలుచున్నవారెవరో పోల్చుకోలేనట్టుగానూ కళ్లుపెద్దవిచేసి నిశ్చేష్టురాలైచూస్తూ, ఆ అమ్మాయి పోట్లాడకుండాఉన్నది ఎందుచేతనో అని మధుసూదన్ ఆలోచిస్తున్నాడు. ఆమె ధోరణికి అర్థమేమిటో !

కొంచెం ఊరుకొని వెక్కిరిస్తూ అతను జబాబు చెప్పాడు—

" నీవు మీ అన్నగారి †చేలావు, ఆ మాట నే నెరుగుదును, కాని నేను ఆ అన్నగారికి అప్పిచ్చిన వడ్డీవ్యాపారస్థుడను. అతనిని ఒక సంతలో కొని ఇంకొక సంతలో అమ్మివేయగలను, ఆమాట ఎరగవు కాబోలు!"

'మీ అన్నయ్యకంటె నేను ఉత్తముడను,' అని కుము మనస్సులో నాటినట్టు చెప్పడానికి ఈమాటలు తప్ప మరి ఏవీ ఆ మూర్ఖుడికి చేతకాలేదు.

" ఇదిగో చూడు, దౌర్జన్యం కనపరచాలంటే కనపరుచు; కాని అల్పుడవు కాకు," అని జవాబు చెప్పి కుము దగ్గిరనున్న సోఫామీద కూర్చున్నది.

" ఏమిటీ! నేను అల్పుడను, మీ అన్నయ్య ఘనుడు! కదూ!" అని కర్కశకంఠంతో అన్నాడు మధుసూదన్.

" నీవు ఘనుడవని నమ్మే మీఇంటికి వచ్చాను," అన్నది కుము.

" ఘనుడవని నమ్మే వచ్చావా! లేక డబ్బాశకొలది వచ్చావా!" అని వేళాకోళంగా అన్నాడు.

కుము గది విడిచి డాబామీదికి వచ్చి నేల చతికిలపడ్డది.

కలకత్తాలో శీతకాలపు రాత్రులు లోభివంటివి— మంచుతోనూ పొగతోనూ నలు దిక్కులా మసక కమ్మి

---

† శిష్యుడు, శిష్యురాలు.

ఉంటుంది, వెన్నెలలో ప్రసన్నత ఉండదు, నక్షత్రకాంతి పగిలిన గొంతుకలోనుండి వస్తూఉన్న మాటలవలె ఉంటవి. చైతన్యం తగ్గిపోయి తిమ్మిరెక్కిన దేహంవలె కుము మనస్సు అయిపోయింది, ఎటువంటి తలంపూ లేదు, విచారం లేదు, దుఃఖం లేదు, తాను ఒక దట్టమైన మేఘంలో కలిసిపోతున్నట్టు ఆమెకు అనిపించింది.

కుము నిశ్శబ్దంగా, ఆమాదిరి గది విడిచి వెళ్లిపోతుందని మధుసూధన్ ఎన్నడూ ఊహించుకోలేక పోయినాడు. ఈ పరాభవంవల్ల అతనికి అందరిమీదకంటె కోపం కుము అన్నయగారి మీదను, మూలనున్న కుర్చీమీద కూలబడి పిడికిలి బిగించి శూన్యాకాశంవైపు ఒక గుద్దు గుద్దాడు. కొంచెముసేపు కూర్చొని మరి ఉండలేక శబ్దంచేసుకొంటూ డాబా మీదికి వచ్చి, *"పెద్దకోడలూ!" అని కేకవేశాడు. కుము ఉలికిపడి లేచి వెనుకను తిరిగి చూచింది.

"చలి, హిమవంతం, బయట ఇక్కడ కూర్చొని ఏమిటి చేస్తున్నావు, లోపలికిరా."

కుము అతనివేపు చూస్తూ నిలుచున్నది, ఆమెలో ఎట్టి సంకోచమూ కానరాలేదు, మధుసూదనుని అధికారంలో ఏ కాస్త జోరు మిగిలి ఉండెనో అదికూడా ఎగిరిపోయింది, కుము చెయ్యిపట్టుకొని, "గదిలోకి రా" అన్నాడు.

---

* బంగాళీలు భార్యను "కోడలు" అని సంభోదిస్తారు. కుము ఇంటికి పెద్దకోడలు.

కుము రెండో చేతిలో అన్నయ్య దగ్గరనుంచి వచ్చిన టెలిగ్రాం ఉండెను, దానిని జాకెట్లోకి జారవిడిచి గుండెదగ్గిర పెట్టుకొని, భర్తచేతిలోనుంచి తనచెయ్యి విడిపించుకొని మెల్లిగా భర్తవెనకనే పడకగదిలోకి తిరిగి వచ్చింది.

౨౬

కుము మర్నాడు వేకువనే లేచేసరికి భర్త ఇంకా నిద్రపోతున్నాడు. కుము అతని ముఖమువేపైనా చూడలేదు, చూచినట్లైతే తన మనస్సు కఠిన మైపోతుందేమో అని భయ పడ్డది. అతి నెమ్మదిగా లేచి అతని పాదాలదగ్గర ప్రణామం చేసి, ఆ పక్కనున్న స్నానాల గదిలోకి వెళ్ళింది. స్నానంచేసి, వెనుకతలుపు తీసి డాబామీదికి వచ్చి కూర్చున్నది. తూర్పు దిక్కున పొగమంచులోనుండి మలిన సువర్ణరేఖ ఒకటి కన బడుతున్నది.

ప్రొద్దెక్కి ఎండ తగలడం ప్రారంభించింది, కుము లేచి, తిరిగి గదిలోకి వచ్చింది— భర్త గదిలో లేడు. స్టాండుఅద్దం టేబిల్ మీదను నిన్నటి రాత్రి తన పూసలసంచి ఉంచింది. అందులో ఉంచిన అన్నయ్య టెలిగ్రాంకొరకు సంచి తెరిచి చూచే టప్పటికి తన నీలండుంగరం దానిలో కనబడలేదు.

ఉదయమే మనస్సులో చేసిన ఆరాధనవల్ల ముఖంలో పుట్టిన శాంతి చెదిరిపోయి కళ్లు ఎర్రని నిప్పులైనవి. పాలు

కొంచెము తాగమని పిలవడానికి మోతీతల్లి వచ్చింది, కుసుము మాటాడక రాతి విగ్రహంలాగు నిశ్చలంగా కూర్చున్నది.

మోతీ-తల్లి భయపడుతూ పక్కకు వచ్చి కూర్చొని, "ఏమిటి అయిందమ్మా?" అని అడిగింది. కుసుము నోటివెంట మాట రాలేదు, పెదవులుమాత్రం వణకడం మొదలుపెట్టినవి.

"ఎందుకు నీకు బాధగా ఉన్నదో నాతో చెప్పక్కా."

కుసుము రుద్ధకంఠంతో, "దొంగతనంగా తీసుకు వెళ్లిపోయి నాడు," అని అన్నది.

"ఏమిటి తీసుకు వెళ్లిపోయినాడక్కా ?"

"నా ఉంగరం, అన్నయ్య నన్ను దీవిస్తూ ఇచ్చిన ఉంగరం."

"ఎవరు ఆ తీసుకువెళ్లినది ?"

కుసుము లేచి నిలిచి బయటివైపు తల ఊపింది; ఎవరి పేరూ చెప్పలేదు.

"కొంచెం ఓర్చిఉండు అక్కా, నీతో ఆటలాడుతున్నాడు, తిరిగి ఇచ్చేస్తాడు."

"తిరిగి పుచ్చుకోను, నేనూ చూస్తాను ఎంత దౌర్జన్యం చేయగలడో !"

"సరే అది తరువాత చూదాము, ఇప్పుడేమైనా కొంచం నోట్లో వేసుకుందువుగాని రా అక్కా."

"నేనిప్పు డేమీ తినలేను, ఏమితిన్నా గొంతుక దిగదు."

"బంగారు తల్లివి, నేను చెప్పానని తినమ్మా !"

"ఒక్కటి అడుగుతాను చెప్పు, నాది అనదగినది ఒక్క వస్తువైనా ఇవాళనుంచి నాకు ఉండదా ?"

"ఉండదు, భర్త కనికరించి ఏదైనా ఇస్తే ఉండాలిగాని, లేకుంటే ఏదీ నీదంటూ ఉండదు. ఉత్తరం వ్రాస్తే చివరకు 'నీ దాసి' అని వ్రాసి కిందను సంతకం చెయ్యాలి, ఎరగవా ?"

"దాసి అంటే జ్ఞాపకం వచ్చింది రఘువంశంలో ఇందుమతి అన్నమాటలు—

గృహిణీ సచివః సఖీమిథః

ప్రియ శిష్యా లలితే కళానిధౌ—

పై పట్టికలో 'దాసి'అనే మాట ఎక్కడా లేదే ! సావిత్రి సత్యవంతునికి దాసీయా ! లేక ఉత్తరరామచరిత్రలోని సీత రాముని దాసీయా ?"

"భార్యను దాసిగా చేసినవాళ్లు ఏజాతికి చెందినవాళ్లు?" అని కుముు అడిగింది."

"అతను ఎట్లాంటివాడో నీవు ఇంకా పోల్చుకోలేదు. అతను ఇతరులచేతమాత్రమే బానిసవృత్తి చేయిస్తాడని అను కుంటున్నావేమో ? తనచేతను కూడా అతను అదేమాదిరి చేయించుకుంటాడు. ఒకనాడు ఆఫీసుకు వెళ్లలేకపోతే ఆనాటి జీతం కొట్టేసుకుంటాడు. ఒకమారు జ్వరం వచ్చి మాసంరోజులు ఇంటివద్ద ఉండిపోవలసి వచ్చింది, తరువాత ఏమిచేశాడో

ఎరుగుదువా—రెండుమూడు నెలలవరకు తిండిఖర్చు తగ్గించి ఆ నష్టం దిద్దాడు. ఇంతకాలంనుండి నేను ఇంటిపని చేసుకు వస్తున్నా నా—అయినా నాపనిని పట్టే నాకు ముట్టవలసింది దొరుకుతుంటుంది. తనవాళ్లు అంటూ అతని కెవ్వరూ లేరు. ఇంటియజమాని మొదలు అంట్లు తోమేదానివరకు అందరూ బానిసలే.

కుము కొంచెంసేపు ఊరుకొని జబాబు చెప్పింది—"నేనూ ఆ బానిసవృత్తే చేస్తాను. నా తిండికీ బట్టకూఅయ్యేఖర్చు రోజూ ఇంటిపని చేసే తీరుస్తుంటాను. జీతంలేని బానిసగా ఈఇంట్లో నేనుండను. పద, నాకు పనిచూపించు, ఇంటిపని పూచీ అంతా నీమీదనే ఉన్నది గనుక నీ అధీనంలో నన్ను ఉంచుకొని నాచేత పనిచేయించు—రాణి అని పిలిచి నన్నెవ్వరూ ఎగతాళి చెయ్యకూడదని చెప్పు."

మోతీతల్లి నవ్వుతూ కుముగడ్డం అతి ఆదరంతో పట్టుకొని, "ఆలాగైతే నామాట వినకతీరదు, ఇప్పుడు నీవు ఫలహారం చెయ్యాలని నా ఆజ్ఞ—పద," అని అన్నది.

గదిలోనుంచి బయటికి వస్తూవస్తూ కుము ఇట్లాగన్నది—"నన్ను అతని చేతులలో సమర్పించుకొందామని నేను వచ్చానక్కా, కాని అతను అది కానిచ్చాడు కాడు. ఇక అతనికి దొరికేది దాసీయే, 'నేను' అతనికి ప్రాప్తిలేదు, అతను దాసితోనే తృప్తిపొంది ఉండాలి."

మోతీతల్లి అన్నది—"వడ్రంగిపిట్ట కర్రను ముక్కుతో కొట్టడము మాత్రమే ఎరుగును, దానికి దొరికేది చెట్టుకాదు, కర్ర. తోటమాలి చెట్లను పెంచుతాడు, వాడికి పువ్వులూ పళ్లూ దొరుకుతవి. నీవు వడ్రంగిపిట్టచేతిలో చిక్కుకొన్నావు—ఆతనిది వర్తకునిమనస్సు, అందులో ఎక్కడా మాధుర్యము గాని ఇతరులకై బాధచెందడంగాని అన్నది లేదు."

కొంతసేపైన తరువాత కుము పడకగదిలోకి వచ్చి చూచేసరికి టీపాయ్‌మీద పిప్పర్‌మెంటు సీసా ఒకటి కనపడ్డది—హాబ్లూ తన త్యాగ చిహ్నంగా దానిని అక్కడఉంచి ఏ మూలనో దాగున్నాడు. ఈ ఇంట్లో ఈ రాళ్లమధ్యను కూడా పువ్వులు పుట్టుతున్నవి—ఆ పిప్పర్‌మెంటు సీసావల్ల కుముకు నవ్వూ వచ్చింది ఏడుపూ వచ్చింది. హాబ్లూను వెదుకొంటూ కుము బయటికి వచ్చి చూచింది, హాబ్లూ తలుపుమూలను దాగొని ఉన్నాడు—తల్లి అతనిని ఈ గదిలోకి రావద్దని చెప్పింది—ఏ కారణంచేతనైనా బావగారికి కోపం రావచ్చునని ఆమె భయం. మొత్తంమీద మధుసూదనునికోసం ఏమైన చేయవలసిఉంటే తప్ప అతనికి సాధ్యమైన దూరంగా ఉండడమే మంచిదని ఇంట్లో అందరూ ఎరుగుదురు.

కుము హాబ్లూను చెయ్యిపట్టుకు తీసుకువచ్చి కుర్చీమీద తన ఒడిలో కూర్చోపెట్టుకొన్నది. ఆ గది ముస్తాబులో పిల్లలాట వస్తువుల తరగతికి చెందిన వేవి ఉన్నవో ఒకొకటి హాబ్లూకు చూపించింది, కాగితాలు గాలికి ఎగరకుండా ఉంచే

పేపర్ వైట్, హాబ్లూకు అన్నిటికంటె వింతగా కనపడ్డది, రంగు రంగుల పువ్వులు గాజుగుండా లోపలికి ఏలాగు దూరినవో పోల్చుకోలేక చాలా సరదా పడుతున్నాడు.

"అది నీకు కావాలా గోపాల్?" అని కుము అడిగింది.

ఊహింపరాని అటువంటి ప్రశ్న ఇంతవరకు ఎన్నడూ హాబ్లూ వినలేదు. సంకోచిస్తూ కుము ముఖంవంక వింతగా చూచాడు.

"నీవు అది తీసుకో," అన్నది కుము.

ఆనందం పట్టిఉంచుకోలేక, దాన్ని పట్టుకొని గంతులు వేసుకొంటూ ఇంట్లోకి వెళ్లిపోయాడు, ఆనాడు రెండో పూట హాబ్లూ-తల్లి కుముగదిలోనికి వచ్చి ప్రారంభించింది, "ఏమిటి అక్కా నీవుచేసినపని? బావగారు ఆ గాజుగుండును హాబ్లూ చేతిలో చూచి ఏకగోలచేశారు. వాడిచేతిలోనుంచి లాగి తీసుకొన్నారు సరేసరి, పైగా దొంగ అని వాణ్ణి గట్టిగా కొట్టారు. పిల్లవాడిబుద్ధి ఏమి తక్కువా! నీ విచ్చావని చెప్ప వచ్చును కదా?—నీ పేరైనా అనడు! హాబ్లూకి నేను దొంగతనం నేర్పుతున్నానని కూడా ఇక పుట్టిస్తారు చూస్తు ఉండూ!"

కుము కర్రబొమ్మలాగు కూర్చున్నది.

మధుసూదన్ వస్తున్నట్టు బయట శబ్దం అయింది, మోతీతల్లి తొందర తొందరగా లేచి పారిపోయింది. చేతిలోఉన్న గాజు-పేపర్ వైటును మధుసూదన్ యదాస్థానంలో సరిది

పెట్టాడు. తరువాత దృఢవిశ్వాసంగలవాడివలె శాంతంగా, గంభీరంగా కుమువైపు చూస్తూ అన్నాడు—"హాబ్లూ దీన్ని నీ గదిలోనుంచి దొంగిలించి తీసుకువెళ్లాడు. వస్తువులు జాగ్రత్తగా ఉంచడం నేర్చుకో."

"వాడు దొంగలించలేదు," అని తీక్ష్ణస్వరంతో జబాబు చెప్పింది కుము.

"అయితే పట్టుకువెళ్లిపోయినాడు, సరేనా!"

"లేదు, నేనే వాడికి ఇచ్చాను."

"వాణ్ణి ఈలాగే పాడుచేస్తూఉంటావు కాబోలు! కాని ఒకమాట జ్ఞాపకం ఉంచుకో—నా సెలవులేనిదే ఎవ్వరికీ ఏదీ ఇయ్యకూడదు—అన్నీ కలగాపులగం చేస్తూఉండడం నాకిష్టం లేదు కూడాను."

కుము లేచి నిలబడి, "నీవు నా నీలంఉంగరం తీసుకో లేదూ?"

"తీశాను."

"దానితోకూడా ఆగాజుగుండు ఖరీదు బాకీతీరలేదా?"

"అది నీదగ్గిర ఉంచకూడదని నేను చెప్పలేదూ?"

"నీ వస్తువులు నీవు ఉంచుకోవచ్చు, నావి నేను ఉంచుకో కూడదా?"

"ప్రత్యేకం నీవస్తువులంటూ ఈ ఇంట్లో ఏవీ ఉండవు."

"సరే అయితే ఈగదికూడా నీదే," అని అంటూ కుము బయటికి వెళ్లిపోయింది.

కుము వెళ్ళి వెళ్ళకముందే శ్యామ కంగారు కంగారుగా గదిలోకి వచ్చి, "కోడలెక్కడికి వెళ్ళింది?" అని అడిగింది.

"ఎందుకు?"

"ప్రొద్దుటనుంచి ఆమెకోసం ఫలహారంపట్టుకు కూర్చున్నాను, ఈ ఇంటికి వచ్చి భోజనంకూడా మానేస్తుంది కాబోలు!"

"అయితే నష్టమేమిటి—నూర్‌నగర్ రాజకన్య భోజనం చేయకపోతే తప్పేమి? మీరు ఆమె దాసీలా?"

"ఛా, అదేమిటి అబ్బాయి! చిన్నపిల్లమీద అలాగు కోపగించవచ్చా! ఆమె భోజనం మాని అలా మాడుతుంటే చూచి మేము ఊరుకోలేము, కోరి మూర్ఛపోయిందంటావా?"

"సరే లే, నీవు వెళ్లు, ఏమీ చేయనక్కరలేదు, ఆకలివేస్తే తానే వచ్చి తింటుంది," అని గర్జించాడు మధుసూదన్.

మిక్కిలి దుఃఖిస్తున్నట్టుగా బయటికి వెళ్లింది శ్యామ.

మధుసూదనుకు రక్తం తలలోకి ఎక్కింది. తొందర తొందరగా స్నానాలగదిలోకి వెళ్లి మీదినుంచి ధారలుపడే కొళాయి విప్పి దానికింద తలపెట్టాడు.

## ౨౭

సాయంకాలం అయిపోయింది, ఆనాడు కుము ఎక్కడా కనపడలేదు. వెదకగా వెదకగా లైట్లూ, సెమ్మెలూ, దీపం బుడ్డీలు ఉంచే, మూలనున్న చిన్నపంచేలో కనపడ్డది, చాపఒకటి వేసుకొని కూర్చొని ఉన్నది.

మోతీతల్లి వచ్చి, "మంచివానవే అక్కా, ఏమిటి కథ!" అని అన్నది.

"లైట్లూ దీపాలూ బాగుచేస్తుండడమే ఈ ఇంట్లో నా పని, నేను ఈ గదిలోనే ఉండదలచుకున్నాను కూడాను."

"మంచి పనికే కుదురుకొన్నావు అక్కా, ఇంటికి దీపం అవుదామని వచ్చావు నిజమే, ఆలాగని చెప్పి దీపాలు బాగు చేస్తూ కూర్చో అక్కరలేదులే, పద ఇక."

కుము కదల లేదు.

"అయితే నేనుకూడా ఇక్కడే కూర్చుంటాను, ఇక్కడే పడుకుంటాను," అన్నది మోతీతల్లి.

"వద్దు," అన్నది కుము దృఢస్వరంతో, బయటికి మెత్తగా కనబడే ఆ అమ్మాయిలో అధికారం చేసే జోరు కావలసినంత ఉన్నదని పోల్చుకొని, మోతీతల్లి వెళ్లిపోవలసివచ్చింది.

రాత్రి పడుకోడానికి వచ్చి మధుసూదన్ కుముసంగతి విని తనలోతాను మొదట ఇలా అనుకొన్నాడు——"మంచిదే, ఆ గదిలోనే ఉండనీ ఎన్నాళ్లు ఉండగలదో, బ్రతిమాలితే మరీ మొండిపట్టు పట్టుతుంది."

ఇట్లాగు అనుకొంటూ దీపం ఆరిపి నిద్రపోదామని మంచంమీద పడుకున్నాడు. కాని ఎంతకీ నిద్రరాదు. ఏమాత్రం శబ్దంఅయినా, 'అదిగో వస్తున్నది' అని అనుకొనే వాడు. బయట, తలుపుదగ్గిర నిలుచున్నదేమోఅని ఒకమారు

అనుకొని లేచి బయటికి వచ్చి చూచాడు, ఎవ్వరూ లేరు. రాత్రి అవుతున్నకొలది మనస్సు మరీ కొట్టుకొంటున్నది. కుముమాట అనుకోకూడదని నిశ్చయించుకుంటాడు కాని సాధ్యంకాకుండా ఉన్నది. తానే ఆమెదగ్గిరికివెళ్లి పరాజయం ఒప్పుకోవడం తన రాజనీతికి విరుద్ధం. చల్లని నీళ్లతో ముఖం కడుక్కొని తిరిగి మంచంమీద పడుకున్నాడు, కాని నిద్ర రాకుండా ఉన్నది. ఇటూ అటూ దొర్లి లేచిపోయినాడు. సమాచారం తెలుసుకుందామని కుతూహలంగాఉంది, ఓర్చిఉండ లేకుండా ఉన్నాడు. లాంతరు చేతపుచ్చుకొని నిద్రిస్తున్న గదులవరస ఎదుటనుండి మూలనున్న లాంతర్లగదిదగ్గిరికి వచ్చి కొంచెముసేపు తలుపుమీద చెవిపెట్టి విన్నాడు—ఏమీ శబ్దములేదు మెల్లిగా తలుపుతెరిచి చూచాడు—నేలమీద చాపపరుచుకొని కుము నిద్రపోతున్నది. చాపకొస మడిచి దానిని తలగడ చేసింది. మధుసూదన్‌కు నిద్ర లేదు అదేమాదిరి ఆమెకూడా నిద్రలేక ఉండడం న్యాయం, కాని ఆమె నిశ్చింతగా నిద్రపోతున్నది. అతనిచేతిలోనున్న లాంతరు వెలుతురు ఆమెకళ్లల్లో పడినప్పటికీ ఆమెకు నిద్రాభంగం కలుగలేదు. అంతలో కొంచెము కదిలి ఇటునుండి అటు తిరిగింది. ఇంటివాళ్లకు మెలుకువ వస్తుందని భయపడి దొంగ పారిపోయినట్టుగా మధుసూదన్ అక్కడనుండి పారిపోయినాడు, అతనికి కలిగిన పరాభవం చూచి కుము తనలోతాను నవ్వుకుంటుందేమో అని అతనికి అనుమానం కలిగింది.

లాంతర్న గదిలోనుంచి లోపలిఇంటి వరండా దాటి బైటకు వచ్చేసరికి శ్యామ అతని కంటపడ్డది—ఆమెచేతిలో దీపంబుడ్డి ఒకటి ఉన్నది.

"ఇదేమిటి అబ్బాయి, ఇక్కడికి ఎక్కడనుంచి వచ్చావు?"

ఆ ప్రశ్నకు జబాబియ్యకుండా, "నీ వెక్కడికి వెళ్లు తున్నావు వదినా?" అని అడిగాడు.

"నావ్రతం రేపే, బ్రాహ్మణులకు విందుచేయించాలి. దాని ఏర్పాట్లకోసం వెళ్లుతున్నాను; నీవు కూడా విందుకు రావాలి, కాని నీకు తగిన దక్షిణ ఇచ్చే సామర్థ్యం నాకు లేదు సుమా!"

జబాబు మధుసూదన్ నాలుక చివరవరకు వచ్చి ఆగి పోయింది.

తెల్లవారబోతున్నది—అయినా, బాగా చీకటిగా ఉన్నది—ఆ దీపం వెలుతురులో శ్యామ బహు అందంగా కనబడ్డది. ఆమె కొంచెము నవ్వుతూ, "నిద్ర లేచి ఇవాళ నీవంటి భాగ్యవంతుని ముఖం చూచాను, ఈ రోజు సుఖం గానే గడిచిపోయి వ్రతం సఫలం అవుతుందని నా నమ్మకం," అని అన్నది.

'భాగ్యవంతుడు' అనే మాటను కొంచెము నొక్కి ఉచ్చరించింది శ్యామ, అందులో కొంత ఎగతాళి ఉన్నట్టు

తట్టింది మధుసూదన్‌కు. శ్యామ కుమును గురించి ఏమీ అనడానికి సాహసించలేదు, "రేపు తప్పక విందుకు రావాలి సుమా, లేకుంటే ఒట్టు!" అని అంటూ వెళ్ళిపోయింది.

మధుసూదన్ గదిలోకి వచ్చి మంచంమీద పడుకొన్నాడు. లాంతరు బయట ఉంచాడు, కుము వస్తుందేమో అని. నిద్రిస్తున్న ఆ కుముదిని ముఖం అతని మనస్సును విడవకుండాఉన్నది ఎంత ప్రయత్నించినా. శాలువులోపలినుండి వచ్చి బయటపడిఉన్న కుముచెయ్యివంటి చక్కని చెయ్యి అతను, ఎక్కడా చూడలేదు. వివాహసమయంలో ఆ చెయ్యినే తన చేతితో పట్టుకొన్నాడు, కాని అప్పుడు దానిని మనసార చూడలేదు. ఇవాళ దానిని ఎంతచూచినా తనివితీరదు అనిపిస్తున్నది. ఆ చెయ్యిపై అధికారం అతనికి ఎప్పుడు లభిస్తుందో కదా! మరి పడుకొని ఉండలేక లేచిపోయినాడు. దీపం వెలిగించి కుము *డెస్కు సొరుగు తీశాడు, ఆమె పూసలసంచి అందులో ఉన్నది, అది విప్పాడు, మొట్టమొదట అన్న పంపిన ఆ టెలిగ్రాం కనపడ్డది—"భగవంతుడు నిన్నాశీర్వదించును గాక!" తరువాత చిన్న ఫొటోగ్రాఫ్—ఇద్దరు అన్నయ్యలూ కలిసిఉన్నది. తరువాత చిన్న కాగితంముక్క—దానిమీద విప్రదాసు తన చేతితో తానే వ్రాసిఇచ్చిన గీతాశ్లోకం:—

యత్ కరోషి, యదశ్నాషి, యజ్జుహోషి, దదాసి యత్,
యత్ తపస్యసి కౌంతేయ తత్ కురుష్వ మదర్పణమ్.

---

* Desk

మధుసూదనుని మనస్సు ఈర్ష్యవల్ల మిక్కిలి కలతజెందింది. అతను పళ్లు బిగించి విప్రదాస్ నాశన అయిపోవును గాక అని శపించాడు. ఆ నశించేరోజు ఎప్పుడో వస్తుంది ఆమాట మధుసూదన్ బాగా ఎరుగును, ఈలోగా *స్క్రూ కొంచెం కొంచెం బిగిస్తూ ఉండాలి, కాని అన్నయ్య చేతిలో ఉండి పోయిన ఆమె పందొమ్మిది సంవత్సరాలూ అతని చెయ్యి నులిపి తీసుకోగలిగితే అప్పుడు తనకు మనశ్శాంతి కలుగుతుంది. †జబర్దస్తీతప్ప వేరేదారి ఎరగడు మధుసూదన్. ఆ పూసల సంచి పారేయడానికి ఇవాళ సాహసం చాలింది కాదు, ఆమె ఉంగరం తీసుకొన్ననాటి సాహసం నేడు లేదు. కుముదిని ఒక సాధారణ స్త్రీ అనే అప్పుడనుకొన్నాడు, సాధారణ స్త్రీల మాదిరే సులభంగా అధీనంలోకి వస్తుందనీ, అధీనంలో ఉండడానికే ఇష్టపడుతుందనీ అనుకొన్నాడు. కుముదిని చెయ్యగలదేదో పోల్చుకొనే మార్గంలేదని ఇవాళ తెలుసుకొన్నాడు. కుముదినిని తన జీవనంతో గట్టిగా కట్టగల బంధం ఒక్కటే ఉన్నది, అది సంతానబంధం—దానిని గురించే యోచిస్తూ కొంత మనశ్శాంతి పొందాడు.

ఈలాగు అనుకొంటూ ఉన్నాడు, గడియారం ఐదు కొట్టింది, కాని శీతకాలంఅవడంచేత ఇంకా చీకటిగానే ఉన్నది, త్వరలోనే తెల్లవారిపోతుంది. ఈరాత్రి వృథా అయిపోయినట్టే! మధుసూదన్ తొందర తొందరగా గదిలో

---

* Screw. †బలప్రయోగం.

నుంచి బయటికి వచ్చాడు, లాంతర్లగది దగ్గిరికి చప్పుడు చేస్తూ నడిచి వచ్చి, తలుపుతో శాడు శబ్దం అయేటట్టు, చూచేటప్పటికి కుము లేదు—ఎక్కడికి వెళ్లిందో!

అంగణంలోనుంచి కొళాయినీళ్ల శబ్దం వినబడుతున్నది. వరండామీదినుండి అటువైపు చూచాడు, ప్రపంచంలోని కిలం పట్టిన పాత సెమ్మేలన్నీ కుప్పచేసి ఉన్నవి, కుము వాటికి చింత పండు పెట్టి తోముతున్నది. అది కేవలం కోరి పని పెంచడమని తెలుస్తూనే ఉన్నది—శీతకాలపు వేకువను నిద్రమాని, లేచి, ఈపనిచేయడం దుఃఖాన్ని పెంచుకోవడంకొరకే అని అతనికి తోచింది.

మధుసూదన్ మీది వరండాపైకి వెళ్లి నిశ్చేష్టుడై చూస్తున్నాడు, అబలులబలాన్ని విరిచే మార్గం ఏమిటి అనీ ఆలోచిస్తున్నాడు. ఇంట్లోనివాళ్లు నిద్రలేచేసరికి ఇది కనబడితే ఏమనుకుంటారు? అంట్లుతోమే నౌకరుది ఏమనుకుంటుంది? నలుగురి చేత తనను ఎగతాళిచేయించడానికి దీనికంటె మంచిదారి వేరేదీ ఉండదని తనలో తాననుకొన్నాడు.

కొళాయిదగ్గరికి వెళ్లి ఆమెకు బోధపరచి రాజీనామా చేసుకొందామా అని అతనికి బుద్ధి పుట్టింది, కాని ఆమెతో వాదన చేస్తూఉంటే విని అంతా నిద్రలేచి వేడుకచూస్తారు. ప్రహాసనం ఊహించుకొని వెనక్కు తగ్గాడు. తమ్ముడు నవీనుని పిలిపించి, "ఇంట్లో ఏమేమి జరుగుతున్నదో కొంచెము చూస్తున్నావా?" అని అడిగాడు.

నవీన్ ఇంటి మేనేజరు, "ఏమి! ఏమిటయింది అన్నయ్యా?" అని అడిగాడు.

అన్నకు ఏ కారణంవల్లనైనా కోపం వచ్చినప్పుడు, తిట్టడానికీ అధికారం చలాయించడానికీ ఎవడైనా ఒకడు దొరకాలి—ఈ సంగతి నవీన్ ఎరిగినదే. అపరాధి తప్పించుకు పారిపోయినట్లైతే నిరపరాధి దొరికినా చాలును. అట్లాగు అయితే తప్ప *డిసిప్లిన్, ఉండదు, సంసారంలో †ప్రెస్టిజ్ నిలబెట్టుకోలేము !

"మీ వదినె పిచ్చిదానిలాగు ఎందుకు ఆపనిఅంతా చేస్తున్నదో నాకు తెలియదనుకొన్నావా ?" అని మధుసూదన్ అడిగాడు.

వదినచేస్తున్న పిచ్చిపని ఏమిటి అని అడగడానికి నవీన్ సాహసించలేదు, అది తెలుసుకోకపోవడం కూడా అపరాధం అని అన్నగారు అనవచ్చు.

"చిన్నతోటికోడలు మీవదిన పిచ్చిని అధికంచేస్తున్నది, దానికేమీ సందేహం లేదు," అని మధుసూదన్ అన్నాడు.

నవీన్ సంకోచిస్తూ మెల్లిగా అనబోయినాడు—"లేదే, తోటికోడలు—" కాని మాట పూర్తిచేయనీయకుండా "నా కళ్లతో నేను చూచాను," అని మధుసూదన్ అన్నాడు.

*Discipline—కాయిదా † Prestige—పరువు.

అటుపైని మాటాడి ప్రయోజనం లేదు. "నాకళ్లతో నేను చూచాను," అన్నవాటిలో ఆ గాజు పేపర్ వైట్ ఒకటి ఉండాలి.

౨౮

మోతీతల్లి కుమును అంత అమాయకమైన ప్రేమతో చూస్తూ సంరక్షణ ప్రారంభించడం చూచి మధుసూదన్ సహించలేడని నవీన్ ఎరుగును. ఇంట్లోనివాళ్లకుకూడా ఇది అంతగా నచ్చదు. ఇప్పుడు అటువంటిదే ఏదో జరిగిందని నవీన్ పోల్చుకొన్నాడు. మధుసూదన్, అనుమానంమీద ఆధారపడి చేస్తున్న దోషారోపణనుగురించి వాదించి ప్రయోజనంలేదని నవీన్‌కు తెలుసును—దానివల్ల అన్నగారి మొండిపట్టు మరింత గట్టి అవుతుంది.

జరిగిన సంగతి ఏమిటో మధుసూదన్ స్పష్టంగా చెప్పలేదు, చెప్పడానికి సిగ్గుపడి ఉండవచ్చును. ఇప్పుడు ఏమి చెయ్యాలో అదీ ఊహించుకోలేకుండా ఉన్నాడు నవీన్. అతని మనస్సులో స్పష్టంగా ఉన్నది, పూచీ పూర్తిగా చిన్న తోడికోడలిదే అన్న అభిప్రాయం ఒక్కటే. దాంపత్య మర్యాదానుసారం తలాతోకలలో తల భర్తది కనుక ఆపూచీ ఆ అపరాధమూ నవీనుది అన్నమాట.

నవీన్ భార్యదగ్గిరికి వచ్చి, "గొప్పచిక్కులో పడ్డాను," అని అన్నాడు.

"ఏమి—ఏమి టయింది?"

"అది ఆ అంతర్యామికి తెలియాలి, అన్నయ్యకి తెలియాలి. నీకుకూడా తెలిస్తే తెలిసిఉండవచ్చు, కాని దెబ్బలు మాత్రం నామీద పడుతున్నవి."

"నీకెందుకు శిక్ష ?"

"నాద్వారా నీవు మంచిదారిలో పడవలెనని, నీద్వారా అన్నయ్య కొత్తవర్తకానికని, కొత్తగా దిగుమతిచేసిన వస్తువు మంచిదారిలో పడవలెనని."

"ఆ మంచిదారిలో పెట్టడమనే కార్యం నీవే ఆరంభించు నామీద, ఆపనిలో నీచెయ్యి గట్టిదో అన్నయ్యగారి చెయ్యి గట్టిదో చూదాము."

ఒడియా బంట్రోతు ఒకసారి అన్నయ్య డిన్నర్ సెట్‌లో చిన్నపళ్లెం ఒకదానిని విరిచేశాడు, దానికై విధించిన జరిమానాలో ముఖ్యభాగం నేను ఇచ్చుకోవలసి వచ్చింది, ఆ సెట్ నా పెద్దరికం కింద ఉండేదిగనుక—అది నీకు జ్ఞాపకం ఉన్నదా ? కాని ఇప్పుడు ఇంటికి తీసుకువచ్చిన వస్తువుమీద నాపెద్దరికములేదే! అయినా దాని పూచీ మనమిద్దరం పంచుకోవాలట. చెయ్యవలసినదేదో నీవే చెయ్యి ఇల్లాలా, నన్ను బాధనుంచి రక్షించు."

"జరిమానా అంటే ఏమిటి నాకేమి బోధపడడం లేదు."

"రజబ్‌పూర్ పంపించేస్తాను నిన్ను—అని ఉండిఉండి భయపెట్టుతున్నాడు."

"భయపడుతుంటావు గనుక భయపెట్టుతుంటాడు. ఒకసారి పంపాడు రైలుచార్జీలు దండగపెట్టి మళ్ళీ పిలిపించ లేదా? కోపంవచ్చినప్పుడైనా లాభనష్టాలమాట మరిచిపోడు మీ అన్నయ్య, నన్ను ఇంటి పనిలోనుండి తప్పిస్తే ఖర్చుతగ్గదు. ఒక్కదమ్మిడీ ఎక్కడైనా నష్టంవస్తే సహించి ఊరుకోవలసిన వాడు కాడు."

"బోధపడ్డది. కాని ఇప్పుడు చెయ్యవలసినదేమిటో చెప్పు."

"ఎంత గొప్పరాజుఅయినా రాణిగారిగర్వం పోగొట్ట వలెనంటే చేయవలసింది సిగ్గువిడిచి తానే చేయాలి, కాని ఆపని జీతం ఇచ్చిఉంచినవాళ్లద్వారా ఎన్నడూ సాధించలేడని మీ అన్నయ్యగారికి తెలియచేయాలి. శోభనపుగదిలోకి కూలి వాళ్లను పిలవకూడదని చెప్పు."

ఆ ఉపదేశం నేను చెయ్యనక్కరలేదు, రెండురోజులలో తానే తెలుసుకుంటాడు. ఈలోగా కొంచెము దూతపని చెయ్యి, కార్యం సఫలంఅయినా కాకపోయినా—మనం అతని డబ్బుతింటూ ఊరికే కూర్చోలేదని దానిద్వారా తెలుసు కుంటాడు.

మోతీతల్లి కుమును వెదకడానికి బయలుదేరింది. ఉదయాన కుము డాబా మీాద ఉంటుందని ఆమె ఎరుగును. డాబా చుట్టూ ఎత్తు గోడలున్నవి, వాటినిండా కన్నాలున్నవి గాలికొరకు, ఇక్కడా అక్కడా చెట్లతొట్లెలు పడిఉన్నవి,

వాటిలో చెట్లులేవు, ఒకమూలను విరిగిపోయిన పంజరం ఒకటి ఉన్నది, దానిఅడుగు పోయింది, పూర్వం దానిలో చెవులపిల్లులు ఉండేవి. ఇప్పుడు మాగాయి ముక్కలు ఎండలో పెట్టినప్పుడు, కాకులెత్తుకుపోకుండా మూతపెట్టడానికి ఉపయోగపడుతున్నది.

తలమీదనున్న ఆకాశం కనబడుతుంది, కాని దిగంతం కనబడదు. ప్రశ్చిమంవైపున ఫ్యాక్టరీ ఇనపచిమ్నీ ఒకటి కనబడుతుంది. కుము వచ్చిన ఈనాలుగు రోజులలో డాబా మీదికి వచ్చి కూర్చున్నప్పుడు చూడదగినదీ ఆకాశమంతటిలో ఆమెకు కనబడుతున్నవాటిలో సజీవవస్తువులనదగినదీ, ఆ చిమ్నీలోనుంచి చుట్టలు చుట్టలుగా మీదకిలేస్తున్న నల్లని పొగ ఒక్కటే—ఏదో ఆవేగంతో ఉబ్బిఉబ్బి చుట్టుకొంటూ మీదికి పరుగెత్తుతున్నట్టు కనబడేది అది.

కుము సెమ్మేలు మొదలైనవన్నీ తోమి, చీకటిఉంటూ ఉండగానే స్నానంచేసి, తూర్పుకు ముఖం తిప్పి డాబామీద కూర్చొని ఉన్నది. తడిజుట్టు వీపుమీద వ్రేలాడుతున్నది, సన్నని నల్లంచుగల ముతకచీరె కట్టుకొని ఉన్నది. ఒంటిమీద నగలు లేవు. చలివేయకుండా దళసరి *ఎండీ-పట్టు శాలువు కప్పుకొన్నది. కొన్నాళ్లబట్టి ఆమె ఆశిస్తున్న ఆదర్శప్రియతముని మనస్సులో ఉంచుకొని తన హృదయంలో ఉండే క్షుధను

---

* ఒకజాతి పట్టు.

చల్లార్చుకోవలెనని కూర్చున్నది. ఆమె ఇన్నాళ్లనుండి చేసిన వ్రతాలు, నోచిన నోములు, చదివిన పురాణాలు—వీటి అన్నిటి సహాయంవల్లా మనస్సులోఉన్న ఊహామూర్తిని సజీవంగా ఉంచుతున్నది. ఆమె ఒక అభిసారిక; ఉదయమే లేచి తన మానసబృందావనంలోనికి పోయి పాడుతూ కూర్చున్నది. ఆమె ఎవరికొరకు రోజూ ఎదురుచూస్తున్నదో అతడు దగ్గరకు రాకముందే తన ఆత్మనివేదనార్ఘ్యాన్ని పంపుతుండేది. వర్షపు రాత్రి ఒకేవరుసను వర్షం కురుస్తుండేది, తోటలో చెట్లఆకుల మీాద వర్షధారల కలకల విరామంలేకుండా వినబడుతుండేది. కుము "బాజే ఝున నన" అనే వర్షపుపాట 'కన్నడరాగంమీాద మీాదపాడుతూ కూర్చుండేది. కాళ్లకు గజ్జలుకట్టుకొని లక్ష్యం లేనిదారిని ఉదాసీనంగా వెళ్లిపోతుండే మనస్సు ఇంటికి ఎట్లా తిరిగి రాగలదు. రూపంతో కంటికి ముందెప్పుడో కనబడ బోయే వానిని అప్పుడే సంగీతంద్వారా చూడగలిగేది. ఆమె హృదయం ఈవిధంగా నిగూఢానందంతో పరిపూర్ణతపొంది ఉన్నప్పుడు, తనకు నచ్చిన ఉత్తమపురుషుడెవడైనా భాగ్య వశాత్ ఆమెకుకనబడి ఉండినట్లైతే ఆమె సంగీతం ఆక్షణమే రూపంధరించి సజీవిఅయిఉండును. కాని పథికుడెవడూ ఆమె ద్వారంఎదుటకువచ్చి నిలవలేదు, ఊహా కుంజగృహంలో ఆమె ఒంటరిగా కూర్చొనిఉండెను. ఆ స్వప్నాలలో తనతోటి స్నేహితు రాలు ఒక్కతెలేదు. కనుకనే ఇన్నాళ్లూ ఆమె నిరుద్ధప్రేమ శ్యామసుందరుని పాదాలదగ్గర పూజాపుష్పాలయి నిరుద్దిష్ట

ప్రియుని వెదుకుతుండెను. ఘటకుడు వచ్చి వివాహ ప్రస్తావం చెయ్యగానే దేవుని ఆజ్ఞ తెలుసుకోగోరి, "నేను కోరుతుండేవి నీవే" అని అన్నది; "నీకు దొరికినది నేనే," అని ఆ అపరాజిత పుష్పం అన్నది.

మనస్సులో ఇన్నాళ్లబట్టి జరుగుతున్న ప్రయత్నమంతా వృథాఅయింది. ఛనేలున కింద రాయితగిలింది, నిండు ఓడ అడుగుపగిలి ఒక్కనిమిషంలో మునిగిపోయింది. వ్యథతో నిండిన యవ్వనము తన పుష్పసంపదను ఎవరికి అర్పించదగునో అని తిరిగి వెదకడం మొదలుపెట్టింది. పళ్లెములో ఉన్న అర్ఘ్యము బరువెక్కి పోయింది—మోయలేకపోవడంచేత తన శక్తిఅంతటినీ ప్రయోగించి ఇవాళ పాట ప్రారంభించింది.—

"మోరె గిరిధర గోపాల ఔర్ నహిఁ కోహీ,"

కాని ఆ పాట ఇవాళ ఎక్కడికీ చేరక శూన్యంలోనే తిరుగుతున్నది. ఆశూన్యతే కుము మనస్సును నింపింది. నేటి నుండి బ్రతికిఉన్నన్నాళ్లు తనహృదయంలోఉన్న గాఢ ఆకాంక్ష ఆ పొగచుట్లవలె శూన్యతలోనికి ఊదబడుతూ ఉంటుంది కాబోలు!

మోతీతల్లి వెనుకను, దూరాన, కూర్చుండి పోయింది; ఆ నిర్జనంగాఉన్న డాబామీద, ఆ నిర్మల ప్రభాతకాంతిలో ఎట్టి ముస్తాబూలేకుండా కూర్చుండిఉన్న ఆ సుందరి కంట పడగానే ఆమెకు అమితాశ్చర్యం కలిగింది. ఈ ఇంట్లో

కుముదుని ఎట్లా ఉండగలదు? ఆమెకుతగినదేదీ ఈ ఇంట్లో లేదే! ఆమె దేజాతి ఈ ఆ ఇంటివారి దేజాతి? వాళ్లు తమంతట తామే ఆమెదగ్గరనుండి వేరుపడిపోతున్నారు, ఆమెమీద కోపగిస్తున్నారు. కాని ఆమెతో స్నేహంచెయ్యడానికిమాత్రం సాహసించలేకుండా ఉన్నారు.

కూర్చొని ఉండిఉండి కుము రెండుచేతులతో దుప్పటి చెంగు పట్టుకొని కళ్లనొత్తుకొని వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించింది, మోతీతల్లి ఇదిచూచి మరి సహించి ఉండలేక దగ్గిరికి వచ్చి కుమును రెండుచేతులతో కౌగలించుకొని, "ఎందుకు నీకు అంతకష్టంగా ఉందో నాతో చెప్పుఅక్కా, బంగారు తల్లివి!" అని వేడుకున్నది.

కుము చాలాసేపటివరకు మాటాడలేక పోయింది. చివరకు కొంచెము సరుదుకొని, "ఇవాళకూడా అన్నయ్య దగ్గిరనుంచి ఉత్తరం రాలేదు, అన్నయ్య ఒంట్లో ఏలాగు ఉన్నదో తెలియలేదు," అని అన్నది.

"ఉత్తరం వచ్చేరోజు అయిందా అక్కా?"

"ఆహా, అయింది. నేను వచ్చేసరికి అన్నయ్య ఒంట్లో ఏమీ బాగులేదు, అతని దగ్గరనుంచి ఎప్పుడు కబురు వస్తుందా అని కనిపెట్టుకొని ఉంటానని అన్నయ్య ఎరుగును."

"నీవు ఏడుస్తూ కూర్చోకు అక్కా, కబురు తెప్పించే ఉపాయం ఒకటి కనిపెడతాను," అని మోతీతల్లి అన్నది.

టెలిగ్రాం ఇద్దామని కుముకు బుద్ధిపుట్టింది అనేకసార్లు, కాని టెలిగ్రాం ఎవరిద్వారా పంపగలదు? అవాళ మధుసూదన్ 'నేను మీా అన్నగారికి అప్పిచ్చిన వడ్డీ-వ్యాపరస్థుడను,' అని అంటూ బడాయి కొట్టాడు, ఆనాటినుంచి మధుసూదనుని ముందర అన్నమాట ఎత్తలేకపోయింది. కాని ఇప్పుడు మోతీతల్లితో, "నా పేరను అన్నయ్యకు టెలిగ్రాం నీవు పంపగలిగితే, నాకు ప్రాణం ఇచ్చినదానవు అవుతావు," అని అన్నది.

"పంపిస్తాను భయపడకు," అని మోతీతల్లి అన్నది.

"నాదగ్గిర ఒక్కరూపాయైనా లేదు, నీవెరుగుదువు," అన్నది కుము.

"నీమాటలకు అర్థంలేదు అక్కా. నీరూపాయలు నాదగ్గిర ఉన్నవి, ఖర్చుచేస్తున్నవి నీరూపాయలుకావా? నేను తింటున్నది నీడబ్బుకాదా?"

జోరుగా తల ఆడిస్తూ కుము జబాబు చెప్పింది—" "కాదు కాదు, ఎన్నటికీ కానేరదు, ఈ ఇంట్లోది ఒక దమ్మిడీ అయినా నాదికాదు."

"సరే ఆలాగైతే నా రూపాయతో టెలిగ్రాం ఇప్పిస్తాను......మాటాడకుండా ఊరుకున్నావేమి అక్కా? నేను బడాయికని ఇచ్చినట్టైతే నీవు పౌరుషంకొద్దీ పుచ్చుకోక పోయినా బాగుంటుంది కాని నేను కేవలం ప్రేమకొలదీ ఇచ్చినప్పుడు నీవు ప్రేమతో పుచ్చుకో అక్కరలేదూ?"

"పుచ్చుకుంటాను," అన్నది కుసుమ.

"నీ పడకగది ఇవాళకూడా ఖాళీగానే ఉంటుందా అక్కా—?" అని కుసుమను అడిగింది.

"అందులో నాకు స్థానంలేదు," అని కుసుమ అన్నది.

మోతీతల్లి కుసుమను బ్రతిమాలలేదు—ఆపని ఎవరు చేయవలసినవిధో అతనే చెయ్యనీ అని తనలో తాననుకొని, "నీకోసం కొంచెము పాలు తెచ్చిస్తాను," అన్నది.

"ఇప్పుడు కాదు, కాస్సేపు పోనీ," అన్నది కుసుమ—తన హృదయంలో ఉన్న దేవత సలహాతీసుకొని రావాలి—దేవత తన అభిప్రాయం ఇంకా తెలియపరచలేదు.

మోతీతల్లి తన గదిలోకి వెళ్లి నవీన్‌ను పిలిపించి ఇట్లా అన్నది: "బావగారి గదిలో టేబిల్ మీాద పెద్ద తోటికోడల పేర వచ్చిన ఉత్తర మేదైనా ఉంటే తీసుకురావాలి; టేబిల్ మీాద లేకపోతే సొరుగులోకూడా చూడాలి."

"కొంపతీశావే!" అన్నాడు నవీన్.

"నీవు వెళ్లకపోతే నేనే వెళ్లుతాను."

"పొదలోనున్న ఎలుగుబంటి పిల్లను తీసుకు రమ్మన్నట్టే ఉన్నది నువ్వు చెప్పేది!"

"బావగారు ఆఫీసుకు వెళ్లారు, వచ్చేటప్పటికి ఒంటి ఘంట దాటుతుంది, ఈలోగా—"

"చూడు పిల్లా, పగటిపూట ఇట్లాంటిపని నాకు సాధ్యం కాదు, అన్నివైపులా మనుష్యులు—చీకటి పడ్డాక ప్రయత్నం చేసి ఏమయినదీ నీకు కబురు చెప్తాను."

"సరే మంచివాడవే, కాని ఇప్పుడే నూర్‌నగర్ టెలిగ్రాం పంపి అక్క అన్నయ్యగారి ఒంట్లో ఏలాగు ఉన్నదీ జవాబు తెప్పించాలి."

"అన్నయ్యచేత టెలిగ్రాం ఇప్పించాలి, అంతేనా?"

"కాదు."

"నీవు ఎంతకైనా సాహసిస్తున్నట్టున్నావే! ఈ ఇంట్లో బల్లి ఈగను పట్టుకోలేదు అన్నయ్య ఆజ్ఞలేనిదే, అట్లాంటప్పుడు నీవు నన్ను—"

"అక్క పేరితో టెలిగ్రాం వెళ్లుతుంది, దానికి నీకు ఎందుకూ భయం?"

"కాని పంపడం నా ద్వారానే కదా!"

"బావగారి ఆఫీసునుంచి రోజూ ఎన్నో టెలిగ్రాములు వెళ్లుతూ ఉంటవి, వాటితోపాటు ఇదీ పంపేయి, ఇదిగో రూపాయ అక్క ఇచ్చింది.

కుము అవస్థ చూచి నవీన్‌కు కూడా ఎంతో దుఃఖం కలిగి ఉండకపోతే, ఇంత సాహసకృత్యం ఎన్నడు చేయ పూనుకోడు.

౨౯

మామూలుప్రకారం మధుసూదన్ ఒంటిఘంట అయిన తరువాత భోజనానికని అంతఃపురంలోకి వచ్చాడు. యథా ప్రకారం ఆడవాళ్లలో ఒకరు విసనకర్రపట్టుకొని విసురుతున్నారు, ఒకరు వడ్డిస్తున్నారు, మరిఒకరు ఈగలు తోలుతున్నారు. ఈ రాజాంతఃపురంలో ఐశ్వర్యంగాని ఆడంబరంగాని లేదని అందరూ ఎరిగిన విషయమే. మధుసూదనుని భోజనం పూర్వంమోస్తరుగానే నడుస్తున్నది. ముతక బియ్యపు అన్నం ఉంటేనేగాని నోటికిరుచిగా ఉండేదికాదు, కడుపు నిండేదికాదు, కాని తినేపాత్రలు మొదలైనవి ఖరీదు గలవి—వెండి కూరగిన్నెలు, వెండిగ్లాసు. సాధారణంగా అతను తినేది కందిపప్పు, చేపలపులుసు, చిక్కని చింతపండుపులుసు, ఇగురుకూర; చివరకు, పెద్దగ్లాసుతో గ్లాసుడు పాలు, పంచదార వేసుకొని, ఒక్కచుక్కైనా మిగల్చకుండా, తాగేవాడు; అంతా అయినతరువాత తాంబూలం వేసుకొని, బీడాలడబ్బీలో నాలుగు బీడాలు ఉంచుకొని, పావుఘంటసేపు గుడుగుడు పీలుస్తూ విశ్రమించి, తత్‌క్షణమే ఆఫీసుకు వెళ్ళిపోయేవాడు, మొదటి బీదఅవస్థ వదిలి చాలాకాలం అయింది కాని అతని పద్ధతులలోను అలవాట్లలోను మార్పురాలేదు. అతనికి ఆకలి ఉండేది కాని తిండిపోతుకాడతను.

శ్యామాసుందరి పాలల్లో చీనీ కలిపి ఇస్తున్నది. చామనచాయ, లావు అని చెప్పదగిన ఒళ్లుకాదు, కాని తనను

తాను చాటించే పరిపూర్ణతవంటి తీరు ఉన్నది. ఒంటిని తెల్లచీర ఒక్కటి తప్ప ఇంకేమీ ఉండేది కాదు, కాని చీర ఒళ్లంతా కప్పే ఉండేది. యౌవనం దాటిపోతున్నది, కాని ఆమెను జ్యేష్ఠ మాసపు అపరాహ్ణంతో సరిపోల్చవచ్చును—సాయంకాలం అయిపోతుంటుంది, అయినా చీకటి పడదు. దట్టమైన కనుబొమ్మల కింద తీక్ష్ణమైన నల్లనికళ్లు—ఎదుటనుండేవాళ్లను చూస్తున్నట్టుగా ఉండేదే కాదు, కాని ఏ కాస్త చూచేదో దానిద్వారా అంతా గ్రహించేది. ఆమె నిండుపెదవులధోరణి చూస్తే చెప్ప దగినదెంతో అణిచి ఉంచుకుంటున్నదని తోచేది. సంసారంలో ఆమెకు లభించిన రసం అతిస్వల్పం, కాని ఎల్లప్పుడూ రసభరితమై ఉండేది. తనలో విలువ ఉన్నదని తానెరుగును, ఆమెలో లుబ్ధత్వం లేదు. ఆమె ఈయగల మహాదానం విని యోగపడ లేదని పౌరుషం కలిగి నలుగురినీ నిరసనగా చూచేది. మధుసూదనుకు ఐశ్వర్యప్రాప్తీ, శ్యామా ఈ ఇంటికి రావడమూ—రెండూ ఒకేసారే జరిగినది. యౌవనమంత్రశక్తి ద్వారా సంసారశిఖరం మీదికి ఎక్కగలనని ఆమె ఆశించింది. మధుసూదనుని మనస్సు ఎన్నడూ విచలితం కాలేదని చెప్పలేము కూడాను—కాని అతడు పరాజితుడు కాలేదు. దీనికి కారణం లేకపోలేదు—మధుసూదనుని ధనార్జనబుద్ధి కేవలం బుద్ధిమాత్రమే కాదు, అది ఒక ప్రతిభ. ఈప్రతిభాబలంవల్లనే అతను సంపదను సృష్టించాడు, ఆ సృష్టించడమనే పరమానందంలోనే ఎల్లప్పుడూ నిమగ్నుడై ఉండేవాడు. ధనసృష్టి అనే ఏతపస్సులో

మధుసూధన్ నిమగ్నుడై ఉన్నాడో, దేవేంద్రుడు ఆతపస్సుకు భంగంకలిగించ ప్రయత్నిస్తున్నాడని అతను తన ప్రతిభమూలం గానే స్పష్టంగా చూడగలిగాడు. మాటిమాటికి తపోభంగం కలిగేటట్టు కనబడ్డది, కాని విఘ్నాలను అతను నివారించగలిగాడు—పనితో నిండిఉన్న దినమధ్యభాగంలో మనకు తీరిక ఉండనట్టుగానే మధుసూదన్‌కు ఆరోజులలో ఏమీ తీరిక ఉండేది కాదు. ఇతని తపస్సుకు భంగంకలగక పోవడానికి అదే ముఖ్య కారణం. కఠినపరిశ్రమ మధ్యను అప్పుడప్పు శ్యామాసుందరి మధుసూదనుకు ఏకాంతంలో కంటపడేది, ఆమెమాటలు అతని చెవిని పడేవి. వీటివల్ల అతని క్లాంతి తగ్గుతుండేది కొంతవరకు. పండగాపర్వం వచ్చినప్పుడు పనిపాటుల భారం శ్యామాసుందరి మీద వదిలేవాడు, కాని అంతఃపురంలో ఆమె అధికారం పెరిగేటంత చనువు ఆమెకు అతనెన్నడూ ఇయ్యలేదు. మధుసూధన్‌లో తాను రేపుతండే ఆకర్షణను గురించి శ్యామాసుందరి బాగా ఎరుగును, ఐనా ఆమెలో భయంమాత్రం పోలేదు.

మధుసూదన్ భోజనసమయంలో శ్యామ రోజూ దగ్గర ఉండేది; ఇవాళకూడా ఉన్నది. అప్పుడే స్నానంచేసి వచ్చింది అతి నల్లగా పొడవుగాఉండే ఆమెజుట్టు వీపుమీద విరబోసి ఉన్నది, తెల్లని చీరచెంగు తలమీదికి లాగి ఉన్నది. జుట్టుకు రాసిన నూనెయొక్క సువాసన కొంచెముకొంచెము వస్తున్నది. మధుసూధన్‌కోసం పాలలో పంచదార కలుపుతూ, తల

ఎత్తుకుండానే, "తోటకోడలిని పిలిచేదా అబ్బాయి?" అని అడిగింది.

మధుసూదన్ జవాబియ్యక వదినగారివంక గంభీరంగా చూచాడు. శ్యామాసుందరి తడబడుతూ, ప్రశ్నను వ్యాఖ్యానిస్తూ, "నీవు భోజనంచేస్తున్నప్పుడు తోటికోడలు దగ్గరఉంటే బాగుండును—నీకు సేవచేదామని—" అంటూ తిరిగి ప్రారంభించింది.

కాని అతను ఏమనుకొంటున్నది అతని ముఖాన్నిపట్టి పోల్చుకోలేక ఊరుకొన్నది. మధుసూదన్ తిరిగి తలదించుకొని భోజనం చేస్తున్నాడు.

మరి కొంచెంసేపైన తరువాత, "తోటికోడ లెక్కడ?" అని అడిగాడు.

గడబడపడుతూ, "చూచి వస్తాన"ని ఆమె జవాబు చెప్పింది.

మధుసూదన్ ముఖం చిట్లించి, 'వద్దు' అని చేతితో సంజ్ఞచేశాడు, ఆప్రశ్నకు తానాశించిన జవాబు ఆమెనోటివెంట వస్తే సహించలేదు, అయినా మిక్కిలి కుతూహలంగా మాత్రం ఉన్నది. భోజనంచేసి మూడోఅంతస్తుమీదికి వచ్చాడు, మనస్సులో, ఏమూలనో, కొంచెము ఆశ ఉండెను—ఒకమారు డాబామీదికి వచ్చాడు, ప్రక్కనున్న స్నానాలగదిలోకి వచ్చి కొంచెంసేపు అక్కడనిలబడి గదిలోకి తిరిగివచ్చి మంచంమీద పడుకొని గుడుగుడు పీల్చాడు. తన మామూలు పావుఘంట

అయింది, ఇరవై నిమిషా లయింది, ఆఖరికి అరఘంటకూడా అయేటప్పటికి జేబులోనుంచి వాచి తీసి వేళ చూచాడు. సంవత్సరంతరువాత సంవత్సరం గడుస్తున్నది, కాని ఇప్పటివరకు ఎన్నడూ ఆఫీసువెళ్లడం అయిదునిమిషాలైనా ఆలస్యం కానియ్య లేదు. ఆఫీసులో ఒక రెజిష్టర్ ఉన్నది, దానిలో ఎవరు ఎంత వేళకు వచ్చినది వ్రాస్తుండాలి, దాన్నిపట్టి నెలాఖరికి జీతం హెచ్చడం తగ్గడం జరుగుతుంటుంది. ఆలస్యంగా వచ్చినందుకు జరిమానాపడడం అందరికంటె మధుసూదనుకే తక్కువ, ఈ విషయంలో మధుసూదనుకు తనయెడల పక్షపాతం లేక పోవడమే కాకుండా, తాను ఆలస్యంగా వచ్చినప్పుడల్లా మిగతా ఉద్యోగస్థుల దగ్గరనుంచి రాబట్టిన దానికి రెండింతలు జరిమానా తన దగ్గరనుంచి రాబట్టుకొనేవాడు. ఇవాళ బాగా ఆలస్యం అయిపోయింది, 'ఇవాళ ఆఫీసుపని ముగించి అంతా ఇంటికి వెళ్లిపోయిన తరువాతకూడా తాను ఆఫీసుపని చేసి కంపెనీనష్టం దిద్దుతాను' అని తనలోతాను నిశ్చయించుకొన్నాడు. ఘంటలు నడచిపోతున్నవి, కాని అతని మనస్సు పనిమీదికి పోవడమే లేదు—అంతేకాదు ఇవాళ ఒక అరఘంటముందుగానే ఆఫీసు వదిలి ఇంటికి వచ్చేశాడు, ఇంటికి తిరిగివచ్చి పడకగదిలోకి పరుగెత్తుకు వెళ్లవలెనని వెర్రికోరిక పుట్టింది—గదిలో బహుశా ఒకరు కనబడవచ్చు. అతను పగటిపూట పడకగదిలోకి ఎన్నడూ వచ్చేవాడుకాడు, ఇవాళ ఆఫీసు దుస్తులతోనే అంతఃపురంలోకి వచ్చాడు.

మోతీతల్లి సరిగా అప్పుడే డాబామీద, ఎండలో, మాగాయిఒరుగు బుట్టలోకి ఎత్తుతున్నది, మధుసూదన్ వేళ కానివేళ పడకగదిలోకి రావడంచూచి, ముసుగు మూరెడు కిందికి లాగుకొని తనలోతాను నవ్వుకొన్నది. ఈలాగు మరదలికి దొరికిపోయి మధుసూదన్ మిక్కిలి సిగ్గుపడ్డాడు, చీకాకు పడ్డాడు. అతి నిశ్శబ్దంగా పడకగదిలో ప్రవేశిద్దామని నిశ్చయించుకు వచ్చాడు, ఏమాత్రం శబ్దం అయినా పిరికిలేడిపిల్ల పారిపోతుందని సంకోచిస్తూవచ్చాడు, కాని అనుకున్నట్టు జరగలేదు, వింతగా తనవైపుచూస్తున్న దృష్టులను తప్పించుకు పోవలెనని తొందరతొందరగా చప్పుడు చేసుకొంటూ గదిలో దూరవలసివచ్చింది. ఆఫీసునుండి పారిపోవడం వృథా అయిపోయింది. గదిలో అప్పుడు ఎవరూ లేకపోవడం సరేకదా, ఉదయంనుంచి ఎవరూ ఆగదిలోకి వచ్చిన చిహ్నా ఒక్కటైనా కనబడలేదు. ఓర్చి ఉండలేకపోయినాడు. తాను బావగారు— ఇప్పటివరకు మరదలితో ఒక్కమారైనా మాట్లాడలేదు; అయినా కుమును గురించి ఆమెను అడుగుదామని అతని మనస్సు కొట్టుకుంటున్నది, ఆమెతో మాట్లాడదామని బయటికి వచ్చాడు, కాని ఆలోగా మోతీతల్లి మేడదిగి వెళ్లిపోయింది.

ఆటువంటి సమయంలో ఏమీ పనిలేకుండా పడకగదిలో కాలయాపన చేస్తూఉండడం సిగ్గైనపని. ఆమాట మరిచి

పోదామని మధుసూదన్ గబగబ బయటికి వచ్చాడు. ఏదో జరూరుపని ఉన్నట్టు నటిస్తూ అక్కడ టేబిల్‌మీద నున్న పెద్ద నోటుబుక్కును, ముఖముదగ్గిర పెట్టి, తనిఖీ చేయడం ప్రారంభించాడు. ఎప్పుడోగాని అతను అది చూడడు, ఆఫీస్ హెడ్-గుమాస్తా చూస్తూ ఉంటాడు. ఎవరు ఏమి అనుకుంటారో అనే భయంకొద్ది ఇవాళ దాన్నిచూస్తూ కూర్చున్నాడు. ఇంటికి వచ్చిన ఉత్తరాలు టెలిగ్రాములు, ఇంటినుంచి వెళ్లినవి, ఎవరు పంపినదీ, ఎవరిపేర పంపినదీ, రోజూ, ఘంటా— మొదలైన వివరాలన్నీ ఆ బుక్కులో ఉంటవి. బుక్కు తెరుస్తూనే నేటి తేదిని పంపిన టెలిగ్రాములలో విప్రదాసుపేరు కనబడ్డది, పంపినది రాణి.

"దర్వాన్‌ను పిలు."

దర్వాన్ వచ్చాడు.

"ఈ టెలిగ్రాం నీచేతికి ఎవరిచ్చారు?"

"తమ్ముడుగారు."

"తమ్ముడు గారిని పిలు."

తమ్ముడు వచ్చాడు—ముఖం తెల్లబారిపోయింది.

"నా సెలవులేనిదే ఆ టెలిగ్రాం పంపమని నీకెవరు చెప్పారు?" చెప్పినవారిపేరు ఇంటి యజమానిఎదుట చెప్పడం సులభమైన పనికాదు, ఏమి చెప్పడమో తెలియక కంగారు పడుతున్నాడు తమ్ముడు. ఆ శీతకాలపు సాయంకాలం-వేళనుకూడా భయంవల్ల తమ్ముని ఒంటినిండా చెమట కమ్మేసింది.

నవీన్ జవాబు చెప్పకపోవడం చూచి, "చిన్నకోడలేనా ?" అని అడిగాడు. నోరువిప్పక తలవాల్చుకు నిలబడ్డాడు నవీన్, దానివల్ల అతని జవాబు స్పష్టం అయింది. మధుసూదనుని ఒంట్లోని రక్తమంతా బుర్రలో కెక్కిపోయింది, ముఖం ఎర్రగా అయిపోయింది—కోపంవల్ల ఒక్క మాట రాలేదు నోటిలోనుండి, నవీన్‌ను బయటికి వెళ్ళమని చేతితో జోరుగా సంజ్ఞ చేసి, గదిలోకి వచ్చి ఒక మూలనుంచి మరిఒకమూలకు వడిగా పచారిచేయడం మొదలుపెట్టాడు.

## ౩౦

నవీన్ ముఖం వాడిపోయింది, భార్యదగ్గిరికి వచ్చి, "మన పని సరి !" అన్నాడు.

"ఏమిటి సమాచారం ?"

"మూటా ముల్లే కట్టుకొని సిద్ధంగా ఉండవలసిందే ఇక."

"నీ బుద్ధిమీద ఆధారపడి అన్నీ ఇవాళ కడితే రేపు మళ్ళీ అన్నీ విప్పాలి. జరిగినదేమిటి—అన్నగారు కోపగించారు—అంతేనా ?"

"అతనిసంగతి నేను బాగా ఎరుగుదును, ఈసారి ఇక్కడ నుంచి బసను ఎత్తమంటాడు."

"పద, అయితే, అంత ఆలోచన ఎందుకు ? ఇక్కడ నుంచి వెళ్ళిపోతే చచ్చిపోతామని భయపడక్కర లేదు."

"నన్ను కూడా కలుపుతున్నావెందుకు? ఈసారి భార్యను ఇంటికి పంపేయమని ఆజ్ఞ ఔతుంది."

"ఆ ఆజ్ఞ నీవు పాలించలేవు, నాకు తెలుసును."

"ఎట్లాగు తెలుసును ?"

"నే నొక్కదాననే కాదు, ఇంట్లోవాళ్లందరూ ఎరిగినదే, నీవు భార్యను వదలి ఒక్కక్షణం ఉండలేవని. మగవాడై ఉండి కూడా ఎల్లప్పుడూ ఎవడైనా ఆడవాళ్ల వెంబడి ఎట్లా తిరుగుతుంటాడో ఇప్పటి వరకు మీ అన్నయ్యకు బోధపడలేదు, ఇక బోధ పడుతుంది."

"దాని అర్థ మేమిటి ?"

"ఆ రోగం మీవంశంలో ఉన్నది—మీ అన్నయ్య స్వభావం ఇప్పటివరకు బయలుపడలేదు; అది ఇన్నాళ్లూ లోలోపున పోగై ఉన్నది గనుక దానిబలం మరీ అధికంగా ఉంటుంది. సంసారమంతా మరిచిపోయి ఇప్పటి వరకు రూపాయలమూటను ఎంత గట్టిగా పట్టుకుకూర్చున్నాడో ఇక భార్యనుకూడా అంతగట్టిగా పట్టుకు కూర్చుంటాడు—నేను చెప్పాను చూస్తూ ఉండు."

"సరే, అన్నగారు భార్యను పట్టుకు కూర్చుంటారు, రాత్రింబగళ్లు, మరి తమ్ముడుగారిగతి ఏమిటి ?"

"ఆ భారం నామీద వదిలిపెట్టి, నేనిప్పుడు చెప్పేది చెయ్యి—అన్నయ్యగారి గదిలోకివెళ్ళి అతని అతని సొరుగు వెదికి రావాలి."

"నన్ను రక్షించాలి, పాముపుట్టలో చెయ్యి పెట్టమని నీవు చెప్పావంటే పెట్టగలను గాని అన్నయ్య సొరుగులో చెయ్యి పెట్టడం నాతరంకాదు."

"పుట్టలో పెట్టవలసివస్తే నేనే పెట్టిఉందును కాని సొరుగు వెదకడం నీవుచేయక తీరదు. ఇంటి ఉత్తరాలేవీ ముందు అతనికి చూపించనిదే ఎవరికీ ఇయ్యకూడదని అతని ఆజ్ఞ—నీ వెరుగుదువు. అక్కపేర ఉత్తరం వచ్చిఉండాలని నా నమ్మకం."

"నా మనస్సు కూడా అలాగే అంటున్నది, కాని ఇంకొకటి కూడా అంటున్నది నా మనస్సు—'ఆ ఉత్తరానికి నీ చెయ్యి తగిలితేమాత్రం నీమీద ఏడు సంవత్సరాల కఠిన ఉరిశిక్ష విధించబడుతుంది,' అని"

"ఉత్తరం తీసుకురా అక్కరలేదు, ఉత్తరం వచ్చిందేమో, చూచిమాత్రం రావాలి."

నవీన్‌కు భార్యయెడలగల భక్తి మిక్కిలి గాఢమైనది-తాను ఆమెకు భర్తఅయిఉండే యోగ్యత తనలో లేదనికూడా అతని నమ్మకము. కనుక ఎంత భయంవేస్తూన్నా ఆ అసాధ్యకార్యం నెరవేర్చుకు రావలెనని అతనితో ఉత్సాహం కలిగింది.

నవీన్ ఆరాత్రే వచ్చి కుముపేరను ఉత్తరమొకటీ, ఒక టెలిగ్రామూ వచ్చిఉన్నవని భార్యతో చెప్పాడు.

భర్త అవమానం చేయడంవల్ల బాధ కలిగి పడకగదిలో నుంచి వచ్చి కుసుమ దాసీ-పని ప్రారంభించింది, ఆ బాధ మొదట అంత తీవ్రంగాలేదు కాని తరువాత మనస్సంతా చింతతో ఛాయాక్రాంతమయి ఉన్నది. శాశ్వతకాలము ఈ పనిచేస్తూ ఎట్లా ఉండగలదు ? కాని ఏదోపని లేకుండామాత్రం ఏలా ఉండగలదు? మరణకాలంవరకు దేనితోనూ ఎట్టిసంబంధమూ లేకుండా ఉండడం సాధ్యం కాదే !

గదిలోకూర్చొని ఇదే ఆలోచిస్తున్నది, తలుపులుమూసి ఉన్నవి. వరండాలో ఒకచివరను ఉన్నది ఆ గది. వరండాకు కర్రకటకటాలు ఉన్నవి. గోడలకు కొట్టిన కొయ్యలమీద బల్లలఅంతస్తులు ఏర్పరచబడిఉన్నవి. వీటిమీదనే దీపాల సరంజామంతా పేర్చిఉన్నది. మీదినుండి క్రిందిదాకా, గది అంతా చమురుజిడ్డుతో బంకబంకగా ఉన్నది. కొవ్వొత్తి ప్యాకెట్ మీదనుండే బొమ్మలను కత్తిరించి, వాటిని గోడలకు అంటించి నౌకర్లు తమ కళాపిపాసను తృప్తిపరుచు కొన్నారు. చీనారేకు డబ్బాతో ఒకమూలను సుద్దగుండ ఉన్నది, దానిప్రక్కను చిన్నబుట్టలో చింతపండు కొంచెము, ఆప్రక్కనే మురికి గుడ్డముక్కలు ఉన్నవి. వరసమీద వరస కెరసనాయిల్ డబ్బాలున్నవి—రెండోమూడోతప్ప అవిఅన్నీ ఖాళీడబ్బాలే.

కుసుమ ఇవాళ ఉదయంనుంచి దీపాలు బాగుచేస్తూనే కూర్చున్నది; ఏమీ చేతకాకుండా ఉన్నది. మోతీతల్లి కొట్టు

గదిలోనుంచి వంటకు కావలసినవన్నీ ఇచ్చి, దీపాలగదిలోకి తొంగి చూచింది. కర్మతపస్సులో మునిగిఉన్న కుముపడుతున్న బాధ పోల్చుకున్నది. పటుత్వంలేని వస్తువులు రెండుమూడు విరిగిపోవడానికి సిద్ధంగా ఉన్నవని మోతీతల్లి కనిపెట్టింది. ఎంత చిన్నవస్తువైనా సరే, కనబడకపోయినా లేక విరిగిపోయినా, నిర్లక్ష్యంగా ఊరుకోవలసిన ఇల్లుకాదు ఇది, అని ఆమె ఎరుగును; కనుక ఊరుకోలేక, "నాపని అయిపోయింది, పనిలేక వచ్చాను, అక్కకు సాయంచేస్తే కొంచెం పుణ్యమైనావస్తుందని" అని ఆమె అన్నది. అంటూ గాజుచిమ్నీలబుట్టను దగ్గిరికి లాగుకొని తానే తుడవడం ప్రారంభించింది.

'వద్దు' అనడానికి కుముకు పౌరుషం మరి లేకపోయింది. ఇప్పటికి అప్పుడే తన అసామర్థ్యము పూర్తిగా తెలుసుకొన్నది. మోతీతల్లి సాయం చేయబట్టి బ్రతికాను అనుకొన్నది కుము. కాని మోతీతల్లిదికూడా చేతకాని నేర్పరితనమే. అన్ని దీపాలకు వత్తులుపేనడం ఆమెకూ సాధ్యంకానిపని, దీపాలు బాగుచేయించడమూ, లెక్కప్రకారం చమురు ఇస్తుండడమూ—అంతా ఆమెచేతిమీద జరగవలసినదే, కాని నేటివరకు ఎన్నడూ తనచేతితో తాను ఒకవత్తి పేని ఎరగదు. కనుక ముసలినౌకరు 'బంకును పిలుస్తా' నన్నది.

చేతకాదని కుము ఒప్పుకోవలసివచ్చింది. బంకును పిలిచారు, నాలుగునిమిషాల్లో పనిఅంతా అయిపోయింది. చీకటిపడకముందే గది కొక దీపంచొప్పున ఉంచిరావడం మామూలు,

ఈపని చేయడానికి యథాప్రకారం తాను రావలసిఉంటుందా అని బంకు అడిగాడు. బంకు అమాయకుడే, కాని ఆప్రశ్నలో కొంత ధ్వని ఉండవచ్చునేమో!—కుము ముఖ మెర్రచేసుకొన్నది.

కుము జవాబుచెప్పకముందే మోతీతల్లి, "రాకపోతే ఎలా?" అని అన్నది. తాను పనిచేయబోవడం పనికి అడ్డురావడం తప్ప మరేమీ కాదని కుముకు బాగా బోధపడిపోయింది.

## 3౧

మధ్యాహ్నభోజనానంతరం కుముగదితలుపులు బిగించుకొని మనస్సులో ఎన్నడూ కోపాగ్నిని రగలనీయనని తనలో తాను శపథం చేస్తుండెను. మనస్సును స్థిమితపరుచుకోడానికి ఆ రోజంతా పడుతుందని ఆమె అనుకొన్నది. భగవంతుని ఆశీర్వాదం తీసుకొని మర్నాటినుండి వాస్తవమైనగృహస్థధర్మంలో నడవడం ప్రారంభిస్తాను అని నిశ్చయించుకొన్నది. ఈ ప్రయత్నంలో అన్నిటికంటె సాహాయ్యకరమైనది అన్నగారి స్మృతి—మితిలేని ఓర్పుఉన్నది అతనిలో, అతని ముఖంలో వ్యక్తిమాతుండే విషాదఛాయ అతనిఘనతను తెలియచేస్తున్నది. ఆరోజులలో పెద్దచదువు నేర్చినవారందరి మాదిరి అతను కూడా *పాజిటివిజమ్ అనేధర్మం అవలంభించాడు. ఆ మతస్థులు భగవంతుని బయటినుండి చేతులతో ప్రణామంచేయరు. భగవంతుడు వాళ్ల జీవనాలను పూర్తిగా నింపిఉంటాడు,

* Positivism.

వాళ్లు చేసే ప్రతికార్యంలో భగవంతుని ఇచ్ఛ సువ్యక్తం అవుతుంటుంది.

సాయంకాలం బంకువచ్చి తలుపుకొట్టగానే కుము తలుపు తీసి బయటికి వచ్చింది, మోతీతల్లిదగ్గిరికి వచ్చి రాత్రి భోజనంచేయనని చెప్పింది—మనస్సును పరిశుభ్రపరచుకోడానికి ఉపవాసం ఒకసాధన. మోతీతల్లి కుమునుచూచి ఆశ్చర్యపోయింది, ఆమె ముఖంలోనూ కళ్లల్లోనూ ప్రశాంతమైన కాంతి కనబడుతుండెను—అప్పుడే తీర్థస్నానమూ పూజా ముగించి వచ్చినట్లు కనబడుతుండెను. అంతర్యామి ఆమె దుఃఖాన్ని తీసుకొన్నదా అన్నట్లుండెను, పూజచేసిన పువ్వులు తన మనస్సులో దాచి తెచ్చుకొన్నదా అన్నట్లుండెను, ఆ పూల సువాసనే కుమును ఆవరించి ఉన్నదన్నట్లు మోతీతల్లికి తోచింది. కనుక కుము ఉపవాసంఉంటానని చెప్పినప్పుడు, దుఃఖంకొద్దీ ఆమె తననుతాను బాధపెట్టుకొందామని ఉపవాసం చేస్తుండలేదని బోధపరుచుకొని, మోతీతల్లి ఆమెకు అడ్డు రాలేదు.

కుము దేవుని విగ్రహాన్ని మనస్సులో ఉంచుకొని డాబామీదికి వెళ్ళి ఒకమూలను కూర్చున్నది. ఇంత తీవ్రమైన దుఃఖం కలగబట్టే దేవుడు తనకు అంత దగ్గరగా వచ్చాడని ఆమెకు నమ్మకం కలిగింది. లోపల కనబడుతున్న ఈశ్వర తేజస్సుపై మనస్సును నిలిపి చేతులుజోడించి ప్రార్థనచేసింది—

"ఇక నెన్నడూ నన్ను విడిచిపెట్టకు, నన్ను నీచిత్తం వచ్చినంత ఏడ్పించు, కాని నన్ను నీదానిగా చేసుకో."

శీతకాలపు రోజులు; చూస్తూ ఉండగానే చీకటి కమ్ముకు వచ్చింది. ధూళీ, మంచూ, ఫ్యాక్టరీపొగా—అన్నీ కలిసి స్వచ్ఛమైన సంధ్యయొక్క గంభీర తిమిర మహిమను వివర్ణం చేసినవి. ఆకాశాన అన్ని దిక్కులా వ్యాపిస్తున్న మలినత భూమిని నొక్కిపెట్టడానికి దిగుతున్నట్టుగా, అన్నయ్యనుగురించి తానను భవిస్తున్న దుస్సహ దుఃఖము ఆమెను కిందికి దిగతొక్కుతున్నది.

ఈవిధంగా స్వాభిమానబంధంనుండి ముక్తిపొంది కుముకు ఆనందం కలుగుతున్నది ఒకప్రక్కనుండి, కాని రెండోప్రక్క నుండి అన్నగారి కష్టాలవల్ల కలుగుతున్న బాధవల్ల ఆమె మనస్సు కలతజెందుతున్నది. తప్పించుకొనే ఉపాయం ఎరగక ఈవిధంగా బాధపడేకంటె సర్వేశ్వరుని నమ్ముకొని సర్వమూ అతనిమీద విడిచిపెట్టడము ఉత్తమమని తెలుసుకొన్నది. కాని ఎన్నోసార్లు తనను తాను నిందించుకుంటున్నప్పటికీ నమ్మకం కుదరకుండా ఉన్నది. టెలిగ్రాం ఇచ్చినా జబాబు రాలేదెందుకో అని మాటి మాటికి అనుకొంటున్నది.

ఆత్మసమర్పణ చేయకోరుతున్న నారీహృదయానికి ఎదురుగావచ్చే సూక్ష్మమైన అడ్డంకులను తొలగించేశక్తి మధు సూదనక్కు లేదు. వివాహమాడిన కుము దేహము మనస్సులపై అతనికిగల సంపూర్ణ అధికారస్థానము కూడా అతనికి అందు

బాటులో లేదు. విధి ఈ మాదిరి కుట్ర పన్నుతున్నది, దానిని ఎట్లా తప్పించుకోవడమో ఎంత ఆలోచించినా అతనికేమీ తట్టడంలేదు. మధుసూదన్ నేటివరకు ఎన్నడూ తన వర్తకం విషయమై నిర్లక్ష్యంగా ఉండలేదు. ఇప్పుడు ఆ దుర్లక్షణం కూడా కనబడడం ప్రారంభించినవి. తల్లి జబ్బూ మృత్యువు లైనా అతనిపనికి అడ్డురాలేక పోయినవని అంతా ఎరిగిన విషయమే. అవిచలితమైన అతని మనోబలాన్ని చూచి చాలా మందికి ఆశ్చర్యం కలిగింది, వారికి మధుసూదనునియెడల గలభక్తి పెరిగింది—వారిప్పుడు ఇతనిలో కనబడ్డమార్పును చూచి నిర్ఘాతపోతున్నారు. ఎన్నాళ్లనుండో స్థిరపడిఉన్న దారినుండి తప్పించి ఇప్పు డతనిని ఈమాదిరి క్రొత్తదారిలోకి తోసుకుపోతున్నశక్తి, ఎక్కడికి లాగుకొనిపోతుందో ఎవరూ ఊహించలేకపోయినారు.

రాత్రి భోజనమైన తరువాత మధుసూదన్ పడకగదిలోకి వచ్చాడు—కుము ఇవాళ గదిలోకి వస్తుందని ఆశించలేదు, కాని రావచ్చునని అనుమానించి, మామూలు వేళదాటిన తరువాతనే గదిలో ప్రవేశించాడు. మంచి స్వస్థతగల శరీరం మధుసూదనుది, చిరకాలపు అభ్యాసాను సారం ఘంట మినిట్లప్రకారం నిద్రవచ్చేది—ఒక నిమిషమైనా ఆలస్యమయేది కాదు. ఇవాళ కూడా ఆలాగే నిద్రపట్ట వచ్చుననీ, తరువాత కుము గదిలోకివచ్చి అతను నిద్రపోతుండడం చూచి వెళ్లిపోవచ్చుననీ ఊహించి, మంచంమీదికి

వెళ్ళలేదు. కొంచెంసేపు సోఫామీద కూర్చున్నాడు, కాస్సేపు డాబామీద పచారిచేశాడు. తొమ్మిది ఘంటలకు నిద్రపోవడం అతని అలవాటు, కాని కొంతసేపటికి దేవిడీలో కొట్టిన ఘంటలు వినబడ్డవి—పదకొండు అయింది—విని ఉలికిపడ్డాడు. సిగ్గుపుట్టింది, రెండుమూడుసార్లు మంచందగ్గరికి వెళ్ళాడు కాని పడుకో బుద్ధిపుట్టలేదు. అప్పుడే, ఆ రాత్రివేళనే, బయటి గదిలోకి వెళ్ళి నవీన్‌ను పిలిపించి, సంగతి కనుక్కుందామని నిశ్చయించుకొన్నాడు.

బయటి గదివరండా మీదికి వచ్చిచూచేసరికి గదిలో ఇంకా దీపం వెలుగుతున్నది. మధుసూదన్ గదిలోకి వెళ్ళబోతున్నాడు. అంతలో నవీన్ లాంతరు చేతపుచ్చుకొని బయటికి వస్తున్నాడు. పగటిపూటఅయి ఉంటే నవీన్ ముఖం పాలిపోయి ఉండడం స్పష్టంగా కనబడి ఉండును.

"ఇంత రాత్రప్పుడు ఇక్కడేమి చేస్తున్నావు," అని మధుసూదన్ అడిగాడు.

"నిద్రపోవడానికి ముందు రోజూ గడియారం" కీ ' తిప్పుతుంటాను, క్యాలెండర్లో తారీకు మారుస్తుంటాను," అని నవీన్ జవాబు చెప్పాడు. హఠాత్తుగా ఆరాత్రి నవీన్ తనలోకి కాస్త బుద్ధి దూరింది.

"సరే గదిలోకి వచ్చి నేనుచెప్పేది విను."

నవీన్ బోను ఎక్కించిన ముద్దాయి మాదిరి భయపడుతూ గదిలోకివచ్చి నిలుచున్నాడు.

"వీరా వదిన చెవిలో ఎవరో మంత్రాలు ఊదుతున్నారు-అది నా కెంతమాత్రం ఇష్టంలేదు. నాభార్య నా ఇష్టప్రకారం నడవవలెను కాని ఇతరుల సలహా ననుసరించి నడుచుకో కూడదు—ఇదే సరిఅయిన నియమము," అని అన్నాడు. మధుసూదన్.

నవీన్, "ఔను, అదే నియమం," అన్నాడు అతి గంభీరంగా.

"కనుక, నీభార్యను పుట్టింటికి పంపేయి."

నవీన్ ఎట్టి తత్తరపాటూ లేకుండా నిశ్చితంగా అంటు నట్టుగా, "ఆహా, తప్పకుండా! నేనే ఆమాట చెపుదా మను కొంటున్నాను కాని నీవు ఒప్పుకోవేమో అని జడిశాను," అని జబాబు చెప్పాడు.

"నీ వన్నదానికి అర్థ మేమిటి?" అని మధుసూదన్ అడిగాడు ఆశ్చర్యపోతూ.

"ఎన్నాళ్లనుంచో పుట్టింటికి వెళ్లివస్తానని నన్ను చీకాకు పెడుతున్నది, మూటాముల్లె కట్టుకొని సిద్ధంగాకూడా ఉన్నది. మంచిరోజు చూచి బయలుదేరుతుంది," అని నవీన్ జబాబు చెప్పాడు.

ఇది కేవలం కల్పితకథ అని చెప్ప నక్కరలేదు. మధుసూదన్ తన ఇష్టప్రకారం ఎవరిని పొమ్మంటే వాళ్లు ఇంటినుండి పోవాలి, అంతేగాని ఇట్లోనివాళ్లెవరైనా తమ ఇష్టప్రకారం వెళ్లి

పోవడం నియమవిరుద్ధం కనుక చీకాకుపడుతూ మధుసూదన్ అడిగాడు, "ఏమి, నీపెళ్లానికి పుట్టింటికి వెళ్లడానికి ఎందుకు అంత తొందర?" అని.

" 'గృహిణి ఇంటికి వచ్చింది, ఇంటి పూచీ అంతా ఆమెదే కదా ఇక; నేను మధ్యను ఉండడంవల్ల ఏమాటైనా రావచ్చును,' అని నా పెళ్లం అన్నది," అని నవీన్ జబాబుచెప్పాడు.

"ఈ సమస్యలనుగురించి ఆలోచించే భారమంతా చిన్న తోటికోడలిదేనా?" అని మధుసూదన్ అడిగాడు.

ఉత్త అమాయకుని మాదిరి జబాబుచెప్పాడు నవీన్—"నేనేమి చేసేది చెప్పు, అన్నయ్యా, ఆడపట్టు. ఎందుకోగాని, నీవే ఆమె నెప్పుడో ఒకనాడు ఏదోమాటమీద వెళ్లిపొమ్మన వచ్చునని ఆమె అనుమానం. అట్లాంటప్పుడు సహించి ఊరుకో లేదు, కనుక అంతకుముందే వెళ్లిపోతానని శపథంచేసుకు కూర్చున్నది. వచ్చే త్రయోదశి మంచి రోజట, ఆలోగా పను లన్నీ చక్కబెట్టి లెక్కకూడా అప్పచెప్పాస్తా నన్నది."

"చూడు నవీన్, చిన్నతోటికోడలికి ముద్దుచేసి నీవే మొండితనం నేర్పావు. ఆమెతో గట్టిగా చెప్పు, వెళ్లడానికి వీలులేదని. నీవు మగవాడవు, ఇంట్లో నీమాట చెల్లకపోవడం చూచి నేను సహించలేను," అని మధుసూదన్ అన్నాడు.

తలగోక్కొంటూ జబాబు చెప్పాడు నవీన్—"చెప్పి చూస్తాను అన్నయ్యా, కాని—"

"సరే నేను చెప్పానని చెప్పు, ఇప్పుడు వెళ్లవద్దు, వెళ్ల వలసిన సమయం వచ్చినప్పుడు నేనే మంచిరోజు చూచి చెపుతా నని చెప్పు."

"నీవే అన్నావు అన్నయ్యా చిన్నతోటికోడల్ని పుట్టింటికి పంపమని—అందుకనే నేను—"

మధుసూదన్ కోపంతో మండిపడుతూ అన్నాడు—"ఈక్షణమే పంపేయమని నే నన్నానా?"

నవీన్ మెల్లి మెల్లిగా వెళ్లిపోయినాడు. మధుసూదన్ దీపం ఒకటి ముట్టించి పడకకుర్చీమీద వెనకకుచేరబడి కూర్చున్నాడు. చౌకీదారు చౌకీఇస్తూ మధ్యమధ్య గదుల ఎదుటనుండి వెళ్లుతూఉంటాడు. మధుసూదన్ కొంచెము కునుకుతూ కునుకుతూ హఠాత్తుగా ఉలికిపడి లేచాడు; చౌకీదార్ గదిలోకి వచ్చి లాంతరు దగ్గరపెట్టి మధుసూదన్ ముఖం చూస్తున్నాడు- — మహారాజావారు మూర్ఛపోయినారనో లేక చనిపోయినారనో అని వాడి అనుమానం. మధుసూదన్ తడబడుతూ కుర్చీమీదనుంచి లేచిపోయినాడు. కొత్తగా వివాహమాడి వచ్చిన రాజా బహదూర్ వారు బయటిఆఫీసు గదిలో ఈవిధంగా రాత్రి గడపడం దుఃఖకరమైన విషయం. ఈ దృశ్యం చౌకీదార్ కంటపడడంకంటె అవమానకరమైనది వేరేదీ ఉండదని మధుసూదన్‌కు తోచింది, తక్షణమే లేచి కొంచెము కోపంగా †'ఘర్ బంద్ కరో,' అని వాడితో

† గది మూసేయి

అన్నాడు—గది తలుపులు తెరచిఉండడం చౌకీదార్ తప్పే అన్నట్టుగా.

దేవిడిలో రెండు ఘంటలు కొట్టారు.

గది విడిచిపెట్టి వెళ్లకముందు మధుసూదన్ ఒకసారి సొరుగు లాగి, కుముదిని పేర వచ్చిన టెలిగ్రాం జేబులో పెట్టుకొని అంతఃపురంవైపు వెళ్లాడు, మూడో అంతస్తుకు వెళ్లే మెట్ల ఎదుట కొంచంసేపు నిలుచున్నాడు.

అర్ధరాత్రి అప్పుడు, గాఢనిద్రనుండి హఠాత్తుగా లేచినప్పుడు, తత్ క్షణం మనస్సును పూర్తిగా మన అధీనంలోకి తెచ్చుకోలేము. అందుచేత పగటిపూట జీవితానికీ రాత్రి కలిగే అనుభవానికీ అంత భేదం కనబడుతుంటుంది. రాత్రి రెండుఘంటల వేళ, లోకం నిద్రానిమగ్నమై ఉన్నది, మనను చూస్తున్నవాడు ఒక్కడుండడు. అట్లాంటప్పుడు మనము ఏమిచేసినా ఏమి అనుకొన్నా మనను అడిగేవాడు ఉండడు, ముందువెనుక ఆలోచించక మనకు మంచిదని తోచినపని మనం చేయగలము. అప్పుడు మధుసూదన్ తా నోడిపోనట్టు తనలో తా నొప్పుకొన్నాడు—ఆ రెండుఘంటల రాత్రి వేళ ఆపని అతనికి అసాధ్యం అని తోచలేదు.

## ౩౨

మెట్లదగ్గిరనుంచి మధుసూదన్ తిరిగి వచ్చేశాడు. గుండె దబదబ కొట్టుకుంటున్నది. మూసి ఉన్న ఒకగది ఎదుట చిన్న కెరసనాయిల్ లాంతరొకటి వెలుగుతున్నది. దానిని చేత

పుచ్చుకొని దీపాల గది ముందరికి వచ్చి నిలుచున్నాడు. మెల్లిగా తలుపు తోసి చూచాడు. గడియ వేయలేదు, తలుపులు విడి పోయినవి. కుము ఆ చాపమీదనే పడుకొని గాఢనిద్రలో ఉన్నది, దుప్పటి కప్పుకొన్నది, ఎడమచెయ్యి గుండెమీద నున్నది. మధుసూదన్ లాంతర్‌ను గదిమూలను ఉంచి నెమ్మదిగా కుము ఎడమవైపుకు వచ్చి ముఖం దగ్గిర ముఖంపెట్టి నిదానంగా చూస్తున్నాడు. ఆ ముఖం అతనిని అంత ఆకర్షించడానికి కారణం, అందులో ఉండే అనిర్వచనీయ పరిపూర్ణత. ఆమె మనస్సులో, తనతో తనకు, ఎన్నడూ విరోధం కలగ లేదు. అన్న ఇంట్లో ఉండే రోజులలో లేమిడివల్ల ఎన్నో కష్టాలు వచ్చినవి, ఎంతో దుఃఖంకలిగింది, కాని ఆ దుఃఖం బాహ్యావస్థ వలన కలిగినది, అది తన హృదయాన్ని తాకలేదు. ఆమె యాత్ర చేస్తున్న సంసారంలో అన్నీ ఆమె స్వభావానికి అను కూలంగానే ఉండెను. కనుకనే ఆమెముఖంలో అంత సరళత కనబడేది, ఆమె నడవడిలో అంత ఇంపైన మర్యాద కనబడేది. మధుసూదన్ తాను చేస్తున్నసాధనలో ప్రతిరోజూ అనేక విధాల పోరాడవలసివస్తున్నది, ఎవరినీ నమ్మక బహుజాగ్రతగా పని నడపవలసి వస్తున్నది, అట్టి మధుసూదనునికింటికి కుములో కనబడే పరిపూర్ణశాంతీ, పరిపక్వతా ఆశ్చర్యకరమైన విషయాలు. మధుసూదన్‌లో సరళత లేదు, సహజప్రవర్తన లేదు; కుములో దేవతలలోఉండే సరళతా సహజతా ఉన్నవి. మధుసూద నుని ప్రబలవేగముతో ఆకర్షిస్తున్నది ఈ వైపరీత్యమే. వధువు

అత్తవారింటికి వచ్చిన మొదటి రోజునాటి దృశ్యం మధు సూదనుకు కళ్లకుకట్టినట్టుఉన్నది. తాను ఆనాడు అధికారం చలాయించబోయినాడు, అసమర్థుడై క్రుద్ధుడైనాడు. కుములో లేశమైనా లొంగని ఆత్మగౌరవం కనబడ్డది. సాధారణస్త్రీలలో కనబడే ప్రగల్భత ఆమెలో కొంచెమైనా కానరాలేదు. కుము కూడా నలుగురి స్త్రీలవంటిదిఅయినట్లైతే మధుసూదన్ తన భర్తృత్వాన్ని ప్రయోగించి, ఆమెను అవమానపరచడానికి సంకోచించిఉండడు. ఆనాడు జరిగినదానిఅర్థం మధుసూదనుకు బోధపడలేదు, కుమును స్వాధీన పరుచుకోలేక పోవడానికి అద్భుతమైన కారణ మొకటి ఉండాలి!

కుమునులేపకుండా ఆ ప్రక్కను కూర్చొనే రాత్రి అంతా గడపవలెనని మధుసూధన్ నిశ్చయించుకొన్నాడు. కొంచెంసేపు కూర్చున్న తరవాత మరి ఉండలేక, కుము తన గుండెమీదను ఉంచుకొన్న చేతిని తీసి తన చేతితో పట్టు కొన్నాడు. కుము నిద్రలోనే ఏవోమాటలంటూ చెయ్యి లాగుకొని రెండో పక్కకు తిరిగి పడుకొన్నది. మధుసూదన్ మరి ఓర్చి ఉండలేక కుము చెవిదగ్గర ముఖంపెట్టి, "ఇదిగో మీ అన్నయ్య టెలిగ్రాం వచ్చింది," అన్నాడు.

నిద్రలోనుంచి హఠాత్తుగా లేచి కూర్చున్నది కుము; మధుసూదన్‌వైపు నిర్ఘాంతపోయి చూచింది. మధుసూదన్ టెలిగ్రాం ఆమెకు చూపిస్తూ, "ఇదిగో మీ అన్నయ్య దగ్గిర

నుంచి టెలిగ్రాం వచ్చింది," అన్నాడు. అని మూలనున్న లాంతరు దగ్గరికి తీసుకు వచ్చాడు.

కుము టెలిగ్రాం చదివింది— అందులో ఇంగ్లీషున ఉన్న మాటల అర్థం ఇది—'నా విషయమై భయపడకు, క్రమంగా జబ్బు బాగౌతున్నది, నీకు నా ఆశీర్వాదాలు.' అంతదుఃఖం లోనూ అన్నయ్య చేసిన దీవనమాట తెలియగానే, కుము కళ్లు తడిచేసుకొన్నది. కళ్లు తుడుచుకొని టెలిగ్రాం భక్తిగా పయటి చెంగున కట్టింది. అది చూడగానే మధుసూదన్ గుండె గడగడ కొట్టుకోసాగింది ఏమి అనడానికీ తోచలేదు; తరువాత కుము అడిగింది, "అన్నయ్య దగ్గరనుంచి ఉత్తరం రాలేదా?"

ఇట్లాగు ఆగదిలో కూర్చొనిఉండడానికి సంకోచం కలిగి కుము లేచి పోదామని అనుకొంటున్నది, అంతలో మధుసూదన్ హఠాత్తుగా, "నామీాద కోపగించకు," అని అన్నాడు.

అది ప్రభువుఆజ్ఞ కాదు ప్రియుని వినతి; అపరాధి మనస్సులో ఉండే పశ్చాత్తాపం కనబడ్డది అందులో. కుముకు ఆశ్చర్యంకలిగింది, అది ఈశ్వరుని లీల అని ఆమెకు తోచింది— పగలంతా "కోపగించకు కోపగించకు," అని తన మనస్సును తాను మందలిస్తుండెను, ఆ మాటలే దేవుడు అర్ధరాత్రి వేళ మధుసూదనుని నోట అనిపిస్తున్నాడు—ఇటువంటిది జరుగు తుందని కుము ఆశించలేదు.

"ఇప్పటికీ నీకు నామీాద కోపంగానే ఉన్నదా?" అని మధుసూదన్ కుమును మళ్ళీ అడిగాడు.

"లేదు. కొంచెమైనా కోపంలేదు," అని కుము అన్నది.

కుము కంటికి కానరాని ఎవరితోనో మాట్లాడుతున్నట్టు కనబడ్డది, అదిచూచి మధుసూదన్ మిక్కిలి ఆశ్చర్యపడ్డాడు.

"అట్లాగైతే ఈ గదిలోనుంచి వచ్చేయి, మీదికి నీ గదిలోకి రా," అని మధుసూదన్ అన్నాడు.

కుము సిద్ధంగా లేదు, రాత్రివేళ నిద్రనుంచి లేవగానే హఠాత్తుగా మనస్సును పూర్తిగా మన అధీనంలోకి తెచ్చుకోలేము. మర్నాడు ఉదయమే స్నానంచేసి, దైనిక ప్రార్థన చేసుకొని సంసారంలో తాను చేయవలసిన సాధన ప్రారంభించవలెనని కుము సంకల్పించుకొని ఉండెను. దేవుడు తనకు వ్యవధి ఈయక హఠాత్తుగా ఇప్పుడు ఈ విధంగా ఆజ్ఞాపించాడు— "రాను" అని ఎట్లా చెప్పగలదు; మనస్సులో ఉండే గాఢ అనిచ్ఛ అపరాధమని తోచి ఆమె లేనిబలం తెచ్చుకొని, లేచి, *"పద" అని అన్నది.

ఇద్దరూ మేడ ఎక్కారు, మధుసూదన్ గదిలో ప్రవేశించాడు, ఆమె గది ఎదుట, తడబడుతూ నిలబడి, "నేనిప్పుడే వస్తున్నాను, ఆలస్యం చేయను," అని అంటూ డాబామీదికి వెళ్ళి ఒకమూలను కూర్చున్నది.

కృష్ణపక్షపు చంద్రుడు అప్పుడు ఆకాశం మధ్యను ఉన్నాడు.

---

* భర్తభార్యను 'నీవు' అని సంబోధించేటట్టు, భార్యకూడా భర్తను 'నీవు' అని సంబోధించడం బంగాళీల ఆచారం.

కుము మనస్సులో ఈ విధంగా అనేకసార్లన్నది—"తండ్రీ నీవు నన్ను పిలుస్తున్నావు, నీవే పిలుస్తున్నావు, నన్ను మరువలేదు గనుకనే పిలుస్తున్నావు, నన్ను ముళ్లదారి వెంబడి తీసుకుపోతున్నావు—ఆ తీసుకపోతున్నది నీవే, నీవే, మరెవ్వరూ కాదు."

మిగిలినదంతా మాయ, అసత్యం. అంతా ముళ్లే అయినప్పటికీ వెళ్లసిద్ధపడ్డది కుము, భగవంతు డేర్పరిచిన దారిలోని ముళ్లు. అవి దారికి అవసరమైన పాథేయం—అన్నయ్య ఆశీర్వాదము—తనవద్ద నున్నది. ఆ ఆశీర్వాదాన్ని తనపయిటచెంగునే కట్టుకొన్నది; పయిటచెంగున కట్టిఉన్న ఆ ఆశీర్వాదాన్ని ఉండి ఉండి కళ్లను అద్దుకొన్నది, తరువాత ప్రణామము చేస్తూ తల నేలను మోపి ఉంచింది. అప్పుడు మధుసూదన్ వచ్చి హఠాత్తుగా "బయట చాలా చలిగా ఉన్నది గదిలోకి వచ్చేయి," అని అన్నాడు వెనుకనుంచి. కుము ఉలికిపడి లేచింది. ఆమె తన హృదయంలోనుండి వినకోరుతుండే కంఠంతో ఈ కంఠం సరిపోలేదు. ఇదే కాబోలు భగవంతుని పరీక్ష, తన వేణుగానం నేడు వినిపించడేమో—తాను ఛద్మవేషంతో వెనుకను దాగి ఉంటాడు కాబోలు.

## 33

వ్యక్తిగతంగా కుములో ఉన్న ఆమె నిజమైన మనస్సు ఆత్మధిక్కారంతోనూ, ఘృణతోనూ, వితృష్ణతోనూ నిండుతూ

ఉండెను. సంసారం ఆమెను బహునిర్దయగాచూచి అవమాన పరుస్తున్నకొలది కుము తనచుట్టూ ఒక ఆవరణను కట్టుకొంటు - న్నది—మంచిచెడ్డలజ్ఞానం ఆ ఆవరణను చీల్చుకొని లోపలికి రాలేనంత దట్టమైన ఆవరణ అది—అనగా తననుగురించి తనకు గల చైతన్యం క్షీణించేటట్టు ఆమె గొప్పప్రయత్నం చేస్తున్న దన్నమాట. ఇట్లాంటిది *క్లోరొఫార్మ్‌ద్వారా సాధించవలసిన పని గాని రెండుమూడు ఘంటలలో సాధించగలదికాదే! రాత్రింబగళ్లు కలిగే వేదనను, వితృష్ణను తోసివేస్తుండాలి. అటువంటి అవస్థలో స్త్రీలకు గురువు అనదగినవాడొకడు దొరికితే ఆత్మ విస్మృతి సులభమవుతుంది. కుముకు అది వీలుకా లేదు, కనుక రాత్రింబగళ్లు ఈ మంత్రం తనలోతాను జపిస్తుండేది.

తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామ్ అహమీశమీడ్యం
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుం.

దేవా నీకు సర్వాంగ ప్రణామముచేసి నేను కోరే ప్రసాదం ఇది—తండ్రి కుమారుడుచేసే పనులను ఎట్లాగు సహించి ఉంటాడో, మిత్రుడు మిత్రుని ఎలా సహించిఉంటాడో ప్రియుడు ప్రియురాలిని ఎట్లాగు సహించిఉంటాడో నీవు నా

* Chlhro form

పనులను అట్లాగు సహించి ఉండగలవు అని నా ఆశ. నాపనులు సహించి ఉండగలిగినంత ప్రేమతో నన్ను చూస్తున్నావన్నదానికి ప్రమాణం ఒక్కటే—నీప్రేమవల్ల నేనుకూడా అందరినీ క్షమిస్తూ ఉండగలగాలి. కుము కళ్లుమూసుకొని దేవునిస్మరిస్తూ మనస్సులో ఇలా అనుకొంటున్నది—"సర్వత్రా నన్నుచూచే వానిని, నాలో సర్వమూ చూడగలిగేవానిని నే నెన్నడూ త్యజించను, అట్లాంటివాడూ నన్ను త్యజించడు—అని నీవే అన్నావు దేవా! ఈ సాధనలో ఎట్టి అశ్రద్ధా నాలో ఉండక పోవు గాక."

ఇవాళ స్నానంచేసి చందనంనీళ్లు ఒంటిని రాసుకొని చాలాసేపటివరకు నిశ్చలంగా కూర్చున్నది. దేహాన్ని పవిత్రం చేసుకొని సుగంధంతోనింపి తనను భగవంతునికి సమర్పించు కొన్నది; ఏకాగ్రచిత్తముతో, భగవంతుని చేయి తనచేతిలో ఉన్నట్టూ,సంపూర్ణంగా తన దేహమంతటా ఆ సర్వవ్యాపియొక్క స్పర్శవ్యాపించి ఉన్నట్టూ ధ్యానిస్తూ కూర్చున్నది. తనదేహం నిజంగానూ, పూర్తిగానూ భగవంతునిదే అయినట్టూ, అది మినహాయించగా మిగిలిన ఏకాస్త ఉన్నదో అది మిథ్య, మాయ, మన్ను అయినట్టూ, చూస్తూచూస్తూ ఉండగానే మంటిలో కలిసిపోతున్నదన్నట్టూ ఊహించుకొంటున్నది. అతని స్పర్శ అనుభవిస్తున్నంతసేపు తనదేహం ఎంతమాత్రం అపవిత్రం కానేరదని ఊహిస్తూ ఉండగానే కుముకళ్లు నీళ్లతో నిండినవి, స్థూలమాంసబంధంనుండి దేహం ముక్తిపొందినట్లూ ఆమెకు

తోచింది. పుణ్యసమ్మేళనానికి నిత్యక్షేత్రమైన తన శరీరంపైని అప్పటినుండి ఆమెకు భక్తికలిగింది. కుంద పువ్వులు అప్పుడు దొరికిఉంటే గుచ్చి మెడలో వేసికొనిఉండును, వాటిని జుట్టులో పెట్టుకొని ఉండును. స్నానంచేసి వెడల్పాటి ఎర్రంచు తెల్లచీర కట్టుకొని డాబామీదికి వెళ్లింది. ఆకాశాన్ని నింపుతున్న నిర్మల సూర్యకాంతి ఆమె సర్వాంగాలను స్పర్శించడంవల్ల ఆమెకు అమితానందం కలిగింది.

కుము మోతీతల్లిదగ్గిరికి వచ్చి, నువ్వు చేస్తున్నపని నన్నుకూడా చేయనీ అని అడిగింది.

"అయితే పద, కూరలు తరుగుదాము," అని ఆమె అన్నది నవ్వుతూ.

పెద్దపెద్ద కర్రపళ్లేలూ, పెద్ద ఇత్తడి తప్పేలాలూ, బుట్టలతో కూరకాయలూ, పదిపన్నెండు కత్తిపీటలూ దగ్గిర పెట్టుకొని, బంధువులూ, ఆశ్రితలూ, నవ్వుతూ, కబుర్లు చెప్పుకుంటూ, కూరలు తరుగుతున్నారు; తరిగిన కూరలకుప్పలు పెరుగుతున్నవి. కుము వాళ్లమధ్యకు వచ్చి కూర్చున్నది, ఎదుట కిటికీలోనుంచి పెద్ద ముసిలి చింతచెట్టొకటి కానవస్తున్నది, దాని ఆకులు ఒక్కనిమిషమైనా ఆగకుండా ఆడుతున్నవి, దానివల్ల సూర్యకాంతి చిన్నచిన్న తునకలయి వర్షపుజల్లువలె నేల పడుతున్నది.

మోతీతల్లి మధ్యమధ్యను కుమువంక చూస్తున్నది, కాని కుము కూరలు తరుగుతున్నదో, లేక ఆమె వేళ్లు పనిచేస్తుండగా

వాటిధోరణిని అనుసరించి మనస్సు ఏ తీర్థంవైపుకో యాత్ర చేస్తున్నదో ఆమె పోల్చుకోలేక పోయింది. తెరచాప ఎత్తుకొని హాయిగా ప్రయాణంచేస్తున్న పడవవలె కుము చూచే వాళ్లకు కనబడుతున్నది. నావకు, చాపను నింపుతున్న గాలి యొక్క స్పర్శతప్ప, మరి ఏజ్ఞానమూలేదు, కిందను తాను రెండు భాగాలుగా చీల్చుకుపోతున్న నీరు ఉన్నదనికూడా గురుతు లేదు. కుముకు ఈప్రక్కనూ ఆప్రక్కనూ కూర్చొని పని చేస్తున్నవారు ఎందరో ఉన్నారు, అయినా వారిలో ఎవరూ, తమలోతాము మామూలుగా మాట్లాడుకున్నట్లుగా, కుముతో మాట్లాడలేక పోయినారు. శ్యామాసుందరిమాత్రం ఒకమారు అన్నది—

"ప్రొద్దున్నే స్నానం చేయాలంటే వేడినీళ్లు పెట్టించమని చెప్పవేమి చెల్లీ, రొంపచేయగలదు!"

"నాకు చల్లనినీళ్లే అలవా"టని కుము జవాబు చెప్పింది.

సంభాషణ మరి నడవలేదు. కుము తనలోతాను జపం చేస్తున్నది—

"పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుం."

కూరలు తరగడం, వంటకు సామానియ్యడం మొదలైన పనులు ముగియగానే ఆడవాళ్లందరూ స్నానానికని, లోపలి మండువాలోకి, వెళ్లారు; కొళాయిదగ్గిర ఏకసందడి చేస్తున్నారు.

దగ్గిర మోతీ-తల్లి ఒక్కతె ఉండడంచూచి, కుము, "అన్నయ్య టెలిగ్రాం దొరికింది," అని అన్నది.

"ఎప్పుడు?" అని ఆశ్చర్యపోయి అడిగింది మోతీతల్లి.

"నిన్నటి రాత్రి."

"రాత్రా?"

"ఔను, అర్ధరాత్రి వేళ, అతనే తెచ్చి నాచేతికి ఇచ్చారు."*

"ఐతే ఉత్తరంకూడా ఇచ్చిఉంటారు తప్పక," అన్నది మోతీ-తల్లి.

"ఏ ఉత్తరం?"

"మీ అన్నయ్యగారు వ్రాసిన ఉత్తరం."

"నా కియ్యలేదే! అన్నయ్య దగ్గిరనుంచి ఉత్తరం వచ్చిందా?" అని కుము ఉలికిపడి అడిగింది.

మోతీతల్లి జబాబు చెప్పలేదు.

కుము గాబరాపడుతూ తోటికోడలి చెయ్యిపట్టుకొని, "అన్నయ్య ఉత్తరం ఎక్కడ? తెచ్చీయవూ?" అని అడిగింది.

"నేను తెచ్చీయలేను, అది బావగారి టేబిల్ సొరుగులో బయటి గదిలో ఉన్నది," అని మెల్లిగా అన్నది మోతీతల్లి.

---

*భర్తనుగురించి ఇతరులతో చెప్పినప్పుడు "డు" ప్రత్యయం ప్రయోగించక, "రు" అనే గౌరవార్థక ప్రత్యయం ప్రయోగిస్తారు బంగాళీలు.

"నాఉత్తరం నాకెందుకు ఈయలేవు?"

"అతని సొరుగు తీశానని తెలిస్తే ప్రళయకాండం జరగదూ?"

"మా అన్నయ్య ఉత్తరం, నేను చదవడానికి వీలులేదా అయితే?" అని చీకాకుపడుతూ అడిగింది కుసుమ.

"బావగారు ఆఫీసుకు వెళ్ళిపోయిన తరువాత సొరుగులో నుంచి తీసి ఉత్తరం చదివి తిరిగి సొరుగులో ఉంచేయి."

కోపంపట్టి ఉంచుకోలేక తీవ్రస్వరంతో "నా ఉత్తరం నేనే దొంగతనంగా చదవాలా?" అని అడిగింది కుసుమ.

"ఈ ఇంట్లో ఏది మనదో ఏది మనది కాదో విచారణచేసే వారు ఇంటియజమానిఅయిన బావగారు."

కుసుమ తానుచేసిన శపథం మరిచిపోబోతుండెను, అప్పుడు మనస్సు అకస్మాత్తుగా లోపలనుండి శతాయిస్తున్నట్టుగా, 'కోప్పడకు,' అని చెప్పింది. కుసుమ కళ్లు మూసుకొన్నది కొంచెం సేపు, ఆమె పెదవులు వణికినవి—"ప్రియః ప్రియాయా ర్హసి దేవ సోఢుం"

"నా ఉత్తరం దొంగలాడితే దొంగలాడనీ, నేను మాత్రం దొంగతనంద్వారా దొంగతనాన్ని దిద్దను."

మాట నోరుజారిరాగానే కుసుమ తెలుసుకొన్నది తా నన్నమాట కఠినంగా ఉండెనని, లోపున అణిగిఉన్నకోపం తనకు తెలియకుండానే బయటికి వచ్చేస్తున్నదని పోల్చు,

కొన్నది. ఆకోపాన్ని ఉన్మూలంచేయాలి, అది ఎల్లప్పుడూ మనచేతికి దొరకదు గనుక దానితో పోట్లాడడం కష్టం, అది మనోగహ్వరం లోపల ఒక కోటను తయారు చేస్తుంటుంది, లోపలికి ప్రవేశించేమార్గం ఏది? లోపల ఇరికి ఉన్నదానిని తోసుకొని పోగలిగినట్టిన్నీ, లోపలకట్టబడి ఉన్నవాటిబంధాలు, ఛేదించగలిగినట్టిన్నీ, గొప్ప ప్రేమప్రవాహాన్ని పుట్టించాలి. అనేకసంగతులు మరిచిపోగల ఉపాయం కుముచేతిలోఉన్నది—సంగీతం. కాని ఈ ఇంట్లో ఎస్‌రాజ్ వాయించడానికి కుముకు సిగ్గువేస్తున్నది—తన ఎస్‌రాజ్ తెచ్చుకోలేదుకూడాను, కుము పాడగలదు, కాని కంఠం అట్టే ఎత్త లేదు. ఆకాశం అంతా నిండిపోయేటట్టు గొంతుక ఎత్తాలని కోరిక కలిగింది కుముకు—దేవితో మాట్లాడాలని బుద్ధిపుట్టింది, “నీ పిలుపు విని వచ్చాను, నీ వెందుకు దాగొనిఉన్నావు నేను ఒక్కనిమిషమైనా ఆలోచించలేదే, నీవు నన్నెందుకు ఇట్టి సందిగ్ధావస్థలో పెట్టావు?” అని పాడ బుద్ధిపుట్టింది. ఈ మాటలే పాటరూపంగా గొంతెత్తి బిగ్గరగాపాడితే దానికి జవాబు కూడా పాటరూపంగానే వస్తుందని ఆమెకు తోచింది.

## 38

పారిపోయి ఒంటరిగా కూర్చోగలజాగా ఈ ఇంట్లో కుముకు ఒక్కటే కనబడ్డది—అది ఇంటిడాబా. అక్కడికే ఇప్పుడామె వెళ్లిపోయింది. ప్రొద్దెక్కింది, ఎండ తీక్ష్ణంగాఉన్నది, ఎండ డాబాను పూర్తిగా ఆవరించింది, గోడపక్కను. ఒక్కచోట మాత్రం కొంచెము నీడఉన్నది, కుము అక్కడికివెళ్లికూర్చున్నది.

ఒకపాట ఆమెకు జ్ఞప్తికివచ్చింది, ఆసావరీ రాగంమీద-"బాఁసొరీ† హామారి రే" అని పాట మొదలు. విఖ్యాతగాయకులు పాడగా కుము ఆపాట విన్నది, ఒకరిదగ్గిర ఒకరు నేర్చుకొంటూ రావడంవల్ల మాటలన్నీ వికృతం అయిపోయినవి, ఇప్పుడు ఆపాట అర్థమేకాదు. ఆ మాటలనే రకరకాలుగా తిప్పి కొత్తకొత్త రాగాలతో పాడుతున్నది. ఆ మాటల ద్వారా ఆమె మనస్సులోపుట్టిన భావం ఇది—ఓ నా వేణువా, నీలోనుండి సంగీతం రాకుండా ఉన్నదేమి? తలుపులు మూసే ఉన్నవేమి, నీపాట ఏదీ?"—"బాఁసొరీ హామారి రే, బాఁసొరీ హామారి రే!"

మోతీతల్లివచ్చి, "లే అక్కా- ఫలహారం చేదువుగాని," అని పిలిచేటప్పటికి డాబా మూలనున్న ఆకాస్త నీడకూడా జేరిగిపోయింది, కుము మనస్సు సంగీతంతోనిండి ఉన్నది, తనకు జరుగుతున్న అన్యాయమంతా తుచ్ఛమైనదిగాను ఆలోచించదగనిదిగాను ఆమెకు కనబడుతున్నది. ఉత్తరంవిషయంలో మధుసూదన్ కనపరిచిన నీచత్వము ఆమె మనస్సులో తీవ్రమైన తృణీకారాన్ని పుట్టించిఉండెను, ఆ నీచత్వం కాంతితోనిండి ఉన్న ఆకాశంలో ఇప్పుడు ఏమూలనో చిన్నపతంగమై లీనమై పోయింది, దాని గుంజనం అనంతాకాశంలో ఎక్కడో మాయమైపోయింది. కాని అన్నయ్య ఉత్తరంలోఉన్న

† వేణువు.

అనురాగ వాక్యాలకొరకు ఆమె హృదయంలో పుట్టిన ఆత్రత మాత్రం తగ్గలేదు.

కుము భోజనంచేసింది, కాని ఆత్రత మాత్రం అలాగే ఉన్నది, మరి ఓర్చిఉండలేక మోతీతల్లి దగ్గరికివచ్చి, "ముందు గదిలోకివెళ్ళి అన్నయ్య ఉత్తరం చదివి వస్తాను" అని అన్నది.

మోతీతల్లి—"మరి కొంచెంసేపు కానీ, నౌకర్లందరూ భోజనాలకు పోతారు అప్పుడు వెళ్లవచ్చు."

కుము—"వద్దు వద్దు, అది కేవలం దొంగతనంలాగు అనిపిస్తుంది. అందరూ చూస్తూఉండగా వెళ్లుతాను, ఎవరు ఏమి అనుకున్నా అనుకోనీ."

మోతీతల్లి—"అట్లాగైతే పద, నేను కూడా నీతో వస్తాను."

కుము—"అది ఎంతమాత్రం వీలుపడదు, అక్కడికి ఏలాగు వెళ్లాలో చెప్పు, అంతే చాలును."

అంఃతపురానికీ బయటిఇంటికీమధ్యనుండే గోడకిటికీలోనుంచి గదిని చూపించింది మోతీతల్లి, కుము బయటికివచ్చింది. నౌకర్లు ఉలికిపడి లేచి ఆమెకు నమస్కారంచేశారు. కుము గదిలోకి వచ్చి డెస్కు తెరిచి చూచింది; అన్నయ్య ఉత్తరం కవరు విప్పి ఉన్నది. కుము గుండె దడదడ కొట్టుకోవడం మొదలుపెట్టింది, ఆమె అది భరించి ఉండలేకపోయింది. కుము పెరిగి పెద్దదైన ఇంట్లో ఇటువంటి నీచమైనపని జరగగలదని ఎవరూ ఊహించ

నైనా లేరు. మనస్సులో గొప్ప కలతపుట్టింది, దాని తీవ్రతవల్ల ఆమెకు చైతన్యం కలిగింది. "ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుం," అని మంత్రం వర్ణించింది; అయినా లోపలి తుపాను వడి తగ్గలేదు; ఆశ్లోకమే పదిమార్లు వర్ణించింది. రాణి, తనలో తాను మంత్రం వర్ణిస్తుండడంచూచి బయట నిలబడిఉన్న ఆర్డర్‌లీ ఆశ్చర్యపోయినాడు, ఆలాగు వర్ణించగా వర్ణించగా కొంతసేపటికి కుముకు మనశ్శాంతికలిగింది, ఆమె ఆ ఉత్తరం చేతితో పట్టుకొని కుర్చీమీద కూర్చొని చేతులు జోడించి ప్రణామంచేసింది. ఉత్తరం దొంగతనంగా చదవనని నిశ్చయించుకొన్నది.

అప్పుడు మధుసూదన్ గదిలో ప్రవేశించి కుమును చూచి ఉలికిపడి నిలబడిపోయినాడు, కుము అతనివైపు చూడలేదు. అతను దగ్గిరికి వచ్చాడు, డెస్కుమీద ఉన్న ఉత్తరం చూచి, "నీవు ఇక్కడి కెట్లా వచ్చావు?" అని అన్నాడు.

కుము మాటాడలేదు, మధుసూదనుని ముఖంవైపు చూస్తూ అతిశాంతంగా కూర్చున్నది. ఆమె చూపులో ఎట్టి ఫిర్యాదులేదు, మధుసూదన్ మళ్లీ అడిగాడు—"నీవు ఇక్కడికి ఎందుకు వచ్చావు?"

"అన్నయ్యదగ్గరనుంచి నాపేర ఉత్తరం వచ్చిందో లేదో చూదామని వచ్చాను," అని కుము జబాబు చెప్పింది.

"ఆమాట నన్నెందుకు అడిగావు కావు?" అని అడగలేకపోయినాడు—ఆ ప్రశ్న వేసేదారి తానే మూసేసుకొన్నాడు

నిన్నను. కనుక, "ఆ ఉత్తరం నేనే తెచ్చి నీ చేతికి ఈయబోనున్నాను, నీ విక్కడికి రావడం అనవసరం," అని అన్నాడు.

కుము మాటాడక కొంచెంసేపు కూర్చొని, మనస్సును శాంతపరుచుకొని జబాబుచెప్పింది—"నేనీ ఉత్తరం చదవడం నీకు ఇష్టంలేదు, కనుక నేను చదవను—ఇదిగో ఉత్తరం చించేస్తున్నాను. కాని ఇకముందు నన్ను ఈమాదిరి కష్టపెట్టవద్దు. నాకు ఇంతకుమించిన కష్టం వేరేదీ ఉండదు."

ఈలాగు అంటూ పైటచెంగుతో నోరు నొక్కుకొంటూ తొందర తొందరగా బయటికి వెళ్లిపోయింది.

మధ్యాహ్నం, ఇంతకుముందే, మధుసూదనుని మనస్సు కలతగా ఉండెను. ఎంతప్రయత్నించినా శాంతి కలుగలేదు. కుము భోజనంకాగానే ఆమెను రమ్మని కబురుపంపాలని నిశ్చయించాడు. ఇవాళ అతిశ్రద్ధగా తల దువ్వుకొన్నాడు. ఉదయమే దొరల క్రాపింగ్ షాపులోనుంచి తలకు రాసుకొనే మంచి వాసననూనెసీసా తెప్పించాడు, మంచి ఎసెన్సుఒకటి తెప్పించాడు. అతని జీవితంలో ఇవి ఉపయోగించడం ఇదే మొదటిమారు. ముస్తాబయి, సుగంధంతో గుమ్‌గుమ్ లాడుతూ తయారైనాడు, ఆఫీసు వేళదాటి నలభైయైదు మినిట్లు అయింది.

మెట్లమీద అడుగులచప్పుడు విని తడబడుతూ కుర్చీ మీద కూర్చొపడ్డాడు. చేతికేమీ దొరకలేదు, దగ్గరఉన్న పాత వార్తాపత్రికఒకటి తీసి దానిలోఉన్న అడ్వర్‌టిస్ మెంట్లు

చూస్తున్నాడు—ఒక్కచూడడమే కాదు; డ్రాయర్‌లోనుంచి నీలిపెన్సిల్ తీసి, ముఖ్యమైన ఆఫీస్ కాగితంలో మార్కుచేస్తు న్నట్టుగా అక్కడక్కడ గీతలు పెడుతున్నాడు.

ఆ సమయంలో శ్యామాసుందరి గదిలో ప్రవేశించింది. మధుసూదన్ కళ్లు చిట్లిస్తూ ఆమెవంక చూచాడు. "నీవు ఇక్కడ కూర్చున్నావు, నీకోసం తోటికోడలు వెదుకుతూ ఉంది," అని శ్యామాసుందరి అన్నది.

"వెదుకుతూఉందా ? ఏదీ ?"

"ఇప్పుడే చూచాను నీ ఆఫీసుగదిలోకి వెళ్లిందె—అంత ఆశ్చర్యపడుతున్నా వెందుకు అబ్బాయి, నీవు ఆక్కడ ఉంటావని కాబోలు పాపం—"

మధుసూదన్ లేచి తొందరతొందరగా బయటనున్న ఆఫీస్‌గదిలోకి వచ్చాడు. తరువాత జరిగినదే పైన వర్ణించిన కథ.

తెరచాప ఎత్తుకొని పరుగెత్తుతున్నది ఓడ; హఠాత్తుగా చాప చిరిగిపోయింది మధుసూదన్ దశ ఇప్పుడు, ఆఓడ దశయే! ఇప్పటికే ఆలస్యం అయిపోయింది, మరి ఒక్కనిమిషమైనా ఉండ లేదు, తక్షణం ఆఫీసుకు బయలుదేరాడు, ఆలోచన మధ్యను ముక్కలైపోయింది, ఆ విరిగినముక్కల వాడిఅంచులు మనస్సుకు గుచ్చుకొని చాలా బాధపెట్టుతున్నవి, మనస్సులో ఆందోళన కలుగుతున్నది. ఆమానసిక భూమికంపంవల్ల మన స్సిచ్చి ఏపనీ అవాళ చేయలేకపోయినాడు. తలనొప్పి భరించ

శక్యంకాకుండా ఉన్నదని చెప్పి చాలాముందుగానే ఆఫీసు నుండి ఇంటికి వచ్చేశాడు.

## ౩౮

ఇవతల పునాదిదగ్గిరనుంచి అంతా కదిలిపోయిందని నవీన్‌కీ మోతీతల్లికీ బోధపడిపోయింది, ఎక్కడికి పోవడమో తోచలేదు, "ఒళ్లు గుండచేసుకొని ఇక్కడ పనిచేస్తున్నట్లు పనిచేస్తే ఆమాత్రం తిండి ఎక్కడైనా దొరుకుతుంది, కాని నామాట నే నాలోచించలేదు, నేను వెళ్లిపోతే అక్కను చూచేవాళ్లు ఈ ఇంట్లో ఎవరూ లేరే అని ఆలోచిస్తున్నాను," అని మోతీతల్లి అన్నది.

నవీన్—"ఈ ఇంట్లో నాకు అనేక రకాల అవమానం కలిగింది, అనేకసార్లు నోటికి అన్నం రుచించింది కాదు కూడాను - కాని ఇట్లాంటి ఇల్లాలు దొరికినా, ఆమెను ఏ విధంగా ఉంచాలో అన్నయ్య తెలుసుకో లేకపోయినాడు కదా అని నాకు భరించరాని దుఃఖం కలుగుతున్నది—అంతా ధ్వంసం చేసేశాడు. మంచి వస్తువులను ముక్కలుచేసి ఆ ముక్కలతోనే ఇల్లు కట్టుతుంది 'అ-లక్ష్మి'."

"ఆమాట బోధపరుచుకోడానికి మీ అన్నయ్యకు ఆట్టే రోజులు పట్టదు, కాని అప్పుడు మరి ఈ విరిగిన ముక్కలు అతుక్కోవు."

నవీన్—"మరిదిఅయిన లక్ష్మణుడయే అదృష్టం మరి నాకు లభించలేదు, అదే నా దుఃఖం. ఏమైతే నేమి, మూటా ముల్లీ కట్టి సిద్ధంగా ఉంచు."

మోతీతల్లి లేచిపోయింది, నవీన్ మరి ఉండలేక వదిన గదివైపు వెళ్లాడు, కుము పక్కమీద, నేలను, పడుకొని ఉన్నది—అన్నయ్య ఉత్తరం చింపేసినందుకు కలుగుతున్న బాధ మరిచిపో లేకుండా ఉన్నది.

నవీన్‌ను చూచి లేచి కూర్చున్నది, "వదినా నీకు ప్రణామం చేదామని వచ్చాను, నీ పాదధూళి ఈయి," అని నవీన్ అన్నాడు.

నవీన్ వదినతో మాట్లాడడం ఇదే మొదటి మారు.

"కూర్చో," అన్నది కుము.

నవీన్ కూర్చున్నాడు నేలను, "నీకు సేవచేయగలనని నా మనస్సు సంతోషంతో పొంగిపోతుండెను వదినా. కాని నవీన్‌కు అంత అదృష్టమెక్కడ? నాలుగురోజులపాటు మాత్రం నీవు మాకు ప్రాప్తించావు, కాని ఏమీం చేయలేక పోయి నాను—ఆ విచారం మాత్రం మనస్సులో ఉండి పోతుంది," అని నవీన్ అన్నాడు.

కుము—"ఎక్కడికి వెళ్లిపోతారు మీరు ?"

నవీన్—"మమ్మల్ని మా గ్రామానికి పంపేస్తా డనుకుంటాను అన్నయ్య. ఇకమీదట నీతో కలుసుకోవడం కాదేమో బహుశా; ప్రణామంచేసి వెళ్లుదామని వచ్చాను." ఇట్లాగు

అంటూ నవీన్ వదినగారి పాదధూళి తీసుకొన్నాడు. అంతలో మోతీతల్లి పరుగెత్తుకువచ్చి, "త్వరగా వచ్చేయి, బావగారు నిన్ను వెదుకుతూ వస్తున్నారు," అని అన్నది.

నవీన్ తత్క్షణమే లేచి వెళ్లిపోయినాడు, మోతీతల్లి కూడా ఆవెనకనే వెళ్లింది.

అన్న బయటిగదిలో డెస్కుముందరనే కూర్చొని ఉన్నాడు, నవీన్ గదిలోకి వచ్చి అన్నఎదుట నిలబడ్డాడు అటివంటి పరిస్థితులలో నవీన్ ముఖాన కనపడుతుండే సంకోచం నేడు కానరాలేదు.

మధుసూదన్—"డెస్కులో ఉన్న ఉత్తరంమాట వదినతో ఎవరు చెప్పారు ?"

నవీన్—"నేనే చెప్పాను."

మధుసూదన్—"హఠాత్తుగా నీకు ఇంత సాహసం ఎక్కడ నుంచి వచ్చింది ?"

"వాళ్ల అన్నయ్య దగ్గిరనుంచి ఉత్తరం వచ్చిందా అని వదిన నన్నడిగింది. ఉత్తరాలు నీ దగ్గిరికి రాగానే డెస్కులో ఉంచుతావని నాకు తెలుసును, వదిన అడగగానే వచ్చి చూచాను."

"నన్ను అడిగేదాకా ఓర్చి ఉండలేక పోయినావు కాబోలు!"

" వదిన ఆత్రత పడుతుండెను—అందుకని—."

"కనుక నా మాట తో సేయవలసివచ్చింది!"

"ఆమె ఇంటి యజమానురాలు, 'నీ అధికారం ఇక్కడ చెల్ల'దని ఎట్లా చెప్పగలను? 'నీ మాట లక్ష్యపెట్ట'నని చెప్పేటంత పొగరు నాలో లేదు. ఆమె కేవలం ఇంటికి యజమానురాలనే కాక ఆమెయెడల నాకు మిక్కిలి భక్తిశ్రద్ధలు ఉన్నవి- నేను ఆమె ఆజ్ఞ పాలించడం ఆమె పెట్టిన తిండి తింటున్నానని కాదు."

"నిన్ను ఇంత చిన్నప్పటినుంచి చూస్తున్నాను నవీన్, ఇదంతా నీలో పుట్టిన బుద్ధి కాదు, ఈ బుద్ధి నీ తలలో ఎవరు పెడుతున్నారో నే నెరుగుదును. సరే, ఇప్పుడు నాకు వేళ లేదు, రేపు ఉదయమే ట్రేన్‌లో నీవు మన ఊరికి వెళ్లిపో!"

"ఆలాగే," అంటూ నవీన్ గదిలోనుంచి బయటికి వెళ్లిపోయినాడు.

అంత క్లుప్తంగా "ఆలాగే" అంటూ నవీన్ వెళ్లడం మధుసూదన్‌కి ఏమీ నచ్చలేదు. అతను సొణుగుకొంటూ దుఃఖిస్తూ వెళ్లడం సరిఅయిన పని—దుఃఖపడినా మధుసూదనుని సంకల్పం మారిఉండేది కాదు. అయినా నవీన్‌ని మళ్ళీపిలిచి, "నీకు రావలసిన జీతం పుచ్చుకొని వెళ్లిపో,—వచ్చేనెలనుండి నీ ఖర్చులు నీవే పెట్టుకోవాలి, నేనొక్క దమ్మిడీ ఇవ్వలేను," అని అన్నాడు.

"ఆ మాట నాకు తెలుసును, నా వంతుభూమి నేను దున్నుకొని కాలక్షేపం చేస్తాను," అని నవీన్ అన్నాడు.

ఇట్లాగు అంటూ, అన్న ఇంకేమైనా చెప్పవచ్చునని కనిపెట్టిఉండక తత్‌క్షణం వెళ్లిపోయినాడు.

మనుష్యుని స్వభావంలో అనేక పరస్పర విరుద్ధమైన గుణాలు కలిసి ఉంటవి—దీనికి ప్రమాణం మధుసూదనుకు నవీనునియెడలగల గాఢానురాగమే, అతని మిగతా ఇద్దరు అన్నదమ్ములూ తమ ఆస్తులను చూసుకొంటూ రజబ్‌పూరులో పడి ఉన్నారు—వాళ్లసంగతి ఏమయిందని ఎన్నడూ అడగనైనా అడగడు మధుసూదన్. తండ్రి మరణానంతరం నవీన్‌ను కలకత్తా తీసుకువచ్చి అతనికి చదువుచెప్పిస్తూ తన దగ్గరనే ఉంచుకొన్నాడు. సంసారం చక్కగా నడిపే నేర్పు నవీన్‌లో స్వాభావికంగా ఉన్నది. అతను బహు నమ్మకైన మనిషి—ఇదే అన్న అనురాగానికి కారణం. ఇంకొక కారణం ఏమిటంటే, నవీనుని మాటలనుబట్టీ అతని నడవడినిబట్టీ అందరికీ అతనంటే చాలా ఇష్టం. ఆ ఇంట్లో ఎవరికి ఎవరితో కలహం కలిగినా నవీన్ సులభంగా దానిని చల్లార్చగలిగేవాడు. ఎవరేమన్నా, ఏమీ లేదు అన్నట్టుగా ఒక్క నవ్వుతో దానిని ఎగరగొట్టేవాడు. ఎవరిది న్యాయమో నిర్ణయించడం కాదు అతను చేసేపని. నవీన్ ధోరణి చూచి ప్రతివాడూ అతను ముఖ్యంగా తన పక్షమే అని అనుకొనేవాడు.

మధుసూదన్‌కు నవీన్‌అంటే హృదయపూర్వకమైన అనురాగం ఉన్నదనడానికి ఇంకొక ప్రమాణమేమిటి అంటే,

మధుసూదన్ మోతీతల్లిని చూచి ఓర్చి ఉండలేక పోయే వాడు—ఎవరియెడల అతను అనురాగం కలిగి ఉంటాడో అతనిమీద తనకు ఏకాధిపత్యం కావాలి. కనుక, భర్తమనస్సు విరుస్తూ ఉండడం నవీన్‌భార్య చేస్తున్నపని అని మధుసూదనుని ఊహ. తమ్మునిమీద తనకుగల పైతృకాధికారానికి అడ్డుగా బయటిస్త్రీ ఒక ఆమె వస్తున్నది. మధుసూదన్‌కు నవీనుని యెడలగల అనురాగం ఇంత గాఢమైనది కాబట్టిగాని, లేకుంటే చాలా రోజులకు పూర్వమే మోతీతల్లిపై ఉద్వాసదండన విధించబడేది.

ఈ రవంత పని చేసేసి తిరిగి ఆఫీసుకు వెళ్లిపోదామని మధుసూదన్ ఇంటికి వచ్చాడు, కాని మనస్సుకు బలం కలగ లేదు. కుము ఆ ఉత్తరం చించి పారేసి వెళ్ళిపోయిన దృశ్యం అతని మనస్సులో గాఢంగా ముద్రించబడి పోయింది. అటు వంటి ఆశ్చర్యకరమైన చిత్రం నేటివరకు ఎన్నడూ ఆతని అనుభవంలోకి రాలేదు. మధుసూదన్‌ది ఎవరినీ నమ్మే స్వభావం కాదు, కనుక కుము ఆ ఉత్తరం చించివేయకముందు చదివే ఉంటుందని మొట్టమొదట అనుకున్నాడు. కాని కుము ముఖాన స్పష్టంగా కనబడుతుండే నిర్మల సత్యదీప్తి అతని సందేహాన్ని అతిత్వరలో చెదరగొట్టేసింది.

కుముపైని అధికారం ప్రయోగించే శక్తి మధు సూదన్ తానే పోగొట్టుకున్నాడు. ఇప్పుడు తనలోనున్న లోటుపాట్లన్నీ తనకే స్పష్టమయి బాధించడం మొదలుపెట్టినవి.

తాను వయస్సు ముదిరిపోయినవా డన్నమాట మరుపురా కుండా ఉన్నది. తలనెరిసిపోతూ ఉన్నది, అది ఏలాగైనా దాచి ఉంచగలిగితే అదృష్టవంతుడని అనుకొంటున్నాడు. వెంట్రు కలకు ఉండవలసిన రంగు నలుపని భగవంతుడు మరిచి పోవడం చాలా అన్యాయం, ఈ అన్యాయం అతనిని చాలా బాధిస్తు న్నది. కుము మనస్సు తన పిడికిలిలోనుంచి తప్పించుకు పోతు న్నది—దీనికి కారణం తనకు యౌవనమూ, సౌందర్యమూ లేక పోవడం ఒక్కటే, దానికేమి సందేహం లేదని అతని నమ్మకము. ఈ విషయంలో అతను కేవలం అస్త్రహీనుడు, దుర్బలుడు. చాటర్జీల అమ్మాయిని పెళ్లాడాలని నిశ్చయించుకున్నాడు, కాని వివాహానికి పూర్వమే ఆమెచేత ఓడగొట్టబడే ఏర్పాటు విధాత చేశాడని మధుసూదన్ ఊహించలేదు. ఎవరిపై తాను నిరాటంకంగా అధికారం చలాయించగలిగి ఉండునో అటు వంటి సామాన్య స్త్రీ భార్యగా దొరికిఉంటే బాగుండేది అని నమ్మగల బలం అతనిలో ఇప్పుడు లేదు.

మధుసూదన్ గర్వపడగలవిషయం ధనం ఒక్కటే. ఆవాళ ఉదయమే ఒక జవహరీ వర్తకుని పిలిపించి మూడు ఉంగరాలు కొన్నాడు—వాటిలో కుము దేనిని ఇష్టపడు తుందో చూదామని అతని ఉద్దేశం. మూడు ఉంగరాల డబ్బీలు మూడుజేబుల్లో ఉంచుకొని పడకగదిలోకి వచ్చాడు. ఒకదానిలో కెంపు కట్టిన ఉంగరం ఉన్నది, ఒకటి పచ్చకట్టిన

ఉంగరము, మూడోది వజ్రంకట్టినది. మధుసూదనుని ఊహానే త్రానికి ఈ దిగువను వివరించిన దృశ్యం కనబడ్డది.

మధుసూదన్ మొట్టమొదట కెంపు తాచిన ఉంగరం కుసుమ ఎదుట పెడుతున్నాడు. కుసుమ నేత్రాలు కోరికతో ఉజ్వలం అయినవి. తరువాత పచ్చ తాచినఉంగరం బయటికి తీశాడు, కళ్లు ఆనందంతో మరీ పెద్దవైనవి. ఆఖరికి వజ్రపుటుంగరం చూపిం చాడు, మితిలేని ఆశ్చర్యం కలిగింది కుసుముకు. అప్పుడు రాజు లకు ఉచితమైన గాంభీర్యంతో మధుసూదన్ అంటున్నాడు— "నీ కేది నచ్చితే అది తీసుకోవచ్చు," అని. కుసుమ వజ్రపుటుంగరం ఇష్టపడ్డది. ఆమె పిరికిసాహసం చూచి మధుసూదన్ చిరునవ్వు నవ్వి ఆ మూడు ఉంగరాలను కుసుమ మూడు వ్రేళ్లకు పెట్టాడు.

ఇదిఅంతా రాత్రిభోజనం అయిన తరువాత జరగబో తుంది అని మధుసూదన్ ఆశించాడు. కాని మధ్యాహ్నం అంతా తలక్రిందుల అయిపోవడంవల్ల మరి ఓర్చి ఉండలేక పోయినాడు. రాత్రి దృశ్యంయొక్క భూమిక ఇప్పుడే జరి గించేదామని అంతఃపురంలోకి వచ్చాడు.

వచ్చి చూచేటప్పటికి ఒక టిన్ పెట్టె తెరిచి కుసుమ నేలను కూర్చొని పెట్టె సరుదుతున్నది. బట్టలూ మొదలైనవన్నీ నాలుగువైపులా పడి ఉన్నవి.

"ఇదేమిటి, ఎక్కడికైనా వెళ్లుతున్నావా?"

"ఔను."

"ఎక్కడికి?"

"రజబ్ పూరు."

"ఏమిటి దాని అర్థం?"

"సొరుగు తెరిచినందుకు మరిదిగారిపైని శిక్ష విధించావు, ఆ శాస్తి నాది."

వెళ్లవద్దని కోరుతూ దగ్గిర కూర్చోవడం మధుసూదనుని స్వభావానికి విరుద్ధము; 'వెళ్లనీ వెళ్ళి అక్కడ ఎన్నాళ్లుంటుందో నేనూ చూస్తాను,' అని తత్ క్షణం తనలో తా నను కొంటూ ఒక్క క్షణమైనా అక్కడ ఉండక గబగబ బయటికి వెళ్ళిపోయినాడు.

## ౩౭

మధుసూదన్ బయటికి వచ్చి నవీన్‌ను పిలిపించి, "వదినకు మీారు పిచ్చెత్తించేస్తున్నారే!" అని అన్నాడు.

"రేపే మేము వెళ్ళిపోతున్నాము అన్నయ్యా, మాట మాటకు భయంతో గుటకలు మింగుతూ ఇక్కడ ఉండడం నాతరం కాదు, కాని వెళ్లేముందర ఒక్కమాట చెపుతున్నాను, జ్ఞాపకం ఉంచుకో—వదినకు పిచ్చెత్తించడానికి ఈ లోకంలో ఇంకెవ్వరూ అక్కరలేదు, నీవొక్కడివే చాలును. మేముఉంటే, కొంచెమైనా మనశ్శాంతి కలిగించి ఉండునేమో, కాని అది కూడా నీవు సహించి ఉండలేక పోయినావు."

మధుసూదన్ గర్జిస్తూ అన్నాడు—"ముసలిమాటలాడకు, రజబ్ పూర్ వెళ్లుదామని ఆమెకు నేర్పింది మీారే."

"నే నెప్పుడూ ఆమాట అనుకోనైనా లేదు కదా ఆమెకు ఏలాగు నేర్పగలను?"

"ఇదిగో విను, ఆమెను మీ ఇష్టప్రకారం ఆడిస్తున్నారు, దానివల్ల మీకు మేలుకలగదు—స్పష్టంగా చెపుతున్నాను, జ్ఞాపకం ఉంచుకో."

"ఎవరితో అన్నయ్యా, ఈ మాటలన్నీ? ఎక్కడ చెపితే లాభంఉంటుందో అక్కడ చెప్పు."

"మీరేమీ అనలేదూ?"

"ఇదిగో నీపాదాలు ముట్టుకు చెపుతున్నాను— నే నెన్నడూ ఆలాగు ఊహించనైనా లేదు."

"వదిన మీతో వస్తానని ఒకవేళ పట్టుపట్టుకు కూర్చుంటే మీరేమి చేయబోతున్నారు?"

"నీకు కబురుపంపిస్తాను. నీనౌకర్లు, పాయకులు, గుమాస్తాలు, నీవు—అంతా కలిసి అడ్డురావచ్చును. తరువాత నీశత్రువులు ఈ యుద్ధవార్త విని వార్తాపత్రికలలో ప్రచారణ చేస్తేమాత్రం చిన్నతోటికోడలిమీద తప్పుమోపకు."

మధుసూదన్, గదిమి, జబాబు చెప్పాడు—"నోరుమూయి! వదిన వెళ్లాలంటే వెళ్లనీ నేను అడ్డుపెట్టను."

"ఆమెను మేము ఎట్లా పోషించగలము?"

"నీ భార్యనగలు అమ్మి!—పో—పొమ్మన్నాను పో—పో, గదిలో నుంచి."

నవీన్ వెళ్ళిపోయినాడు. మధుసూదన్ రుమాలుమీద ఉడికొలోన్ వేసి తలమీదవేసుకొని, తిరిగి ఆఫీసుకు వెళ్ళవలె నని దృఢసంకల్పం చేసుకొంటున్నాడు.

మోతీతల్లి నవీన్ద్వారా సంగతిఅంతా తెలుసుకొని, కుముగదిలోనికి పరుగెత్తి వచ్చింది, కుము బట్టలు మడతపెడు తున్నది, ఇంకా పెట్టెలో సరదలేదు. "ఏమిటిచేస్తున్నావు అక్కా?" అని మోతీతల్లి అడిగింది.

"మీతో వస్తాను."

"నిన్ను మాతో తీసుకువెళ్ళడం సాధ్యమా?"

"సాధ్యం కాకేమి?"

"బావగారు అట్లాగైతే మాముఖం మరిచూడరు."

"ఆలాగైతే నాముఖమూ కనబడదు."

"ఆలాగే ఔతుందనుకో—దానివల్ల లాభమేమిటి మేము బహు బీదవాళ్ళమే!"

"నేను మీకంటె గొప్పదానను కాను, ఏలాగో గడుపు కుందాము."

"బావగారిని చూచి నలుగురూ నవ్వుతారే!"

"ఆలాగనిచెప్పి నాకోసమని మీరు శిక్షపొందడం చూచి నేను భరించి ఉండలేను."

"కాని ఆశిక్ష నీకోసమని కాదే, మా అపరాధానికనే."

"మీరు చేసిన పాపమేమిటి?"

"ఉత్తరంమాట నీతో చెప్పినది మేమేకాదా?"

"నేను అడిగినప్పుడు చెప్పడం మీ తప్పా?"

"యజమానితో ముందు చెప్పకుండా నీతో చెప్పడం తప్పు."

"అలాగైతే మీది తప్పే నాదీ తప్పే, కనుక అందరము కలిసే ఫలం అనుభవిద్దాము."

"సరే అలాగైతే నీకోసం పల్లకీ సిద్ధంచేయమని చెప్తాను. నీవు వెళ్లుతానంటే అడ్డుపెట్టవద్దని బావగారి ఆజ్ఞ అయింది. ఇక నీ సామాను నన్ను కొంచెము సరదనీ, సరదలేక నీవు చెమటపట్టి పోతున్నావు."

ఇద్దరూ సరుదుతూ కూర్చున్నారు.

బయట చెప్పుల చప్పుడు వినబడగానే మోతీతల్లి లేచి గబగబ పరుగెత్తింది.

మధుసూదన్ గదిలోకివచ్చి, "నీవు వెళ్లడానికి వీలు లేదు" అని అన్నాడు.

"వీలు ఎందుకు లేదు?"

"నా ఆజ్ఞ గనుక."

"సరే, వెళ్లను ఐతే, తరువాత ఏమిఆజ్ఞ?"

"సామాను సరదడం నిలపాలి."

"సరే నిలిపేశాను" అని అంటూ లేచి కుము గదిలో నుంచి బయటికి వెళ్లింది. "మధుసూదన్ వెనకనుంచి, విను, విను ఇదిగో," అని కేకవేశాడు.

కుము తిరిగి గదిలోకి వచ్చి, "ఏమిటి చెప్పు," అన్నది.

చెప్పవలసినది ఏమీలేక, కొంచెముసేపు ఊరుకొని, "నీకోసం ఉంగరం ఒకటి తీసుకువచ్చాను," అన్నాడు.

"నేను పెట్టుకోగోరే ఉంగరం పెట్టుకోకూడదని అన్నావు, నాకు మరి ఏఉంగరమూ అవసరంలేదు."

"ఒక్కమారు చూడకూడదా?"

మధుసూదన్ ఒకొక్కడబ్బీ మూత విప్పి కుముఎదుట పెట్టుకొన్నాడు. కుము ఒక్కమాట అనలేదు.

"వీటిలో నీకేది ఇష్టమైతే దానిని పెట్టుకోవచ్చు," అన్నాడు, మధుసూదన్.

"ఏది పెట్టుకోమని నీ ఆజ్ఞో అది పెట్టుకుంటాను," అన్నది కుము.

"మూడూ పెట్టుకుంటే బాగుంటుందని నా అభిప్రాయం."

"ఆజ్ఞ అయితే మూడూ పెట్టుకుంటాను."

"ఉంగరాలను నన్ను పెట్టనీ."

"సరే."

మధుసూదన్ కుమువేళ్లకు ఉంగరాలు పెట్టాడు.

"ఇంకేమైనా ఆజ్ఞ ఉన్నదా?" అని కుము అడిగింది.

"నామీద కోపం ఎందుకు రాణీ?" అని మధుసూదన్ అడిగాడు.

"కోప మేమీలేదు," అని అంటూ మళ్ళీ గదిలోనుంచి బయటికి వెళ్లిపోయింది కుము.

మధుసూదన్ చీకాకు పడుతూ, "ఎక్కడికి వెళ్లిపో తున్నావు, విను విను," అని అన్నాడు.

తత్ క్షణమే తిరిగివచ్చి, "ఏమిటి చెపుతావో చెప్పు," అని అడిగింది కుము.

మధుసూదన్‌కు తోచలేదు, ఏమిటి అడగడమో; ముఖం ఎర్ర చేసుకొని, "పో, వెళ్లు," అని అన్నాడు. "నా ఉంగరం నాకిచ్చేసి పో," అని మళ్ళీ అన్నాడు కోపంతో మండిపడుతూ.

కుము మూడు ఉంగరాలూ తీసి టీపాయ్ మీద ఉంచింది.

"పో," అని మధుసూదన్ గదిమాడు.

తత్ క్షణమే బయటికి వెళ్లిపోయింది కుము.

తిరిగి ఆఫీసుకు వెళ్లవలెనని నిశ్చయించుకొన్నాడు. మధుసూదన్.

అప్పటికి ఆఫీసు మూసేవేళ దాటిపోయింది. ఉద్యోగస్థులలో దొరలంతా టెన్నిస్ ఆటకు వెళ్లిపోయినారు. పెద్ద గుమాస్తాలందరూ లేవబోతున్నారు, అట్లాంటప్పుడు ఆఫీసుకు వచ్చి పని తీవ్రంగా ప్రారంభించాడు మధుసూదన్. ఆరుఘంటలు కొట్టారు, ఏడు కొట్టారు, ఎనిమిది కొట్టబోతున్నారు, మధుసూదన్ కాగితాలు మడత పెట్టివేశాడు.

32

మధుసూదనుని జీవయాత్ర ఇప్పటివరకు ప్రతిరోజూ ప్రతినిమిషమూ నిశ్చిత నియమానుసారం నడుస్తూ వచ్చింది— గొలుసులో ఎక్కడా ఒక్క గుండిఅయినా తెగలేదు. ఇప్పుడు అనిశ్చితమైనది ఒకటి వచ్చి అతని జీవితాన్ని తారుమారు చేసింది. ఆఫీసునుండి ఇంటికి తిరిగి వస్తున్నాడు గాని రాత్రి ఇంట్లో ఏమి జరగబోతుందో ఊహించలేక పోతున్నాడు. ఆనాడు అతను భయపడుతూ భయపడుతూ ఇంటికివచ్చి మెల్లి మెల్లిగా భోజనము చేశాడు. కాని అప్పటికీ పడకగదిలోకి వెళ్లడానికి సాహసం కలగలేదు. కొంచెముసేపు బయట దక్షిణ వరండామీద పచారిచేశాడు. తొమ్మిది ఘంటలయింది. అతను పడుకుండే వేళ; అంతఃపురంలోకి వచ్చాడు. ఇవాళ మామూలు వేళకు పడుకుంటానని శపథం చేసుకున్నాడు. ఏమైనసరే ఆ శపథం నెగ్గితీరాలి అని నిశ్చయించుకొన్నాడు. పడకగది శూన్యం. ఆగదిలో ప్రవేశించి దోమతెర ఎత్తి మంచం ఎక్కి దుబ్బుమని పరుపుమీద కూలపడ్డాడు. ఎంతకూ నిద్ర రాకుండా ఉన్నది. రాత్రి అవుతున్నకొలది ఉపవాసం చేస్తున్న అతని జీవితం లోపలిఅంధకారంలోనుండి మెల్లి మెల్లిగా బయటికి వచ్చేస్తున్నది.

నడిరేయి, మధుసూదన్ అప్పుడు బయటికి రావలెనంటే అడ్డు పెట్టగలవారు ఎవ్వరూ లేరు—పహరావాళ్లందరూ అలసి పడిఉన్నారు.

రాత్రి ఒంటిఘంట అయింది, కంటిమీద రెప్పవాల లేదు. మరి ఉండలేక లేచి కుము ఎక్కడఉన్నదో అని ఆలోచిస్తూ పరుపుమీద కూర్చున్నాడు. లాంతర్ల గదికి ఎల్లప్పుడూ తాళం వేసే ఉంచాలని మధుసూదన్ బంకుకు ఇచ్చిన ఖచితమైన ఆజ్ఞ.

మధుసూదన్ లేచి, డాబామీదికివచ్చి చూచాడు, ఎవ్వరూ లేరు. చెప్పులు వదిలి మేడ దిగి, మెల్లిగా వరండా వెంబడి వచ్చాడు, మోతీతల్లిగదిదగ్గరకు వచ్చేసరికి లోపల మాటల శబ్దం వినబడ్డట్టయింది. మర్నాడు వెళ్లిపోతారు గనుక భార్యాభర్తలేమో మాట్లాడుకుంటూన్నా రనుకొని ఆ గది తలుపుమీద చెవిపెట్టి విన ప్రయత్నించాడు. లోపున ఏవో గుసగుసలు జరుగుతున్నవి ఏమీ వినబడలేదు, కాని ఇద్దరి స్త్రీలకంఠాలని మాత్రం స్పష్టంగా తెలుస్తున్నది. అయితే ఎడబాటుకు ముందు రాత్రి కుము తన మనస్సులోని మాట లన్నీ మోతీతల్లితో చెపుతున్న దన్నమాట. మధుసూదన్‌కు కోపంవచ్చింది, ఒక్కతాపు తన్ని తలుపు విరగకొట్టి లోపల ప్రవేశించి ఒకనాటకం ఆడాలని బుద్ధిపుట్టింది. కాని నవీన్ ఎక్కడ? లోపల ఉన్నవాళ్లు కుమూ మోతీతల్లీ అయితే నవీన్ బయటను ఎక్కడో ఉండాలి.

అంతఃపురంలోనుంచి బయటికి వచ్చేదారికి రెండు వైపులా జాలుకట్టి ఉన్నది, అక్కడ చిన్నదీపం ఒకటి మిణుకు మిణుకు మని వెలుగుతున్నది. మధుసూదన్ అక్కడికి వచ్చి చూచేసరికి ఎర్రనిశాలువు కొప్పుకొని శ్యామ కనపడ్డది. ఆమె

కనబడగానే అతనికి సిగ్గువేసింది, పట్టరాని కోపం వచ్చింది, "ఇక్కడ ఏమిచేస్తున్నావు ఈ అర్ధరాత్రివేళ?" అని అడిగాడు.

శ్యామ జబాబుచెప్పింది—"నిద్రపోతున్నాను, అడుగుల శబ్దం వినబడి భయపడ్డాను—బయట ఎవరో—"

మధుసూదన్ వేలెత్తి భయపెడుతూ అన్నాడు—"నీకు సాహసం చాలా అధికమైపోయింది, నాదగ్గర ఆటలాడకు, జాగ్రత్త! వెళ్లి పడుకో."

శ్యామాసుందరి కొన్నాళ్లబట్టి తనరాజ్యాన్ని నాలుగువైపులా విస్తరిస్తూ ఉన్నది. ఆమెసాహసం పెరిగింది, కాని మధుసూదనుని జబాబు తాను వినగానే అ-సమయంలో అ-స్థలంలో అడుగు వేశానని పోల్చుకొన్నది, అతిదీనంగా మధుసూదనుని వైపు ఒక్కమారు చూచి, ముఖము వెనుకకు తిప్పి పయటిచెంగుతో కళ్లు తుడుచుకొన్నది, వెళ్లిపోబోయి, నిలుచొని, ఒక్కమారు ఇలా అన్నది—"నేను ఆటలాడడం లేదు అబ్బాయి, నీమాట తలచుకుంటే రాత్రికంటికి నిద్ర రాదు. నేను ఈ ఇంటికికొత్తగా వచ్చినదానను కాను, నిన్నామొన్నటి సంబంధంకాదు, మనది—చూస్తూ ఎట్లా భరించగలను?"—అంటూ తొందర తొందరగా లోపలికి వెళ్లిపోయింది.

మధుసూదన్ కొంచెంసేపు నిలుచొని బయటి గదివైపు వెళ్లాడు, వెళ్లుతూ సరిగా చౌకీదార్ కంటపడ్డాడు, చౌకీదార్ అప్పుడు పారా ఇస్తున్నాడు. మధుసూదన్ చేసిన ఏర్పాట్లు

బహుకరీనమైనవి—ఆ ఏర్పాట్లవల్ల తనఇంట్లో తానే ఎవరికంటా పడకుండా నడిచేవారి లేదు. ఆ వ్యూహాంమధ్య నడవబోతే ఎవరికంటో పడక తప్పదు. రాజాబహదూర్ వారు ఈ అర్ధ రాత్రివేళ ఉత్తకాళ్లతో బయటి వరండామీద దయ్యంలాగు తిరుగుతుండడము ఇంతకుపూర్వం ఎన్నడూ జరగలేదు. ఎవరో కనబడగానే చౌకీదారు దూరంనుంచి †"కోఙ్హై?" అని కేక వేశాడు, దగ్గిరపడగానే నాలుకకరుచుకొని, వంగి, పెద్దనమస్కారం చేసి, "రాజబహదూర్ వారి ఆజ్ఞ ఏమిటి?" అని అడిగాడు.

"అంతా సరిగా జరుగుతున్నదో లేదో చూదామని వచ్చాను," అని అన్నాడు మధుసూదఙ్—అతను నిజంగానే అలా చేయవలసినవాడుకూడాను.

మధుసూదఙ్, తరువాత, ముందుగదిలోకివెల్లి చూచేసరికి తాననుకొన్నదే అయింది—నవీఙ్ పెద్దసోఫామీద, తలకింద తలగడపెట్టుకొని, హాయిగా నిద్రపోతున్నాడు. మధుసూదఙ్ గ్యాస్‌దీపం వెలిగించాడు, అయినా నవీఙ్‌కు తెలివిరాలేదు; మధుసూదఙ్ దగ్గరకు వెళ్లి చేతితో కదపగా గడబడపడుతూ లేచి కూర్చున్నాడు. మధుసూదఙ్ అతన్ని ఏమీ ప్రశ్నించ లేదు, సమాధానం అడగలేదు, "తత్‌క్షణం వెళ్లి, వదినను నా పడకగదిలోకి రమ్మంటున్నానని చెప్పు," అని అన్నాడు; అంటూ అంతఃపురంలోకి వెళ్ళిపోయినాడు.

---

† ఎవరది?

కొంచెముసేపటిలోనే కుము గదిలోకి వచ్చింది, ఆమె ఎర్రంచు మామూలు తెల్లచీరకట్టుకొని ఉన్నది, పైటచెంగు తలమీదికి లాగిఉన్నది. మిణుకుమిణుకు మంటున్న దీపపు కాంతిలో, ఆ నిర్జనస్థానంలో బహుఅద్భుతంగా కనబడుతున్నది. ఆమె వచ్చి గదిమూలనున్న సోఫామీద కూర్చున్నది.

మధుసూదన్ తత్‌క్షణం దగ్గరికివచ్చి ఆమె కాళ్లదగ్గర నేలమీద కూర్చున్నాడు. కుము సంకోచిస్తూ కంగారుగా లేవబోతుంటే మధుసూదన్ ఆమెచెయ్యిపట్టుకొని తిరిగి కూర్చోబెట్టి, "నేను చెప్పవలసినది ఉన్నది విను, నీవు నన్ను క్షమించాలి, నేను అపరాధం చేశాను," అని అన్నాడు.

మధుసూదన్ ఇట్లా ఎన్నడైనా చేయవచ్చునని కుము ఊహించలేదు, అతని వినతి విని కుముకు ఆశ్చర్యం కలిగింది, అప్పుడు మధుసూదన్ మళ్ళీ అన్నాడు, "నవీన్‌నూ మీతోటి కోడలినీ రజబ్‌పూర్ వెళ్లవద్దని చెపుతాను, నీ ఉపచారానికై వాళ్లు ఇక్కడే ఉంటారు."

ఏమి జవాబు చెప్పడమో కుముకు తోచలేదు. మధుసూదన్ తన పౌరుషాన్ని దిగమింగి భార్యపౌరుషాన్ని పోగొట్టవలెనని నిశ్చయించుకొన్నాడు; చేతులు జోడించి, "నేను బయటికి వెళ్లి ఇప్పుడే వస్తాను, నీవు వెళ్లిపోనని మాట ఈయి," అని వేడుకొన్నాడు.

"లేదు, వెళ్లను," అని కుము అన్నది.

మధుసూదన్ మేడ దిగి కిందికి వెళ్లాడు.

మధుసూదన్ నీచంగాను కఠోరంగాను ప్రవర్తిస్తున్నంత సేపు కుముకు అంత కష్టం అనిపించలేదు కాని నేడు అతను కనపరిచిన నమ్రతా అణకువా చూచి మధుసూదన్‌కు ఏమి జబాబు చెప్పాలో ఆమె ఊహించుకోలేకపోయింది. దానం చేయగోరి ఆమె తనహృదయాన్ని ఆ దానంతో నింపి తీసుకొని వచ్చింది, ఆదానం కిందపడి ధూళిపాలైంది, దానిని ధూళిలో నుండి ఎత్తడం అసంభవం అని ఎరిగి, భగవంతుని ప్రార్థించడం ప్రారంభించింది—"ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుం."

అప్పుడే మధుసూదన్ నవీన్‌నూ మోతీతల్లినీ తీసుకొని తిరిగి గదిలోకివచ్చి వారిద్దరినీ ఆమెఎదుట నిలబెట్టి వాళ్లను సంభోదిస్తూ అన్నాడు—"రేపు మీారిద్దరూ రజబ్‌పూర్ వెళ్ళిపోవాలని అన్నాను, కాని వెళ్లనక్కరలేదు, రేపటినుండి మీారు కుముకు సేవచేస్తూ ఇక్కడే ఉండాలి."

ఆ మాట విని వారిద్దరూ నిర్ఘాంతపోయినారు. ఇటువంటిది జరగగలదని వారెన్నడూ ఊహించలేదు, అదికాక ఈ అర్ధరాత్రివేళ ఇద్దరినీ మేడమీాదికి, ఆమెఎదుటికి, తీసుకొని వచ్చి ఈ విధంగా చెప్పవలసిన అవసరమేమి వచ్చిందో వాళ్లకు బోధపడలేదు.

మధుసూదన్ ఓర్చి ఉండలేకపోయినాడు. కుముకు తానుఅంటే ఇష్టము కలగవలెనని దుర్నివార్యమైన

కోరిక కలిగి, తన సంకోచమూ, గర్వమూ, లుబ్ధత్వమూ పూర్తిగా వదిలి, చేయగలిగినదంతా చేయవలెనని నిశ్చయించుకొన్నాడు. అతని జీవితంలో ఇటువంటిది ఎన్నడూ జరగలేదు. తానుకోరుతున్నదాన్ని పొందవలెనని తనకు మించిన ఖరీదుకూడా ఇప్పుడిచ్చాడు—అనగా మధుసూదన్ కుముతో తాను చాలలేనని తనభాషలో ఒప్పుకొన్నాడు.

కుము గొప్ప సందిగ్ధావస్థలో పడ్డది. ఈ దానాన్ని ఎట్లా అందుకోవాలో ఆమెకు బోధపడలేదు. దానికి బదులుగా ఆమె ఈయగలదేమి ఉన్నది? విఘ్నాలు బయటివై ఉన్నంతసేపు, వాటితో పోట్లాడడానికి కావలసినబలం లోపున పుడుతూ ఉంటుంది—అప్పుడు భగవంతుడు తానే స్వయంగా మనకు సాయంచేస్తుంటాడు. బయటి శత్రువు పరాజితుడు కాగానే యుద్ధం నిలిచిపోతుంది, కాని శత్రువుతో సంధి జరగదు—మనలోపలను బయటను ఉండే ప్రతికూలత ఉన్నదిఉన్నట్టుగానే ఉంటుంది. మధుసూదన్ పౌరుషంగా నిలబడి ఉన్నంతసేపు కుముకు అతనితో వ్యవహరించడం ఎంత అయిష్టంగా ఉన్నా సులభంగా ఉండేది. ఇప్పుడు అతను నమ్రత కనపరచడంచేత అతనితో వ్యవహరించడం కుముకు బహుకష్టంగాతోస్తున్నది. అతను ఆమెను అన్యాయంగా అవమానపరుస్తున్నంతసేపు ఆమెలో పుడుతున్న స్వాభిమానం ఆమెకు దెబ్బతగలకుండా చేసేది; ఆమె దీపాలగదిలోకివెళ్ళి హాయిగా ఉండగలిగేది. ఇప్పుడు ఆ ఆశ్రయం శాంతిని ఈయ

డం లేదు, చేతులుజోడించుకొని దేవుని ప్రార్థించడంలో ఇప్పుడు అర్థం లేదు.

అట్లాంటప్పుడు మోతీతల్లిని ఏదో నెపంమీద తనదగ్గిర ఉంచుకోగలిగిఉంటే కుసుమ బ్రతికి ఉండును. కాని నవీన్ వెళ్ళి పోగానే మోతీతల్లి మతిపోయిన దానివలె అతని వెంట పడ్డది—ద్వారందాకా వెళ్ళి దిగులుపడుతూ వెనుకకు ఒకసారి చూచి వెళ్ళిపోయింది. భర్తగారి ప్రసన్నతనుండి తనను ఇప్పుడు రక్షించగలవాళ్లెవరు?

"చీర మార్చుకొని పడుకోడానికి రావు రాణీ?" అని మధుసూదన్ అన్నాడు.

మెల్లిగా అడుగులు వేసుకొంటూ కుసుమ స్నానాలగది లోకి వెళ్లింది—స్వేచ్ఛగా ఉండగల వ్యవధి ఇక ఆట్టే లేదని కుసుముకు భయం కలిగింది, ఆ వ్యవధిని సాధ్యమైనంత పొడు గించుకుందామని ఆమెకు బుద్ధిపుట్టింది, స్నానాలగదిలో గోడ దగ్గిరనున్న కుర్చీమీద కూర్చున్నది. తాను దాగోరగల మూల ఒకటి దొరుకుతుందేమో అని ఆమె తన దేహంలోపలనుండే మనస్సులో వెదుకుతున్నట్టు కనబడ్డది. బయట మధుసూదన్ ఉండిఉండి గోడనున్న గడియారం చూచి లెక్క వేస్తున్నాడు, చీర కట్టుకోడానికి ఎంతవేళపట్టుతుందో అని. ఎదుటనున్న అద్దంలో ముఖం చూచుకొంటూ తలవెనకను క్రిందిభాగంలో ఉండే వెండ్రుకలు బ్రష్‌తో గట్టిగా నొక్కి దువ్వుతున్నాడు,

ఎంత నొక్కినా నిర్లక్ష్యంగా తిరిగి మీదికి లేస్తున్నవి వెండ్రు కలు; టేబిల్ మీదనున్న లవండర్ సీసా విప్పి చొక్కామీద ఒత్తుగా జల్లుకున్నాడు.

పదిహేను నిమిషాలయింది, బట్ట మార్చుకోడానికి అంత కంటె అవసరంలేదు. మధుసూదన్ మెల్లిగా అడుగులు వేసు కొంటూ స్నానాలగది దగ్గరకు వచ్చి తలుపుమీద చెవిఉంచి విన్నాడు, లోపల ఏమీ శబ్దం వినబడలేదు—కుము, తల దువ్వుకొంటున్నది కాబోలు, లేక ఏలాగు సిగవేసుకుంటే బాగుంటుందని ఆలోచిస్తున్నదో, అని మధుసూదన్ అను కొన్నాడు. ఆడవాళ్లకు ముస్తాబంటే చాలా సరదా అని ఊహించి, ఓర్చి ఉండక వీలులేదని అనుకొన్నాడు. అరఘుంట అయింది. మరొకమారు తలుపుమీద చెవిపెట్టాడు, అప్పటికీ ఏశబ్దమూ లేదు. తిరిగివచ్చి కుర్చీమీద కూర్చుండబడి ఎదుట గోడకు వేలగట్టిఉన్న సీమపటాన్ని చూస్తూ కొన్ని నిమిషాలు గడిపాడు; తరువాత హఠాత్తుగా లేచి తలుపుదగ్గిరికివచ్చి, "ఇంకా కాలేదు రాణీ?" అని అడిగాడు.

కొంచెంసేపటికి స్వప్నచారిణివలె మెల్లిమెల్లిగా లేచి తలుపుతీసింది కుముదిని. ఇంకా ఆ చీరే కట్టుకొని ఉన్నది; అది రాత్రి పడుకొనేటప్పుడు కట్టుకొనే చీరకాదు. నిండుచేతుల బ్రౌన్ రంగు సర్జ్ జాకెట్ ఒకటి తొడుగుకొని ఉన్నది, ఎర్రంచు బాదంరంగుశాలువ తలమీదనుంచి లాగికప్పుకొని ఉన్నది. ఎడమచెయ్యి తలుపుమీదను ఉంచి, ఏదో ఆలో

చిస్తూ ఏమిచేయాలో స్థిరపరుచుకోలేకున్నట్టు, నిలబడి ఉన్నది. వర్ణింపశక్యంకాని అపురూప రూపం, అతి మనోహరమైన తెలుపు; బంగారు మకరముఖగాజులు, సాదావి, చేతులకు ఉన్నవి - పూర్వపు పద్ధతిని చేసినవి—బహుశా అవి ఆమెతల్లివి అయిఉంటవి. ఆ నాజూకు చేతులకుఉన్న ఆ మోటు బంగారుగాజులు ఐశ్వర్యాన్నీ గౌరవాన్నీ చాటిస్తూ అతి సహజంగానూ అతి సామాన్యంగానూ కనబడుతున్నవి; వాటిలో ఏమాత్రం ఆడంబరమూ కానరాలేదు. కుము మధుసూదనునికి నేడు పూర్తిగా కొత్తగా కనబడ్డది, చూచి అతనికి అమితాశ్చర్యం కలిగింది. తన చిరార్జిత సంపదకు నేడు సిరికల్గిందని అనుకోకుండా ఉండలేక పోతున్నాడు. సదా అతనికి కనబడుతుండేవాళ్లలో అనేకులకంటె ధనగౌరవం తాను పొందుతున్నట్టు మధుసూదన్ నమ్మేవాడు. నేడు గ్యాస్ లైటు వెలుగున పడకగది తలుపుపక్కను నిశ్చలంగా నిలబడిఉన్న కుమును చూస్తున్న మధుసూదనుకు, "నాకు ఉన్నడబ్బంతా ఇంతేనా?" అని అనిపించింది. తానొక మహారాజో చక్రవర్తో అయిఉన్నాకూడా తన ఇల్లు ఆమెకు తగినది కానేరదని అతనికి తోచింది. ఆమెది, పుట్టినప్పటినుండి పవిత్ర వంశ మర్యాదలలో లాలింపబడి ఏర్పడ్డ స్వభావమని స్పష్టంగా మధుసూదన్‌కు బోధపడ్డది—అనగా పుట్టుకకుపూర్వమే వారివంశంలోఉండే సంస్కృతికూడా ఆమెలో ఇమిడిఉన్నదని అతను గ్రహించాడు. ఆమె నివసించుచుండే ప్రపంచంలోకి

ఎవడుపడితే వాడు ప్రవేశించలేడు. తన నిజస్వభావ బలంవల్ల విప్రదాస్‌కూడా అక్కడనే విరాజిల్లుతున్నాడు. కుమును చుట్టబెట్టి ఉన్నట్టుగానే సహజగౌరవ మొకటి విప్రదాసుని సదా ఆవరించి ఉంటుంది. ఆ సంగతి విప్రదాస్ తానే ఎరగడు.

ఇది చూచి సహించలేకుండా ఉన్నాడు మధుసూదన్. విప్రదాసులో లేశమైనా పొగరుపోతుతనం లేదు. ఒకవిధమైన 'దూరత్వం' ఉన్నది. హఠాత్తుగా వచ్చి అతని భుజాన్ని తట్టి, "ఏమయ్యా ఏలాఉన్నావు?" అని అడగడం ఎంతపెద్దవాడికైనా ఎంతదగ్గిర బంధువుకైనా సాధ్యంకాని పని. విప్రదాసు ఎదుట తాను అతిఅల్పుడని మధుసూదన్‌కు తోచేది. అందు చేతనే అతనికి అంతఃకోపం. ఈ సూక్ష్మకారణమువల్లనే మధుసూదన్ కుముమీద బలం ప్రయోగించలేక పోవడం. ప్రపంచమంతటిలోకి తాను ఎక్కడ మిక్కిలి స్వేచ్ఛగా అధికారం నడిపించ గలగాలో అక్కడే అతడు నిలిచిపోవలసి వచ్చింది. కాని దానివల్ల కోపం రావడానికి బదులు ఆకర్షణ అధిక మౌతున్నది. కుమును చూడగానే నేడామె సిద్ధమయి రాలేదని మధుసూదనుకు తెలిసిపోయింది—ఆమె కంటి కగపడని ఒక తెరవెనుక నిలుచోని ఉన్నది—కాని ఆ సౌందర్యమేమిటి! ఏమి టాదేదీప్యమైన శుభ్రత, ఆ శుచిత్వము! నిర్జనతుషార శిఖరాన ఉదయిస్తున్న ఉషఃకాంతివలె కనబడుతున్నది ఆమె!

మధుసూదన్ ఆమెకు దగ్గరగా వచ్చి, "పడుకోడానికి రావూ, రాణీ?" అని నెమ్మదిగా అడిగాడు.

కుముకు ఆశ్చర్యంవేసింది, అతను కోపగిస్తాడని ఆమె అనుకొన్నది, తనను అవమానపరుస్తూ మాట్లాడతాడని అనుకొన్నది. అప్పుడు, తాను బాగా ఎరిగిన కంఠస్వరం హఠాత్తుగా ఆమె స్మరణకు వచ్చింది—అంత నెమ్మదిగానే నాన్నగారు తన అమ్మను పిలిచారని కుముకు తోచింది. పిలిచినా అమ్మ నాన్నను దగ్గరకు రానీయక వెళ్ళిపోవడం ఆమెకు జ్ఞాపకం వచ్చింది. కళ్ల నీళ్లుపెట్టుకొని కుము మధుసూదనుని కాళ్లఎదుట నేలను కూర్చుండబడి, "నన్ను క్షమించ"మని వేడుకొన్నది.

మధుసూదన్ కుమును లేవదీసి కుర్చీమీద కూర్చో పెడుతూ, "నీవు చేసినదేమిటి, నిన్ను క్షమించడానికి అన్నాడు.

"మనస్సును కుదటపరచుకోలేదు, మరికొంచెం వ్యవధి ఇయ్యి," అని కుము అన్నది.

మధుసూదనుని మనస్సు తిరిగి రాయి అయిపోయింది— "ఎందుకు వ్యవధికావాలో నాకు బోధపరుచు," అని అడిగాడు.

"సరిగా చెప్పలేను—ఇతరులకు బోధపరచడం కష్టం—"

మధుసూదన్‌కంఠంలో ఏ రవంత మృదుత్వం ఉండెనో అది పోయింది—అతికఠినంగా అన్నాడు—"నీకు ఏమీ కష్టం లేదు, నేనంటే నీకు అయిష్టం, ఆమాటే నీవు చెప్పలేరేది."

మిక్కిలి చిక్కైన అవస్థ కుముది—మధుసూదన్ చెప్పినది నిజమే, కాని నిజంకాదు కూడాను. హృదయాన్ని

నైవేద్యంతో నింపి అతనికి సమర్పించవలెనని ఆమె శపథం చేసుకొని కూర్చున్నది, కాని నైవేద్యం ఇంకా వచ్చి చేరలేదు. లోపలనుంచి మనసు, ఈవిధంగా అంటున్నది—"కొంచెం తాలి ఉండు, దారిలో ఏమీ అడ్డురాకుండా ఉంటే నైవేద్యం వచ్చి చేరుతుంది—అట్టే ఆలస్యం కాదు కూడాను." కాని ఇప్పటికి పళ్లెంలో ఏమి లేదన్నమాటమాత్రం ఒప్పుకోకతీరదు."

"నిన్ను మోసపుచ్చడం నాకు ఇష్టంలేదు, కనుక కొంచెం వ్యవధి కావాలని కోరుతున్నా" నని కుము అన్నది.

మధుసూదనుని మనస్సు మరింత కఠినమైపోయింది, "వ్యవధిఇస్తే లాభమేమిటి? మీ అన్నయ్య సలహాతీసుకొని సంసారం మొదలుపెడతావు, అంతేనా?" అని కరుకు గొంతుకతో అడిగాడు.

మధుసూదన్ నమ్ముతుండేదికూడా అంతేను. విప్రదాసు అనుమతిలేకనే అంతా నిలిచిపోయి ఉన్నదని అతని అభిప్రాయం, అన్న నడిపించేటట్టు కుము నడుస్తుందని అతని నమ్మకం, "మీ అన్నగారు నీకు గురువు!" అని హేళనగా అన్నాడు.

కుము లేచి నిలుచొని, "ఔను అన్నయ్య నాకు గురువు!" అని అన్నది.

"అతని సెలవు లేనిదే నీవు చీరమార్చవు, పడుకోడానికి రావు—అంతే కదూ?"

కుముదిని పిడికిళ్లు బిగించి కర్రకట్టిపోయి చూస్తున్నది.

"అట్లాగైతే టెలిగ్రాంవేసి అతని సెల వేమిటో కనుక్కుంటూ, చాలారాత్రి అయిపోయింది," అని మధుసూదన్ అన్నాడు.

కుము జవాబు చెప్పక డాబామీదికి వెళ్లవలెనని తలుపువైపు వెళ్లబోయింది.

మధుసూదన్, "వెళ్లవద్దు, నేను చెపుతున్నాను!" అని గర్జించాడు.

కుము తత్‌క్షణం వెనుకకు తిరిగి, "ఏమిటి చేయమన్నావు?" అని అడిగింది.

"తక్షణం వెళ్లి బట్టమార్చుకు రా," అని గడియారం బయటికి తీసి చూస్తూ, "ఐదునిమిషాలు టైమ్ ఇస్తున్నా"నన్నాడు.

కుము స్నానాలగదిలో వెళ్లి బట్ట మార్చుకొని దళసరి తెల్లదుప్పటి ఒకటి కప్పుకొనివచ్చి రెండో ఆజ్ఞకై ఎదురు చూస్తూ నిలుచున్నది. ఇదీ ఒక యుద్ధవేషమే అని మధుసూదన్ పోల్చుకొన్నాడు. కోపం అంతకంతకు అధికమవుతున్నది, కాని ఏమిచేయడమో తోచలేదు. ఎంతకోపంగా ఉండేటప్పుడైనా లాభనష్టాలచింత వదలవలసినవాడు కాడు మధుసూదన్. కొంచెంసేపు ఆలోచించి, "నీకు ఇప్పుడు ఏమి చేయాలని ఉన్నదో చెప్పు," అని అన్నాడు.

"నీవు ఏమిచేయ మంటే అది చేస్తాను."

మధుసూదన్ హతాశుడై కుర్చీమీద కూలబడ్డాడు.

ఆ తెల్లనిదుప్పటి కప్పుకొనిఉన్న స్త్రీ ఒక విధవ విగ్రహంవలె మధుసూదన్‌కంటికి కనబడ్డది, తనకూ ఆమెకూ మధ్యను ఒక నిస్తబ్ధ మృత్యుసముద్రం ఉన్నది, కోపంతో పిచ్చికేకలు వేయడంవల్ల ఆ సముద్రము దాటలేడు. తెరచాపకు ఎట్లాంటి గాలి తగిలినయెడల పడవ ఒడ్డు చేరుకుంటుందో తెలియడం లేదు——అసలు ఎన్నటికైనా చేరుతుందో లేదో అదీ సందేహమే!

మధుసూదన్ ఎట్టిచలనమూ లేకుండా కూర్చున్నాడు కొంతసేపు——గడియారం టిక్కుటిక్కు తప్పితే ఇంకేశబ్దమూ వినబడలేదు. ఈమారు కుము గది విడిచి వెళ్లలేదు, డాబావైపు ముఖం తిప్పి అంధకారంలోకి చూస్తూ కర్రబొమ్మవలె నిలుచున్నది. రోడ్డుమళ్లుపుదగ్గరనుంచి ఎవడో త్రాగుపోతు పాడుతున్న పాటఒకటి వినబడతున్నది. పక్కఇంటి గుర్రపుసాలలో కట్టిఉన్న కుక్కపిల్లచేస్తున్న అవిరామ ఆర్తనాదము రాత్రియొక్క శాంతిని కెలకెల పెడుతున్నది.

కాలము ఒక అడుగందని గొయ్యివలె శూన్యమై నోరు ఆవలించుకొని చూస్తున్నట్టున్నది. మధుసూదనుని జీవన యంత్రంలో ఉండే చక్రాలన్నీ నిలిచిపోయినవి. రేపు చాలా ఆఫీసుపని ఉన్నది, డైరెక్టర్లమీటింగు——కొన్ని కఠినప్రస్తావాలున్నవి, యుక్తిప్రయోగించి అనేకరకాల అడ్డను దాటించి పని

నడిపించవలసి ఉన్నది. ఇవన్నీ అత్యవసరమైన పనులు, అయినా నేడు ఇవి అతనికంటికి ఛాయవలె కనబడుతున్నవి. పూర్వము ఇటువంటి పరిస్థితులలో మర్నాటి కార్యప్రణాళి అంతా ముందురాత్రే కూర్చొని నోటుబుక్కులో వ్రాసి ఉంచుకొనేవాడు. నేడు ప్రపంచంలో ఉండే అన్ని సత్యాలకంటె కఠినమైనది ఏమిటి అంటే—ఆ దుప్పటి కప్పుకొని నిలుచొని ఉన్న స్త్రీ. గదిలోనుండి బయటికివెళ్ళేదారికి అడ్డుగా నిలుచొని ఉన్న ఆస్త్రీని అర్థంచేసుకోవడమే అన్నిటికంటె కఠిన సమస్య. కొంచెముసేపైన తరువాత మధుసూదన్ పెద్ద నిట్టూర్పు విడిచాడు. కుము ధ్యానములో మునిగిఉన్నదానివలె ఉలికిపడి లేచింది. మధుసూదన్ కుర్చీమీదినుండి లేచి కుముదగ్గిరికి వచ్చి. నీ మనస్సు రాయా, *"బడా బౌ?" అని అడిగాడు.

'బడబౌ' అనేపదము కుము మనస్సుపైని మంత్రంవలె పనిచేస్తుంది, తనలోఉన్న తనతల్లి గుణమంతా హఠాత్తుగా ఉజ్జ్వలమయి బయటికి వస్తుంది. ఆపిలుపుకు కుముతల్లి ఎంతో కాలం ఎంతో సునాయాసంగా జవాబిచ్చేది—ఆ అలవాటే కుము రక్తములో కలిసిపోయి ఉన్నది, కనుక ఆ పిలుపు కుము చెవిని పడగానే ఆమె ఉలికిపడి ముఖము మధుసూదనునివైపు

---

*బడబౌ—బంగాళీ ఉచ్చారణ 'బడ'కు 'బొడొ'కు మధ్య. బడబౌ అనగా పెద్దకోడలు, భార్యను 'కోడలు'అని పిలవడం పూర్వకాలపు బంగాళీ సంప్రదాయం. కుము తండ్రికూడా భార్యను 'బడబౌ'అని పిలిచేవాడు—ఇంటికి ఆమె పెద్దకోడలు గనుక.

త్రిప్పింది. మధుసూదన్ మిక్కిలి సంకోచముతో, "నీకు తగిన యోగ్యత నాలోలేదు, నామీద దయ ఉంచవూ?" అని అడిగాడు.

కుము విచారంతో, చా చా, అలా అనకూడదు," అని అన్నది. నేలనుపడి మధుసూదనుని కాళ్లధూళి తీసుకొని, "నేను నీదాసీని, నన్ను నీవు ఆజ్ఞాపిస్తుండాలి," అని అన్నది.

మధుసూదన్ ఆమెను లేవనెత్తి తనగుండెపై నొక్కి పట్టుకొని, "నిన్నాజ్ఞాపించను, నీ ఇచ్ఛానుసారము నీవే నాదగ్గిరికి రావలెను," అని అన్నాడు.

కుము ఎగశ్వాస పుడుతున్నట్టుగా ఊపిరి తియ్యడం మొదలుపెట్టింది, కాని అతని చేతులలోనుంచి తప్పించుకు పోదామని ప్రయత్నించ లేదు. మధుసూదనుని కంఠములో నుంచి మాట రావడంలేదు, వినబడీ వినబడనట్టుగా అన్నాడు— "నిన్ను ఆజ్ఞాపించను, కాని కోరి నీవే నాదగ్గిరికి రా," ఇలాగు అంటూ కుమును విడిచిపెట్టేశాడు.

ఆమె తెల్లని ముఖము ఎర్రనైపోయింది. కళ్లు వాల్చు కొని, "నీవు ఆజ్ఞ ఇస్తూఉంటే ఏపనిఅయినా నాకు సులభం అవుతూ ఉంటుంది కాని నాఅంతట నేను ఆలోచించుకొని ఏమీ చేయలేను," అని అన్నది.

"సరే ఆలాగైతే నీవు కప్పుకొన్నదుప్పటి తీసివేయి, అది చూచి నేను సహించలేకుండా ఉన్నాను."

కుముద సంకోచిస్తూ దుప్పటి తీసేసింది. సన్నపుటంచు, నల్లడోరియాల చీర కట్టుకొని ఉన్నది. నల్లడోరియాల వరసలు నక్షత్రవర్షపు ధారలవలె కనబడుతున్నవి, నిలకడగాఉన్న గీరలవలె కనబడనేలేదు, పరుగెత్తుతున్న నక్షత్రకిరణాలలాగు కనబడుతున్నవి; ఎదో ఒక నల్లని కనుచూపు ఆమెపై పడుతున్నట్టూ, ఆ చూపు ఒకచోట నిలిచిఉండక ఆమెచుట్టూ పరుగెత్తుతున్నదా అన్నట్టూ మధుసూదనుకు తోచింది. ముగ్ధుడై చూస్తున్నాడు మధుసూదన్, కాని అటువంటి అవస్థలో కూడా అతనికళ్లు ఒకసంగతి కనిపెట్టకుండా ఉండలేకపోయినవి— కుముదిని కట్టుకొన్నచీర మధుసూదన్ఇంటి చీర కాదు. కుముదినికి బహు ఇంపుగా కుదిరింది నిజమే, కాని అది వాళ్ల అమ్మగారిఇంటి చీర. స్నానాలగదికి అంటిఉన్న బట్టలగదిలో నిలువు టద్దాలుతాచిన మహాగనీ సొరుగులబీరువా ఉన్నది. దాని నిండా అనేకరకాల మంచిమంచి చీరలు ఉన్నవి. వాటిలో దేనిమీదా కోరిక పుట్టలేదు కుముకు—ఎంత గర్వము అమ్మాయికి! అప్పుడు హఠాత్తుగా ఆ మూడుఉంగరాల మాట అతనికి జ్ఞప్తికివచ్చింది, ఆమె నిర్లక్ష్యం చూచి భరించలేక పోతున్నాడు మధుసూదన్, అంత విలువైన ఉంగరాలు నచ్చలేదు ఆమెకు, కాని ఆ పనికిమాలిన పాడు నీలంఉంగరం మీద అపేక్ష పోలేదు. ఆమెకు అన్నగారియెడలగల ప్రేమకూ మధుసూదనునిమీదగల ప్రేమకూ ఎంతవ్యత్యాసము ఉన్నది! కుము దుప్పటి తీసేయగానే ఈ తలంపులన్నీ ఒక్కమారు

భయంకరమైన తుపానుగాలివలె వచ్చి మధుసూదనుని కొట్టినవి. కాని ఏమి దురదృష్టము! ఆమెకు అంతరూపు ఎందుకు ఉండాలి! ఏమిటా అపురూపసౌందర్యము! ఆ గర్వమూ ఆ నిర్లక్ష్యమూకూడా ఆమెకు అందము ఇస్తున్నవి! ఐశ్వర్యాన్ని కూడా అవమానపరచగల శక్తి ఉన్నది ఆమెలో! ఆమె సహజసంపదతో జన్మించింది—డబ్బుతో సంబంధించిన గొప్ప కాదు ఆమెసంపద, జమాఖర్చుల చిత్రాలకు దొరికేధనం కాదు; ఆమెకు ఏ ఆశచూపించి మధుసూదన్ ఆమెను ఆకర్షించగలడు?

"వెళ్లు, వెళ్లి పడుకో," అని అన్నాడు మధుసూదన్.

కుము అతని ముఖంవంక చూస్తూ నిలుచున్నది—ఆ చూపులో—"'నీవు మొదట పడుకోడానికి వెళ్లవా'" అనే నిశ్శబ్దప్రశ్న ఉండెను.

మధుసూదన్ మళ్ళీ అన్నాడు కొంచెం గట్టిగా—"వెళ్లు మరి ఆలస్యముచేయకు." కుము మంచంమీదికి ఎక్కి కూర్చున్నది, మధుసూదన్ తిరిగివెళ్ళి సోఫామీద కూర్చొని, "నేను ఇక్కడే కూర్చుంటాను, నీవు రమ్మంటేనేతప్ప రాను, సంవత్సరముమీద సంవత్సరము గడిచినా నేను ఇక్కడే ఉండడానికి సిద్ధముగా ఉన్నాను," అని అన్నాడు.

కుముకు ఒళ్లు తిరిగినట్టు అయింది—ఆమెను ఎవరో పరీక్ష చేస్తున్నట్టున్నారు! ఎవరిద్వారము దగ్గరకుపోయి నేడు ప్రార్థనచేయగలదు—దేవుడు ఆమె ప్రార్థన వినిపించుకో

లేదు. ఏ దారివెంబడి ఆమె ఇక్కడికి వచ్చిందో అది తప్పు దారి, సందేహము లేదు. పరుపుమీద కూర్చొని లోలోపల ఈలాగు ప్రార్థించింది—"నన్ను నీవు ఎన్నడూ భ్రమపెట్టలేవు తండ్రీ, ఇప్పటికీ నిన్నే నమ్ముతున్నాను. అరణ్యము మధ్యను దర్శనము ఇస్తానని చెప్పి ధృవుని నీవే కదా అరణ్యములోకి తీసుకువచ్చావు!"

ఆ గదిలో మరి ఏ శబ్దమూ లేదు, రోడ్డు మళుపునుండి ఆ కల్లుతాగినవాని పాట ఇప్పుడు వినబడ లేదు. కట్టిఉన్న కుక్కపిల్ల అరుపుమాత్రం ఉండిఉండి వినబడుతున్నది. ఒక నిమిషము ఎంతో కాలములాగు అనిపిస్తున్నది.

నిస్తబ్ధతయొక్క జాములు బరువెక్కి నడవలేకుండా ఉన్నవనిపిస్తున్నది. అనంతకాలము ఉండవలసిన దాంపత్య దృశ్యము కాదు కదా ఇది! ఇద్దరూ చేరి ఒకమూలను చలనములేకుండా కూర్చొని ఉన్నారు—రాత్రికి అంతము లేదు, వాళ్ళిద్దరికీ మధ్యనుఉన్న నిస్తబ్ధత దాట శక్యముకానిది. కొంతసేపైన తరువాత కుము తన సమస్తశక్తినీ ప్రయోగించి మంచము దిగి వచ్చి, "నన్ను అపరాధిని చెయ్యకు," అని అన్నది.

మధుసూదన్ అతిగంభీరముగా, "ఏమి కావాలి నీకు, ఏమిచేయమంటావో చెప్పు," అని అన్నాడు—ఆఖరిమాట కూడా ఆమె నోటిలోనుంచి పిడిచితీయాలని అతని ఉద్దేశము కాబోలు!

"పడుకోడానికి రా," అన్నది కుము.

కాని, 'జయం' అంటే ఇదేనా ?

౩౯

మర్నాడు ఉదయము మోతీతల్లి కుముకోసము గ్లాసుడు పాలు ఇద్దామని వచ్చేసరికి కుము కళ్లు ఎర్రనయి పొంగిఉన్నవి, ముఖం బూడిదవలె వెలవెల్లాడుతున్నది. ఆసనము వేసుకొని ధ్యానముచేస్తూ తూర్పుముఖముగా రోజూ కుర్చుండేచోట కుము ఇవాళకూడా ఉంటుం దనుకొన్నది మోతీతల్లి. ఆమె అక్కడలేదు, మెట్లపక్కను గోడకు చేరబడి నిస్సత్తువగా కూర్చొని ఉన్నది. ఆమెకు ఇవాళ దేవుని మీద కోపము వచ్చినట్లున్నది. నిరపరాధిఅయిన పిల్లవాడిని నిర్దయుడైన తండ్రి అకారణముగా కొడుతున్నప్పుడు, కుర్ర వాడికి ఏమీ బోధపడదు—పౌరుషముతో ఒళ్లుఇచ్చి దెబ్బలు తింటాడు, కొట్టవద్దని చెప్ప బుద్ధికూడా పుట్టదు. ఇవాళ కుము ఆ కుర్రవాడి మోస్తరుగా కూర్చొనిఉన్నది. ఏ ఆహ్వా నాన్ని దేవుని ఆహ్వానమని నమ్మి మన్నించిందో అది ఆమెను ఇట్లాంటి పంకిలావస్థలోనికి తీసుకువచ్చిందా ! ఇట్లాంటి ఆంతరిక అసతిత్వములో పెట్టిందా! దేవునికి నరబలి కావలెను కాబోలు, కనుకనే బలిని ఈలాగు భ్రమపెట్టి తీసుకువచ్చాడు ! లోపల మనస్సులేని శరీరము, కేవలము మాంసపిండము, అతనికి తగిన నైవేద్యం ఎట్లా కాగలదు ? నేటివరకు కుము భగవంతుని

ఓర్చి ఉండమనిన్నీ త్వరలో తనను సమర్పించుకుంటానని ప్రార్థిస్తూ వచ్చింది. నేడు ఆమె మనస్సు తిరగబడి, "నేను ఎట్లా సహించి ఊరుకోగలను" అని అంటున్నది. "ఏ ముఖముతో నీపూజ చేయగలను? నీ భక్తురాలిని నీవు అంగీకరించక, బానిసలను అమ్మే సంతలో అమ్మేశావు, మత్స్యమాంసాల ధరకు ఆడవాళ్లను కూడా అమ్మే ఆ బానిస-సంతలో అమ్మేశావు. పూజచేసిన పువ్వులు దొరుకుతవనే ఆశతో పూజ అయేవరకు కనిపెట్టుకొని ఉండేవారెవ్వరూ అట్లాంటిచోట ఉండరు—పుష్పవనాన్ని మేకలచేత కుమ్మించి మేపించేవాళ్లు ఆచోట్లలో ఉంటారు.

మోతీతల్లి పాలు తాగమని కుమును బలవంతపెట్టింది; కుము, "ఇప్పుడు వద్దు," అన్నది.

"వద్దు ఎందుచేత?, నా పాలగిన్ని చేసినఅపరాధం ఏమిటి?" అని మోతీతల్లి అడిగింది.

"ఇంకాస్నానం చేయలేదు, పూజ చేయలేదు."

"అయితే స్నానానికి లే, నేను ఇక్కడే కూర్చొని ఉంటాను."

కుము స్నానముచేసివచ్చింది, డాబామీద ఆమె రోజూ కూర్చుండేచోట కూర్చుంటుందని మోతీతల్లి అనుకొన్నది, అలవాటుప్రకారము కుము అటువైపు అడుగువేసి తిరిగి వచ్చి మొదట కూర్చున్నస్థలములోనే కూర్చున్నది—ఆమె మనస్సు ఇప్పటికీ సిద్ధము కాలేదు.

"అన్నయ్య దగ్గరనుంచి ఇంకా ఉత్తరం రాలేదా?" అని కుసుమ అడిగింది.

ఉత్తరం వచ్చిఉంటుందనే ఆశతో మోతీతల్లి ఉదయమే లేచి బావగారి గదిలోకి వెళ్ళి ఉత్తరాల సొరుగు లాగింది. సొరుగు రాలేదు, తాళం వేసిఉన్నది—దొంగ ఇంట్లో కన్నం వేయడానికి ఇక వీలులేదు.

"సరిగా చెప్పలేను కనుక్కొని చెపుతాను," అని మోతీతల్లి అన్నది.

అప్పుడు శ్యామ వచ్చి, "ఏమిచెల్లీ నీ ముఖము ఆలాగు ఉన్నది ఒంట్లో బాగులేదా?"

"బాగానే ఉన్నది."

"పుట్టింటిమాట ఎప్పుడూ అనుకొంటున్నావు కాబోలు, పాపం—కాని మీఅన్నయ్యగారు వస్తున్నారు కనబడతారు."

కుసుమ ఉలికిపడి శ్యామవైపు ముఖముతిప్పి ఆత్రతగా చూచింది.

"ఆ సమాచారం నీవు ఎక్కడ సంపాదించా[illegible] బాగడపువ్వా?" అని మోతీతల్లి అడిగింది.

"వహావ్వా! ఆ కబురు అందరూ ఎరిగినదే."

కుసుమను చూచి రమ్మని వాళ్ళఅన్నగారు ఇంటికిగుమస్తాను పంపారట. అతని ఒంట్లో బాగులేదట కూడాను. డాక్టర్ చేత పరీక్షచేయించుకోడానికి కలకత్తావచ్చి రెండుమూడు రోజులు ఉంటారట—మనపనిమనిషి, పార్వతి, చెప్పింది.

కుము గాబరాపడుతూ, "అన్నయ్యకి జబ్బు ముదిరింది కాబోలు!" అని అన్నది.

"అంత జబ్బుగా ఉన్నట్టులేదు,—ఉంటే ఆమాట తెలిసి ఉండును."

మధుసూదన్ కుముతో అన్నగారి సంగతి చెప్పలేదని శ్యామ పోల్చుకొన్నది—భార్యమనస్సు ఇప్పటికి ఇంకా అతని అధీనంలోకి రాలేదనీ, ఇంటిమాట జ్ఞాపకంతెస్తే మరీపరధ్యాన్యంగా కూర్చుంటుందేమో అనీ ఊహించి, బావగారు కుముతో అన్ననుగురించి చెప్పడం మానిఉంటాడని నిర్ణయించింది. కుము మనస్సును మరింత రేప నిశ్చయించుకొని, "మీఅన్నయ్యలాంటి మనిషి ఉండడని అందరి నోటివెంటా వింటున్నాను చెల్లీ," అని ఆమెతో అంటూ రెండో తోటికోడలితో, "పద అమ్మా, వంటకు వేళౌతూఉంది, సామాను ఇద్దువుగాని, ఆఫీసు వేళ దాటిపోతే చాలా చిక్కువస్తుంది," అని అన్నది.

మోతీతల్లి పాలగ్లాసు మరిఒకసారి కుము దగ్గిరికి తెచ్చి, "పాలు చల్లారి పోతున్నవి, తాగేయి అమ్మా, బంగారు తల్లివి," అని అన్నది.

ఈసారి అభ్యంతరపెట్టక కుము పాలు తాగేసింది.

మోతీతల్లి కుముచెవిలో మెల్లిగా, "కొట్టుగదిలోకి రావూ?" అని అడిగింది.

"ఇప్పుడు రాను, కాని గోపాల్‌ను నాదగ్గిరికి ఒకసారి పంపు అక్కా."

కఠోర వృద్ధాప్య మొకటి, ఆకలిగొన్న పిశాచమై నల్లగా బయటినుండి నోరు తెరచుకొని కుమును మింగడానికి వస్తున్నది, వృద్ధ వయస్సుకు ఉచితమైన శాంతమూ, స్నేహ భావమూ, గాంభీర్యము దానిలో లేవు. పవిత్రమైన ప్రేమా విషయాసక్తీ—రెండూ ఒక్క జాతికి చెందని గుణాలని ఆమె అభిప్రాయము; కనకనే అట్టి వృద్ధాప్యము కనపడగానే కుముకు అంత అసహ్యము. భర్తవయస్సు అధికమని కుముకు అయిష్టము కలుగనేలేదు. అతని వయస్సు ఆత్మగౌరవాన్ని మరచి ప్రవర్తిస్తున్నదని కనిపెట్టినప్పటినుండి కుముకు బాధ కలుగుతున్నది. సంపూర్ణమైన ఆత్మనివేదనము ఒక పండినపండు వంటిది, స్వేచ్ఛగా తాకుతుండే గాలిలోనూ వెలుతురులోనూ కాయ పండుఅవుతుంది, కాని కాయను తెచ్చి తిరగలిలో పెట్టి తిప్పడమువల్ల పండుకాదు. క్రమంగా పరిణామించడానికి వ్యవధి దొరకకపోవడంవల్ల తనకూ తన భర్తకూగల సంబంధము కుమును అంత బాధిస్తున్నది, ఆమెకు అంత అవమానకరముగా తోస్తున్నది. కుము ఇప్పుడు ఎక్కడికి పారిపోగలదు? కుము మోతీతల్లితో గోపాల్‌ను పంపమని చెప్పడం పారిపోయేదారి వెదకడమన్న మాట. కుము చేసినది, అశుచితో కూడుకొని ఉన్న వృద్ధాప్యములోనుండి నిర్మలమైన శైశవములోకి వచ్చే ప్రయత్నం—మనుష్యుడు విడిచిపెడుతున్న విషవాయువులో నుండి పుష్టవన వాయువులోకి పారిపోవ ప్రయత్నము.

హాబ్లూ రంగుబుటాల చీటుచొక్కా తొడుక్కొనివచ్చి మెట్లతలుపు మూలను, భయపడుతూ భయపడుతూ, నిలబడ్డాడు. తల్లికళ్లవలె పెద్దపెద్ద కళ్లు, దేహచ్ఛాయకూడా తల్లిఛాయ—మేఘవర్ణము—గుండ్రని బూరిబుగ్గలు, జుట్టు దగ్గిరగా కత్తిరించి ఉన్నది—బోడిగుండు.

కుము లేచి సంకోచిస్తూ నిలబడిఉన్న ఆ పిల్లవాడిని ఎత్తుకొని, "పెంకి అబ్బాయి, ఈ రెండురోజులూ రాలేదేమి?" అని కౌగలించుకొంటూ అడిగింది.

హాబ్లూ కుము మెడను రెండుచేతులతో కౌగలించుకొని, "నీకోసం ఏమిటి తెచ్చానో చెప్పుకో చూదాము," అని అన్నాడు.

"మాణిక్యం తీసుకువచ్చావు, గోపాల్" అన్నది కుము హాబ్లూ బుగ్గను ముద్దుపెట్టుకొంటూ.

"నా జేబులో ఉన్నది."

"అయితే బయటికి తీయి."

"నీవు చెప్పలేక పోయినావు!"

"నాకు అంతబుద్ధిలేదు, కంటికి కనపడేదానినే తెలుసుకోలేను, కనపడనిదానిని ఎట్లా పోల్చుకోగలను?"

హాబ్లూ బ్రౌన్ కాగితముతో కట్టిన పొట్లము ఒకటి మెల్లిగా జేబులోనుంచి తీసి కుముఒడిలో ఉంచి కిందికి దిగి పారిపో ప్రయత్నించాడు.

కుము పిల్లవాడిని పట్టుకొని, "లేదు, నిన్ను వదలను," అన్నది.

కుర్రవాడు గడబడపడి పొట్లమును రెండుచేతులతో మూస్తూ, "అలాగైతే ఇప్పుడు చూడకు," అన్నాడు.

"భయంలేదు లే, నీవు వెళ్లిపోయిన తరువాత విప్పుతాను,"

"దొడ్డమ్మా, నీవు వేదరాసి పెద్దమ్మను చూశావా?"

"చూసిఉంటానేమో, కాని కనబడితే తక్షణం పోల్చుకోలేను కాబోలు!"

"కింద అంగణం పక్కనున్న బొగ్గులగదిలోకి గబ్బిలము ఎక్కి సాయంకాలమప్పుడు వస్తుంది, దొడ్డమ్మా!"

"ఔను గబ్బిలము వీపుమీద ఎక్కి వస్తుంది."

"కావాలంటే చిన్నదయి పోతుంది, కంటికి కనబడనంత చిన్నదయి పోతుంది—ఎరుగుదువా దొడ్డమ్మా?"

"ఆ మంత్రం ఆమెదగ్గిర నేర్చుకుందామా?"

"ఎందుకు దొడ్డమ్మా?"

"నేను ఇప్పుడు పారిపోదామని బొగ్గులగదిలో దాగుంటాననుకో—అందరి కళ్లకూ కనబడిపోతాను."

హాబ్లూకు దొడ్డమ్మచెప్పిన దానిఅర్థం తెలియలేదు.

"ముసలమ్మ బొగ్గుల్లో కుంకంబరణి దాచి ఉంచింది, ఆ కుంకం ఎక్కడినుంచి తెచ్చిందో ఎరుగుదువా?" అని అడిగాడు.

"తెలుసు ననుకొంటా!"

"అయితే చెప్పు చూదాము."

"తెల తెల్ల వారుతున్నప్పుడుండే మేఘాలలోనుంచి."

హాబ్లూ ఉలికిపడి చూచాడు—బాగా ఆలోచించవలసి వచ్చింది. సముద్రము అవతలఉండే దైత్యపురినుంచి అని హాబ్లూ అనుకొన్నాడు. ఎక్కడాజరగని సంగతులన్నీ చెప్తుండేవాడెవడో హాబ్లూకు ఆకబురు చెప్పాడు. కాని దొడ్డమ్మ చెప్పిందే నమ్మదగినట్టు హాబ్లూకు కనబడి దానికి విరుద్ధంగా ఏమీ అనక, "ఎవరు ఆ బరణిని వెదికి తీసి ఆ కుంకంతో బొట్టుపెట్టు కుంటారో ఆమె రాణి అవుతుంది," అన్నాడు.

"అన్నా! ఏ అభాగ్యురాలికో ఆ సంగతి తెలిసింది కాబోలు."

"చిన్న అత్త కూతురు, 'ఖుదీ'కి, ఆ సంగతి తెలుసును. 'ఛన్ను' ప్రొద్దున్న బొగ్గులు తీయడానికి ఆ గదిలోకి వెళ్ళే టప్పుడు, రోజూ, ఖుదీ దానితో వెళ్లుతుంటుంది, ఖుదికి కొంచె మైనా భయం లేదు."

"అది చిన్నపిల్ల, రాణి అవమన్నా దానికి భయం ఉండదు."

బయట చలిగా ఉన్నది, ఉత్తరపుగాలి వీస్తున్నది, కుము మోతీని తీసుకొని గదిలోకి వచ్చి సోఫామీద కూర్చొని పిల్లవాడిని ఒళ్లో కూర్చోపెట్టుకున్నది. ప్రక్కను టీపాయ్ మీద చిన్న వెండిపళ్లెములో నాలుగైదురకాల శీతకాలపు పువ్వులు కొన్ని ఉన్నవి-మాలీ రోజూ తోటలోకొనిపోసి కుముకోసమని ఉంచుతుంటాడు. సూర్యోదయంవైపు ముఖము త్రిప్పి ప్రార్థనచేసి కుము తమను దేవునికి అర్పిస్తుందని ఆపువ్వులు కనిపెట్టుకొని ఉన్నవి. కాని నేడు పూజ జరగలేదు, కుము ఆ పువ్వులపళ్ళెమును హాబ్లూ ఎదుట పెట్టి, "ఈ పువ్వులు నీకు కావాలా, గోపాల్?" అని అడిగింది.

"కావాలి."

"పువ్వులు ఏమిటి చేస్తావు?"

"ఆడుకుంటాను, పూజ-ఆట."

కుము మెడలను చిన్న సిల్కుదుమాలు ఒకటి చోపి ఉండెను—దాన్ని తీసి, పువ్వులను అందులో కట్టి గోపాల్ బుగ్గమీద ఒక ముద్దుపెట్టి, "ఇదిగో తీసుకో," అంటూ ఆ మూట అతనిచేతిలో పెట్టింది. "నాపూజ-ఆట కూడా అయింది," అని తనలోతాను అనుకొంటూ, "వీటిఅన్నిటిలో ఏ పువ్వులు నీకు ఇష్టం గోపాల్?" అని పిల్లవాడిని అడిగింది.

"మందార," అన్నాడు హాబ్లూ.

"నీకు మందార ఎందుకు ఇష్టమో చెప్పేదా?"

"చెప్పుకో చూదాము."

"తెల్లవారకముందే అది పెద్దమ్మ బరణిలోనుంచి రంగు దొంగలించింది."

హాబ్లూ కొంచెముసేపు మాటాడక గంభీరముగా కూర్చొని ఆలోచించి హఠాత్తుగా, "నీ చీర అంచుకూడా సరిగా మందారపువ్వు రంగే దొడ్డమ్మా," అని అన్నాడు— పిల్లవాడి మనస్సులో ఉన్నదంతా ఆ ఒక్కమాటతో పూర్తి అయిపోయింది.

కుము వెనుకకు ముఖము తిప్పేసరికి మధుసూదన్ కనబడ్డాడు. అతను ఉన్నాడని ఆమెకు తెలియలేదు, కొంచె మైనా అడుగుల చప్పుడు కాలేదు. అది మధుసూదన్ అంతఃపురములోకి వచ్చే వేళకూడా కాదు. రోజూ ఈవేళ అప్పుడే వర్తకముతో సంబంధించిన నానారకాలపనులు చూస్తూ కూర్చుంటుంటాడు మధుసూదన్. చిల్లరవర్తకులు, ఖాతాదారులు, దలారీలతో మాట్లాడవలసిన చిన్నచిన్న సంగతులు ఎన్నో ఉంటవి. సెక్రిటరీ ఇట్లాంటప్పుడే వచ్చి వాటిఅన్నిటినిగురించీ మాట్లాడుతుంటాడు. అసలు ముఖ్యమైన పనులకంటె ఈ చిల్లర పనుల ఒత్తిడి తక్కువకాదు.

## ౩౯

జోలిలో కేవలము ఊకచేరి, ఒక ధాన్యపుగింజఅయినా కనబడకపోతే ముష్టివాడి మనస్సు ఏలాగు అయిపోతుందో ఆలాగు అసంతుష్టితోను కాఠిన్యముతోను నిండిన మనస్సుతో

మధుసూదన్ నేడు తెల్లవారుజామున పడకగదిలో నుంచి బయటికి వచ్చాడు. కాని అతృప్తివలన కలిగిన ఆకర్షణ మరీ అధికము—ఎటువైపు అడ్డు ఉంటుందో అటువైపే వెళ్లుతుంటూఉంటుంది మనస్సు.

మధుసూదన్ కంటపడగానే హాబ్లూ ముఖము వాడిపోయింది, గుండె దబదబ కొట్టుకోవడము మొదలుపెట్టింది. పారిపోబోతుంటే కుము పిల్లవాడిని గట్టిగా పట్టుకొని లేవనివ్వింది కాదు.

మధుసూదన్ అది కనిపెట్టి, హాబ్లూను గదుముతూ అడిగాడు—"ఏమి చేస్తున్నావు ఇక్కడ, చదువుకోడానికి వెళ్లవా?"

గురువుగారువచ్చేవేళ ఇంకా కాలేదని చెప్పే సాహసం లేదు హాబ్లూకి, పెద్దనాన్నగారి ఆజ్ఞను శిరసావహిస్తూ తల వాల్చుకొని మెల్లిగా లేచి వెళ్ళిపోయినాడు.

కుము కుర్రవాడికి అడ్డుపడబోయి ఊరుకొని, "హాబ్లూ పువ్వులు ఉంచేశావు, తీసుకు వెళ్లవూ?" అని అన్నది—అంటూ పువ్వులమూట అతని ముందర పట్టుకొన్నది. హాబ్లూ దానిని పుచ్చుకోక భయపడుతూ భయపడుతూ పెద్దనాన్నగారి ముఖము చూస్తూ నిలబడ్డాడు.

మధుసూదన్ పువ్వులమూటను ఛటీమని కుముచేతిలో నుంచి లాక్కొని, "ఈ రుమాలు ఎవరిది?" అని అడిగాడు.

కుము ముఖము ఎర్రచేసుకొని, "నాది," అన్నది.

ఆ రుమాలు పూర్తిగా కుముదునిదే, సందేహము లేదు, పెళ్ళికాక పూర్వమునుండి ఆమెవద్దనే ఉన్నది, దానిమీద కన బడుతున్న జరీబుటాలఅంచుకూడా కుము స్వయముగా తన చేతితో కుట్టినదే.

మధుసూదన్ మూట విప్పి పువ్వులు నేల పారేసి రుమాలు జేబులో పెట్టుకొని, "ఇది నేను తీసుకుంటాను, చిన్న పిల్లవాడు అది ఏమిచేసుకొంటాడు," అని అంటూ కుర్రవాడితో, "నువ్వు పో ఇక," అని అన్నాడు.

ఈ మూర్ఖప్రవర్తన చూచి కుము నిర్ఘాంతపోయింది, పోబ్లూ ముఖము వాల్చుకొని బయటికి వెళ్ళిపోయినాడు, కుము ఏమీ అన లేదు.

మధుసూదన్ కుముధోరణి చూచి, "నీవు అందరికీ దానాలు చేస్తున్నావు, ప్రాప్తిలేనివాడను నేనొక్కడనే—నేను ఈ రుమాలు తీసుకుంటున్నా, నీవు ఏదో ఒకటి ఇచ్చావని జ్ఞాపకం ఉంటుంది," అని అన్నాడు.

కుము కిందికిచూస్తూ సోఫామీద ఒక పక్కను కూర్చొని ఉన్నది, చీరయొక్క ఎర్రని అంచు తలమీదనుంచి కిందికి పడుతున్నది, ఆమె తడిజుట్టుకూడా దానితోనే కలిసి వేలాడుతున్నది, ఆమె కోమల కంఠముచుట్టూ సన్నని బంగారు హారము ఒకటి కనబడుతున్నది—ఈ హారం కుము తల్లిది, కనుక ఆమె దానిని ఎల్లప్పుడూ మెడలోనే ఉంచుకొనేది, ఇంకా జాకెట్ తొడుక్కో లేదు, లోపున షెమీజ్ మాత్రము

ఉన్నది, ఉత్తచేతులు ఒడిలో పెట్టుకొని కూర్చున్నది, ఆ సుకుమారమైన తెల్లని చేతులు రెండూ లోపలినుండి పొంగి పొరలి వస్తున్న వాణివలె కనబడుతున్నవి. అభిమానంతో కూర్చొని-ఉన్న కుముదవంక మధుసూదన్ ముఖము దించి చూస్తూ నిలుచున్నాడు. ఆ మోటు బంగారుగాజులు తొడుక్కొన్న చక్కని చేతులపైనుండి కళ్లు ఎత్తలేక పోయినాడు. తానుకూడా సోఫామీద, కుముద పక్కను, కూర్చొని ఆమె చెయ్యిని తీసి పట్టుకోవలెనని ప్రయత్నించాడు, కాని ఆమెకు ఇష్టములేనట్టు అతనికి తోచింది. ఆమె చేతిలో ఉన్న కాగితముపొట్లము చూచాడు.

"ఆ కాగితముపొట్లం ఏమిటి?" అని మధుసూదన్ అడిగాడు.

"నాకు తెలియదు."

"తెలియదు అన్నమాటకు అర్థం?"

"అర్థము, నాకు తెలియదు అని."

మధుసూదన్ కుముదమాట నమ్మలేక, "నాకు ఇయ్యి నేను విప్పిచూస్తాను," అని అన్నాడు.

"అందులో రహస్యము ఒకటి ఉన్నది, నీవు చూడకూడదు," అని కుముద అన్నది.

ఆమాట చెవిని పడేసరికి, కోపము, తివ్వన బాణము లాగు, అతని బుర్రలోకి ఎక్కిపోయింది, "ఏమిటీ! ఎంత సాహసం!" అని అంటూ గబుక్కున ఆ పొట్లం తీసుకొని విప్పాడు. చూచేసరికి అందులో ఏమీ లేవు, నాలుగు పనస

గుసాలు మాత్రం ఉన్నవి. ఆశ్ఖే ఖర్చులేకుండా తల్లి తయారుచేస్తుండే ఫలహారా లన్నిటిలోకి హాబ్లూకి ఇవే ఎక్కువ ఇష్టమని కాబోలు నాలుగు తీసి కాగితములో కట్టి జాగ్రత్తగా దొడ్డమ్మకు కానుకగా తెచ్చాడు.

మధుసూదన్‌కు ఏమీ బోధపడలేదు, నిశ్చేష్టుడై చూస్తు న్నాడు. కుముకు అమ్మగారి ఇంట్లో ఈలాంటి ఫలహారాలే అల వాటు కాబోలు అని అనుకొన్నాడు—కనుక రహస్యంగా తెప్పించి ఉంచుకొన్నది, సిగ్గుచేత బయటికి తెలియనీయడం లేదు. లక్ష్మీదేవి దానం చేయడానికి సిద్ధంగా ఉన్నా తనకు పుచ్చుకొనే యోగ్యత కలగడానికి సమయం పడుతుంది అని అతను తనలో తాను అనుకొని, లేచి, తొందర తొందరగా కిందికి వెళ్లాడు.

కుము, సొరుగు లాగి, దానిలో ఉన్న చౌకము - చందనపు పెట్టె తెరిచి ఆ పనసగుసాల పొట్లం అందులో ఉంచింది. అన్న య్యకు ఉత్తరం వ్రాయడం మొదలుపెట్టింది. నాలుగు పంక్తులు ఇంకా వ్రాయలేదు, మధుసూదన్ గదిలోకి తిరిగి వచ్చాడు. అతను కనబడగానే వ్రాస్తున్న ఉత్తరాన్ని కుము చేతితో కప్పి కర్రబొమ్మవలె నిశ్చలంగా కూర్చున్నది. మధుసూదన్ చేతిలో బంగారం - గిల్టుచేసిన నగిషీ వెండిగిన్నె ఒకటి ఉన్నది, జరీసిల్కు రుమాలు కప్పిఉన్న ఆ గిన్నెను టేబిలుపైని, కుము ఎదుట ఉంచి "తీసి చూడు ఏమిటి ఉన్నదో!" అన్నాడు.

కుము రుమాలు తీసి చూచింది, దాని నిండా పనస గుపాలు! దగ్గర ఎవరూ లేకుండా ఉంటే కుము కడుపుఉబ్బా నవ్వి ఉండును—కాని ఏమీ అనక నిశ్చలంగా కూర్చున్నది— నవ్వి ఉంటే అంతకంటె బాగుండు నేమో!

మధుసూదన్—"పనసగుపాలు దొంగతనంగా తినవలసిన అవసర మేమిటి? అందులో సిగ్గుపడవలసిన దేమిఉంది, ఎన్ని కావాలో, చెప్పు—నాతో చెప్పావు కావేమి, రోజూ తెప్పిస్తూ ఉందునే!"

"నీవు తెప్పించి ఇయ్యలేవు," అన్నది కుము.

"ఇయ్యలేనా! నీవు ఒక అద్భుతమైన మనిషిలాగు ఉన్నావే!"

"లేదు, ఇయ్యలేవు."

"అంత ఖరీదా వాటిది?"

"అవి రూపాయలు ఇస్తే దొరికేవి కావు!"

మధుసూదనుకు అప్పుడు ఛటీమని ఒక సందేహము తట్టి, "మీ అన్నయ పార్సిల్ చేసిపంపాడు కాబోలు," అని అన్నాడు.

ఆ ప్రశ్నకు జబాబుచెప్ప బుద్ధిపుట్టక కుము ఆ పనసగు-పాలగిన్నెను అటుతోసేసి, బయటికి వెళ్లిపోదామని లేచింది. మధుసూదన్ ఆమె చెయ్యిని గట్టిగా పట్టుకొని తిరిగి కూర్చో పెట్టాడు.

మధుసూదనుని తిరిగి ప్రశ్న వేయనీయక కుము, "అన్నయ్య దగ్గిరనుంచి మనిషి ఎవడైనా వచ్చాడా, అతని సంగతి చెప్పడానికి ?" అని అతనిని అడిగింది.

కుము ఆ కబురు విన్నదని తెలియగానే మధుసూదన్ చీకాకుపడుతూ "ఆ కబురు చెపుదామనే తెల్లవారగానే నీదగ్గిరికి వచ్చాను," అని అన్నాడు. కాని ఆతను చెప్పినది, కేవలము అబద్ధము—ఈ సంగతి చదువరులకు తెలియచేయడము అనవసరము.

" అన్నయ్య ఎప్పుడు వస్తాడు ?"

" పదెనిమిదిరోజులలో వస్తాడు !"

విప్రదాసు ఆ మర్నాడే వస్తున్నాడని మధు ఎరుగును, ఏమీ ఇంకా సరిగా తెలియనట్టుగా ఉండాలని, 'పదెనిమిది' అని అన్నాడు.

"అన్నయ్య జబ్బు ముదిరింది కాబోలు!"

"అటువంటి దేమీ వినలేదు."

మధుసూదన్ తప్పించుకొని జబాబు ఇస్తున్నట్టు ఆమెకు కనబడ్డది—విప్రదాసు మందు పుచ్చుకొందామని కలకత్తా వస్తున్నాడు—అనగా ఒంట్లో బాగులేదన్నమాటే కదా !

"అన్నయ్య దగ్గరనుంచి ఉత్తరం రాలేదూ?"

"ఇంకా ఉత్తరాలపెట్టె తెరిచిచూడలేదు, వస్తే నీకు పంపించేస్తా."

కుముకు ఇప్పటికీ ఇంకా మధుసూదనుని మాటలలో నమ్మకం పోలేదు, కనుక అతనుఅన్నదే నిజం అనుకొన్నది.

"అన్నయ్య ఉత్తరం వచ్చిందేమో ఒక్కమారు చూడ గలవా?"

"వస్తే మధ్యాహ్నము భోజనముకాగానే నేనే తెచ్చి ఇస్తాను."

కుము మనస్సును కట్టిపెట్టుకొని ఓర్చి ఉండవలెనని నిశ్చయించుకొన్నది. ఆమెను దగ్గిరికి లాగుకొందామని మధు ఆమెచెయ్యి పట్టుకోబోతున్నాడు, శ్యామ హఠాత్తుగా గదిలో ప్రవేశించి, "ఓయి బాబు! అబ్బాయే!" అని అంటూ బయటికి పారిపోయింది.

"ఏమి? ఏమిటి నీకు కావలసింది?" అని మధుసూదన్ అడిగాడు.

"తోటికోడలు వంటకు సామాను ఇస్తుందేమో అని పిలవడానికి వచ్చాను—రాణిఅయినా గృహలక్ష్మికూడా కదా! పోనీ ఈవాళకు ఎలాగో జరుపుకుంటాము!"

మధుసూదన్ సోఫామీదనుంచి లేచి ఏమీ అనకుండా బయటికి వెళ్లిపోయినాడు.

భోజనం అయినతరువాత మామూలుప్రకారం పడకగది మంచముపైని, బాలీసుమీద చేరపడి, తాంబూలం నములుతూ, కుముకు కబురుపంపాడు రమ్మని. కుము తత్‌క్షణమే వచ్చింది—

అన్నయ్య ఉత్తరం ఈవాళ వస్తుందని ఆమె ఎరుగును. పడక గదిలో ప్రవేశించి మంచముపక్కను నిలబడ్డది.

మధుసూదన్ గుడుగుడుగోట్టం పక్కనుఉంచి చేతితో సంజ్ఞచేస్తూ, "కూర్చో," అన్నాడు.

మధుసూదన్ ఆమెచేతికి ఇచ్చిన ఉత్తరములో ఈనాలుగు మాటలే ఉన్నవి—

"నా ప్రాణప్రతిమకు—

శుభాశీర్వాద రాశయః సంతు!

మందు పుచ్చుకోడానికి త్వరలో కలకత్తా వస్తున్నాను, ఒంట్లో కొంచెము సుళువుగానే ఉన్నది. నిన్ను చూడడానికి వస్తాను, ఇంటిపనులమధ్య వీలుచేసుకొని అప్పుడప్పుడు నీ క్షేమ సమాచారం తెలియచేస్తూ ఉంటే నిశ్చింతగా ఉండగలను."

ఆ చిన్నఉత్తరం చూడగానే కుము మనస్సుకు దెబ్బ తగిలింది—"నేను అప్పుడే పరాయిదాననుఅయిపోయినా"నని తనలో తాను అనుకొన్నది. కాని అభిమానం ఇంకా బాగా ఎక్కువ కాకుండానే అన్నయ్య ఒంట్లో బాగులేదేమో అని సందేహముకలిగి—"ఛీ, ఎంత చిన్న మనస్సు నాది, ఎల్లప్పుడూ నాసంగతే ముందు ఆలోచిస్తుంటా!" నని తననుతాను నిందించు కున్నది.

కుము లేచి వెళ్లిపోబోతుండడం చూచి మధుసూదన్, "ఎక్కడికి వెళ్లుతావు కొంచెముసేపు కూర్చో," అని అన్నాడు.

కుమును కూర్చోమన్నాడు గాని ఏసంగతినిగురించి మాట్లాడడమో తట్టలేదు. త్వరగా ఏదో ప్రసంగం ప్రారంభించాలి కనుక ఉదయమునుంచి మాటిమాటికి అతని మనస్సులోకి వస్తున్నదానిని గురించి అడిగేశాడు—"పనసగుసాలను గురించి అంతగొడవ చేశావెందుకు—అందులో సిగ్గుపడవలసినదేమున్నది?"

"అందులో రహస్యం ఉన్నది."

"రహస్యమా! నాతో కూడా చెప్పకూడదనివా?"

"కూడనిదే!"

మధుసూదనుని కంఠం కఠోరమయిపోయింది—"ఇది నీ నూర్‌నగర్ పంథా, అన్నగారి స్కూల్‌లో తయారయినది!"

కుము నోరువిప్పలేదు. మధుసూదన్ బాలీసుమీద నుంచి ముందుకులేచి కూర్చొని, "నీ నూర్‌నగర్ ధోరణి వదలగొట్టకపోతే నాపేరు మధుసూదన్ కాదు," అని అన్నాడు.

"నీ ఆజ్ఞ ఏమిటో తెలియజేయమని నేను కోరేది."

"ఆ పొట్లం నీకు ఎవరిచ్చారో చెప్పు."

"హాబ్లూ."

"హాబ్లూ ఇచ్చాడా! అయితే అంత దాపుడు ఎందుకు?"

"కారణం నేను సరిగా చెప్పలేను."

"దాన్ని ఎవరైనా హాబ్లూచేతికి ఇచ్చిపంపారా?"

"లేదు."

"అయితే మరి ఇంతదాపరికం ఎందుకు?"

"అంతవరకే—అంతకు పైని అడగవలసిన ప్రశ్న లేదు."

"దానికి ఇంత దొంగతనం ఎందుకు?"

"నీకు బోధపడదు."

మధుసూదన్ కుముచెయ్యి పట్టుకొని ఒక జోడింపు జోడించి, "నిన్నుచూచి ఊరుకోవడం ఎవరితరం, ప్రతి విషయంలో గొప్ప చిరాకు పెడుతున్నావే!"

కుము ముఖం ఎర్రచేసుకొన్నది, అయినా అతి శాంతంగా, "నీవు కోరే దేమిటో తెలియజేయి, మీ ఇంటి పద్ధతులకు నేను అలవాటుపడలేదు, ఆమాట ఒప్పుకోక తీరదు," అని అన్నది.

మధుసూదన్ ముఖానికి రెండుపక్కలనుఉండే రక్త శిరాలు పొంగినవి, జబాబు ఏమీ తట్టక, కుమును కొట్టవలెనని బుద్ధిపుట్టింది అతనికి; సరిగా, ఆసమయంలో బయట దగ్గినట్టు శబ్దము వినబడ్డది—ఆ వెంటనే, "ఆఫీసు దొరగారు వచ్చి కూర్చున్నారు," అంటూ మాట కూడా వినబడ్డది. ఇవాళ డైరెక్టర్ల మీటింగ్ అని మధుసూదన్‌కు అప్పుడు జ్ఞాపకం వచ్చింది, ఆమాట జ్ఞాపకమే లేకపోయినందుకు సిగ్గుపడ్డాడు. ఆనాటి ఉదయమంతా వృథా అయిపోయింది. తన స్వభావానికీ, అభ్యాసానికీ విరుద్ధమైన ఈ మనోశైథిల్యము చూచి మధుసూదన్ నిర్ఘాంతపోయినాడు.

## ౪౦

మధుసూదన్ వెళ్ళిపోగానే కుసుమ మంచము దిగి నేల మీద కూర్చున్నది. దరి కనబడని సముద్రంలో ఈవిధంగా శాశ్వతకాలమూ ఈదుతూ ఉండవలెను కాబోలు! మధుసూదన్ అన్నమాట నిజమే—ఆమె పద్ధతులువేరు తన పద్ధతులువేరు.

అన్ని భేదాలకంటె ఇటువంటిభేదము భరించ శక్యము కానిది. ఇప్పుడు ఏమిటి ఉపాయం?

హఠాత్తుగా ఏమిటో జ్ఞాపకంవచ్చి కుసుమ మేడదిగి మోతీతల్లి గదివైపు వచ్చింది. మెట్లు దిగబోయేటప్పటికి శ్యామాసుందరి ఎదురుగావచ్చింది—ఆమె మేడ ఎక్కుతున్నది.

"ఎక్కడికి వెళ్తున్నావు చెల్లీ, నేను నీదగ్గరకే వస్తున్నాను."

"పని ఉన్నదా?"

"మరేమీలేదు—అబ్బాయిమనస్సు బాగున్నట్టులేదు. మీ ప్రణయానికి ఏమైనా అడ్డువచ్చిందేమో అని భయము వేస్తున్నది. అతనితో ఎలాగు భక్తిశ్రద్ధలతో నడుచుకోవలెనో ఆవిషయములో నీకు మేము సలహా ఈయగలము సుమా, మరిచిపోకు. చిన్నతోటికోడలి గదిలోకి వెళ్తున్నావు కాబోలు—వెళ్లు మనస్సువిప్పి మాట్లాడుకోవచ్చు."

శ్యామాసుందరీ—మధుసూదనూ—ఇద్దరూ ఒక్క మట్టితో చేయబడ్డవాళ్లే అని ఇవాళ కుముకు హఠాత్తుగా తట్టింది. ఇద్దరూ ఒక్క కుమ్మరిచక్రములో తయారైనవాళ్లే! కుము తలలోకి ఆతలంపు ఎందుకు దూరిందో చెప్పడం కష్టం. అది వాళ్ల ప్రవర్తనను పరిశీలించి నిర్ణయించిన అభిప్రాయం కాదు. బాహ్యప్రవర్తనలో ఇద్దరూ ఒక్కమాదిరే కనబడే వారా అంటే అదీ లేదు, ఇద్దరి జగత్తులలో ఒకేస్వరంవంటిది కనబడేది. ఇద్దరి ప్రపంచాలలో వీచేగాలీ ఒక్కటే అని, చూచే వాళ్లకు తడుతుంది. శ్యామాసుందరి స్నేహము కనపరుస్తూ కుము దగ్గిరికి వచ్చేటప్పటికి, ఆ స్నేహాభావం కుముసు మరింత దూరం తోసేస్తుండేది, కుము ఒంట్లో గగుర్పు పుట్టేది.

కుము మోతీతల్లి గదిలోకి వెళ్లేసరికి భార్యాభర్త లిద్దరూ, చేతులతో ఒకరినొకరు తోసుకొంటూ ఏదోచేయ బోతున్నారు, కుము వెళ్లిపోదామని తిరిగింది, అంతలో నవీన్ ఆమెను చూచి, "వదినా వెళ్లకు, వెళ్లకు, నీదగ్గిరకే రావాలను కొంటున్నాను, ఫిర్యాదు చేదామని," అని అన్నాడు.

"దేనివిషయమై ఫిర్యాదు?"

"కొంచెము కూర్చో, దుఃఖించవలసిన సంగతి ఒకటి ఉన్నది."

కుము మంచముమీద కూర్చున్నది.

"ఎంత అన్యాయమో చూచావా, ఈ దొడ్డ ఇల్లాలు నా పుస్తకం దాచేసింది," అని నవీన్ అన్నాడు.

"అంత కఠినమైన ఖాయిదా ఎందుకు?"

"ఈర్ష్య—తాను ఇంగ్లీషుచదవలేదు గనుక; స్త్రీ విద్య పక్షము నాది. భర్త - జాతికి చదువుకూడదు అనే జట్టులో చేరినది ఆమె. నా బుద్ధి అధికమవుతున్నకొలది, ఆమెకూ నాకూగలభేదము మరి అధికమౌతున్నది, అని ఆమెకు కడుపుబ్బ, ఎంతో బోధపరిచాను. సీత అంత గొప్పఘనమైన ఇల్లాలయినప్పటికీ శ్రీరాముని వెనుకనే ఎల్లప్పుడూ వెళ్లుతూ ఉండేది. విద్యాబుద్ధులలో నీకంటె నేను ఎంతో ముందు ఉన్నాను. నాకు అడ్డురాకు అని నేను ఎంతచెప్పినా వినకుండా ఉన్నది."

"నీవిద్యమాట సరస్వతీదేవి ఎరుగును, కాని నీబుద్ధిని గురించి మాత్రం నా ఎదుట బడాయి కొట్టవద్దు - చెప్తున్నాను, జ్ఞాపకం ఉంచుకో."

గొప్ప ఆపదలోపడ్డవాడిలాగు నవీన్ నటించడం చూచి, కుము నవ్వుఆపుకోలేక పకపక నవ్వింది. ఈ ఇంటికి వచ్చినప్పటి నుంచి ఇంత స్వేచ్ఛగా కుమునవ్వడం ఒక్కనాడూ జరగలేదు. అది చూచి నవీన్‌కు బహు ఆనందం గలిగి, తనలో తాను, "నాకోరిక నెరవేరింది, వదినను నవ్వించాలిఅని అనుకొన్నాను నవ్వించాను," అని అనుకొన్నాడు.

కుము నవ్వుతూ నవ్వుతూ, "ఏమి చెల్లీ ఎందుకు అబ్బాయి పుస్తకం దాచేశావు?" అని అడిగింది.

"చూడు అక్కా, పడకగదిలోకికూడా బడిపంతులు తయారయినట్టుగా ఏమిచేస్తున్నారో నీ మరదిగారు?

రోజంతా కష్టపడి కష్టపడి రాత్రి గదిలోకి వచ్చేసరికి, దీపముబుడ్డి వెలుగుతుంటే ఇంకొక లైట్ కూడా ముట్టించి ఈమహా పండితులవారు చదువుతూ కూర్చున్నారు. ఇవతల అన్నం నీరుకారిపోతున్నది, ఎంతపిలిచినా వినబడదే వినబడదు."

"నిజమేనా అబ్బాయి?"

"నేను భోజనాపేక్షలేనంత తపస్విని కాను వదినా, కాని భోజనముకంటె రుచికరమైనది ఆమె కంఠములోనుంచి వచ్చేపిలుపు. భోజనానికి ఆలస్యముచేయడానికి కారణం అదే, పుస్తకము చదవడం ఉత్త నెపము."

"మాటలలో అతనితో నేను చాలలేను—నేనే ఓడి పోతాను."

"ఆమె మాటలు ఆపేస్తే నేను ఓడిపోతాను!"

"ఆలాగుకూడా ఎప్పుడైనా జరుగుతూఉంటుందా ఏమిటి, అబ్బాయి?"

"ఒకటి రెండు తాజాదృష్టాంతాలు చెపుతాను విను, అట్లాగైతే - తన కన్నీటితో తానే వ్రాసిఉంచినవి—అక్షరాల నిగనిగ ఇంకాపోలేదు."

"సరే చాలించండి, దృష్టాంతాలు తమరు ఈయనక్కర లేదు. నా తాళాలు ఎక్కడుంచావో చెప్పు ఇక—చూడు అక్కా నా తాళాలు ఎక్కడో దాచేశాడు."

"ఇంట్లోవాళ్ల మీద పోలీస్ కేసు పెట్టడానికి వీలులేదు, దొంగను దొంగతనము మూలంగానే లొంగదీయాలి. నాపుస్తకం ఇచ్చేయి మొదట."

"నీచేతికి ఈయను, అక్కచేతికి ఇస్తాను," గదిమూలను పట్టారోమముగుడ్డ పీలికలూ, చిరిగిపోయిన మేజోళ్లూ మొదలైనవి వేసిన బుట్టఅడుగునుంచి మోతీతల్లి *ఎబ్రిడ్జ్ ఎన్సైక్లోపీడియా, అనే పేరుగల ఇంగ్లీషు పుస్తకంఒకటి తీసి కుముదిఒడిలో పెట్టి, "దానిని నీగదిలోకి తీసుకువెళ్లిపో అక్కా, అతనికి ఈయకు—నీమీద ఎంతకోపగిస్తాడో చూదాము," అని అన్నది.

నవీన్ దోమతెరమీదినుంచి తాళము చేతులగుత్తి తీసి కుముచేతిలో పెట్టి, "ఇది ఎవ్వరికీ ఇయ్యకు వదినా, నిన్ను ఎవరు ఏమిచేస్తారో చూదాము," అని అన్నాడు.

కుము ఆపుస్తకముకాగితాలు తిరగవేస్తూ, "ఈపుస్తకం అంటే అబ్బాయికి చాలా సరదా కాబోలు?" అని అడిగింది.

"అతనికి సరదాలేని పుస్తకము ఉండదు. అవాళ ఎక్కడినుంచో "గోపాలనము" అనే పుస్తకము పట్టుకొని కూర్చున్నాడు."

"ఆగ్రంథం నా శరీర రక్షణకోసం చదవలేదు—కనుక అందులో సిగ్గుపడవలసినదేమీ లేదు."

---

*Abridged Encyclopaedia=సంక్షిప్త విజ్ఞాన సర్వస్వము.

"నీవు ఏదో అడగాలని వచ్చినట్టున్నావు అక్కా, అడిగేయి, ఈ వాచాలుడికి సెలవు ఇచ్చేదాము."

"వద్దు సెలవు ఈయనక్కరలేదు—మా అన్నయ్య రెండు మూడు రోజులలో వస్తాడట—ఆమాట—"

"ఔను అతను రేపు వస్తున్నా" రని నవీన్ అన్నాడు.

"రేపే!" అని అంటూ కుము కొంచెముసేపు ఊరుకొని పెద్దనిట్టూర్పు విడిచి, "అన్నయ్యను ఏలాగు చూడడం?" అని అన్నది.

"నీవు బావగారితో ఏమీ అనలేదా?" అని అడిగింది మోతీతల్లి.

లేదని సూచిస్తూ తలఊపింది కుము.

"ఒకసారి అడిగి చూడవూ?"

కుము జబాబు చెప్పలేదు. మధుసూదన్ ఎదుట అన్నయ్యమాట ఎత్తడం చాలా కష్టం. అన్నను అవమాన పరచవలెననే బుద్ధి మధుసూదనుని ఒంట్లో నాటిపోయిఉన్నది, కనుక ఏమాత్రం కదిలించి చూడడానికైనా కుముకు బహు సంకోచము.

కుము ముఖంచూచి నవీన్‌కు మిక్కిలి బాధకలిగింది. "నీవేమీ భయపడకు వదినా చేయవలసింది మేము చేస్తాము—నీవేమీ అన్నయ్యతో చెప్పక్కరలేదు," అని అత నన్నాడు.

నవీన్ చిన్నప్పటినుండీ అన్నగారిదగ్గర చాలా పిరికిగా ఉండేవాడు. వదిన వచ్చి ఆ పిరికితనాన్ని పోగొట్టినట్టు ఉన్నది.

కుము వెళ్లిపోయిన తరువాత మోతీతల్లి నవీన్‌తో అన్నది—"ఏమి ఉపాయం ఆలోచించావు? ఆనాడు రాత్రి మీ అన్నయ్యగారు మనను పిలిపించి అక్కడగ్గిర తన అల్పతనాన్ని ఒప్పుకున్నారు—అప్పుడే అనుకొన్నాను దానివల్ల లాభం ఉండదని, అప్పటినుండి నీవు కనబడేసరికి ముఖం అటు తిప్పుకొని వెళ్లిపోతున్నారే!"

"పొరపాటు అయింది అని అన్నయ్య గ్రహించాడు. ఆవేశముకొలదీ రూపాయలసంచి ఒంపేసి వెల చెల్లించేశాడు, ఇవతల అనుకొన్న తూనికప్రకారం సరుకు రాలేదు. ఈ తెలివిమాలినతనానికి మనము సాక్షులము కాబట్టి మనను చూస్తే అంతకోపము."

"మనమీద కోపముఉంటే ఉండనీ, కాని విప్రదాసుబాబుమీదఉండే కోపం అతనిని రోజుకురోజు పిచ్చెత్తించేస్తున్నదే! ఇంత అసందర్భ మేమిటి?"

"అట్లాంటివాళ్ల భక్తి ఆవిధముగానే వ్యక్తమవుతుంటుంది. ఆజాతివాళ్లు ఎవరినైతే లోలోపల మానవశ్రేష్ఠులని నమ్ముతారో వాళ్లనే బహిరంగముగా నిందిస్తుంటారు. రాములవారంటే రావణునికి అసాధారణభక్తి అని కొందరి నమ్మకము, కనుక తన ఇరవై చేతులతో రాములవారికి నైవేద్యం సమర్పించేవాడట. నేను చెపుతున్నాను చూస్తూ ఉండు—ఎంతో కష్టంమీదగాని కుము అన్నగారిని కలుసుకోలేదు."

"అట్లాగంటే ఏలాగు, ఏదో ఉపాయం కనిపెట్టాలి."

"ఒక ఉపాయం బుర్రలోకి వచ్చింది."

"ఏమిటది చెప్పు."

"చెప్పడానికి వీలులేనిది."

"ఎం'చేత?"

"సిగ్గువేస్తున్నది."

"నా దగ్గిరకూడా సిగ్గే?"

"ఆహా నీదగ్గిరకూడాను."

"దానికి కారణం?"

"కుయుక్తిపన్ని అన్నయ్యను మోసపుచ్చాలి—నీతో చెప్పి ప్రయోజనములేదు."

"ఎవరియెడల నాకు ఆదరం ఉన్నదో వాళ్లసుఖం కొరకు కుయుక్తి పన్నడానికి నేను కొంచెమైనా సంకోచించను."

"నామీద ప్రయోగించి ప్రయోగించి నీచెయ్యి పండిపోయిందనుకుంటాను?"

"ఆ శక్తిని అంత సునాయాసంగా ప్రయోగించడానికి నీవంటివాళ్లు ఎక్కడో గాని దొరకదు!"

"నీకు ఎగ్రిమెంటు వ్రాసిఇచ్చేస్తాను అమ్మగారూ, నీ ఇష్టమువచ్చినప్పుడు యుక్తులు పన్నుతుండు!"

"అంత ఆనందం ఎందుకయ్యా?"

"ఎందుకు చెప్పేదా? నీవు పన్నగల జిత్తులన్నింటినీ తేనెతో నింపిఉంచాడు విధాత, ఆ మధుమయమైన వంచననే 'మాయ' అంటారు."

"అటువంటి 'మాయ'ను చెదరగొట్టడము మంచిది కాదూ?"

"క్రొంపతీశావు! మాయపోతే ప్రపంచములో మిగిలిన దేమిటి?"

"దేవీ విగ్రహానికి ఉండే రంగు కడిగేస్తే మిగిలినది గడ్డి మన్నే కదా! మూర్ఖుని భ్రమలో పెట్టు దేవీ! మోసపుచ్చు, మంత్రం ప్రయోగించి స్మారకం తప్పించు, మైకం కమ్మించు—నీచిత్త ప్రకారం చేయించు!"

భార్యాభర్తలకు ఆతరువాత జరిగిన మాటలు పనికి వచ్చేమాటలుకావు—ఈకథతో వాటికి ఎట్టిసంబంధమూ లేదు.

## ౪౧

ఈ రోజున మీటింగులో మధుసూదనుకు ప్రథమ అపజయం కలిగింది. అతనుచేసిన ఏపనికిగాని ఏప్రస్తావానికి గాని ఎవరూ ఇంతవరకు ఎన్నడూ అడ్డురాలేదు. తనపై తనకు ఎట్లాంటి నమ్మకం ఉండేదో అతనితో పనిచేస్తున్న వాళ్లందరికీ కూడా ఆతనిపైని అట్లాంటి నమ్మకమే ఉండేది. ఆధైర్యము మీదనే మీటింగులో డైరెక్టర్ల అనుమతి పొందకముందే అనేకమైన జరూరువిషయాలలో పనినడిపించేస్తూ ఉండేవాడు. ఇప్పుడు పాతనీలిమందు కార్ఖానా ఒకటీ దానితో కలిసిఉన్న గ్రామమూ కొనవలెనని మాటలుజరిగి, అంతా నిశ్చయం అయిపోయింది, డబ్బుకూడా చాలాభాగం ఇచ్చేయడం

జరిగింది—దలారి స్టాంపు రిజిస్టరుచేయించగానే మిగతాడబ్బు చెల్లించేయడము మాత్రమే తరవాయి—కొత్త కార్ఖానాలో ఎవరెవరికిని ఏఏ పనులలో ఉంచాలో అది కూడా నిర్ణయము అయిపోయింది. ఒక క్యాషియర్ పని ఇంకా ఖాళీగాఉన్నది. కంపెనీ పెద్దవాళ్లలో ఒకడు, తనకు వరసకు అల్లుడయే ఒక అతనిని ఆపనికి సిఫార్సుచేసాడు—కాని అయోగ్యులకు ఉద్యోగాలు ఇచ్చి, వాళ్లను ఉన్నతిలోకి తీసుకువచ్చే స్వభావం కాదు మధుసూదన్‌ది—కనుక ఆ అల్లుడికి క్యాష్‌కీపర్ పని ఈయదలచుకోలేదు.

కంటికి కనబడకుండా భూమిలో దాగిఉన్న చిన్న బీజము పెద్దవృక్షమై లేచినట్టు చిన్నసంగతి హఠాత్తుగా అంకురించి ప్రతికూలమై నిలుచున్నది. ఆ వ్యవహారంలో కొంచెము లోపం కూడా ఉండెను. అమ్ముతున్నవాడు మధుసూదన్‌కు దూరపు మేనత్తబావగారి కొడుకు, అత్తవచ్చి కాళ్లూ చేతులూ పట్టుకొన్నది—మధుసూదన్ చూచాడు—ఎస్టేటు చౌకగా తీసుకోవచ్చును, దానివల్ల బాగా లాభం వస్తుంది—పైగా అత్తకు ఉపకారం చేశాడని బంధువులందరూ పొగుడుతారుకూడాను, ఇదిఅంతా ఆలోచించి ఆ ఎస్టేటుకొన నిశ్చయించాడు. ఈలోగా, పనికిమాలినవాడనే కారణముచేత ఎవడి అల్లుడికి క్యాషియరు పని దొరకలేదో ఆ పెద్దమనిషి చాలా ప్రయత్నముచేసి మధుసూదన్ తనవాళ్లయెడల పక్షపాతంకలవాడనే సంగతి స్థిరపరిచాడు. స్థిరపరచి ఈ సత్యము ఎక్కడెక్కడ త్వరగా

వ్యాపిస్తుందో ఆ ఆ స్థలాలులో ప్రచారణ ప్రారంభించాడు. ఇదికాక కంపెనీకోసం సరుకుకొన్నప్పుడూ కంపెనీ సరుకు అమ్మినప్పుడూ మధుసూదన్ దొంగతనంగా కమిషన్ పుచ్చుకుంటున్నాడని వదంతి అన్యాయంగా పదిమంది చెవులలో పడే భారముకూడా తానే వహించాడు. ఇటువంటి నిందలకు ప్రమాణాలుకనపరచమని చాలామంది కోరనేకోరరు—తమలో దాగిఉన్న దురాశే అన్ని ప్రమాణాలకంటె బలమైన అంతరతమ ప్రమాణము. లోకులకు మధుసూదన్‌పైని కోపం కలగడానికి కారణం ఉన్నది. సంపద పెంపొందించడములో అసామాన్య ఆసక్తి కలవాడు మధుసూదన్—వర్తకవిషయాలలో మాట నిలకడ కలవాడనీ పూర్తిగా నమ్మదగినవాడనీ పేరుపడ్డవాడు—ఇతరుల శత్రుత్వానికి ముఖ్యకారణాలు ఇవే. మధుసూదన్‌కూడా దొంగతనంగా డబ్బుచేసుకొంటున్నాడనే అపవాద వినగానే, ఏదైనా దొరికితేచాలును కడుపునింపుకుందామని కూర్చున్న వాళ్లందరికీ గొప్పమనఃశాంతి కలిగింది.

అవతల, తాలూకా అమ్మ చూపినవాడికి మాట ఇచ్చాడు మధుసూదన్. ముందుకు నష్టము రావచ్చునని జడిసి మాట తప్పవలసినవాడుకాడు అతను. కనుక తానే ఆతాలూకా కొనేదామని నిశ్చయించుకొన్నాడు—అది కొనకపోవడమువల్ల తామే మోసపోయినారని కంపెనీవాళ్లకు నచ్చచెప్పవలెనని మధుసూదనుని కోరిక.

ఆరోజున మధుసూదన్ ఇంటికి ఆలస్యముగా వచ్చాడు. తాను బహు అదృష్టవంతుడనని మధుసూదన్‌కు ఒక అంధ విశ్వాసము ఉండేది—కాని 'అదృష్టదేవత అతను జీవనయాత్ర చేస్తున్న బండి ముఖాన్ని ఇవాళ ఒకవైపునుంచి రెండోవైపుకు హఠాత్తుగా తిప్పివేసిందేమో అని అతనికి భయముకలిగింది. మొదటిజాడింపుతో గుండె దబదబ కొట్టుకోవడము ప్రారంభించింది. మీటింగునుంచి ఆఫీసుగదిలోకి వస్తూనే వాలుకుర్చీ మీద కూలబడి గుడుగుడు పీల్చడము మొదలుపెట్టాడు— అతని మనస్సులో పుడుతున్న నల్లని ఊహాలు ఆ గుడుగుడు పొగతో కలిసి చుట్టలుచుట్టలుగా బయటికివస్తున్నట్టు కనబడ్డది.

నవీన్ వచ్చి, "విప్రదాసుగారి ఇంటినుండి మనిషి వచ్చాడు, నిన్ను చూస్తానంటున్నాడు," అని అన్నాడు.

"పొమ్మను, నాకు ఇప్పుడు వేళలేదు," అని మధుసూదన్ కసిరాడు.

మధుసూదనుని ధోరణి చూచి మీటింగులో ఏదో విపరీతము జరిగిందని నవీన్ పోల్చుకొన్నాడు. అన్నయ్యమనస్సు అప్పుడు చాలా దుర్బలంగా ఉండవలెనని గ్రహించాడు. దౌర్బల్యము ఉదారతను నాశనంచేస్తుంది. దుర్బలుల ఆత్మగరిమ క్షమాహీన నిష్ఠురతను వహిస్తుంది. అన్నయ్యకు ఏదో పెద్దదెబ్బ తగిలింది. అట్లాంటప్పుడు వదినమనస్సుకు బాగా బాధకలిగేటట్టు ఏదో చేసితీరుతాడు. ఈ విషయములో నవీన్‌కు ఏమీ

సందేహము లేదు. వదినకు దెబ్బతగలకుండా కాపాడవలెనని నవీన్ నిశ్చయించుకొన్నాడు—ఇప్పటివరకు అతనికి ఉండే సంకోచము ఇప్పుడు పూర్తిగా పోయింది. నవీన్ కొంచెము ఇటూఅటూ తిరిగి మళ్లా గదిలోకి వచ్చాడు—పైవిలాసాలు వ్రాసిఉంచే నోటుబుక్కు పట్టుకొని మధుసూదన్ పేజీలు తిరగ వేస్తున్నాడు, నవీన్‌వచ్చి నిలబడగానే కోపముగా అడిగాడు— "ఏం!—మళ్లా వచ్చావెందుకు? మీా విప్రదాసుబాబుగారి పక్షము వకీలుగా వచ్చినట్టున్నావు!"

"లేదుఅన్నయ్యా, ఆ భయం అక్కరలేదు—ఎట్లాంటి గసురుగసిరి వాళ్లమనిషిని పంపానో ఎరుగుదువా—నీవు రమ్మని కోరినా మన ఇంటివైపు అతను మరిరాడు."

అట్లాగన్నా మధుసూదన్‌కు కోపమే—"నా చిటికినవేలు ఆడించేసరికి నాపాదాలదగ్గిరికి వచ్చిపడాలి—ఎందుకు వచ్చాడట వాళ్లమనిషి?" అని అన్నాడు మధుసూదన్.

"విప్రదాసుబాబు కలకత్తా రావడం రెండురోజులు వెనకపడ్డదట—అతనిబంట్లో మరికొంచెము బాగుంటేనేతప్ప రాలేడట."

"సరే, సరే, అందుకని నేను గాబరా పడుతుండలేదు."

"రేపు ఉదయము నాకు రెండు ఘుంటలసేపు సెలవు కావాలి అన్నయ్యా."

"ఎందుకు?"

"వింటే నీకు కోపమువస్తుంది."

"వినకపోతే మరీ కోపమువస్తుంది."

"కుంభకోణమునుండి జ్యోతిష్కుడొకడు వచ్చాడు, అతన్ని కలుసుకోవాలని ఉన్నది అన్నయ్యా."

మధుసూదన్ గుండె దబదబ కొట్టుకొన్నది—తత్ క్షణమే అక్కడికి పరుగెత్తి వెళ్లవలెనని బుద్ధిపుట్టింది కాని బయటికి మాత్రం హేళనచేస్తున్నట్టుగా, "అట్లాంటివాటిలో నీకు నమ్మకం ఉన్నదా?" అని అడిగాడు.

"మామూలుఅవస్థలో ఉన్నప్పుడు నమ్మకం ఉండదు కాని భయంవేసినప్పుడు మాత్రం నమ్మకం కలుగుతుంది."

"ఎందుకు భయము?"

నవీన్ జవాబు ఇయ్యక తల గోక్కుంటూ నిలుచున్నాడు.

"దేనినిగురించి నీకుభయం?" అని మధుసూదనే తిరిగి అడిగాడు.

"ఈప్రపంచములో నీవు తప్పితే ఇంకెవరికీ జడవను. నీధోరణి చూస్తూఉంటే కొన్నాళ్లపట్టి నా మనస్సులో గాబరా పడుతున్నది."

మధుసూదన్‌ను చూస్తే పెద్దపులిలాగు జడుస్తారు అందరూ, ఇది అతనికి మహాతృప్తికరంగా ఉండేది. నవీన్ వైపు

ముఖముతిప్పి తన మాహాత్మ్యాన్ని అనుభవిస్తూ, గుడు గుడు పీలుస్తున్నాడు.

నవీన్—"కనుక ఒక్కమారువెళ్ళి గ్రహాలు నన్నేమి చేయతలస్తున్నవో కనుక్కొని రావలెనని ఉన్నది—నాకు సెలవు ఎప్పుడు దొరుకుతుందో అదికూడా కనుక్కోవలెనని ఉన్నది."

"నీవు నాస్తికుడవు—దేనిలోనూ నీకు నమ్మకములేదు-చివరకు—"

"భగవంతడిలో నమ్మకముఉంటే గ్రహాలను నమ్మిఉండను అన్నయ్యా—డాక్టర్‌లో నమ్మకములేనివాడికి సాముద్రికుడిని నమ్మడానికి కష్టము ఉండదే!"

మధుసూదన్‌కు జ్యోతిష్కుడి దగ్గిరికివెళ్ళి తన సంగతి కనుక్కుందామని లోలోపల ఎంత తొందరగా ఉన్నదో, బయటికి అంత తీవ్రంగా నవీన్‌ను తిడుతూ "చదువెరిగిన కోతివినీవు—ఎవడేది చెపితే అదే నమ్ముతావు—నీచదువంతా ఇందుకేనా!" అని అన్నాడు.

"అతని దగ్గిర భృగుసంహిత ఉన్నది—ఇప్పటికి పుట్టిన వాళ్ళవీ, ముందుకు పుట్టబోయేవాళ్ళవీ—ఎక్కడ పుట్టినవాళ్ళైనా సరే ఎప్పుడు పుట్టినవాళ్ళైనా సరే—అందరి జాతకాలూవ్రాసి తయారుగా ఉన్నవట—దానిపైని మరి వాదించవలసినది ఏమిఉన్నది? వెళ్ళిచూడడమూ నిజమో కాదో పరీక్షచేయడమూ—రెండూ అయిపోతవి.

"మూర్ఖులను మోసపుచ్చి పొట్టపోషించుకొనేవాళ్ల కొరకు నీవంటి తెలివిమాలినవాళ్లను అనేకమందిని సృష్టించి ఉంచాడు భగవంతుడు."

"ఆ మూర్ఖులను రక్షించడానికే నీవంటి బుద్ధిమంతులను కూడా సృష్టిస్తుంటాడు. ఇతరులను కొట్టేవాళ్లమీద దేవుడికి ఎంత దయో ఇతరులచేత కొట్టబడ్డ వాళ్లమీద కూడా అంత దయే. భృగుసంహితమీద నీ తీక్ష్ణబుద్ధి ప్రయోగించి చూడ కూడదూ?"

"సరే ఆలాగైతే రేపు ఉదయమే నన్ను అతని దగ్గిరికి తీసుకువెళ్లి—నీ కుంభకోణము మోసం బయలుపెడతాను."

"నీ అపనమ్మకము చాలా బలమైనది అన్నయ్యా, దాని వల్ల జ్యోతిష్కుని లెక్కలుకూడా తప్పు అయిపోవచ్చును. మనుష్యులను మనము నమ్ముతున్నకొలదీ వాళ్లు విశ్వాస యోగ్యులౌతూ ఉంటారు—ఈ సంగతి లోకములో మనము రోజూ చూస్తున్నదే. గ్రహాలదశ కూడా అంతేను. దొరలకు గ్రహాలలో నమ్మకములేదు, కనుక వాటిశక్తి దొరల మీద పోదు. ఆవేళ బ్రాహ్మ్యాహస్పర్శవేళప్పుడు బయలుదేరి మీ చిన్నదొరగారు గుర్రపుపందెములో గెలిచివచ్చారు, నేనే ఆవేళప్పుడు బయలుదేరిఉంటే, ప్రతిపందెములో గెలుచుకు వస్తూఉండే గుర్రము కూడా ఛటీమని నా దగ్గిరికివచ్చి నా పొట్టమీద ఒక్కతాపు తన్నిఉండేది. ఈ గ్రహనక్షత్రాల

లెక్కలమీద నీబుద్ధి ప్రయోగించకు అన్నయ్యా, వాటిని నమ్మిఉండడమే మంచిది.”

మధుసూదన్ మనస్సు కొంచెము చులకన అయింది. చిరునవ్వునవ్వుతూ గుడుగుడు పీల్చాడు.

మర్నాడు ఉదయము ఏడుకొట్టకముందే ఒక ఇరుకు సందులో పెంటకుప్పలమీదుగా బండితోలించుకుంటూ వచ్చి మధుసూదన్ నవీన్‌తో కలిసి వెంకటశాస్త్రి బసదగ్గిర హాజరయినాడు. కింది అంతస్తులో ఉన్న ఒక చీకటిగదిలో అతని ఉనికి. గదినిండా బూజు. సున్నము రాలిపోతున్న గోడలు ఘోరమైన చర్మరోగముపట్టిన మనిషిలాగు పరమ అసహ్యంగా కనబడుతున్నవి. కర్రమంచముమీదను చిరిగిపోయిన మురికి శత్రంజీ పరిచిఉన్నది, ఒకపక్కను పుస్తకాలు కొన్ని కలగా పులగముగా పడిఉన్నవి, గోడను శివపార్వతుల పటము ఒకటి వేలకట్టిఉన్నది. లోపలికి వచ్చి నవీన్, “శాస్త్రీజీ” అని కేక వేశాడు. మురికిశాలువు కప్పుకొని శాస్త్రిగారు గదిలో ప్రవేశించారు. తల ముందుభాగం క్షవరముచేసి ఉన్నది. వెనుకను జుట్టు, నల్లగా పొట్టిగా బక్క పలచగా ఉన్నాడు. నవీన్ అతిభక్తిగా అతనిని నమస్కరించాడు. అతని ఆకారము చూస్తే మధుసూదన్‌కు మాత్రం కొంచెమైనా భక్తికలగలేదు. అయినా దైవజ్ఞుడికి దేవుడితో సంబంధము ఉన్నదని జ్ఞాపకము తెచ్చుకొని పెట్టీపెట్టని నమస్కారము ఒకటి మెల్లిగా పెట్టాడు. నవీన్ మధుసూదనుని జాతకము శాస్త్రిఎదుట పెట్టాడు, శాస్త్రి

అది చూడక మధుసూదన్‌ని చెయ్యిచూపించమన్నాడు. కర్ర పెట్టెలోనుంచి కాగితమూ కలమూ తీసి తానే ఒక చక్రము గీశాడు. మధుసూదన్ ముఖము చూస్తూ "పంచమవర్గము," అన్నాడు. మధుసూదన్‌కు ఏమీ బోధపడలేదు. జ్యోతిష్కుడు వేలిగీతలు లెక్కపెడుతూ వర్ణించాడు, " 'క' వర్గం, 'చ' వర్గం, 'ట' వర్గం, 'త' వర్గం, 'ప' వర్గం." అప్పటికీ మధుసూదన్‌కు ఏమీ తెలియలేదు. జ్యోతిష్కుడు తరువాత, "పంచమవర్ణం" అన్నాడు, మధుసూదన్ ఇంకా ఓర్చి కూర్చున్నాడు నిశ్చలంగా. జ్యోతిష్కుడు వర్ణించాడు—"ప, ఫ, బ, భ, మ." భృగుముని వ్యాకరణముయొక్క ప్రథమ అధ్యాయంనుండే తనసంహితము ప్రారంభించాడని దానివల్ల మధుసూదన్ పోల్చుకున్నాడు. వెంకటశాస్త్రి తరువాత, "పంచాక్షరకం" అని అన్నాడు.

నవీన్ ఉలికిపడి మధుసూదన్ చెవిదగ్గిర మెల్లిగా, "బోధపడ్డది, అన్నయ్యా," అని అన్నాడు.

"ఏమిటి బోధపడ్డది ?"

పంచమవర్గములోని పంచమవర్ణము "మ," తరువాతఅయి దక్షరాలు—"మ-ధు-సూ-ద-న," జన్మగ్రహముయొక్క అద్భుతమైన దయవల్లను మూడు అయిదులు ఒక్కచోట కూడినవి.

మధుసూదన్ నిర్ఘాంతపోయినాడు—తల్లితండ్రులు పేరు పెట్టడానికి ఎన్నో వేల సంవత్సరాలకు పూర్వమే భృగుముని పుస్తకములో నామకరణము అయిపోయి ఉన్నది. నక్షత్రాలకు గల శక్తి, ఏమిటిది ! తరువాత, నిశ్చేష్టుడయి మధుసూదన్

సంస్కృతములో వ్రాసిఉన్న తన అతీత జీవితచరిత్ర వింటూ కూర్చున్నాడు. భాష బోధపడడము తక్కువ అవుతున్నకొలదీ అతని భక్తి అధికము అవుతున్నది. తన జీవితమంతా మూర్తీభవించిన ఋషివాక్యమువలె అతనికి కనబడ్డది. గుండెను చేతితో నిమురుతూ చూచాడు—దేహమంతా అనుస్వార, విసర్గ, తద్ధిత ప్రత్యయాల మసాలాతో ఏ తపోవనములోనో తయారైన గ్రంథమని అతనికి తోచింది. తరువాత జ్యోతిష్కుని చివర మాటలు ఇవి: మధుసూదనుని ఇంటికి లక్ష్మీదేవి రావలసి ఉన్నది గనుక మొదటినుండి ఆ ఇంటినిండా ఇన్ని సౌభాగ్యసూచనలున్నవట, కొద్దిరోజులయి లక్ష్మీదేవి నవవధువును ఆశ్రయించి ఉన్నదట, ఇప్పటినుండి చాలా జాగ్రత్తగా ఉండవలెనట—ఆమె మనస్సుకు ఎట్టిబాధ కలిగినా దేవికి కోపము వస్తుందట.

కోపలక్షణాలు అప్పుడే కనబడుతున్నవని కూడా వెంకటశాస్త్రి చెప్పాడు, జాతకుడు ఇప్పటినుంచి బహుజాగ్రత్తగా ఉండవలెనట, ఉండక పోయినట్లైతే రాబోయే విపత్తు పెరుగుతుంటుందన్నాడు. మధుసూదన్ కర్రకట్టిపోయి కూర్చున్నాడు. గొప్పలాభం వచ్చిందన్న కబురు పెళ్ళిరోజునే విన్నాడు—ఆ మాట జ్ఞప్తికి వచ్చింది. తరువాత కొద్దిరోజులలోనే తనకు జరిగిన పరాభవము మాటకూడ జ్ఞాపకము వచ్చింది. లక్ష్మీదేవి తానే స్వయముగా రావడము అతని అదృష్టమే, కాని ఆమె రావడమువల్ల భయంకరమైన పూచీకూడా నెత్తిమీద పడ్డది.

ఇంటికి తిరిగి వస్తున్నప్పుడు మధుసూదన్ బండిలో మాట్లాడకుండా కూర్చుండబడిపోయినాడు. అది కనిపెట్టి నవీన్ అన్నాడు, "వెంకటశాస్త్రి చెప్పినదానిలో ఒక్కమాటైనా నమ్మదగినది కాదు, నీ సంగతిఅంతా అతను ఎవరిదగ్గరనో కనుక్కొని ఉంటాడు," అని అన్నాడు.

"గొప్పబుద్ధి కదూ నీది! ఎక్కడ ఎంతమంది మనుష్యులున్నారో వాళ్లఅందరి చరిత్రలూ ముందుగా సంగ్రహించి ఉంటాడు అంటావు—అంతేనా? — చాలా సులభమైన పనికదూ!"

"మనుష్యులు పుట్టకపూర్వము కోట్లకొలది జాతకాలు వ్రాసి ఉంచడముకంటె అది సులభమే! భృగుముని అన్ని కాగితాలు ఎక్కడ సంపాదించగలడు, ఆ పుస్తకాలన్నీ ఉంచడానికి వెంకటశాస్త్రి ఇంట్లో స్థలము ఎక్కడ ?"

"వాళ్లు ఒక్కవిసురున వెయ్యిమాటలు వ్రాయగలిగే వాళ్లు అది ఎరుగుదువా ?"

"అసంభవము !"

"నీబుద్ధిలో ఇమడని ఊహాలన్నీ అసంభవమే నీకు! గొప్ప †సయన్సుకదూ నీది! నీతర్కం చాలించి ఆవాళ వాళ్ల ఇంటినుండి వచ్చిన గుమాస్తాను,నీవే స్వయంగా వెళ్లి, తీసుకురా; ఇవాళే వెళ్లి ఆపని చేసుకురా, ఆలస్యము చేయకు."

† Science = విజ్ఞానము.

అన్నగారిని మోసపుచ్చినందుకు నవీన్‌కు చాలా విచారం కలిగింది; ఉరిపన్నడం చాలా సులభంగా జరిగింది, అన్నయ్యగారు అందులో చిక్కుకోవడం చూస్తే నవ్వువస్తున్నది—దీనివల్ల నవీన్‌కు సిగ్గుకలుగుతున్నది, మనస్సుకు ఎంతో కష్టముగా ఉన్నది. అన్నగారిని అనేకసార్లు చిన్నచిన్న విషయాలలో అవసరాన్నిపట్టి అనేక రకాలగా మాయలో పెట్టాడు నవీన్—అతని మనస్సుకు అది ఏమీ కష్టమనిపించలేదు. కాని ఇంత ప్రయత్నముచేసి ఇలా మోసపుచ్చినందుకు నవీన్‌కు తనమీద అసహ్యం కలిగింది—మనస్సు అపవిత్రం అయిపోయిందని తోచింది.

౪౨

మధుసూదనుని మనస్సులోనుండి గొప్పభారము ఒకటి తొలిగిపోయింది—తాను మహా గొప్పవాడు అనే నమ్మకం నేలకూలపడ్డది. మధుసూదనుని హృదయములో వికసించడానికి సిద్ధంగాఉన్న ప్రేమను పెద్ద బండరాయివలె నొక్కిఉంచుతుండేది ఈ అహంభావమే. కుమును చూచి మధుసూదన్ ఒకప్పుడు ముగ్ధుడై ఉండెను. అప్పుడు అతనిమనస్సులో ఉండిన విహ్వాలతతో లోలోపుల పోరాటము జరుగుతుండెను. చేతకాక చివరకు కుముచేతికి దొరికిపోతున్నకొలదీ ఆమెయెడలకల క్రోధం అధికమవుతుండెను. అట్లాంటప్పుడు తిన్నగా నక్షత్రాల దగ్గరనుండి ఆదేశము వచ్చింది: లక్ష్మీదేవి తనఇంటికి వచ్చిందనీ దేవిని సంతోష పెడుతుండవలెనని నక్షత్రాలు చెప్పుతున్నవనీ

తెలియగానే మధుసూదనుని మనస్సులో ఉండే సంకోచము మాయమయింది; అతని దేహమూ మనస్సూ పులకరించినవి. ఉండి ఉండి తనలో తాను ఈ మాటలు వల్లించడం మొదలుపెట్టాడు - "లక్ష్మీదేవి వచ్చింది, నా ఇంటికి వచ్చింది లక్ష్మి. అది నా అదృష్టము. అది నాకు లక్ష్మీదేవి ప్రసాదించిన దానం!" తత్ క్షణమే సంకోచాన్ని తొక్కిపెట్టి కుమువద్దకు వెళ్లి తన హృదయములో అంకురిస్తున్న ఆనందాన్ని ఆమెకు తెలియజేసి ఆమెను స్తుతించి రావలెనని మధుసూదన్‌కు బుద్ధిపుట్టింది, "నే నేమైనా అపరాధము చేసిఉంటే తప్పుపట్టకు," అని ఆమెతో చెప్పిరావలెనని కోరిక పుట్టింది. కాని ఆనాడు వ్యవధిలేదు, ఆఫీసులో పని పూర్తి కాలేదు, ఇప్పుడే తిరిగి ఆఫీసుకు పరుగెత్తాలి, భోజనానికి ఇంట్లోకి వెళ్లడానికైనా సమయం చిక్కలేదు.

ఇవతల, రోజంతా కుము మనస్సు కొట్టుకుపోతున్నది. మర్నాడు అన్నయ్య వస్తున్నాడని ఎరుగును—అతని ఒంట్లో బాగులేదు. అన్నయ్యను చూడడానికి సులభమైన మార్గం దొరుకుతుందో లేదో తెలుసుకొందామని మనస్సు తత్తర పడుతున్నది. నవీన్ పనిమీద ఎక్కడికో వెళ్లి ఉండాలి, ఇప్పటికీ తిరిగిరాలేదు. అన్నగారు ఇవాళ స్వయంగా వచ్చి రాణి వదినను అన్నివిధాల ప్రసన్నురాలను చేస్తాడని నవీన్ బాగా ఎరుగును—కనుక ముందుగా ఆ సంగతి వదినకు తెలియజేసి రసభంగము కలుగచేయకూడదని నిశ్చయించు కొన్నాడు.

ఇవాళ డాబామీద కూర్చోడానికి వీలుగాలేదు. నిన్నసాయంకాలంనుండి మేఘముగాఉన్నది, ఇవాళ మధ్యాహ్నమునుండి తుప్పతుప్పన చినుకులు పడుతున్నవి. చలికాలపు వర్షము, అనిచ్ఛిత అతిథిమోస్తరు. మేఘానికి రంగుఉండదు, వర్షానికి చప్పుడుఉండదు, తడిగాలి ప్రాణాంతకముగా ఉంటుంది. ఆకాశము సూర్యకాంతిరహితమై ఉండడమువల్ల పృథ్వి సంకుచితమై ఉంటుంది.

మెట్లు ఎక్కగానే పడకగదిముందుఉండే వరండాలో నేలనుకూర్చొని ఉన్నది కుము. ఉండి ఉండి వర్షపుజల్లు కొడుతున్నది. తడీ, చీకటీ—వీటివల్ల కుముకు విసుగెత్తిపోతున్నది. ఆమె జీవితం ఒక అజగరసర్పమయి ఆమెను మింగి, తన మురికి పేగులమధ్యనుపెట్టి నొక్కుతున్నట్టు ఆమెకు తోచింది—ఎటుచూచినా బయటికి పారిపోయే సందుదొరకలేదు. తనను మోసముచేసి అట్టి నిరుపాయ నిరాశావస్థలోకి తీసుకువచ్చిన దేవునిపైని ఇన్నాళ్లూ లోలోపున రవులుతున్న కోపము నేడు పెద్ద జ్వాలై మండడము మొదలుపెట్టింది. కుము ఛటీమని లేచి డెస్కు తెరిచి అందులో తాను ఉంచుకొన్న దేవునిపటం బయటికి తీసింది. పటం రంగుపట్టు రుమాలులో కట్టిఉన్నది, రుమాలువిప్పి ఇప్పుడు ఆ పటాన్ని విరగకొట్టవలెనని ఆమెకు బుద్ధిపుట్టింది, “నీమీద నాకు లేశమైనా నమ్మకంలేదు,” అని బిగ్గరగా కేక వేయవలెనని కోరికపుట్టింది. కాని చేతులు వణకడంవల్ల రుమాలుముడి విడడానికి మారుగా మరింత బిగిసిపోయింది;

కోపమువచ్చి రుమాలుని పళ్లతో లాగి చించేసింది. చిరకాలం నుండి భక్తితో ధ్యానముచేస్తున్న ఆదేవుని పటము కళ్లకు కనబడగానే కుసుమ భరించి ఉండలేక దానిని గుండెమీద నొక్కుకొని ఏడవడం మొదలుపెట్టింది—దాని కర్ర ఫ్రేము తగిలి గుండె నొప్పిపెడుతున్నకొలదీ మరీ గట్టిగా నొక్కుకొంటున్నది.

ఆ సమయములో నౌకరు, మురళి, పడకగదిలో పరుపు వేదామని వచ్చాడు. చలికి చేతులు వణుకుతున్నవి. బట్టతల; దవడలు లోతుపడిపోయినవి; చింకి, మురికి దుప్పటి కప్పుకొని ఉన్నాడు. ఎన్నాళ్లబట్టో క్షవరము లేక గడ్డముమీదను నల్ల వెండ్రుకలూ పండువెండ్రుకలూ ముళ్లలాగు పొడుచుకు వస్తున్నవి. ఇప్పుడే మలేరియా పడిలేచాడు, ఒంట్లో రక్తము లేదు, పని విడిచిపెట్టి స్వదేశానికి వెళ్లిపొమ్మని డాక్టరు సలహా ఇచ్చాడు,—కాని విధి దయాహీనమైనది కదా!

"చలివేస్తున్నదా మురళీ?" అని కుసుమ అడిగింది.

"ఔనమ్మా, వర్షము—చలివేస్తున్నది."

"నీకు రోమము బూర్నీషు లేదా మురళీ?"

"బిరుదు వచ్చిననాడు మహారాజావారు ఇచ్చారు రాణీ అమ్మా, మనమడికి దగ్గుజ్వరము వచ్చింది, డాక్టరుగారు ఎల్లప్పుడూ రోమముదుప్పటి కప్పి ఉంచాలి అన్నారు, ఆ దుప్పటి వాడికి ఇచ్చేశానమ్మా."

కుము పక్కగదిలోకి వెళ్లి పాత, బూడిదరంగు శాలువ ఒకటితెచ్చి, "ఇదిగో నా పాతశాలువ—ఇది నీవు తీసుకో మురళీ," అంటూ వాడికి ఆ శాలువను ఇచ్చింది.

మురళీ వంగి నమస్కారముచేసి," క్షమించు అమ్మా, మహారాజావారికి కోపము వస్తుంది." అన్నాడు.

ఈ ఇంట్లో దయచూపించడము అపరాధముకింద లెక్క అని కుముకు జ్ఞాపకం వచ్చింది. కాని దయచూపమని తానే భగవంతుని కోరుతున్నది—పుణ్యకర్మ భగవంతుని దయ సంపాదించడానికి మార్గము కదా! కుము దుఃఖముకొద్దీ ఆ శాలువును నేల పారేసింది.

మురళి చేతులు జోడించి ఇలాగు అన్నాడు—"రాణీ, నీవు నా తల్లివి, కోపగించకమ్మా. నాకు రోమముబట్ట అవసరము లేదు. నేను ఉండేది దర్వాజాగదిలో అమ్మా—అక్కడ కుంపటితో నిప్పు ఎల్లప్పుడూ ఉంటుంది, గది వెచ్చగా ఉంటుంది."

"మురళీ, నవీన్ బాబు ఇంటికి తిరిగి వచ్చిఉంటే, అతన్ని పిలిచేస్తావా?"

నవీన్ గదిలోకి రాగానే, "నాకు ఒక చిన్నపని చేసిపెట్టాలి, చేస్తానంటే చెపుతాను," అని కుము అన్నది.

"నాకు హానికరమైనదైతే చేయడానికి అభ్యంతరము లేదు కాని నీకు కీడు కలిగేదైతేమాత్రం చేయను."

"నాకు హానికరమైనది ఇంకేమి ఉంటుంది—నాకు ఆ భయంలేదు." ఈలాగు అంటూ తనచేతినిఉన్న బంగారుగాజులు తీసి నవీన్‌కు ఇస్తూ, "ఇవి అమ్మి అన్నయ్యకోసమని స్వస్తి వచనము చెప్పించాలి," అన్నది.

"అవసరములేదు వదినా, నీకు అతనిమీాద ఉన్నభక్తే ప్రతిక్షణమూ స్వస్తి పఠనమవుతుంది."

"అన్నయ్యకోసమని ఏమీా ఇక నేను చేయలేను. చేయగలిగినదంతా అతనిపేరను భగవంతుని పూజచేయడము ఒక్కటే."

"నీవేమీా చేయనక్కరలేదు వదినా, మేమంతా లేమూ నీ సేవకులం?"

"మీారేమి చేయగలరు?"

"మేము పాపిష్ఠులము, పాపం చేయగలము—పాపము చేసిఅయినా నీకేదైనా ఉపకారముచేయగలిగితే ధన్యులం అవుతాము వదినా."

"ఇటువంటి విషయాలలో వేళాకోళము చేయకూడదు అబ్బాయి."

"వేళాకోళం కానేకాదు వదినా! పుణ్యముచేయడం కంటె పాపంచేయడం చాలా కష్టము. ఆ సంగతి భగవంతుడు ఎరిగిఉంటే, తప్పక మాకు బహుమతి దొరుకుతుంది."

నవీన్ దేవునిగురించి అంత నిర్లక్ష్యముగా మాట్లాడడం చూచి కుముదు బాధకలిగి ఉండేది. కాని తన అన్నగారికి

కూడా ఈలాగునే, దేవుడంటే భక్తిలేదు—కనుక సమీర్ మాటలువింటే ఆమెకు కోపంరాలేదు. పసిపిల్లల అల్లరి చూస్తే తల్లికి ముద్దువేస్తుంది, కుతూహలం కలుగుతుంది. ఇతని భక్తిలేని మాటలువిన్నా కుము మనస్సులో అటువంటి భావమే పుట్టేది.

కుము పొడినవ్వు నవ్వి జబాబు చెప్పింది—"ప్రపంచములో మీరు మీ స్వంతబలము ప్రయోగించి పనిచేసుకో గలరు—మాకు కేవలము మాబలమే ప్రయోగించి పనిచేసుకొనే సదుపాయము చిక్కదు. భక్తికొలది ఎవరికి సేవచేయవలెనని అనుకొంటామో వాళ్లదగ్గిరికి వెళ్లేమార్గము మాకు దొరకదు—సేవచేయడానికి అవకాశములేక చాలాబాధపడతాము, మాకు ఆ సాయముచేసేవాళ్లు ఎక్కడా ఎవరూ ఉండరా!"

సమీర్ కళ్ల నీళ్లు పెట్టుకొన్నాడు.

"అన్నయ్య కోసము నేను ఏదైనా చేయాలి అబ్బాయి, ఇవి మా అమ్మగాజులు, అమ్మపేరను ఈ గాజులు దేవుడికి ఇచ్చేస్తాను."

"దేవుడికి చేతితో ఈయనక్కరలేదువదినా, దేవుడు నీ దానాన్ని మనస్సు ద్వారా అంగీకరిస్తాడు. రెండురోజులు ఓర్చి ఉండు వదినా; అప్పటికీ భగవంతుడు ప్రసన్నుడు కాలేదని నీకు తోస్తే నీవేమిచేయమంటే అది చేస్తాను—నీమీాద కోపగించి ఉన్న దేవుడికి భోగముచేసి రమ్మన్నా వస్తాను."

పొంగిపొరలడం మొదలుపెట్టింది. కుముయొక్క చక్కని ముఖమే అతనికి అభయవరమయింది. అతనికి కలిగిన పరాజయము పూర్తిగా కడుగుకుపోతుంది అనడానికి సూచన నేడే కనబడ్డది. నిన్నను మీటింగులో అతనికి వ్యతిరేకంగా మాట్లాడిన వాళ్లలో కొందరు ఇవాళ స్వరం మార్చి మధుసూదన్‌కు ఉత్తరాలు వ్రాశారు. మధుసూదన్ తానే ఆతాలుకా కొనబోతున్నాడని వినగానే తాము పొరపాటుచేశామేమో అని కొందరికి సందేహం కలిగింది. ఆసంగతి మరిఒకసారి మీటింగులో పెట్టి ఆలోచిస్తే బాగుంటుందని కూడా కొందరన్నారు.

ఒకనాడు సెలవులేకుండా ఉండిపోయినందుకు ఒకానొక దర్వాన్‌పైని రెండువారాల జీతం జరిమానా విధించిఉండెను మధుసూదన్—వాడు ఇవాళ టిఫిన్‌వేళప్పుడు వచ్చి మధుసూదన్ కాళ్లుపట్టుకోగానే మధుసూదన్ వాడి జరిమానా మాపుచేశాడు—మాపుచేయడమంటే ఆ జరిమానా రూపాయలు మధుసూదన్ తానే పెట్టుకొన్నాడన్నమాట—ఏ వ్యవహారములోనూ నియమానికి విరుద్ధముగా వెళ్లవలసినవాడుకాడు కదా!

'మధు'జీవితములో నేడు బహు ఆశ్చర్యకరమైన రోజు. బయట ఆకాశము బహుపంకిలముగా ఉన్నది, టుప్పటుప్పున చినుకులు పడుతున్నవి—కాని ఇవి అతనిలో పుడుతున్న ఆనందాన్ని మరింత అధికముచేస్తున్నవి. మధుసూదన్ రోజూ ఆఫీసునుండి తిరిగివచ్చి భోజనసమయం అయ్యేవరకు బయట

రాత్రి చీకటిపడ్డది. మెట్లమీద రోజూవింటున్న జోడు చప్పుడు వినబడుతున్నది. అన్న మేడమీదికి వస్తున్నాడని నవీన్ పోల్చుకున్నాడు, కాని అక్కడనుంచి పారిపోక, సాహసించి కూర్చున్నాడు. కుముకుమాత్రం మనస్సు ముడుచుకు పోయినట్లు అయిపోయింది. అదృశ్యమైన తిరుగుబాటొకటి ఆమెలో పుట్టింది, శరీరములోని రక్తనాళాలన్నీ ఉలికిపడి లేచినట్లయి ఆమెకు భయము కలిగింది. ఎందుచేతనో గాని దుర్జయమైన పాపమేదో తనను వశపరుచుకొన్నదని ఆమెకు తోచింది.

"గురువయి నాకు ఉపదేశము ఈయగలవారెవరైనా నీవు ఎరుగుదువా," అని హఠాత్తుగా కుము నవీన్‌ను అడిగింది.

"గురువు ఎందుకు వదినా?"

"నా మనస్సును నేను స్వాధీనపరుచుకోలేకుండా ఉన్నాను."

"అది నీ మనస్సుయొక్క దోషముకాదు."

"విపత్తు బయటిది, దోషము మనస్సుది—ఈ సంగతి మా అన్నయ్య చెప్పగా విన్నాను."

"భయపడకు వదినా, మీ అన్నయ్యే నీకు ఉపదేశం ఇస్తాడు."

"ఆ రోజులు నాకు మరి ప్రాప్తించవు."

మధుసూదనుని మనస్సులో ధనార్జనబుద్ధికీ ప్రేమకూ గల విరోధము పోగానే, ప్రేమ అతనుచేసే ప్రతిచిన్నపనిలోనూ

ఆఫీసుగదిలోనే పనిచేస్తూ కూర్చుండేవాడు. పెళ్లి అయిన తరు వాత వేళ కాని వేళను అంతఃపురములోకి రాదలచినప్పుడు సాధ్య మైనంతవరకు ఎవరికంటా పడకుండా ఉండే ప్రయత్నంచేసే వాడు. కాని ఇవాళ తాను కుమును చూడడానికి వస్తున్నట్టు ఇంటివాళ్లందరికీ తెలియచేస్తున్నట్టుగా చప్పుడుచేస్తూ లోపలికి వచ్చాడు. ప్రపంచములో ఉండే అందరూ తనను ఈర్ష్యతో చూస్తున్నారని అత నెరుగును—అదే తన సౌభాగ్యమని అతని నమ్మకము.

కొంచెము సేపయింది వర్షము బాగా పట్టిఉన్నది—ఇంకా అన్నిగదులలో దీపాలు వెలిగించలేదు. ముసలినౌకరిది గదిగదికీ వచ్చి సాంబ్రాణిధూపం వేసి వెళ్లుతున్నది. ఆకాశములోనుండి అంగణంలోకి గబ్బిలంఒకటి వచ్చి అంతఃపురము దారిలో వేలాడగట్టిన లాంతరువరకు వచ్చి చక్కరుకొట్టి తిరిగి పోతున్నది. తొడలమీద ఒత్తులు వేసుతూ వరండాపైని కూర్చొనిఉన్న దాసీలు మధుసూదన్ వస్తూఉండడం చూచి ముసుగులు కిందికి లాగుకొని పరుగులెత్తారు. అడుగులచప్పుడు విని శ్యామాసుందరి గదిలోనుంచి బయటికి వచ్చింది—చేతిలోనున్న పాత్రలో తమలపాకు లున్నవి. మధుసూదన్ ఆఫీసునుండి వచ్చి బయట కచ్చేరిగదిలో కూర్చున్నప్పుడు శ్యామాసుందరి తాంబూలం అక్కడికి పంపడము మామూలు. మధుసూదన్‌కు నచ్చేటట్టు తాంబూలం సరదడము ఒక్క శ్యామాసుందరికే తెలుసునని అందరూ ఎరుగుదురు. ఆ ఒక్కపనే కాదు—శ్యామాసుందరికి

అటువంటివి మరికొన్ని పనులుకూడా తెలుసును. వాటిని ఆధారముచేసుకొనే,పాన్‌దాన్ చేతిలో పట్టుకొని,"తాంబూలం సిద్ధముచేసి ఉంచాను తీసుకుంటావా ?" అని అంటూ దారికి అడ్డుగా నిలబడ్డది. ఇంతకుముందు ఇటువంటి సందర్భాలలో కొంతసంభాషణ జరిగేది—మాటలలో కొంత మధురరసము కూడా వ్యక్తమయేది. ఇవాళ ఎందుచేతనో గాని శ్యామా సుందరి గాలి తగులుతుందేమో అని భయపడుతున్నట్టుగా దూరమునుంచే వడివడిగా మధు వెళ్లిపోయినాడు. శ్యామా సుందరి పెద్దపెద్ద కళ్లు స్వాభిమానముతో నిప్పులవలె కాలుతు న్నవి, మరికొంతసేపటికి వాటినుండి పెద్దకన్నీటి చుక్కలు రాలి నవి. శ్యామాసుందరి మధుసూదనుని ప్రేమిస్తుండడం నిజము.

మధుసూదన్ గదిలో ప్రవేశించగానే, నవీన్ లేచి కుము. పాదధూళి తీసుకొని, "గురువుమాట జ్ఞాపకం ఉంచుకుంటాను వదినా, కనుక్కొని చెబుతాను," అని వదినతో అని, అన్న య్యతో ఇలాగు అన్నాడు—"వదినకు గురువుగారివద్ద మంత్రోపదేశము పొందాలని కోరికగా ఉన్నది, మన గురువు గారు ఉన్నారు—కాని—".

మధుసూదన్ ఉత్తేజంతో జబాబు చెప్పాడు.—"సరే దానినిగురించి తరువాత ఆలోచించుదాము, నీవు ఇప్పుడేమీ చేయనక్కరలేదు."

నవీన్ బయటికి వెళ్లిపోయినాడు.

"బడాబౌ, నీవు మా ఇంట్లోకి వెలుతురును తీసుకు వచ్చావు,"—ఈమాటలు మధుసూదన్ దారిపొడుగునా పిల్లవాడు పాఠము వల్లిస్తున్నట్టుగా వల్లించుకుంటూ వచ్చాడు. ఇటువంటిమాటలుఅనే అభ్యాసం అతనికి లేనేలేదు, కనుక గదిలో ప్రవేశిస్తూనే ఆవిసురున ఎట్టి సంకోచమూ లేకుండా ఆమాటలు అనేదామని నిశ్చయించుకొన్నాడు. కాని నవీన్ కంటపడగానే మాటలు ఆగిపోయినవి, తరువాత గురువుగారి ప్రసంగం వచ్చి నోటిని పూర్తిగా మూసేసింది. లోపల జరుగుతున్న యత్నమంతా ఈచిన్న అడ్డవల్ల వృథా అయిపోయింది. అటుతరువాత చూచాడు, కుము ముఖంలో భయం కనబడుతున్నది, దేహమూ మనస్సూ సంకోచముతో నిండి ఉన్నట్టు కనబడుతున్నవి. ఇంతకుపూర్వము ఇటువంటివి మధుసూదన్ కంట పడేవే కావు. ఇవాళ అతని మనస్సులోపలికి వెలుతురు రాబట్టి చూచేశక్తి ప్రబలమయింది, దృష్టి సూక్ష్మమయింది. ఈరోజునకూడా కుము ఇటువంటి విముఖత చూపించడము ఘోర అన్యాయమని అతనికి తోచింది, కాని చీకాకుపడను అని శపథము చేసుకొన్నాడు. అయితేనేమి సులభంగా జరిగిపోవలసినపని అసలు జరగనేలేదు.

"బయటికి వెళ్లిపోతున్నావా బడాబౌ, కాస్త కూర్చోవూ?" అని మధుసూదన్ కొంచెము సేపు ఊరుకొని అన్నాడు.

మధుసూదనుని మాటలూ అతని కంఠస్వరమూ విని కుము ఆశ్చర్యపోయింది — "లేదు, వెళ్లడం లేదు!" అని జవాబు చెప్పింది.

"నీకోసం చిన్న వస్తువు ఒకటి తెచ్చాను, ఇది తెరిచి చూడు" అని చెపుతూ చిన్న బంగారు బరణిని ఆమె చేతిలో పెట్టాడు.

కుము బరణి కప్పు తీసి చూచింది—లోపల అన్నయ్య ఇచ్చిన ఆ నీలం ఉంగరం ఉన్నది. ఆమెగుండె దబదబ కొట్టుకోవడం మొదలుపెట్టింది—ఏమీ చేయడానికి తోచలేదు.

"దీనిని నీవేలికి పెట్టనిస్తావా?"

కుము చెయ్యి చాచింది. మధుసూదన్ కుము చేతిని తన ఒడిలో పెట్టుకొని ఉంగరాన్ని వేలికి పెట్టాడు; మెల్లి మెల్లిగా దాన్ని వేలిమీదికి ఎక్కించి, ఆ చేతిని తనచేతిలో కొంచెము సేపు ఉంచుకొన్నాడు. తరువాత దాన్ని మీదికి ఎత్తి ముద్దుపెట్టుకొని, "నీ ఉంగరము తీసుకోవడం పొరపాటు-నీచేతిని ఏపొడి ఉన్నా దోషం లేదు," అని అన్నాడు.

మధుసూదన్ వచ్చి కుమును గట్టిగా కొట్టినా ఆమెకు అంత ఆశ్చర్యంగా ఉండేదికాదు. పసిబిడ్డవలె ఆశ్చర్యపడుతున్న కుము ముఖం మధుసూదన్‌కు బహు ఆనందము కలిగింది. ఈరోజు సామాన్యమైనదికాదని కుము ముఖమువల్ల స్పష్టమవుతుండెను. ఇదికాక తాను చేయతలచుకొన్న దానము ఇంకొకటి

ఉన్నది—"మీ ఇంటి కాలూముఖర్జీ వచ్చి ఉన్నాడు, నీకు అతనిని చూడాలని ఉన్నదా?" అని అడిగాడు.

కుసుము ముఖము ఆనందముతో వికసించింది—"కాలూదా వచ్చాడా?" అని అడిగింది.

"అతనిని పిలుస్తాను, మీరు మాట్లాడుతూ ఉండండి, నేను ఆలోగా భోజనము చేసి వస్తాను."

కృతజ్ఞతతో కుసుము కళ్లు తడి అయినవి.

## ४३

చాటర్జీ జమీందారులతో కాలూకు గలసంబంధం వంశానుక్రమముగా వస్తున్నది. మిక్కిలి విశ్వాసంమీద జరగవలసిన పనులన్నీ ఇతని ద్వారానే జరుగుతున్నవి. వీళ్ల పూర్వులెవరో చాటర్జీల కోసమని జైల్‌లో కూర్చున్నారట. విప్రదాసు తరఫున వడ్డీకిస్తీ ఒకటి చెల్లించడానికి మధుసూదనుని ఆఫీసుకు కాలీ వచ్చాడు ఇప్పుడు. పొట్టిగా పుష్టిగా ఉన్నాడు, తెల్లని దేహచ్ఛాయ, కళ్లరంగు ఆకాశవర్ణము, ఒత్తుగా నలుపూ తెలుపూ కలిసిఉన్న కనుబొమ్మలు కళ్లమీద పడుతున్నవి—కాని మీసాలూ జొట్టూ పూర్తిగా నలుపుఅనే చెప్పవచ్చు, శ్రద్ధతో కుచ్చిళ్లు పెట్టిన శాంతిపూర్ ధోవతి కట్టుకొని ఉన్నాడు, యజమానుల మర్యాదకు తగిన పూర్వ కాలపు శాలువ, ఖరీదైన దొకటి వేసుకొన్నాడు, వేలికి ఉంగరం ఒకటి ఉన్నది—దానిలో తాచి ఉన్నది చవకరకము పొడి కాదు.

కాలూ గదిలోకి రాగానే కుము అతనికి ప్రణామం చేసింది, ఇద్దరూ తివాసీమీద కూర్చున్న తరువాత కాలూ అన్నాడు—“చిన్నఅమ్మా, నీవు రావడమేమో మొన్ననే గాని నిన్ను చూచి ఎన్నో సంవత్సరాలయిందని అనిపిస్తున్నది.”

“అన్నయ్య ఒంట్లో ఏలాగున్నది? మొదట అదిచెప్పు కాలూదా.”

“అన్నయ్యను గురించి చాలా గాబరాపడ్డాము—నీవు వచ్చేసిన మర్నాడు చాలా ప్రమాదం చేసింది, గట్టి శరీరం గనుక మెల్లి మెల్లిగా సరుదుకున్నది—డాక్టర్లు చూచి ఆశ్చర్య పోయినారు.”

“అన్నయ్య రేపు వస్తున్నాడా?”

“రావలెననే అనుకున్నాడు, కాని మరిరెండు రోజులు ఆలస్యం అవుతుంది—పున్నంనాడు బయలుదేరకూడ దని అంతా అన్నారు—జ్వరం మళ్లీ ముదురుతుందని జడిపించారు. అన్నమాట ఆలాగుండనీ అమ్మా, నీ వెట్లాగు ఉన్నావు?”

“నేను హాయిగా ఉన్నాను.”

కాలూకు ఏమీఅన బుద్ధిపుట్టలేదు, కాని కుము ముఖాన మునుపటి లావణ్యం లేదు, కళ్లకింద నల్లని గుంటలు పడ్డవి, చక్కగా నిగనిగ లాడుతుండే దేహానికి ఇప్పుడు కళ లేదు, పాలిపోయింది. కాలూకు దీనికారణము బోధపడలేదు. “అన్నయ్య నాతో చెప్పమని ఏమీచెప్పలేదా?” అని కుము అడగబోతున్నది, కాని నోరు విప్పి అడగ లేకుండా ఉన్నది.

ఆ అవ్యక్త ప్రశ్నకు జబాబు ఇస్తున్నట్టుగా "పెద్దన్నయ్య నాచేత నీకొక వస్తువు పంపాడు." అని కాలూ అన్నాడు.

"ఏమి పంపాడు, ఏదీ అది?" అని కుము ఆత్రతతో అడిగింది.

"అది బయట ఉంచి వచ్చాను."

"తెచ్చావు కావెందుకు?"

"గాబరా పడకు చెల్లీ, మహారాజావారు తామే దానిని తెచ్చి నీకు ఇస్తామన్నారు."

"అది ఏమిటో చెప్పవూ, కాలూదా?"

"చెప్పవద్దని చెప్పారు మహారాజా." కాలూ ముఖం నాలుగు వైపులకు తిప్పి బాగా చూచి, "నిన్ను ఎంతో ఆదరిస్తూ సుఖంగా ఉంచుతున్నారని వెళ్లి అన్నయ్యతో చెపుతాను, అన్నయ్య సంతోషిస్తాడు," అని అన్నాడు. "మొదట నాలుగు రోజులవరకు నీ దగ్గిరనుంచి, ఉత్తరం రాలేదు, ఏక గాబరా పడ్డాడు,పోస్టాఫీస్‌లో ఏదో అవకతవక జరిగి ఉండాలి, తరువాత మూడు ఉత్తరాలు ఒక్కమారు వచ్చినవి."

ఆ అవకతవక ఎట్లా జరిగిఉండాలో కుము ఊహించి పోల్చుకో గలిగింది.

కాలూదాను భోజనముచేసి వెళ్లమందామని కుముకు, బుద్ధిపుడుతున్నది కాని అడగడానికి ధైర్యము చాలలేదు; చివరకు అనుమానిస్తూ అనుమానిస్తూ "నీవు ఇంకా భోంచేయలేదు కదూ, కాలూదా?" అని అడిగింది.

"సాయంకాలం అయినతరువాత భోజనముచేస్తే జీర్ణము కాకుండా ఉన్నది. కలకత్తాలో, మన రామసదయ్-కవిరాజు మకరధ్వజం ఇచ్చాడు, అది పుచ్చుకుంటున్నాను, కాని అట్టే లాభించినట్టు లేదు."

కుము ఇంటికి కొత్తకోడలు, అధికారం ఇంకా చేతిలోకి రాలేదు, సాహసించి భోజనం పెట్టలేక ఆలాగు ప్రశ్నించిందని కాలూకు బోధపడ్డది.

అంతలో తలుపుసందులోనుంచి మోతీతల్లి చేతితో సంజ్ఞచేసి కుమును పిలిచి, "మీ అమ్మగారి ఇంటినుంచి కాలూ ముఖర్జీగారు వచ్చారట, భోజనానికి ఏర్పాటు చేశాను, కింది గదిలోకి తీసుకురా అక్కా," అని అన్నది.

కుము తిరిగివచ్చి, "నీ కవిరాజు ఆజ్ఞ ఇవాళకు మరిచి పోవాలి కాలూదా, ఇప్పుడు భోజనం చేయనిదే నిన్ను వెళ్ల నీయను," అని అన్నది.

"నీతో గొప్ప చిక్కే! ఇది చాలా అన్యాయము సుమా! ఇవాళకు నన్ను విడిచిపెట్టు తల్లీ, కావలంటే ఇంకొకనాడు వస్తాను."

"వీలుపడదు కాలూదా, లే, భోజనానికి."

మకరధ్వజమువల్ల చాలా మేలుకలిగిందని చివరకు రుజువయింది, ఆకలి లేశమాత్రమైనా తగ్గలేదు.

కాలూదా భోజనం ముగియగానే కుము తిరిగి పడకగదిలోకి వచ్చింది. ఇవాళ ఆమెమనస్సు అమ్మగారిఇంటి స్మృతులతో నిండి ఉన్నది. ఈ పాటికి నూర్‌నగర్ చెరువు ఒడ్డున

మామిడిచెట్లు పూచి ఉంటవి. పూచిఉన్న జామ్‌రూల్ చెట్టు నీడను చెరువుగట్టుమీదనున్న గచ్చుచప్టాపై కుము తలను చేతిపైని ఆనుకొని, జుట్టు విరబోసుకొని, ఏకాంతంగా, రోజూ, ఎన్నో ఘంటలు గడిపేది. ఎండా నీడా అచ్చొత్తిన గచ్చునేల పైని పడుకొని ఉన్నప్పుడు తేనెటీగలగుంజనం వినబడుతుండేవి. అట్లాంటప్పుడు ఆమెమనస్సులో అకారణంగా ఒకవిధమైన బాధ పుట్టేది. దాని అర్థం ఆమెకు తెలిసేదికాదు. ఆవుల డెక్కలు రేపే ధూళితో రంగువేయబడి ఆ వ్యథ కుముకు స్వప్నాలలో కనబడుతుండేవి. ఆ యౌవనంలో ఆమెకు ప్రాప్తించని సఖుడు జలస్థలాలపైని, ఎక్కడో మాయను అల్లుతున్నాడని ఆమె అప్పుడు పోల్చుకోలేకపోయింది. అతడు ఆమె పూజిస్తుండే యుగళ మూర్తుల పూజలో దాగి దాగుడుమూతలాడు తుండేవాడు—తాను ఎస్‌రాజ్ మీద వాయిస్తున్న ముల్తాన్ మూర్ఛన లోనికి అతన్ని పట్టి తీసుకొనివచ్చేది—ఆ సంగతి ఆమెకే తెలిసేదికాదు. ప్రథమయౌవనంలో ఆమెకు దొరకని ఆ మనోమూర్తి ఎన్నోచోట్ల దాగిఉన్నట్టు, ఎన్నో విధాల సూచనలు దొరికేవి. మేడమెట్ల గదిలోనుంచి దారి మళుపు దగ్గిర పూలతోనిండిన ఆవచేను కనబడేది—ఆ సఖుడు అక్కడ దాగిఉన్నాడేమో అని ఆమెకుతోచేది. చెరువు ప్రహరీ ప్రక్కనున్న దిబ్బమీద కూర్చున్నప్పుడు గోడమీద కలగాపులగంగా పులిమిఉన్న పచ్చనినాచూ నల్లనిబూజూ తాను మరిచిపోయిన పురాతనకాలపు అస్పష్టచిత్తరువని ఆమెకు అనిపించేది.

ప్రొద్దున నిద్ర లేచి కిటికీలోనుంచి చూడగానే నావల తెరచాపలు ఉద్దేశ్యరహితంగా పరుగులెత్తుతున్న కోరికలవలె ఎర్రని ఆకాశానికి అడ్డుగా కనబడేవి. వీటి అన్నిటిలోనూ ఆ చెలికాడు ఏదో ఒకవిధముగా దాగి ఉండేవాడు. ప్రథమయౌవనానికి చెందిన ఆ మరీచికలు ఆమె పూజపాటలతో కలిసి కలకత్తాకు వచ్చినవి. అవే దైవవాణి రూపం ధరించి మోసపుచ్చి కుమును వివాహపాశంలోకి లాక్కొని వచ్చినవి. కాని వెలుతురు పడీ పడడంతోనే మాయ చెదిరిపోయింది.

కుము మనోనేత్రముతో వెనుకటిరోజుల జీవితం ఇలా చూస్తూ ఉన్నది. మధుసూదన్, ఆమెకు తెలియకుండా ఎప్పుడో వెనుకనుండి వచ్చాడు—వచ్చి ఎదుటనుండే గోడమీద వేలాడకట్టిన అద్దములో ప్రతిబింబించిన కుము ముఖాన్ని చూస్తూ నిలుచున్నాడు—కుము ఎవనికొరకు వెదుకుతున్నదో ఆ అదృశ్యపురుషునికి తాను పోటీగా రావడము తెలివిమాలిన పని అని గ్రహించాడు. కుము ఇంత పరధ్యానంగా ఉండడం చూచిఉంటే పూర్వము మధుసూదన్‌కు కోపం వచ్చిఉండేది. కాని ఇవాళమాత్రం శాంతంగా వచ్చి ఆమె పక్కను కూర్చొని, "ఏమిటి ఆలోచిస్తున్నావు బడాబౌ?" అని విచారంగా అడిగాడు.

కుము ఉలికిపడ్డది, ఆమె ముఖం తెల్లబారిపోయింది. మధుసూదన్ ఆమె చేయిపట్టుకొని మెల్లిగా అడించి, "నీవు ఎన్నటికీ నాకు దొరకవా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు ఏమి జబాబు ఈయవలెనో కుముకు తట్ట లేదు. ఎందుకు అతనికి దొరకకుండా ఉన్నదో తానే ఎరగదు, ఆ ప్రశ్న తానే తనకు వేసుకొంటున్నది. మధుసూదన్ నిర్దయగా వ్యవహరిస్తున్నంతసేపు సులభంగా జబాబు చెప్పగలిగేది, కాని తా నోడిపోయినాడని అతను ఒప్పుకోగానే కుము తనను నిందించుకోవడంతప్ప చేయగలదేదీ లేకపోయింది. భర్తకు మనస్సూ ప్రాణమూ పూర్తిగా సమర్పించలేకపోవడం మహా పాపం అనే విషయములో కుముకు ఎట్టి సందేహామూ లేదు. అయినా ఆమెకు ఈ దశ ఎందుకు వచ్చిందో? భార్యకు ఎల్లప్పుడూ ఉండవలసిన ఆదర్శము సావిత్రివంటి పతివ్రత కావలెనని మాత్రమే. ఆ లక్ష్యము పోగొట్టుకొనే దుర్గతి ఆమెకు నేడుకలిగింది, ఇందులోనుంచి తిరిగి తనను లేవనెత్తుకో వలెనని ఆందోళనపడుతూ మధుసూదనునితో—"నామీద దయఉంచు," అని అన్నది.

"దయా? దయ ఎందుకు?"

"నన్ను నీదానిగా చేసుకో—ఆజ్ఞ చేస్తూఉండు, శిక్షిస్తూ ఉండు—నేను నీకు తగినదానను కానని నాకు తోస్తున్నది."

ఆమాట విని మధుసూదన్‌కు దుఃఖంవచ్చి నవ్వాడు. కుము పతివ్రత కావలెనని కోరుతున్నదని అతను గ్రహించాడు. ఆమె ఒక సామాన్యస్త్రీ అయిఉంటే ఇంతకంటె చేయవలసిన దేదీ ఉండదు, కాని ఆమె కేవలం మంత్రోచ్చారణమూలంగా భార్యఅయిన స్త్రీకాదు. ఆమెలో ఉన్నది అంతకంటె బహు అధికము—ఆ అధికంగా ఉన్నదానిని పొందడానికి ఎంత

ఈయడానికైనా సంసిద్ధుడయినాడు మధుసూదన్, కాని ఏమీ లాభం లేకపోయింది, పైగా అతని అల్పత్వం అంతకంతకు బయలుపడిపోతున్నది, కుముకూ తనకూగల అసమానత మరింత అధికమయి, అతనిలో గొప్ప ఆందోళన పుట్టిస్తున్నది.

"నీకు ఒక మంచి వస్తువు ఇస్తాను, నాకేమిటి ఇస్తావు?" అని మధుసూదన్ అన్నాడు.

అన్నయ్య పంపినదేదో ఇస్తాడని అనుకొని కుము ఆత్రతగా అతని వంకచూస్తూ నిలుచున్నది.

"వస్తువుకు తగిన ఖరీదు పుచ్చుకుంటాను జాగ్రత్త," అని అంటూ మంచముకిందనుండి పట్టుబురకావేసిఉన్న ఎస్రాజ్‌ను ముందుకులాగి, బురకా తీశాడు—కుము చిన్ననాటినుండి వాయిస్తున్న ఎస్రాజ్ బయలుపడ్డది—ఇక్కడికి వచ్చేటప్పుడు కుము దానిని ఇంటిదగ్గిరే ఉంచివచ్చింది.

"ఆనందంగా ఉన్నదా ? ఖరీదు ఇస్తావా?"

మధుసూదన్‌కోరే వెల ఏమిటో తెలుసుకోలేక కుము అతని ముఖం చూస్తూ నిలుచున్నది. "నీ ఎస్రాజ్ మీద పాట ఒకటి వినిపించు," అని మధుసూదన్ అడిగాడు.

"అతని కోరినది అంత గొప్పదేమీ కాదు, అయినా పూచీ కష్టమైనదని కుముకు తోచింది. సంగీతం విని ఆనందించగల గుణము మధుసూదన్‌లో లేదని కుము ఎరుగును, కనుక సంకోచం వదిలి అతని ఎదుట వాయించడం కష్టమని ఆమెకు తోచింది. ఎస్రాజ్ ధనస్సు చేత్తోపట్టుకొని ఇటూఅటూ కదు

పుతూ కూర్చోవడం చూచి మధుసూదన్, "వాయించు బడాబో, నాముందర సిగ్గు పడకు," అని అన్నాడు.

"శ్రుతి వేయలేదు," అన్నది కుసుమ.

"నీ మనస్సుకు కూడా శ్రుతివేయలేదని చెప్పవేమి?"

ఆ మాటలో నిజం ఉండబట్టి మనస్సుకు బాధకలిగి, కుసుమ, "శ్రుతివేసి మరి ఒకనా డెప్పుడైనా వినిపిస్తా" నన్నది.

"ఎప్పుడు వినిపిస్తావో సరిగా చెప్పు - రేపువినిపిస్తావా?"

"సరే, రేపు వినిపిస్తాను."

"సాయంకాలం వినిపిస్తావా, నేను ఆఫీసునుండి రాగానే?"

"వినిపిస్తాను."

"ఎస్ రాజ్ దొరికిందని సంతోషంగా ఉన్నదా?"

"ఆహా, చాలా సంతోషముగా ఉన్నది."

మధుసూదన్ శాలువులోనుంచి చర్మంకేసు ఒకటి బయటికి తీసి, "ఇదిగో నీకోసం ఒక ముత్యాలహారం తీసుకు వచ్చాను, దీనివల్ల నీకంత ఆనందం కలగదేమో?"అని అన్నాడు.

అటువంటి చిక్కైన ప్రశ్న అతను ఎందుకు అడిగాడో! కుసుమ మాట్లాడక ధనస్సు కదుపుతూ కూర్చున్నది.

"నా దరఖాస్తు మంజూర్ కాలే దన్నమాట!"

ఆ మాట కర్థం కుసుమకు సరిగా బోధపడలేదు.

మధుసూదన్—"నా మనస్సులోనుండి వచ్చిన ఈ దరఖాస్తును నీ హృదయముదగ్గిర వేలగట్టి ఉంచవలెనని నాకోరిక, కాని దరఖాస్తు దాఖలు కాకుండానే డిస్మిస్ అయిపోయింది!"

తెరిచిఉన్న ముత్యాలహారము - పెట్టె కుము ఎదుట నేలమీదను ఉన్నది. ఇద్దరిలో ఎవరూ ఏమీ అనలేదు. కుము కలగంటున్నదానివలె, ఇంతకుపూర్వం అప్పుడప్పుడు ఉండే టట్టుగానే, ఇప్పుడు కూర్చున్నది. కొంతసేపటికి చైతన్యం వచ్చిన దానివలె ఆ హారాన్ని తీసి మెడలో వేసుకొని, మధుసూదన్‌కు ప్రణామంచేసి, "నాపాట వినవలెనని ఉన్నదా ?" అని అడిగింది.

"ఆహా, వింటాను," అన్నాడు మధుసూదన్.

"ఇదిగో ఇప్పుడే వాయిస్తాను,"అని అంటూ ఎస్‌రాజ్‌కు శ్రుతివేసి కేదారిమీద ఆలాపన ప్రారంభించింది; గదిలో ఇంకొక రున్నారన్నమాట మరిచిపోయి కేదారినుండి ఛాయానట్ రాగములోకి ఎత్తి, అన్నిటికంటె ఆమెకు ఇష్టమైన పాట పాడుతూ కూర్చున్నది.—"ఠాడీ రహో మేరె ఆంఖన్ కె ఆగె," ఆ గానగగనములో రంగు రంగులతో అపురూప స్వరూపం ఒకటి ఆమెకు కనబడ్డది—ఎవడు సంగీతముద్వారా కుముకు లభించాడో, ఎవడు ఆమెకు తన ప్రాణములోపల దొరికాడో, ఎవరిని తనకంటితో చూడవలెనని ఆమె రాత్రింబగళ్లు కోరు తున్నదో—ఆ సుందరమూర్తి నేడు ఆ సంగీతముద్వారా దొరికాడు—"ఠాడీ మోరె ఆంఖన్ కె ఆగె."

మధుసూదన్‌కు సంగీతజ్ఞానం లేదు, సంగీతం అంటే రుచి లేదు. మైమరచిఉన్న కుము ముఖము పైనాట్యం చేస్తున్న పాటవల్లనూ, కుమువేళ్లు ఎస్‌రాజ్ మెట్లపై నడుస్తున్నప్పుడు పాట తీగలపై చేస్తున్న నృత్యంవల్లనూ మధుసూదనుని హృదయం దోలాయితమయింది. ఒళ్లుమరిచి పాడుతూ కుము

మధ్యను ఒకమారు తలఎత్తి చూచింది. మధుసూదన్ ఆమెవంక తదేకధ్యానంగా చూస్తున్నాడు. కుముచెయ్యి ఆగిపోయింది. ఆమెకు సిగ్గువేసింది. వాయిద్యం నిలిచిపోయింది.

మధుసూదనుని హృదయం కరుణరసంతో ఊగడం ప్రారంభించింది—"నీకేమి కావాలి చెప్పు బడాబౌ?" అని కుమును అడిగాడు. "కొద్దిరోజులు అన్నయ్యదగ్గిరికి వెళ్లి సేవచేసి వస్తా" నని ఆమె కోరిఉంటే కూడా మధుసూదన్ సమ్మతించేవాడే!— నేడు అతను ఆమె సంగీతంతో ముగ్ధుడై ఉన్నాడు.

కుము ఎస్‌రాజ్ కిందను ఉంచింది, ఏమీ మాట్లాడలేదు.

మధుసూదన్ మరిఒకసారి బ్రతిమాలుతూ అన్నాడు— "నీకోరిక ఏమిటో చెప్పు బడాబౌ, నీవు ఏదికోరితే అది ఇస్తాను."

కుము నౌకరు, మురళికి, ఒక రోమంబూర్ణీసు ఈయమని కోరింది.

కుము 'నాకేమీ అక్కరలే' దని చెప్పినా బాగుండేది, కాని మురళికి రోమంకంబళి ఇమ్మన్నదే! తలపైనున్న కిరీటం ఈయ సిద్ధముగా ఉన్నవానిని జోడు తాళ్లీయమని అడిగినట్టే!

మధుసూదన్ నిర్ఘాంత పోయినాడు, మురళిమీద అతనికి కోపం వచ్చి, "దౌర్భాగ్యుడు మురళి నిన్ను చీకాకు పెడుతున్నాడు కాబోలు!" అని అన్నాడు.

"లేదు నేనే వాడికి పాతశాలువ ఒకటి ఈయబోయినాను, కాని వాడు పుచ్చుకోలేదు—నీ ఆజ్ఞ అయితే వాడికి కొంచెము ధైర్యం వచ్చి పుచ్చుకొంటాడు."

మధుసూదన్ మెదలలేదు కొంతసేపటివరకు; తరువాత, "నీకు ధర్మం చేయాలని ఉన్నట్టున్నది—సరే అయితే నీశాలువు చూపించు," అని అన్నాడు.

కుము ఎన్నాళ్లబట్టో తాను వేసుకుంటున్న బాదంరంగు శాలువును తీసుకువచ్చింది. మధుసూదన్ తాను ఆశాలువు కప్పుకొని, టీపాయ్ మీదనున్న 'కాల్ బెల్' నొక్కగానే ముసలినౌకరు ఒకతె వచ్చింది, దానితో మురళిని పిలవమని అన్నాడు.

మురళివచ్చి చేతులుజోడించి నిలబడ్డాడు—చలిచేతా, భయమువల్లా చేతులు వణుకుతున్నవి.

"మీ రాణిఅమ్మగారు నీకు ఇనాము ఇస్తున్నారు," అని అంటూ తన జేబులోనుండే మనీపర్సుతీసి, అందులోనుంచి నూరురూపాయలనోటు ఒకటితీసి, మడతవిప్పి కుముచేతికి ఇచ్చాడు. ఈవిధంగా అకారణంగా, అయాచితంగా, ఎన్నడూ, ఎవరికీ, మధుసూదనుని దగ్గిర దానం దొరకలేదు. ఇటువంటి నమ్మరాని ఘటనచూచి మురళి భయపడి—"మహారాజా—" అంటూ ప్రారంభించాడు.

"మహారాజా! ఏమిటిరా మూర్ఖుడా, అమ్మగారు ఇచ్చేది తీసుకొని నీకు కావలసినన్ని రోమం బట్టలు కొనుక్కో," అని మహారాజావారు అన్నారు.

కథ ఇక్కడితో ముగించి—దీనితో అవాళది అంతా పూర్తి అయిపోయిందనే చెప్పవచ్చు. ఆనాడు కుము మనస్సు ఏప్రవాహంమీద తేలిపోతూఉండెనో, ఆప్రవాహం

హఠాత్తుగా నిలిచిపోయింది. మధుసూదనుని ఇరుకైన మనస్సులో గట్టుతీసి ప్రవహించడం మొదలుపెట్టిన ఆత్మత్యాగ స్రోతస్సు, కుము నౌకరుకోరకుచేసిన ఆ సామాన్య ప్రార్థనకు తగిలి అడుగుకు దిగిపోయింది. అటుపైని ఇద్దరిలో ఒకరూ ఏమీ అనలేకపోయినారు.

ఆ తాలూకా కొనడం విషయమై మాట్లాడుదామని ఎవరోవచ్చి బయటిగదిలో కనిపెట్టుకొని ఉన్నారు, ఆమాట మధుసూదన్ మరిచిపోయినాడు, ఇప్పుడు హఠాత్తుగా జ్ఞాపకం రాగానే ఉలికిపడిలేచి, తనను తాను నిందించుకొని, "పని ఉన్నది వెళ్లివస్తాను," అని అంటూ తొందరతొందరగా బయటికి వెళ్లాడు.

దారిలో శ్యామాసుందరి గది ఉన్నది, మధుసూదన్ ఆ ద్వారముదగ్గిర నిలబడి, "గదిలో ఉన్నావా?" అని బిగ్గరగా అడిగాడు.

ఆవాళ శ్యామాసుందరికి భోజనంలేదు, నేలపై చాపవేసుకొని దుప్పటి కప్పుకొని విచారంగా పడుకొనిఉన్నది. మధుసూదన్ పిలవగానే తొందరగా లేచి వచ్చి, "ఏమి అబ్బాయ్?" అన్నది.

"నాకు తాంబూలం ఇచ్చావు కావే!"

బయట చీకటిలో తలుపుమూలను ఇంతసేపూ ఒకడు నిలుచొని ఉన్నాడు—అతడు హబ్లూ—అబ్బాయిసాహసం తక్కువ కాదే! మధుసూదన్ అంటే యమధర్మరాజుకు జడిసేటట్టు జడిసేవాడు, ఐనా అతను ఉన్నంతసేపూ కర్రబొమ్మ

మాదిరి నిలుచొనే ఉన్నాడు. వెనుక ఒకనాడు మధుసూదన్ పిల్లవాడిని గదిమి పొమ్మన్నాడు, అప్పటినుండి దొడ్డమ్మదగ్గిరికి రావడానికి వీలుచిక్కలేక హాబ్లూ మనస్సు తత్తరపడుతున్నది. ఇవాళ సాయంకాలమైనా అతనిరాక నిరాపదగా జరగలేదు. అతన్ని పరుపుమీద పడుకోబెట్టి, తల్లి వంటపనిమీద వెళ్లిన పిమ్మట ఎస్ రాజ్ పాట వచ్చి హాబ్లూ చెవిని పడ్డది. ఏమి వాయిద్యమో వాయిస్తున్న వారెవరో పిల్లవాడికి తెలియలేదు. కాని పాట పెద్దనాన్నగారి గదిలోనుంచి వస్తున్నదన్న మాట మాత్రం స్పష్టం. పెద్దనాన్నగారు ఉండగా ఎవరూ వాయించడానికి సాహసించరని హాబ్లూ నమ్మకము; కనుక గదిలో పెద్దనాన్నగారు లేరని స్థిరపరిచాడు. మేడమెట్లు ఎక్కుతూనే పెద్దనాన్నగారి జోళ్లు కనబడ్డవి, కిందికి పారిపోదామని అనుకున్నాడు, కాని అంతలో గదిలోకూర్చొని దొడ్డమ్మ తానే ఎస్ రాజ్ వాయిస్తుండడం కనబడ్డది. అది కంటపడగానే కాళ్లు మరి కదలలేదు; తలుపుమూలను దాగొని పాట వింటున్నాడు. మొదటినుండే హాబ్లూకు దొడ్డమ్మఅంటే ఆనందంగా ఉన్నది, ఇప్పుడు అతనికి కలిగిన వింతకు అంతేలేదు. మధుసూదన్ వెళ్లిపోవడం చూచి మరి ఓర్చిఉండలేక గబగబ గదిలోకి పరుగెత్తివచ్చి దొడ్డమ్మ ఒడిలో కూర్చొని, ఆమె మెడను కాగలించుకొని "దొడ్డమ్మా!" అన్నాడు.

కుము అతనిని గుండెపై నొక్కుకొని, "ఇదేమిటి, చేతులు ఇంత చల్లగాఉన్నవి, వర్షపుగాలిలో తిరుగుతున్నావు కాబోలు!" అని అన్నది.

హాబ్లూ జబాబుచెప్పలేదు, దొడ్డమ్మ తనను తీసుకువెళ్లి పరుపుమీద పడుకోపెట్టేస్తుందేమో అని జడిశాడు. కుము తన శాలువును అతనిమీదకూడాకప్పి, పిల్లవాడిఒళ్లు కొంచెం వేడిఎక్కేటట్టు గట్టిగా కాగలించుకొని,—"ఇంకా పడుకో లేదూ గోపాల్?" అని అడిగింది.

"నీపాట విందామని వచ్చాను దొడ్డమ్మా, వాయించడం నీకు ఏలా వచ్చింది?"

"నేర్చుకుంటే నీకూ వస్తుంది."

"నాకు నేర్పుతావా?"

అంతలో మోతీతల్లివచ్చి తుపానుగాలివలె గదిలో ప్రవేశించి కేకలువేసింది—"ఇదిగోఇక్కడ దాగున్నాడు దొంగ, వీడిని వెదుకుతూ సప్తరాజ్యాలూ తిరుగుతున్నాను. చీకటి పడకుండానే, ఒక్కమారు బయటికి వెళ్లమనేసరికి వణికిపోతాడు అబ్బాయి, దొడ్డమ్మదగ్గిరికి రావడానికి మాత్రం భయంలేదు."

హాబ్లూ కుమును గట్టిగా పట్టుకు కూర్చున్నాడు.

"మరి కాస్త కూర్చోనీ చెల్లీ," అన్నది కుము.

ఈవిధముగా సాహసం పెరిగిపోయిందంటే చివరకు దుఃఖపడవలసివస్తుంది—వాడిని పడుకోబెట్టి ఇప్పుడేవస్తాను."

ఏదైనా ఆటవస్తువో, లేక తినేవస్తువో హాబ్లూకి ఇద్దామని కుముకు బుద్ధిపుట్టింది, కాని గదిలో ఏమీలేదు, మనసార ముద్దుపెట్టుకొని, "వెళ్లి పడుకో అమ్మా, బంగారు తండ్రివి, రేపు మధ్యాహ్నం పాటవినిపిస్తాను," అని అన్నది.

హోబ్లూ లేచి తలదించుకొని దుఃఖిస్తూ తల్లితో వెళ్లి పోయినాడు. మోతీతల్లి వెంటనే తిరిగివచ్చింది. నవీన్ పన్నిన కుట్ర ఎలా ఫలించిందో తెలుసుకుందామని ఆమెకు బహు కుతూహలముగా ఉన్నది. వచ్చి దగ్గర కూర్చోగానే కుము వేలినిఉన్న నీలంఉంగరం మోతీతల్లి కంటపట్టది—కార్యం సఫలం అయిందని ఆమె పోల్చుకొన్నది. ఆ ప్రసంగమే కదప కోరి, "ఈ ఎస్‌రాజ్ నీకు ఎలా దొరికింది అక్కా?" అని అడిగింది.

"అన్నయ్య పంపాడు."

"బావగారు తెచ్చిఇచ్చినట్టున్నారు?"

"ఔను," అని కుము జబాబు చెప్పింది క్లుప్తముగా.

మోతీతల్లి కుము ముఖమువైపు చూచింది, కాని ముఖంలో ఉల్లాసలక్షణముగాని ఆశ్చర్యలక్షణముగాని కానరాలేదు.

"మీ అన్నయ్యగారి సంగతి ఏమైనా చెప్పారా బావగారు?"

"లేదు."

"ఎల్లుండి వస్తున్నారు, అతని దగ్గిరికి నీవు వెళ్లడము మాట రాలేదా?"

"లేదు అన్నయ్యమాట రానేలేదు."

"నీవే అడిగి ఉండవలసింది!"

"ఇంకేది అడిగినా అడుగుతానుగాని అదిమాత్రం అడగను."

"అడగక్కరనేలేదు, అడగకుండా వెళ్లిపో అక్కా, బావగారు ఏమీ అనరు."

మధుసూదన్ ప్రతికూలంగా లేకపోవడంవల్ల కుముకు మరీ చిక్కుగా ఉన్నదని మోతీతల్లి బోధపరుచుకో లేదు. మధుసూదనుని దానానికి ప్రతిదానముగా అతను కోరేది అంతా కుము ఈయజాలదు. పూర్తిగా దివాలా తీసింది కుము హృదయం——కనుకనే మధుసూదన్ చేసే దానాలు పుచ్చుకొని ఋణం పెరగనీయడానికి మనస్సు ఒప్పుకోకుండా ఉన్నది. అన్నయ్య మరి నాలుగురోజులైన తరువాత వస్తే బాగుండునేమో అని కూడా ఆమెకు తోచింది.

మరి కొంచెము తాళి, "బావగారి మనస్సులో ఎంతో ప్రసన్నత పుట్టినట్టున్నది," అని మోతీతల్లి అన్నది.

కుము కళ్లల్లో సంశయం కనబడ్డది, మోతీతల్లి ముఖం చూస్తూ ఆమె అన్నది——"ఎందుకో ఆ ప్రసన్నత నాకు బోధపడకుండా ఉన్నది, భయము వేస్తున్నది అందుచేత—— ఏమి చేయడమో తెలియకుండా ఉన్నది."

మోతీతల్లి కుముగడ్డం ముద్దుగా ఆడిస్తూ జవాబు చెప్పింది——"ఏమీ చేయనక్కరలేదు——ఇన్నాళ్లూ పూర్తిగా వర్తకంలో మునిగి ఉన్నారు బావగారు, నీలాంటి స్త్రీని అతను

ఎన్నడూ చూడలేదు. కొంచెం కొంచెంగా నీసంగతి పోల్చు కొంటున్నకొలది నీవు అంటే ఆదరము పెరుగుతున్నది—అది నీకు బోధపడడము లేదు అక్కా ?"

"చూచిన కొలదీ ఆకర్షణపుట్టించేటటువంటిది నాలో ఏమీ లేదు చెల్లీ. నాలోపల ఉన్నదంతా శూన్యత, నేనెరగనా? ఆ శూన్యతే రోజుకురోజూ పట్టుబడి పోతుంటుంది. కనుకనే అతని ఆనందం చూస్తే అతను భ్రమపడుతున్నాడని నాకు భయంవేస్తున్నది. నాశూన్యత పూర్తిగా బయలుపడిపోతే అతను మరీ కోపగిస్తారు. కాని సహజంగా ఉండవలసినది ఆ కోపమే, కనుక ఆకోపానికి నేను అంతగా భయపడను.

"నీవిలువ నీకేమి తెలుసును అక్కా ! నీవు వీరిఇంటికి వచ్చినవాడు వీరికి నీవు ఇచ్చినదాని వెల వీరు ఎన్నటికీ చెల్లించలేరు. మీ మరిదిగారికి నీనంటే ప్రాణం. నీకోసం సాగర లంఘనం చేస్తేనేతప్ప అతనికి తృప్తిలేదు. నీవు అంటే నామనస్సులో అంతప్రేమ పుడుతూ ఉండబట్టి కాని లేకపోతే ఈపాటికి నీకూ నాకూ పోట్లాట జరిగేదే !

"అటువంటి మరిది దొరకడం ఎంతభాగ్యం!" అని కుము నవ్వుతూ అన్నది.

"మరి ఈ పోట్లాడలు నీ భాగ్యస్థానములో రాహువా కేతువా ?"

"మీలో ఒకరిపేరు చెపితే రెండోవారి పేరు చెప్ప నక్కరలేదు."

మోతీతల్లి తన కుడిచెయ్యిని కుము మెడమీద వేసి గట్టిగా కౌగలించుకొని, "నా కోరిక ఒకటి తీర్చాలి అక్కా నీవు?" అని అన్నది.

"చెప్పు ఏమిటో?"

"నీమనస్సులో ఉన్నదంతా ఏమీ దాచకుండా నాతో చెప్పాలి."

"నేను కోరేదీ అంతే—మొదటినుండే మనలో ప్రేమ కుదిరింది!"

"అట్లాగైతే నాదగ్గిర ఏమీ దాచి ఉంచకూడదు— ఇవాళ ఉదయమునుంచి నీముఖం ఎందు కాలాగు ఉన్నదో నాకు బోధపడడం లేదు."

కొంచెంసేపు మోతీతల్లి ముఖమువైపు చూచి కుము అన్నది: "నిజం చెప్పమన్నావా? నన్నుచూస్తే నాకే భయం వేస్తున్నది."

"ఏమిటా మాట, నిన్నుచూస్తే నీకు ఎందుకు భయం?"

"నాగురించి నేను ఇన్నాళ్లూ అనుకుంటున్నది సరిఅయిన అభిప్రాయంకాదు, నేను అనుకుంటున్నలాంటిదానను కాను నేను. మనస్సునుఅంతా చక్కచేసుకొని నిశ్చింతగా వచ్చాను. అన్నయ్య సందేహిస్తున్నప్పుడు నిర్భయంగా కొత్తదారిని అడుగువేశాను. కాని ఆశతో బయలుదేరిన ఆ స్త్రీ హృదయం నేడు నాలో కానరాకుండా ఉన్నది."

"నీవు బావగారిని ప్రేమించలేకుండా ఉన్నావు. నాతో నిజంచెప్పు అక్కా——ఇంతకుముందు నీవు ఎవరినైనా ప్రేమించావా! ప్రేమంటే ఏమిటో తెలుసునా ?"

తెలుసును:అంటేనవ్వుతావు; సూర్యోదయం కాకపూర్వం ఆకాశాన ఉషారాగం ఆక్రమించి ఉన్నట్టుగా ప్రేమ నామనస్సు నావరించి ఉండెను. సూర్యుడు ఉదయించబోతున్నాడని మాత్రమే నేనెరిగినది. ఆ సూర్యోదయము మాట ఊహించుకొంటూ బయలుదేరాను. చేతిలో తీర్థజలం పట్టుకొన్నాను, పళ్లెములో ఫలాలు భక్తితో పెట్టి ఉంచాను. ఇన్నాళ్లబట్టి ఏ దేవుని మనసారపూజిస్తున్నానో ఆదేవుడు నాలో ఉత్సాహం పుట్టిస్తున్నాడని తోచి, అభిసారికవలె బయలుదేరాను. ఆనాటి అంధకారం అంధకారమని అనిపించలేదు. నేడు వెలుతురులో కళ్లు విప్పి చూచేటప్పటికి లోపున ఎంతో బయటా అంతే. ఘడియలు లెక్కపెట్టుకొంటూ సంవత్సరం తరువాత సంవత్సరం ఏలాగు గడపగలను అని ఇప్పుడు భయం వేస్తున్నది."

"బావగారిని ప్రేమించలేనని అనుకొంటున్నావా ?"

"ప్రేమించగలిగి ఉందును. ఏదిదొరికితే దానితోనే సంతోషించగల శక్తిని నాతో తెచ్చుకొన్నాను. కాని దానిని మీ బావగారు మొదటిలోనే కుమ్మివేసి గుండపిండిచేసేశారు. ఏది చేయబోయినా ఇప్పుడు నాకు కఠినముగా కనబడుతున్నది. నా శరీరముమీదనుండే నాజూకు పొరను గీసేసి తీసేశారు, కనుక ఇప్పుడు ఒంటికి ఏమి తగిలినా గొప్పబాధ కలుగుతున్నది. కొన్నాళ్లకు ఒళ్లు కాయకాసిపోతే ఏదైనా భరించి ఉండ

గలగవచ్చు కాని "నాకు జీవితములో ఆనంద మంటూ ఇంకెన్నడూ ఉండదేమో!"

"చెప్పలేము అక్కా!"

"గట్టిగా చెప్పగలము. నాకు ఇప్పుడు లేశమాత్రమైనా భ్రమలేదు. సిగ్గువిడిచిన దానివలె నాజీవనం స్పష్టముగా అంతా కనబడుతున్నది. ఎక్కడైనా ఏరవంతైనా కంటికి కనబడకుండా దాగిఉంటే నన్ను నేను భ్రమపెట్టుకోగలిగి ఉందునేమో. ఆడ వాళ్లకు మృత్యువాక్కచేతప్ప వేరుదారిలేదు. విధాత బహు క్రూరుడు, వాళ్లబ్రతుకు చాలా దుఃఖకరమైనదిగా చేశాడు.

ఇంత ఉత్తేజనంతో ఇంతసేపు కుము మాట్లాడడం మోతీతల్లి ఇంతకు పూర్వం ఎన్నడూ వినలేదు. ముఖ్యంగా, ఎంతో కష్టముపైని భార్యాభర్త లిద్దరూకలిసి మధుసూదన్‌ను ఇవాళ కుముఃయెడల ప్రసన్నుడయేటట్టుచేసారు. ఈనాడే కుము మనస్సులో అంత నిరాశకలగడం చూచి మోతీతల్లి చాలా భయపడ్డది. లతకు వేళ్లదగ్గరనే దెబ్బతగిలింది. మాలీ అనుగ్రహజలం లతమీదనుపోసి దానిని సజీవిచేసి తాజాగా ఉంచలేదు.

"భక్తిపూర్వకముగా భర్తకు ఆత్మసమర్పణచేయలేక పోవడం మహాపాపం—నేనెరుగుదును. కాని ఆ పాపానికి నేనంతగా జడవలేదు—భక్తిలేని ఆత్మసమర్పణవల్ల కలిగే అసహ్యం సహించరానిది."

మోతీతల్లి ఏమీ జబాబు చెప్పలేక, మతిపోయినదాని వలె కూర్చున్నది. కొంచెంసేపు ఊరుకొని కుమే అన్నది—

"నీవు ఎంత అదృష్టవంతురాలవు, ఎంతపుణ్యం చేసుకొన్నావు—మరిదిగారిని సర్వాంతఃకరణంతో ప్రేమించగలుగుతున్నావు. ప్రేమించడమే సులభం అని నేను అనుకొనేదానను పూర్వం—ఏ భర్తనైనా భార్య ప్రేమించగలదని అనుకొనేదానను, కాని ఇప్పుడు తెలుస్తున్నది—ప్రేమించ'గలగ'డం అనేది బహు దుర్లభం—జన్మజన్మాల సాధనవల్ల ఘటించగలది. నిజంగా చెప్పు అక్కా—అందరు భార్యలూ తమతమ భర్తలను ప్రేమించ గలరా?"

"ప్రేమించకపోయినా స్త్రీ సతీపత్ని కావాలి, లేకపోతే సంసారం నడవడం ఎట్లా?"

"అటువంటి ధైర్యం ఈయి నాకు—ఇంకేమి కాక పోయినా నేను సతీపత్నిని కావలెనని దీవించు—సాధన కఠిన మైనచోటే పుణ్యంకూడా అధికం."

"అట్లా చేదామన్నా బయటనుండి అనేకరకాల అడ్డు వస్తుంటవి."

"వాటిని లోపలనుండి జయించుకురావచ్చు. నేను జయించగలను—నేను ఓడిపోవడానికి ఒప్పుకోను."

"నీవు జయించలేకపోతే ఇంకెవరు జయించగలరు అక్కా!"

వర్షం ఒత్తుగా పడడం ప్రారంభించింది. గాలికి దీపం ఉండుండి గుప్పుగుప్పు మంటున్నది. తడిరెక్కలు కొట్టు కొంటూ లోపలికి ఎగిరివస్తున్న నిశాచరపక్షివలె వర్షపుగాలి లోపలికి ఉండుండి తోసుకువస్తున్నది. కుముదు ఒంట్లోను, మనస్సులోను వణుకుపుడుతున్నది, తోటికోడలువంక చూస్తూ ఇట్లాగన్నది—"దేవుని ప్రార్థించడంవల్ల నాకు మరి బలం

రావడము లేదు. నోటితో మంత్రాలు చదువుతుంటాను, మనస్సు తన ముఖాన్ని వెనుకకుతిప్పి కూర్చుంటున్నది, ఎంత ప్రయత్నించినా తిరిగిచూడదు—ఇది చూస్తే నాకు అన్నిటికంటె భయముగా ఉన్నది."

మోతీతల్లికి మరిపింపుమాటలతో ధైర్యం చెప్పడానికి ఇష్టంలేకపోయింది, ఏమీ అనక కుమును తన గుండెపైని ఉంచుకొని గట్టిగా కౌగలించుకొన్నది. ఆ సమయంలో నవీన్ పిలుపు వినబడ్డది బయటినుండి.

కుము, "రా అబ్బాయి, రా!" అని సంతోషంతో అన్నది.

"ఇంటి సంధ్యాదీపం గదిలో కనబడలేదు, వెదుకుకొంటూ వచ్చాను," అన్నాడు నవీన్.

"అయ్యో పాపం! మణిని పోగొట్టుకొన్న నాగుపాము!"

"మణి ఎవరో ఎవరు నాగుపామో జాతకాలు చూపించుకుందామా ?" అని నవీన్ అడిగాడు.

"నన్నుమాత్రం సాక్షిగా వేయకు అబ్బాయి !" అని కుము అన్నది.

"నాకూ కొంత జ్ఞానం ఉన్నది, నిన్ను సాక్ష్యంవేస్తే తీర్పు నాకు విరుద్ధం అవుతుంది, నాకు ఆమాత్రం తెలియక పోలేదు."

"అలాగైతే నీ మణిని తీసుకువెళ్లిపో, నాదగ్గిర కట్టిపెట్టి ఉంచను," అన్నది కుము.

"మణిని పోగొట్టుకున్నవాడు మణికోసం రాలేదు వదినా, ఆ నెపమువిూదనైనా రాణీ పాదదర్శనం దొరుకుతుందని వచ్చాడు."

"నేపం అవసర మేమి వచ్చింది, పాదాలు వాటంతట అవే పట్టుబడి పోయినవి. అన్నిటికంటె అసాధ్యమైన దాని కొరకు సాధనచేస్తూ ఎవరూ కూర్చోరు—వచ్చేటప్పుడు అది సునాయాసముగా వచ్చేస్తుంది. ప్రపంచంలో వేలకొలది మనుష్యులు, నాకంటె యోగ్యులు, ఉంటూ ఉండగా నీపాదాలు స్పర్శించే భాగ్యం నాకే ఎందుకు దొరకాలి, వాళ్లకు ప్రాప్తించలేదే! నవీనుని జన్మసార్థకం అయింది, వెల చెల్లించకుండానే."

"నీవుఅన్నది బహు చక్కగా ఉన్నది అబ్బాయి! నీ ఎన్సైక్లోపీడియాలోనుంచి—"

"ఆలాగు కొట్టి పారేయలేవు వదినా. పావలంటే ఏమిటో వాళ్లకు ఎట్లా బోధపడుతుంది? మేకదెక్కలవంటి మడమలుగల జోళ్లలో లక్ష్మీదేవి పాదాలను ఖైదుచేసి ఉంచే వాళ్లకేమి తెలుస్తుంది పాదాల మహిమ? సీతాదేవి పాదాలు చూస్తూనే లక్ష్మణుడు పద్నాలుగేళ్లు వనవాసం చేశాడు, అనగా దాని విలువ మనదేశంలో ఉండే మరదిగార్లకే తెలుసునన్న మాట— పాదాలమీదికి చీర లాగుతున్న వేమి వదినా? పాదాలు మూసేయాలంటే మూసేయి—పద్మాలు సాయంత్రంవేళ మూసుకొంటవి. ఆలాగని చెప్పి శాశ్వతకాలమూ మూసుకొని ఉండవే! మర్నాడు ఉదయమే తిరిగి మొగ్గలు విడుతవి.

"ఈలాంటి స్తోత్రంచేసే నిన్ను భ్రమింపజేశాడా చెల్లీ?"

"అది కేవలం పొరపాటు అక్కా, తీపిమాటలు వృథాగా ఖర్చుపెట్టేవారు కారు ఆయన."

"స్తోత్రం అక్కరలేదనా అబ్బాయి, నీ అభిప్రాయం?"

"దేవికి స్తోత్రం అంటే ఉండే ఆకలికి అంతులేదు."

స్తోత్రంచేయడం చాలా అవసరం, కాని శివునివలె నేను పంచాననుని కానే. ఒకే నోటిలోనుండి వస్తుండడంవల్ల స్తవం పాత అయిపోయింది—దేవికి రసహీనమైపోయింది.

ఈసంభాషణ జరుగుతున్నది, మురళి వచ్చి, "మహారాజా వారు ఆఫీసుగదిలో ఉన్నారు, రమ్మని ఆజ్ఞ అయింది," అని నవీన్‌తో అన్నాడు.

ఈ మాట వినగానే నవీన్ మనస్సు చెడిపోయింది. ఇవాళ ఆఫీసునుంచి వస్తూనే తిన్నగా పడకగదిలోకి వచ్చేస్తాడని నవీన్ అనుకొన్నాడు పడవకు ఎక్కడో నేల తగిలిపోయింది కాబోలు!

నవీన్ వెళ్ళిపోగానే మోతీతల్లి అన్నది, "కాని బావ గారికి నీవంటే ఎంతప్రేమో మరిచిపోకు."

"అదే నాకు ఆశ్చర్యంగా ఉన్నది."

"ఏమి టామాట, నిన్ను ప్రేమించడంలో ఆశ్చర్య మే ముంది ? అతని మనస్సు రాయి అనుకున్నావా?"

"అతనికి తగినయోగ్యత నాలో లేదు."

"నీ యోగ్యతకు మించిన పురుషుడు ప్రపంచములో ఉన్నాడంటావా?"

"ఆయనకు ఉన్నశక్తి ఏమిటి, ఆయన మర్యాద ఏమిటి, ఆయన బుద్ధి ఏమిటి ? ఎంతపెద్దవారు ఆయన! నాలో ఏమిటి దొరుకుతుంది ఆయనకు! నాలోని అపక్వతా, చేతకాని తనమూ ఇక్కడికి వచ్చిన రెండు రోజులలోనే నాకు స్పష్టం అయిపోయింది. కనుకనే ఆయనకు నామీద ప్రేమ పుట్టిందంటే నాకు అంతభయం. ఎంతవెదికినా నాకు నాలో ఏమీ కనబడ లేదు—అంత నిస్సారతతో నిండిఉన్న రిక్తురాలను. నేను! అతని

సేవ ఎట్లాగుచేయగలను, నిన్నరాత్రి అంతా కూర్చొని ఆలోచిస్తున్నాను. ఏమి తట్టిందో ఎరుగుదువా: నేను ఒక బేరింగ్ కవరునట, డబుల్‌చార్జి ఇచ్చి తీసుకొన్నారట, విప్పిచూస్తే లోపల ఉత్తరమైనా లేదు అట."

"నీమాటలు వింటూఉంటే నవ్వువస్తుంది అక్కా, బావగారు పెద్దవర్తకులు, వర్తకజ్ఞానంలో ఆయనతో సమానులెవరూ లేరు—ఒప్పుకున్నాను. కాని నీవు ఆయని వర్తకంలో మ్యానేజరుపని చేయడానికి వస్తేకదూ యోగ్యతలేదని భయపడడానికి? బావగారు తన మనస్సులో ఉండేమాట చెప్పిఉంటే తానే నీకు తగినవారు కారని చెప్పేవారు."

"ఆమాటే అన్నారు ఆయన."

"నీవు నమ్మలేదు కదూ!"

"లేదు. పైగా భయంకూడా వేసింది—పొరపాటు పడుతున్నారనీ, పొరపాటుపడ్డట్టు తరువాత పోల్చుకుంటారనీ."

"అలా ఎందుకు అనుకుంటున్నావు అక్కా?"

"చెపుతాను విను. నాకు పెళ్లి హఠాత్తుగా జరిగింది, ఆమాట నీవు ఎరుగుదువు. అదిఅంతా నేను చేసుకొన్నదే. వట్టిమాయ కల్పించుకొని కేవలం కుర్రతరహాగా ప్రవర్తించాను. లేనివన్నీ ఊహించుకొని నన్ను నేను భ్రమపెట్టుకున్నాను. కాని నాలో గొప్పనమ్మకమూ పట్టుదలా ఉండబట్టి ఎవ్వరూ నన్ను ఆపలేకపోయినారు. అడ్డుపెట్టడం వృథా అని తెలిసి అన్నయ్య ఏమీ అనలేదు. అన్నయ్య కంగారూ, అతని భీతీ నాకు తెలియకపోలేదు. తెలిసినా నాపట్టు నేను వదలలేదు—అంత మూర్ఖురాలను నేను! ఈనాటినుండి నాకు

చచ్చేవరకు కష్టాలే, నావల్ల ఇతరులకూ కష్టాలే. ఇదిఅంతా నేను చేసుకొన్నదే అని రోజూ జ్ఞాపకంవస్తూ ఉంటుంది కూడాను."

మోతీ తల్లికి ఏమీ తోచలేదు, కొంచెముసేపు ఊరుకొని, "అయితే ఏ ఉద్దేశంతో పెళ్లి చేసుకుందామని నిశ్చయించుకున్నావక్కా?"

"పాతివ్రత్యముయొక్క ఘనత కనపరచడానికి భర్త ఒక గురివంటివాడనీ, అతని మంచిచెడ్డలతో పనిలేదనీ నేను నమ్మేదానను. భగవంతుడు నాకు ఎవరిని భర్తగా నిర్ణయించాడో ఆతనిని తప్పక నేను ప్రేమిస్తాననే నా నమ్మకము. చిన్నప్పటినుండి మా అమ్మను చూస్తుండేదానను, పురాణాలు చదివాను, హరికథలు విన్నాను—శాస్త్రానుసారము జీవితాన్ని నడిపించడం బహు సులభం అని అనుకొనేదానను."

"పందొమ్మిదేళ్ల కన్యకకోసమని వ్రాసినవి కావు అక్కా, శాస్త్రాలు!"

"ప్రేమ పై-లాభమువంటిదని నాకు ఇప్పుడు బోధపడ్డది చెల్లీ—సంసారయాత్ర చేసేటప్పుడు ఆపై-లాభం మీద ఆశ పెట్టుకోకూడదు, ధర్మాన్ని కౌగలించుకొని తేలిఉండాలి. ధర్మము రసరహితంగా ఉండవచ్చును, దానికి పువ్వులు పూయకపోవచ్చును, పళ్లు పండకపోవచ్చును, అది ఎండిపోయినా మనసు మునగకుండా తేలి ఉంచగలిగితే అంతే చాలును."

మోతీతల్లి తాను ఆట్టే మాటలాడక కుముదచేతనే మాట్లాడించవలెనని ప్రయత్నంచేసింది.

ఆఫీసులో పరిస్థితులు బాగులేవు, మధుసూదన్ ఆఫీసుకు వెళ్ళగానే ఆ సంగతి బోధపడ్డది. వీళ్ళ వర్తకంతో సంపర్కం గల పెద్ద మద్రాసు బ్యాంకు ఒకటి దివాలాతీసింది. కొందరు డైరెక్టర్ల ప్రేరేపణవల్ల ఆఫీసు ఉద్యోగస్థులెవరో ఆఫీసు లెక్కల పుస్తకాలూ కాగితాలూ రహస్యంగా కెలుకుతున్నారని మధుసూదన్‌కు తెలిసింది. ఇంతకాలమూ మధుసూదనుని ఎవ్వరూ సందేహించలేదు. ఎవడో ఒకడు అతనిలో చిన్న తప్పు ఒకటి కనిపెట్టాడో లేదో, మంత్రశక్తివల్ల మారిపోయినట్టుగా అంతా మారిపోయింది. పెద్దపెద్ద పనులలో చిన్న చిన్న లోపాలు కనిపెట్టడం సులభం. గొప్ప సేనానాయకులు ఎన్నో చిన్నచిన్న పరాజయాలద్వారానే గొప్ప జయం పొందుతుంటారు. మధుసూదన్ కూడా ఆలాగునే జయం పొందుతూ వచ్చాడు, కనుకనే అప్పుడప్పుడు పొందిన చిన్న అపజయాలు కంటపడేవికావు. అట్లాంటి చిన్నచిన్నవన్నీ ఎంచి పట్టీవ్రాసి సామాన్యుల ముందుపెడితే, "మేము ఇటువంటి పొరపాట్లు చేసే ఉండము," అని అంటూ తమతెలివి తేటలకు తామే పొంగిపోతారు. 'పగిలిన ఓడతోనైనా మధుసూదన్ గట్టుచేర గలిగాడ'ని నేడు వాళ్ళకు ఎవరు బోధపరచగలరు. అతనులేకపోతే ఓడ గట్టుచేరనేచేరదు; ముఖ్యమైన సంగతి దరిచేర్పించడం అనేసంగతి ఇప్పుడు ఎవడికీ అక్కరలేదు. ఇప్పుడు ఓడను గట్టుమీద పెట్టి రంధ్రాలు తనిఖీ

చేసేసరికి అందరిఒంట్లో వణుకు పుట్టింది. ఇట్లాంటి చిన్న విష యాలద్వారా సామాన్యుల మనసులలో గాబరాపుట్టించడం సులభం. సాధారణంగా విచక్షణలేనివాళ్లకు కావలసినదేమిటి అంటే లాభం, మంచిచెడ్డల విచారణతో వాళ్లకు పనిలేదు. కాని వాళ్లు విచారణ ప్రారంభిస్తేమాత్రం ఆ విచారణ ప్రాణాంతకం అవుతుంది. ఆ మూర్ఖులమీద మధుసూదన్‌కు అసహ్యం పుట్టింది, కోపంవచ్చింది. కాని మూర్ఖులే ముఖ్యులై ఉన్నచోట వాళ్లతో మంచి చేసుకోవడం తప్ప వేరుమార్గం లేదు. పాత నిచ్చెన, ఎక్కగానే, ఆడిపోతుంది, విరిగిపడి పోతుందేమో అని భయం పుట్టిస్తుంది, కాని ఎక్కుతున్న వాడు అది ఆడకుండా ఉండేటట్టు చేసుకొని మెల్లిగా ఎక్కాలి. కోపంవచ్చి ఒక్కతాపు తన్న బుద్ధిపుడుతుంది, కాని తన్నడంవల్ల అపాయం మరీ అధికం అవుతుంది.

తన పిల్లను ఆపదనుండి తప్పించడానికి సింహం తన ప్రాణాన్నైనా ఇచ్చేయడానికి సిద్ధపడుతుంది. వ్యాపార విష యాలలో మధుసూదనుని మనోభావం కూడా అటువంటిదే. ఈ వర్తకమంతా అతని సృష్టి, దానిమీద అతనికిఉండే అభిమానము ధనాపేక్ష కాదు. రచనాశక్తి కలవానికి తన రచన మూలముగానే తనతో గాఢపరిచయం కలుగుతుంది; తనను పూర్తిగా తన రచనలోనే పొందుతాడు. విఘ్నాలు వచ్చి ఆ కోరిక సఫలంకానప్పుడు బ్రతుకు రుచిలేనిది అయి పోతుంది, మన కోరికలన్నీ తుచ్ఛముగా కనపడతవి.

కొన్నాళ్లనుండి కుము మధుసూదనుని అధికంగా ఆకర్షిస్తుండెను. అప్పుడు ఆ ఆకర్షణ హఠాత్తుగా తగ్గిపోయింది. మధుసూదన్ జీవితానికి ప్రేమ అవసరమైనదని వయసుముదిరిన తరువాత పోల్చుకొన్నాడు. ఆ వయస్సులో ఇటువంటి ప్రమాదం కనబడినప్పుడు అది బహుతీవ్రంగా పనిచేస్తుంది. ప్రేమ హఠాత్తుగా రావడమువల్ల దెబ్బ మధుసూదన్‌కు జోరుగానే తగిలింది కాని ప్రేమవల్ల కలగవలసినవేదన తిరిగి మాయమయి పోయింది ఎందుచేతనో !

నవీన్ గదిలోకి రాగానే మధుసూదన్ అతనిని అడిగాడు—"నా *ప్రైవేట్ జమా ఖర్చులచిత్తాలు పైవాళ్ల చేతిలో పడ్డవేమో నీవు ఎరుగుదువా?"

"అదేమిటి ఆ మాట ?" అని నవీన్ ఉలికిపడి అన్నాడు.

"నీవు మెల్లిగా కూపీ లాగాలి, జమాఖర్చుల గుమాస్తా గదిలోకి ఎవ్వరైనా వచ్చిపోవడాలు జరుగుతున్న వేమో."

"చాలా నమ్మకమైనవాడు రతికాంత, అతను ఎన్నడూ—"

"అతనికి తెలియకుండా కిందనుండే గుమాస్తాలు రహస్యాలు బయటికి జరిపేస్తున్నట్టు అనుమానించడానికి కారణం కనపడుతున్నది. ఎవరిద్వారా ఈ పని జరుగుతున్నదో చాలా నేర్పుతో బయటికి లాగాలి."

---

* Private

నౌకరువచ్చి భోజనం చల్లారిపోతున్నదని చెప్పాడు, మధుసూదన్ ఆమాట వినిపించుకోక నవీన్‌తో తత్‌క్షణం బండి కట్టించమని చెప్పాడు.

"ఆలస్యం అయిపోతుంది, భోజనంచేసి వెళ్లవా?" అని నవీన్ అన్నాడు.

"బయట ఎక్కడైనా భోజనం చేస్తాను, జరూరుపని ఉన్నది."

నవీన్ తలవాల్చుకొని ఆలోచిస్తూ బయటికి వెళ్లాడు. అతను పన్నిన పన్నాగమంతా వృథాఅయిపోయిందా ఏమిటి!

మధుసూదన్ నవీన్‌ను మళ్ళీ పిలిచి, "ఈ ఉత్తరం కుముకు ఇచ్చిరా," అన్నాడు.

ఆ ఉత్తరం విప్రదాస్ వ్రాసినది. ఉత్తరం ఆనాడు ఉదయమే వచ్చింది, నవీన్‌చూచి పోల్చాడు, తనచేతితో తానే కుముకు ఇద్దామని మధుసూదన్ దానిని తనదగ్గర ఉంచుకొన్నాడు. ఈవిధంగా కుమును కలుసుకోడానికి వెళ్లినప్పుడల్లా ఏదోఒక అర్ఘ్యం తీసుకువెళ్లవలెనని మధుసూదనుని కోరిక. కాని ఇవాళ ఆఫీస్‌పనిలో ఏదో తుపాన్‌వచ్చి ఇంత శ్రద్ధగా అతనుచేసిన ప్రయత్నమంతా వృథా అయిపోయింది.

మద్రాస్‌లో ఫేల్‌అయిన బ్యాంకు చాలామంచి బ్యాంక్ అని అందరూ నమ్ముతుండేవారు. ఆబ్యాంక్‌తో ఘోషాల్ కంపెనీకిగల సంబంధం డైరెక్టర్లూ వంతుదారులూ-

అంతా ఎరిగినదే, దానివల్ల నష్టంరావచ్చునని ఎవరికీ ఎట్టి సందేహమూ లేదు. మర ఆగిపోగానే, "మేము మొదటినుండీ అనుమానిస్తున్నాము," అని అనేకులు అనడం మొదలుపెట్టారు.

వర్తకానికి పెద్దదెబ్బ ఏదైనా తగిలినప్పుడు నలుగురూ కలిసి దానిని రక్షించడానికి ప్రయత్నించాలి. అట్లాంటప్పుడే 'నీది తప్పు నీదితప్పు' అని అంటూ ఈర్ష్యకొలదీ ఒకరిమీద ఒకరు నిందమోపుతూ ఈర్ష్యలు తీర్చుకుంటారు. దీనివల్ల అసలే అల్లల్లాడుతున్న వ్యాపారం కూలిపడుతుంది. ఇప్పుడు అటువంటిద్దే జరుగుతున్నదని మధుసూదన్ కనిపెట్టాడు. మద్రాస్ బ్యాంక్ దివాలావల్ల ఘోషాల్ కంపెనీకి ఎంతనష్టం రావచ్చునో ఇప్పుడప్పుడే ఎవరూ నిర్ణయించలేరు, కాని, మధుసూదనుని ప్రతిష్ఠ నాశనంచేయగోరుతూ శత్రువులు చేస్తున్న యత్నాలకు ఇది ఒక మసాలావలె దొరికింది. ఏమైతే నేమి, రోజులు బాగులేవు, మిగతావన్నీ వెనకకుపెట్టి నడుముబిగించి మధుసూదన్ ఇప్పుడు వర్తకవ్యవహారాలే సరిచేయ ప్రయత్నించాలి.

నవీన్ మధుసూదన్‌తో మాట్లాడి వచ్చి చూచేసరికి మోతీతల్లి ఇంకా కుముతో మాట్లాడుతున్నది. కుముకు అన్నగారు వ్రాసిన ఉత్తరం నవీన్ ఆమెకు ఇచ్చాడు.

కుము ఉలికిపడి ఉత్తరం అందుకొన్నది. కవరుచించి చదవడానికి భయపడ్డది. లోపల ఎటువంటి కబురు ఉంటుందో

అని చెయ్యి వణకడం మొదలుపెట్టింది. ఇప్పుడు రాలేనని వ్రాశాడేమో! మెల్లి మెల్లిగా కవరు చించి ఉత్తరం చదివి, ఏమీ అనక కూర్చున్నది కొంచెముసేపు. ఆమె మనస్సులో ఎక్కడో బాధకలుగుతున్నదని ముఖాన్నిపట్టి స్పష్టమవుతున్నది. కుము నవీన్‌వైపుచూచి, "అన్నయ్య ఇవాళ మూడు ఘంటలకు కలకత్తా వచ్చాడు," అన్నది.

"ఇవాళే వచ్చారా? అతను—"

"రెండుమూడు రోజులతరువాత బయలుదేరవలసిన మాట, కాని ఏదో అవసరమైన పనిమీద ముందుగానే వచ్చే శాడట."

కుము ఇంకేమీ అనలేదు. ఒంట్లో కొంచెం నయము కాగానే కుమును చూడడానికి వస్తున్నానని, విప్రదాసువ్రాసిన ఉత్తరంచివరభాగములో, ఉండెను. ముందు వ్రాసిన ఉత్తరంలో కూడా ఈమాటే ఉండెను. కుము చేసిన తప్పేమిటి— "నీవు మాఇంటికి రావద్దు," అనేకదా ఆమాటకు అర్థం. నేల మీదపడి ఏడుద్దామని బుద్ధిపుట్టింది కుముకు, రాతివిగ్రహము వలె నిశ్చలంగా కూర్చున్నది.

ఆ ఉత్తరములో కఠినమైన మాటలేవో ఉన్నవి అని నవీన్ అనుమానించాడు, కుము ముఖంచూడగానే అతని మనస్సు కరిగిపోయింది; "మీ అన్నయ్యను చూడడానికి రేపే వెళ్లాలి వదినా," అని అతనన్నాడు.

"నేను వెళ్లను," అని కుము అన్నది, అని మరి దుఃఖము ఆపుకోలేక రెండుచేతులతో కళ్లు మూసుకొని వెక్కి వెక్కి ఏడవడం మొదలుపెట్టింది.

మోతీతల్లి ఏమీ ప్రశ్నించక కుమును తన గుండెపై నొక్కుకొని కౌగలించుకొన్నది. కుము, "అన్నయ్య నన్ను రావద్దన్నాడు," అని అన్నది.

"లేదు వదినా నీవుపొరపాటు పడుతున్నావు," అని నవీన్ అన్నాడు.

తా నెంతమాత్రం పొరపాటు పడలేదని సూచిస్తూ తీవ్రంగా తల ఊచింది కుము.

"నీ పొరపాటు ఎక్కడో చెప్పనా? మా అన్నయ్య నిన్ను మీ అన్నయ్య బసకు వెళ్లనియ్యడేమోఅని విప్రదాసుబాబు అనుకున్నారు, వెళ్ల ప్రయత్నముచేస్తే నీకు అవమానం కలగ వచ్చుననీ నీవు దుఃఖించవచ్చుననీ ఊహించి నీకు కష్టం లేకుండా చేదామని మీ అన్నయ్య చేసిన ఆలోచన ఇది.

ఇది వినగానే కుము మనస్సులోఉండే భారం కొంత తగ్గింది; తడికళ్లను నవీన్‌వైపు ఎత్తి ప్రీతితో చూస్తూ కూర్చున్నది. నవీన్‌చెప్పినదానిలో కొంచెమైనా పొరపాటు లేదని కుము పోల్చుకొన్నది; అన్నను అకారణంగా నిందించినందుకు సిగ్గుపడ్డది; మనస్సుకు ఇప్పుడు బలము కలిగింది; అన్నయ్య వద్దకు తక్షణమే వెళ్లక అన్నయ్య తన దగ్గరకు వచ్చేవరకు తాళి

ఉండగలదు ఇప్పుడు—అట్లాగు ఉండడమే మంచిదని ఆమెకు ఇప్పుడు తోచింది.

మోతీతల్లి కుము గడ్డం ఎత్తి పట్టుకొని ఇట్లా గన్నది—"అన్నగారి మాటలో ఏమాత్రమైనా సందేహించ దగినది ఉన్నదంటే ఎదురుగాలి వచ్చి ఓడకు తగులుతుంది, సముద్రం అల్లకల్లోలమయిపోతుంది!"

"అట్లాగైతే రేపు మీఅన్నయ్య దగ్గిరికి వెళ్లే ఏర్పాటు చేస్తాను వదినా," అన్నాడు నవీన్.

"వద్దు, అవసరం లేదు."

"అవసరం లేకపోవడ మేమిటి, నీకు అవసరం లేకపోతే నాకవసరం ఉన్నది."

"నీకేమి అవసరం?"

"వహవా, మా అన్నయ్యనుగురించి మీ అన్నయ్య ఏమిటి అనుకుంటూఉన్నా నేను సహించి ఊరుకోవాలి కాబోలు! మా అన్నయ్యపక్షం నేను పోట్లాడుతాను, నీచేత మాత్రం ఓడిపోను, రేపు మీ అన్నయ్య దగ్గిరికి వెళ్లితీరుతాను."

కుము పకపక నవ్వడం మొదలుపెట్టింది.

"హాస్యంకాదు వదినా, మాఇంటి అగౌరవము మీఇంటి అగౌరవమే. ఇక లేచి నాలుగుమెతుకులు నోట్లో వేసుకొని రా వదినా, అన్నయ్యను మేనేజరుగారు భోజనానికి పిలిచారు,

పడుకోడానికి ఇవాళ అన్నయ్య ఇంట్లోకి రా దనుకుంటాను, బయటిగదిలో పడకకు ఏర్పాటు చేస్తున్నారు."

ఆమాట వినగానే కుముదు కొంచెం సరదా వేసింది. కాని ఆ ఉత్తరక్షణమే సరదా వేసినందుకు సిగ్గు కలిగింది.

రాత్రి నవీన్‌కూ భార్యకూ దీనివిషయమై మాటలుజరిగినవి; "అక్కను నీవు ఓదార్చావు కాని, తరువాతనో?" అని భార్య అడిగింది.

"మరి తరువాత ఏమిటి, నవీన్ ఎంత అంటాడో అంత చేసితీరుతాడు, వదిన రేపువెళ్లితీరాలి, తరువాత ఏమిజరగవలసి ఉన్నదో అది జరుగుతుంది."

కొత్తగా రాజత్వం పొందినవాళ్లు తమ ఔన్నత్యాన్ని మరిచిపోరు, బహుఉన్నతపదివిలో ఉన్నామనేజ్ఞానం వాళ్లలో మహాఉగ్రంగా ఉంటుంది. వివాహమాడి తమఇంటికి వచ్చిన నవవధువుకు ఉచ్చస్థానము దొరికిందనీ, తనపూర్వావస్థను ఆమె పూర్తిగా మరిచిపోవాలనీ, కనుక పుట్టిల్లు అనే పనికిమాలిన స్థలమొకటి ఉన్నదని జ్ఞాపకం ఉంచుకోకపోవడమే సరియైన పని అనిన్నీ అత్తవారి అభిప్రాయం. అట్టి పరిస్థితులలో వధువు ఇద్దరి మర్యాదా కాపాడి ఉంచలేనప్పుడు, ఏదో ఒకదానినిమాత్రమే కాపాడ ప్రయత్నిస్తుంది. అందులో దేనిని రక్షించి ఉంచవలెనో నవీన్ తనలో తాను స్థిరపరిచి ఉంచాడు. అన్నకు సంపూర్ణాధికారమున్నచోట అతనితో పోట్లాడే సాహసం

తన కున్నదని మొన్నమొన్నటివరకు నవీన్ కలలోనైనా అనుకోలేదు.

రేపుఉదయం అన్నయ్యను ఒకమారు చూచి వస్తావని కుము మధుసూదన్‌తో చెప్పవలెనని భార్యాభర్త లిద్దరూ తమలోతాము వాదించుకొని స్థిరపరచారు. మధుసూదన్ సమ్మతించి కుమును అక్కడికి పంపినట్లైతే, అక్కడ నాలుగైదురోజులు ఉన్నతరువాత అక్కడనుండి వెంటనే తిరిగి రావడానికి వీలు కానట్టు ఏవో సరియైన కారణాలు కల్పించడం కష్టంకాదు.

మధుసూదన్ ఇంటికి వచ్చేటప్పటికి బాగా రాత్రి అయింది, మోపెడు కాగితాలుకూడా తీసుకువచ్చాడు. నవీన్ పొంచిఉండి చూచాడు, మధుసూదన్ వచ్చి, పడుకోక, టేబిల్ దగ్గర కూర్చొని కాగితాలు తిరగవేస్తున్నాడు, నీలిపెన్‌సిల్‌తో అక్కడక్కడ గీట్లు పెడుతున్నాడు, *నోట్‌బుక్కులో †నోట్సు వ్రాస్తున్నాడు. నవీన్ సాహసించి గదిలో ప్రవేశించి, "నేను సాయంచేసేదా అన్నయ్యా?" అని అన్నాడు. "వద్దు," అని క్లుప్తముగా జవాబు చెప్పాడు మధుసూదన్. వర్తకము చిక్కులలో పడ్డది, అది ఏ అవస్థలో ఉన్నదో పూర్తిగా తెలుసుకోవలెనని అతని ఉద్దేశము, అంతా కంటికికట్టినట్టుగా కనబడవలెను, ఇతరులు తోడ్పడమువల్ల తనకు అంతా సరిగా తెలియదు; చేయవలసిన ప్రయత్నానికి తగినబలము కలగదు.

* Note Book. † Notes.

ఇంకేమీ మాట్లాడడానికి మిష దొరకక నవీన్ బయటికి వచ్చేశాడు, ఇంతలో అన్నతో ప్రసంగించాడని వీలుచిక్కేటట్టు కూడా కానరాలేదు. రేపు వదిన ఆమె అన్నగారిఇంటికి వెళ్లితీరాలని నవీన్ శపథం చేశాడు. ఈరాత్రే అన్న అను-మతి పొందాలి.

చాలాసేపు అయినతరువాత నవీన్ ల్యాంప్‌ఒకటి తెచ్చి అన్నగారి టేబిల్‌మీద పెట్టి, "నీ దీపం తగ్గిపోతున్నది అన్నయ్యా," అన్నాడు.

ఈరెండో దీపముతో పని సుళువు అవుతుందని మధుసూదన్‌కు తోచింది, కాని నవీన్‌కు ఆ వంకనైనా ఏమీ అనడానికి వీలులేకపోయింది, తిరిగి బయటికి వచ్చాడు.

మరి పదినిమిషాలు గడిచినతరువాత అన్నగారి గుడు-గుడులో తమాకు వేసి తెచ్చి కుర్చీకి ఎడమపక్కను ఉంచి గొట్టం నెమ్మదిగా టేబిల్‌మీద ఉంచాడు. గుడుగుడు అవసరముండె నని మధుసూదన్‌కు తత్‌క్షణం తట్టింది, పెన్‌సిల్ పక్కనుపెట్టి గుడుగుడు కొంచెంసేపు పీల్చాడు.

సందు దొరికిందనుకొని నవీన్ అన్నాడు—"పడుకోడానికి వెళ్లవా అన్నయ్యా, చాలారాత్రి అయిపోయింది, వదిన నీకోసం మేలుకొని ఉంటుంది కాబోలు!"

"మేలుకొని ఉంటుంది"—ఈమాట మధుసూదనుని లోపలికివెళ్లి హృదయానికి తలిగింది. ఓడ కెరటాలమీద

ఊగిపోతున్న వేళకు గట్టుమీదినుండి చిన్నపక్షిఒకటివచ్చి ఓడ కొయ్యమీద కూర్చున్నట్టు అయింది. అల్లకల్లోలంగా ఉన్న సముద్రము మధ్యనున్నవాడికి, శాంతితోనిండి వనచాయలుగల ద్వీపముయొక్క దృశ్యం కనబడ్డట్టు అయింది. కాని కుము మాట మనస్సులోకి రానీయవలసిన సమయము కాదు అది—ఓడ నడిపించుకువెళ్లాలి.

ఈ మాత్రమైనా మనోచాంచల్యం కలిగినందుకు మధుసూదన్‌కు భయంపుట్టింది, దానిని తత్‌క్షణం అణచుకొని నవీన్‌తో అన్నాడు, "వదినను పడుకోమనిచెప్పు, నేనీవాళ బయటే, పడుకుంటాను.

"పోనీ, ఇక్కడికి పిలిచేదా వదినను," అని అంటూ నవీన్ గుడుగుడు ఊదడం మొదలుపెట్టాడు.

"వద్దు, వద్దు," అని ఉద్రేకంతో మధుసూదన్ జబాబిచ్చాడు. అప్పటికీ ఊరుకోక, "నీతో ఏదో మాట్లాడదామనుకొంటున్నట్టున్నది వదిన, "అని నవీన్ అన్నాడు.

"నాకు ఇప్పుడు మాట్లాడడానికి వేళలేదు," అని అన్నాడు, గొంతుక బిగించి, మోటుగా.

'నీకు వేళ లేదు నిజమేగాని అన్నయ్యా, వదినకైనా ఆట్టే వ్యవధిలేదు."

"ఏమిటి కథ, జరిగినదేమిటి?"

"విప్రదాసుబాబు ఇవాళ కలకత్తాకు వచ్చారని తెలిసింది. వదిన రేపు ఉదయం వెళ్లి.—"

"ఉదయం వెళ్లాలనుకొంటున్నదా?"

"అట్టే సేపు ఉండదు. ఒక్కమారు వెళ్లి—"

"మధుసూదన్, చేతులు విసురుతూ కేకవేశాడు—"వెళ్లనీ అయితే, వెళ్లనీ—చాలు ఇక నీవు వెళ్లు."

అనుమతి దొరకగానే నవీన్ పరుగువేశాడు. బయట అతను కాలు పెట్టగానే మధుసూదన్ మళ్లీ, "నవీన్" అని కేకవేశాడు.

అన్న మళ్లీ వద్దంటాడేమో అని నవీన్‌కు భయంవేసింది. నవీన్ గదిలోకి వచ్చి నిలబడగానే మధుసూదన్ అతనితో అన్నాడు—"వాళ్ల అన్నయ్యగారిఇంటికి వెళ్లి పదిరోజులు ఉండి రమ్మని వదినతో చెప్పు, ఆ ఏర్పాటు నీవే చేయి."

అన్నయ్య ఈలా అనేసరికి తన ముఖంలో సంతోషం కనబడిపోతుందేమో అని నవీన్‌కు భయంవేసింది. తనకు అయిష్టంగా ఉన్నట్టు కనబడాలని తలగోకుకొంటూ "వదిన వెళ్లి పోతే ఇల్లు శూన్యమయిపోతుంది అన్నయ్యా," అని అన్నాడు.

మధుసూదన్ జబాబియ్యలేదు, గుడుగుడు పీలుస్తూ తిరిగి పనిలోపడ్డాడు. ఆమెఅంటే ఆకర్షణ ఇంకా పోలేదని నవీన్ గ్రహించాడు—పూర్తిగా విముఖత కలగలేదు.

నవీన్ ఆనందంతో బయటికి వెళ్లిపోయినాడు; మధుసూదన్ పనిచేసుకుంటూ కూర్చున్నాడు. కాని ఆఫీసుకార్య ప్రవాహంపక్కను మానసికప్రవాహం ఒకటి పరుగెత్తడం

మొదలుపెట్టింది. అది ఎప్పుడు ప్రారంభించిందో చాలా సేపటి వరకు అతనికే తెలియలేదు. పనిపూర్తికాకుండానే మధ్యనెప్పుడో నీలిపెన్‌సిల్ సెలవు తీసుకొన్నది. గుడుగుడు గోట్టం నోట్లోకి ఎక్కింది. పగటిపూట కుము మాట మరుపురాగానే, తనపైనుండే ఏకాధిపత్యాన్ని తిరిగి సంపాదించుకోని బహు ఆనందంతో మధుసూదన్ పనిచేసుకోగలిగాడు. కాని రాత్రి అవుతున్నకొలది, శత్రువు ఇంకా కోటనుండి వెళ్లిపోలేదేమో అనే భయం హెచ్చవుతున్నది. దొంగవేషం వేసుకొని సొరంగములో, కింద నెక్కడో, దాగి ఉన్నాడని సందేహము కలిగింది.

వర్షం ఆగిపోయింది. తోట మూలనున్న ఇరుగుడుచెట్టు మీదినుండి కృష్ణపక్షపుచంద్రుడు ఉదయించి వర్షపు తడితో నిండిఉన్న పృథ్విని పిరికిదానిగా చేస్తున్నాడు. చల్లనిగాలి వీస్తున్నది. పరుపుమీద పక్కను వెచ్చని కోమలస్పర్శకొరకు మధుసూదనుని మనస్సు చంచలించడం ఆరంభించింది. నీలి పెన్‌సిల్ తీసి గట్టిగా పట్టుకొని, టేబిల్‌దగ్గర ముఖంపెట్టి తిరిగి ఆఫీసు కాగితాలు చూడడం మొదలు పెట్టాడు. కాని లోపల నుంచి, "వదిన నీకోసం మేలుకొని ఉంటుంది కాబోలు," అనే మాటలు వినబడుతున్నవి. మాటలు క్షీణకంఠముతోనే వస్తున్నవి, కాని అతిస్పష్టముగా వినబడుతున్నవి.

ముఖ్యమైన పని ఒకటి ఆరాత్రే పూర్తిచేసేయాలని మధుసూదన్ నిశ్చయించుకొన్నాడు. అది రేపు ప్రొద్దున్న

చేసినా ఇబ్బంది ఉండదు, కాని అనుకొన్న ప్రకారం చేయడం అతని వర్తక - జీవితముయొక్క నీతి. ఏ కారణముచేతనైనా ఆలాగు చేయలేనప్పుడు తనను క్షమించుకో లేకపోయేవాడు. ఇంతకాలమూ ఆ ధర్మాన్ని బహు పట్టుదలతో పోషిస్తూ వచ్చాడు, దానివల్ల అనేకవిధాల లాభాలు పొందాడు. కాని ఇప్పుడు పగటి మధుసూదనునికీ రాత్రి మధుసూదనునికీ చాలా భేదం వచ్చింది—పగటి వ్యక్తిస్వరం రెండవ వ్యక్తి స్వరంతో కలియడం లేదు, ఒక్కవీణకే రెండు వర్గాల తీగలు ఎక్కించినట్టుగా వినబడుతున్నది. దృఢంగా నిశ్చయించుకొని డెస్కుమీదికి ముఖం వాల్చి కూర్చున్నాడు. కాని బాగా రాత్రి అయినతరువాత తాను చేసుకొన్న శపథములో ఏమూలనో ఉండే పగలువెంబడి, "వదిన నీకోసం మేలుకొని ఉంటుంది కాబోలు," అనే తలంపు, భ్రమరగుంజనములాగు అతని తలలో దూరుతుండెను.

లేచిపోయినాడు. కాగితాలూ పుస్తకాలూ, ఉన్నవి ఉన్నట్టే, ఉంచేసి దీపమైనా ఆరపకుండా పడకగదివేపు వెళ్లాడు. అంతఃపురములో అంగణముచుట్టూ ఉండే వరండామీదుగా మూడో అంతస్తుకు ఎక్కే మెట్లుఉన్నవి. శ్యామాసుందరి వరండా కటకటాలు పట్టుకొని నేలను కూర్చొనిఉన్నది. చంద్రుడు మధ్య ఆకాశానికి వచ్చిఉన్నాడు; చంద్రకాంతి ఆమెను ఆవరించి ఉన్నది; నవలలో అచ్చొత్తినబొమ్మవలె కనబడుతున్నది ఆమె— అనగా రోజూ అతని కంటికి కనబడుతుండే శ్యామవలె అప్పుడు

కనబడలేదు. రోజూ అతి సమీపమునుంచి, కోమలతా నాజూకూ లేని కఠోర ఆవరణలోనుంచి, కనబడేది. ఇవాళ ఆమె ఎక్కడో దూరమునుండి కనబడుతున్నట్టుగా కనబడ్డది. రాత్రివేళ మధుసూదన్ పడకగదిలోకి ఆ వరండామీదుగానే వెళ్లుతాడని ఆమె ఎరుగును. వెళ్లడము చూచినప్పుడల్లా ఆమెకు భరించలేని దుఃఖం కలుగుతుంటుంది, కనుకనే దాని ఆకర్షణ అంత బలమైనది. ఆబాధతో గుండె బద్దలుచేసుకొందామనే పిచ్చి కోరికతోనే ఆమె అక్కడ కూర్చోలేదు. ఆ కనిపెట్టుకొని కూర్చోవడములో కొంత ఆశకూడా ఉండెను. ఏక్షణానికి ఏమి అవుతుందో ఎవరూ చెప్పలేదు కదా! అసంభవం హఠాత్తుగా సంభవం కావచ్చుననే ఆశతో దారిలో కూర్చున్నది.

మధుసూదన్ ఆమెవంక ఒక్కమారు చూచి మెట్లు ఎక్కిపోయినాడు. శ్యామాసుందరి తన అదృష్టంమీద కోపగించి కిటకాలమీద తల గట్టిగా కొట్టుకున్నది.

మధుసూదన్ పడకగదిలోకి వచ్చి చూచేటప్పటికి కుము మేలుకొని ఉండలేదు. స్నానాల గదితలుపు కొంచెం తెరిచి ఉన్నది, సందులోనుంచి కొంచెం వెలుతురు వస్తున్నది. తిరిగి వెళ్లిపోదామని మధుసూదన్‌కు బుద్ధిపుట్టింది కాని వెళ్లలేక పోయినాడు. గ్యాస్‌లైట్ ముట్టించాడు, శాలువుకప్పుకొని కుము పరుపుమీద నిద్రపోతున్నది, దీపం ముట్టించినా తెలివి రాలేదు. ఆమె హాయిగా పడుకోవడముచూచి మధుసూదన్‌కు

కోపం వచ్చింది. కోపం పట్టుకోలేక దబ్బుమని మంచమిాద కూర్చుండ పడ్డాడు, మంచంశబ్దముచేస్తూ కదిలింది.

కుము ఉలికిపడి లేచి కూర్చున్నది, ఇవాళ మధుసూదన్ రాడని ఆమె అనుకొన్నది. ఆమె ముఖం చూచేసరికి మధుసూదన్‌కు బల్లెముతో పొడిచినట్టయింది, రక్తం తలలోకి ఎక్కింది, అతను కుముని అడిగాడు—"నన్ను చూచి అసహ్య పడకుండా ఉండలేవు, కదూ?"

ఆ ప్రశ్నకు ఏమి జబాబీయడానికీ తోచలేదు కుముకు. తటాలున అతను కనబడేసరికి ఆమె గుండె భయంతో గజ గజ వణికింది, చప్పున లేవడమువల్ల మనసు ఇంకా స్వాధీనం కాలేదు. ఏ మనోభావం ఆమెను సదా అణచి ఉంచుతున్నదో, దేనిబలము తానే పూర్తిగా ఎరగదో—అది హఠాత్తుగా బయలుపడిపోయింది.

మధుసూదన్ మాటలు నములుతూ, "మిా అన్నయ్య దగ్గరికి వెళ్లే అవసరం ఉన్నదా?" అని అడిగాడు.

తత్‌క్షణమే అతని కాళ్లమిాద పడవలెననుకొంటున్న కుము అతని ముఖం చూడగానే మనసు రాయిచేసుకొని, "లేదు," అన్నది.

"నీకు వెళ్లాలని లేదా?"

"వెళ్లాలని లేదు."

"నన్ను అడిగి రమ్మని నవీన్‌ను నీవు పంపలేదా?"

"లేదు, పంపలేదు."

"అన్నయ్యదగ్గిరికి వెళ్లాలని ఉన్నదని నవీన్‌తో నీవు చెప్పలేదూ?"

"అన్నయ్యను చూడడానికి వెళ్లనని అతనితో అన్నాను."

"ఏమి ? ఎందుకు వెళ్లవు?"

"ఎందుకో నేను చెప్పలేను."

"చెప్పలేవా ? మళ్లా నీ నూర్‌నగర్ వేషమా!"

"నూర్‌నగర్ అమ్మాయినే నేను!"

"వెళ్లు అయితే, అక్కడికే వెళ్లు! నీవు ఇక్కడ ఉండ దగినదానవు కావు. దయతలచాను, మర్యాద బోధపడదు నీకు. ఇక పశ్చాత్తాపపడుదువుగాని, వెళ్లు."

కుము కర్రకట్టిపోయి కూర్చున్నది, ఏమీ జబాబు చెప్పలేదు. కుము చెయ్యిపట్టుకొని జోరుగా ఒక ఊపు ఊపి, "క్షమాపణ కోరుకోవడమైనా తెలియదా?" అని అన్నాడు.

"ఎందుకు క్షమాపణ?"

"నా పరుపుమీద పడుకొన్నందుకు"

కుము తత్‌క్షణము లేచి పక్కగదిలోకి వెళ్లిపోయింది.

మధుసూదన్ బయటిగదిలోకి వెళ్లిపోతూ దారిలో శ్యామను చూచాడు—ఆ వరండామీదనే బోర్లపడుకొని ఉన్నది. మధుసూదన్, దగ్గిరిగికి వచ్చి వంగొని ఆమెను చెయ్యి

పట్టి ఎత్తె ప్రయత్నిస్తూ, "ఏమి చేస్తున్నావు శ్యామా ?" అని అడిగాడు. శ్యామ తత్‌క్షణమే లేచి మధుసూదనుని రెండు కాళ్లూ తనగుండెకు తగిలించి, "నన్ను చంపమని నాప్రార్థన," అని గద్గదకంఠముతో అన్నది.

మధుసూదన్ ఆమెను చేయిపట్టి లేవనెత్తి, "ఆహా పాపం చేతులు ఎంతచల్లగా అయిపోయినవో! పద నిన్ను పడుకోపెట్టి వస్తాను," అని అన్నాడు, అని తన శాలువనే ఆమెమీదకూడా కప్పి, కుడిచేతితో ఆమెను గట్టిగా పట్టుకొని, పడకగదిలో పడుకో పెట్టాడు. శ్యామ, "కొంచెము కూర్చోవా," అని నెమ్మదిగా అన్నది.

"పని ఉన్న" దన్నాడు మధుసూదన్.

ఎక్కడినుంచో దయ్యం వచ్చి మధుసూదనుని ఇంత సేపూ పట్టుకొని అతని పని ధ్వంసంచేసింది, కాని ఇక దాని ఆటలు సాగవు. కుము అతనిని బహునిర్లక్ష్యముగా చూచింది, అయితే నేమి, దానివలన అతనికి కలిగినకొరతను నింపగల భాండా గారము ఎక్కడఉన్నదో తెలుసుకోగలిగాడు. ప్రేమద్వారా మానవుడు తనమూల్యాన్ని పొందుతాడనే సంగతి అనుభవం ద్వారా తెలుసుకోవడము మధుసూదన్‌కు నేడు మిక్కిలి అవసరము. శ్యామాసుందరి యావజ్జీవమూ సర్వాంతః కరణముతో తనకొరకు వేచిఉన్నదని తెలుసుకోవడమువల్ల మధుసూదన్‌కు ఆనాటిరాత్రి తిరిగి పనిచేయగల శక్తి కలిగింది. కుము చేసిన అగౌరవంవల్ల మధుసూదనుని మనస్సుకు ముల్లు

గుచ్చుకున్నట్టు బాధకలుగుతుండెను. శ్యామచేసిన ఆదరము వల్ల ఆబాధ చాలాభాగము తగ్గింది.

అవతల, కుముకు దెబ్బతగిలినప్పటికీ కొంత ఓదార్పుకూడా కలిగింది. మధుసూదన్ ప్రేమ కనపరుస్తున్నప్పుడల్లా కుము తనమనస్సుతో పోట్లాడవలసివచ్చేది—అతను కనపరిచే ప్రేమయొక్క వెలను ప్రేమమూలముగానే చెల్లించడము తనకర్తవ్యము అని నమ్మి ఆమె బాధపడేది. ఆ పోరాటములో తనకు చివరకు జయము కలుగుతుందని ఆమెకు ఆశ లేకపోయింది. పరాజయము ఒప్పుకోడానికికూడా ఇష్టములేకుండా ఉండెను. ఈసంగతి అణచిపెట్టి ఉంచవలేనని మనస్సు ఇన్నాళ్లబట్టి ఎంతో ప్రయత్నించేసింది, కాని ప్రయత్నం అంతా వృథా అని నిన్నరాత్రి స్పష్టం అయింది. కుము జాగ్రతగా లేని సమయంలో రాబట్టి మధుసూదన్ స్పష్టముగా చూడగలిగాడు తన స్వభావానికీ కుము స్వభావానికీ సంపూర్ణ పరస్పరవిరోధం ఉన్నదిని. ఇది విస్పష్టముగా తెలిసిపోవడమే మంచిది అయింది, ఇటుపైని, ఎట్టి కపటమూ లేకుండా, పరస్పరకర్తవ్యాలు పాలించుకోడానికి వాళ్లిద్దరికీసాధ్యమవుతుంది. మధుసూదన్‌కు కుముయెడల వాంఛ పోలేదు—అందువల్లనే చిక్కువచ్చిపడ్డది. ఆమెను విడిచిపెట్ట దలస్తున్నాడు. కాని దానివల్ల మనస్సుకు సుఖం కలగలేదు. మధుసూదనుని పరుపు మీద పడుకోడానికి ఆమెకధికారం లేదు, ఆమాట నిజమే. పడుకుంటే అతనిని కేవలం మోసపుచ్చినట్టే కదా. ఇంట్లో ఆమె ఉండడం పరిహాసం, మోసం!

ఆరాత్రి అంతా ఈ ఒక్క ప్రశ్న కుముదు మనస్సును వదలకుండా ఉన్నది. మధుసూదన్‌కు తానంటే ఎందుకంత ఆకర్షణ. ఆయన మాటమాటకీ "నూర్ నగర్ వేషం" అని ఆమెను ఎత్తిపొడుస్తుండేవాడు—దాని అర్థమేమిటంటే, 'ఆమెకూ తమకూ ఏమీ అత్తదు' అని. వాళ్ల స్వభావాలు వేరు, జాతి వేరు—అయినా ప్రేమ కనపరుస్తుంటాడెందుచేత? ఆ ప్రేమ నిజమైన ప్రేమ కాగలదా ఎన్నడైనా? మధుసూదన్ ఇప్పటి వట్టుకు ఏమి నమ్ముతున్నా, తాను ఎన్నటికీ ఆయన మనస్సును నింపి ఉంచలేదని కుముదు నమ్మకం, ఈసంగతి మధుసూదన్ ఎంత త్వరగా గ్రహిస్తే అందరికీ అంత మంచిది.

నిన్నరాత్రి అన్నగారిసమ్మతినిపొంది నవీన్ బహు ఆనందముతో పడుకోడానికి వెళ్లాడు, కాని ఇవాళ లేచేసరికి ఆనందములో రవంతైనా మిగిలిఉండలేదు. రాత్రి మధుసూదన్ పని ముగించుకొనేసరికి రెండుఘంటలనర అయింది, అప్పుడు నవీన్‌ను రమ్మని కబురు పంపాడు. నవీన్ రాగానే కుముదును మర్నాడు ఉదయమే విప్రదాసుగారి ఇంటికి పంపించమనిన్నీ, తాను తిరిగి కబురు పంపేవరకు ఆమె అక్కడనుండి రానక్కరలేదనిన్నీ ఆజ్ఞ ఇచ్చాడు—ఇది ప్రవాసదండన అని నవీన్ గ్రహించాడు.

అంగణముచుట్టూ ఉన్న వరండామీద నిన్నరాత్రి శ్యామను చూచినచోటికి ఎదురుగా నవీన్ పడకగది ఉన్నది. ఆ సమయములో భార్యాభర్తలు కుముదుమాటే మాట్లాడుకొంటున్నారు, బయట మాటలు వినబడి మోతీతల్లి తలుపు తీసే

సరికి శ్యామామధుసూదనుల సమ్మేళనదృశ్యము ఆమెకంట పడ్డది. చూడగానే మోతీతల్లి తెలుసుకొన్నది, కుము అదృష్ట సూత్రములో మరిఒకచిక్కు ఏర్పడ్డదని.

"ఇటువంటి ఆపదసమయములో అక్కయ్య వెళ్లిపోవ డము మంచిదేనా?" అని మోతీతల్లి భర్తతో అన్నది.

"ఇన్నాళ్లూ వదిన లేదు, కథ ఇంతదూరమువరకు నడవ లేదు. వదిన రాబట్టే ఇటువంటిసంఘటన సాధ్యమయింది."

"ఏమిటి నీ వనేది?"

"నిద్రిస్తున్నక్షుధను లేపింది వదినవచ్చి, ఆకలితీరడానికి అన్నం ఇవ్వలేకుండా ఉన్నది, కనుకనే ఇంత ఘోరమైన పని చేయడానికి సిద్ధపడుతున్నాడు. ఇట్లాంటప్పుడు ఆమె దూరంగా ఉండడమే ఉత్తమమని నా అభిప్రాయం—దానివల్ల మరే లాభమూ లేకపోయినా ఆమె సురక్షితంగా ఉంటుంది," అని నవీన్ అన్నాడు.

"అయితే ఇది ఇట్లాగు జరుగుతుండవలసినదేనా?"

"అగ్గి ఆర్పే ఉపాయము లేనప్పుడు అది తనను దహించుకొని బూడిదఅయిపోయేవరకు చూస్తూ నిలుచో వలసిందే."

మర్నాడు ఉదయమంతా హాబ్లూ కుము వెనుకనే తిరు గుతున్నాడు. మాష్టరుగారు చదువుచెప్పడానికి రమ్మని కబురు పంపారు. కుము వెళ్లమని చెపితే హాబ్లూ వెళ్లి ఉండేవాడు, కాని వెళ్లక పిల్లవాడు కుముముఖం చూస్తూ నిలుచున్నాడు.

"హాస్పిటలుకి ఇవాళ సెలవు," అని కుము నౌఖరుచేత మాష్టరు గారికి కబురు పంపింది.

## ౪౬

కుము బయలుదేరు తున్నప్పుడు నాలుగు రోజులు అమ్మగారి ఇంటికి వెళ్లి తిరిగి వస్తుందన్నట్టు కనబడలేదు. కుమును ఉంచుకొనే భాగ్యం ఈ ఇంటికి లేదని అందరికీ తోచింది. ఇన్నాళ్లబట్టి పంజరంలో కట్టిపెట్టి ఉంచినపక్షి, ఇవాళ, పంజరముతలుపు కొంచెము తెరవగానే, ఎగిరిపోతున్నది. ఈ పంజరములోకి మరి రాదనిపించింది.

నవీన్—"అట్టే రోజులు ఉండిపోకు అని నేను చెప్ప గలిగితే బ్రతికిపోయి ఉందును వదినా, కాని నోటినుండి ఆ మాట రాకుండా ఉన్నది. ఎవరు నిన్ను ఆదరిస్తారో అక్కడే ఉండు వదినా. ఎప్పుడు ఎటువంటి అవసరం వచ్చినా నవీన్‌ను జ్ఞాపకం ఉంచుకో."

మోతీతల్లి కుండెడు ఆవకాయ పల్లకీలో పెట్టింది. అంతగా ఏమీ అనలేదు, కాని లోలోపల మాత్రం ఆమెకు అసంతుష్టిగా ఉండెను. మధుసూదన్ కుమును బహిరంగంగా అవమానపరుస్తున్నంతసేపు మోతీతల్లి కుము పక్షమే. బయటికి కనబడే ఆడ్లు కఠినంగా ఉన్నంతకాలము కుము అవస్థ చూచి చాలా బాధ పడేది. కాని కొన్ని బాధలు సూక్ష్మమైనవి, బయటికి కనబడవు, మన హృదయాలలోపలనే ఉండి

భరించ శక్యంకాని వ్యథను కలిగిస్తుంటివి, వాటిని విడదీసి లక్ష ణాలను నిర్ణయించలేము—వీటివల్ల కలిగే బాధ అన్నిటికంటె తీవ్రమైనది—ఈసంగతి మోతీతల్లి బోధపరచుకోలేదు. భర్తకు ఏక్షణం దయకలుగుతుందో ఆక్షణమే తాను అదృష్టవంతు రాలని భార్య అనుకుంటూ ఉండడం స్వాభావికమని ఆమె నమ్మకం. ఇంకొకవిధంగా భావించడం ఇంతది అంతగా చేయడం అన్నమాట. వదినఅంటే నవీన్ ఇప్పటికీ ఇంత మెత్తదనం కనపరచడం చూచి మోతీతల్లికి కోపంకూడా వస్తుండెను. కుముకుగల అయిష్టత స్వభావసిద్ధమైనది గాని, నటన కాదనిన్నీ అది స్వాభిమాన లక్షణముకాదనిన్నీ, కుము తన మనస్సుతో తాను ఘోరయుద్ధముచేసికూడా ఆ అయిష్టతను జయించలేక పోయిందనిన్నీ, ఆడవాళ్లు ఎవరూ సాధారణంగా బోధపరుచు కోలేరు. ఆచారానుసారం పాదాలను నొక్కిఉంచి వికృతము చేసుకోవడానికి చీనాస్త్రీలు అభ్యంతరపెట్టరు. బాధపడు తున్నా నోరుమూసుకొని సహించి ఊరుకోవడము ఆత్మగౌరవ రాహిత్యం అనుకొనే స్త్రీలు పైదేశాలలో ఉన్నారని వింటే, వాళ్లు తెలివిమాలినవాళ్లని అనుకొని చీనాస్త్రీలు నవ్వుతారు. నిజంగా ఏది స్వాభావికమో దానినే వాళ్లు అస్వాభావికము అంటారు. మోతీతల్లి ఒకానొకప్పుడు కుముమాట తలచు కొంటూ బహుదుఃఖించేది, కనుకనే కాబోలు ఇప్పుడు ఆమె మనస్సు ఇంత కఠినము అవడము మొదలుపెట్టింది. ప్రతికూల ముగా ఉండే అదృష్టదేవత వరదానం చేదామని వచ్చినప్పుడు

ఆమె పాదాలు కళ్లనద్దుకొని వరం అందుకోని స్త్రీలయెడల దయచూపించడం మోతీతల్లికి సాధ్యంకాదు—అటువంటి స్త్రీలను క్షమించకూడదని కూడా ఆమె మతము.

# ౪౭

పల్లకీ అన్నయ్యబసఇంటి ఎదుటకు రాగానే కుము తలుపు కొంచెము తెరిచి మేడవైపు చూచింది. రోజూ ఈ వేళప్పుడు రోడ్డువైపువరండామీద కూర్చొని అన్నయ్య వార్తాపత్రిక చదివేవాడు. ఇవాళ అక్కడ ఎవ్వరూలేరు. కుము ఇవాళ వస్తుందని అతని కబురు రాలేదు. మహారాజా వారి డవాలీబంట్రోతు పల్లకీతో రావడం చూచి చిన్న అమ్మాయిగారు వచ్చారని గ్రహించి ఇంటి దర్వాన్ తడబడు తున్నాడు. బయటిమేడ దాటి అంతఃపురములోకి పల్లకీ వెళ్లబోతున్నది. కుము పల్లకీని ఆపి, దిగి, తొందరతొందరగా బయటిఇంటి మేడమెట్లు ఎక్కింది. తనను ఇంకెవరూ చూడక ముందే అన్నయ్యను చూదామని కుము కోరిక. బయట కులాసాగా కూర్చుండే గదిలో అన్నయ్య ఉండడానికి ఏర్పాటు చేసి ఉంటారని ఊహించింది. అక్కడి కిటికీలోనుంచి తురాయి చెట్టు, కాంచనవృక్షము, రావిచెట్టు మొదలైనవన్నీ కనబడు తుంటవి. చెట్లకొమ్మలమధ్యనుండీ ఆకులమధ్యనుండీ వస్తున్న సూర్యకిరణాలు ఉదయము మొట్టమొదట ఈ గదిలోనే పడతవి. అన్నిటికంటె విప్రదాసుకు ఈ గదే ఇష్టము.

కుము మెట్ల దగ్గిరికి రాగానే అందరికంటె ముందు కుక్క, టామ్, పరుగెత్తి వచ్చి ఆమెమీదికి ఎగిరి, తోక ఆడిస్తూ అరిచి సందడిచేసింది. గంతులువేస్తూ అరుచుకొని టామ్ కుము వెనకనే వస్తున్నది. విప్రదాస్ మడతకుర్చీమీద వెనకకు చేరబడి, కాళ్లమీద శాలువుకప్పుకొని కూర్చొని ఉన్నాడు, కుడిచెయ్యి మంచముమీద పడిఉన్నది, చేతిలో పుస్తకం ఒకటి ఉన్నది. అలసి అప్పుడే చదువు ఆపినట్టు కనబడుతున్నది. పక్క టేబిలుమీద టీ-కప్పూ, సగముతినేసిన రొట్టెతో సాసర్ ఒకటీ ఉన్నవి. తలవైపు గోడనున్న షెల్ఫులో పుస్తకాలు కలగా పులగంగా పడిఉన్నవి. రాత్రి వెలిగించిన ల్యాంపుచిమ్నీ పొగపట్టి ఉన్నది, అది ఇంకా ఆ గదిమూలనే ఉన్నది.

కుము విప్రదాసుముఖం చూచి ఉలికిపడ్డది. అంత పాలిపోయిన ముఖమూ చప్పిదవడలూ కుము ఎన్నడూ చూడ లేదు. తా నెరిగిన విప్రదాసుకూ ఈ విప్రదాసుకూ ఎన్నో సంవత్సరాల భేదము. అన్న పాదాలకు తల తగిలించి కుము ఏడవడం ప్రారంభించింది.

"ఇదిగో వచ్చావూ, రా అమ్మా, రా!" అంటూ విప్రదాస్ ఆమెను దగ్గరికిలాక్కొని పక్కను కూర్చోపెట్టుకొన్నాడు. ఉత్తరంలో అతను కుమును రావద్దని ఒకవిధంగా వ్రాశాడు, కాని రావచ్చునని ఆశమాత్రం వదలలేదు. కుము రావడంచూచి ఆమెను ఎవరూ అడ్డుపెట్టలేదని అతను అనుకొన్నాడు, చెల్లి హాయిగానే కాపురము చేసుకుపోతుండవలెనని దానిని పట్టి

నిర్ణయించాడు. విప్రదాసే కోరి కుమును రమ్మని తీసుకురావలసింది, పల్లకీని మనుష్యులనూ పుట్టింటివాళ్లే పంపించడం ఆచారము. విప్రదాసు అట్లా చేయకపోయినా కుము తనంతటతానే వచ్చింది. ఆమెకు అంతస్వాధీనత ఉంటుందని అతను ఊహించుకో లేకపోయినాడు.

అన్నయ్య చింపిరిజుట్టును చేతితో దువ్వుతూ, "ఏమి అన్నయ్యా ఈలాగు అయిపోయినావు!" అని కుము అడిగింది.

"ఏమిజరిగిందని బాగుండడానికి? కాని నీవేమిటి కుమూ ఈలాగున్నావు. ఇంత తెల్లపారిపోయినావు?"

ఇంతలో, కుము వచ్చిందని విని క్షేమ - అత్త వచ్చింది గదిలోకి.

నౌకర్లూ దాసీలూ—అంతా వచ్చి ద్వారముదగ్గిర నిలుచున్నారు. కుము అత్తకు ప్రణామము చేసింది, అత్త కుమును గట్టిగా కౌగలించుకొని, నుదురు ముద్దుపెట్టుకొన్నది. దాసీలూ నౌకర్లూ కుముకు ప్రణామంచేశారు; కుము అందరి క్షేమ సమాచారాలూ అడిగింది. చివరకు, "అన్నయ్య ఇంతజబ్బుగా కనబడుతున్నాడేమి అత్తా?" అని క్షేమను అడిగింది.

"కోరి జబ్బు పెంచుకుంటున్నాడంటావా? నీ శుశ్రూష లేనిదే అన్నయ్య జబ్బుతగ్గదు తల్లీ, ఎన్నాళ్లపట్టి నీసేవకు అలవాటు పడిఉన్నాడు!"

"కుముదు ఫలహారం చేయమనవు అత్తా?" అని విప్రదాస్ క్షేమతో అన్నాడు.

"చేయదూ, ఆమాటా చెప్పాలీ? పల్లకీవాళ్లనూ నౌకర్లనూ భోజనానికి కూర్చోపెట్టి వచ్చాను, వాళ్లని చూచి వస్తాను, అంతలో మీరు కబుర్లు చెప్పుకుంటూ ఉండండి."

విప్రదాస్ అత్తను దగ్గిరికి రమ్మని సంజ్ఞచేసి, ఆమె చెవిలో మెల్లిగా ఏదో చెప్పాడు. అత్తవారిఇంటినుండి కుముతో వచ్చిన మనుష్యులను ఏవిధంగా మర్యాదచేసి పంపించవలెనో దానినిగురించి అన్నయ్య క్షేమఅత్తతో చెపుతున్నాడని కుము పోల్చుకున్నది. ఈ సలహాలో కుము ఇక అన్నయ్య పక్షంగా లెక్కకాదు, ఆమెను అడగవలసినపని లేదని అన్నయ్య అభిప్రాయం. దీనివల్ల కుము మనస్సుకు బాధకలిగింది, పగతీర్చ నిశ్చయించుకొని చిరకాలమునుండి అన్నఇంట్లో తనకు ఉండే అధికారం తిరిగి చలాయించడం మొదలుపెట్టింది.

మొట్టమొదట అన్నయ్య వంటవాడిదగ్గిరికి వెళ్లి ఏదో చేయమని వాడిచెవిలో ఆజ్ఞఇచ్చింది. తరువాత తనకు నచ్చినట్లు ఇల్లు సరదడమూ చక్కపెట్టడమూ ప్రారంభించింది. కప్పూ సాసరూ, ఖాళీ సోడాబుడ్డీ, అడుగువిరిగిన కుర్చీ, మురికి తువాళ్లు నాలుగూ, బనియనూ, మొదలైనవన్నీ వరండా మీదినుండి తీసేసింది. బీరువాలో పుస్తకాలు చక్కగా సరిదింది, అన్నకు అందినట్టుగా చిన్న టీపాయ్ ఒకటిపెట్టి

దానిమీాద ఆతను చదువుతూఉండే పుస్తకమూ, సిరాబుడ్డీ కలమూ, బ్లాటింగ్ ప్యాడూ, గాజు మంచినీళ్ల జాడీ, గ్లాసూ, చిన్న అద్దమూ, దువ్వెనా, బ్రషూ ఉంచింది.

ఇంతలో నౌకరు, గోకుల్, పెద్దఇత్తడి గిన్నెతో వేడి నీళ్లూ శుభ్రమైన తువాలూ తెచ్చి స్టూల్‌మీాద దగ్గరగా ఉంచాడు. అన్నయ్యకు అడగనైనా అడగకుండా ఆతని ముఖమూ చేతులూ వేడినీళ్లతో తుడవడం మొదలుపెట్టింది. తల దువ్వింది. విప్రదాసు ఏమీా అనకుండా పసి పిల్లవాడి లాగు కూర్చున్నాడు. అన్నయ్యకు ఎప్పుడు ఏ మందు ఈయ వలెనో, అన్నయ్య పథ్యం ఏమిటో—మొదలైన సంగతులన్నీ కనుక్కొని ప్రపంచములో తనకు ఇంకే పూచీ లేదన్నట్లుగా అన్న సేవలో పడ్డది.

దీని అర్థంఏమని ఆలోచిస్తూ కూర్చున్నాడు విప్రదాసు. కుము ధోరణిచూస్తే అత్తవారింట్లో కుము ఏలాగు కాలం గడుపుతున్నదో కనుక్కుందామని విప్రదాసుకు చాలా కుతూహలంగా ఉండెను, అయినా అడగడానికి సంకోచించాడు; కుము తనంతటతానే చెపుతుందనే ఆశతో ఊరుకున్నాడు. కాని ఆమె ఏమీా చెప్పకపోవడం చూచి, తానే చివరకు, "ఇవాళ నీవు ఎప్పుడు తిరిగి వెళ్లిపోవాలి?" అని మెల్లిగా అడిగాడు.

"ఇవాళ వెళ్లనక్కరలేదు," అని కుము జవాబుచెప్పింది.

"మీాఅత్తవారు ఏమీా అనరా?" అని ఆశ్చర్యపడుతూ విప్రదాస్ అడిగాడు.

"అనరు, నాభర్త ఒప్పుకున్నారు."

కుము గదిమూల టేబిల్ మీద దుప్పటి ఒకటి వేసి దాని మీద మందుసీసాలూ మొదలైనవి పేర్చడం మొదలుపెట్టింది. కొంచెం ఊరుకొని, "అయితే రేపు వెళ్లాలా?" అని విప్రదాస్ అడిగాడు.

"లేదు, కొన్నాళ్లు నీదగ్గిర ఉంటాను."

టామ్ మంచముకింద నిద్రప్రయత్నములో ఉండెను, కుము దానిని ముద్దుచేసి దాని ప్రీతిని రేపింది. టామ్ లేచివచ్చి ముందుకాళ్లు రెంటినీ కుము ఒడిలో పెట్టి ఉచ్చస్వరముతో కళభాషణం ప్రారంభించింది. కుక్క గందరగోళం చేస్తూ ఉంటే ఆ శబ్దమువెనుక తనను దాచుకొందామని కుము కుక్కను రేపింది అని విప్రదాసు పోల్చుకున్నాడు.

కొంతసేపయిన తరువాత కుక్కతో ఆట చాలించి, కుము అన్నయ్యను అడిగింది, "బార్లీ తాగేవేళ అయింది అన్నయ్యా, తెచ్చేదా?"

"లేదు వేళకాలేదు," అని అంటూ చేతితో సంజ్ఞ చేసి కుమును తనపక్కను కూర్చోపెట్టుకొన్నాడు, తనచేతిలో చెల్లెలిచెయ్యి ఉంచుకొని, నెమ్మదిగా అడిగాడు—"నాదగ్గిర దాచకు చెల్లీ, ఏలాగుఉన్నది మీఇద్దరికీ?"

కుము తత్‌క్షణం ఏమి చెప్పలేక పోయింది, తలవాల్చుకొని ముఖం ఎర్రచేసుకొన్నది; కొంచెం అలాగు కూర్చొని,

చిన్నప్పటిలాగు అన్న గుండెమీద ముఖంపెట్టి ఏడ్చేసింది, కొంతసేపయిన తరువాత, "నేను అనుకున్నదంతా పొరపాటే అన్నయ్యా—నే నేమీ ఊహించుకోలేక పోయినాను," అని అన్నది ఏడుస్తూ.

విప్రదాసు నెమ్మదిగా చెల్లెలి తల నిమురుతూ, "నీకు సరి అయిన శిక్షణ ఇవ్వలేక పోయినాను," అని అన్నాడు. "అమ్మ ఉంటే అత్తవారింటికివెళ్లేముందు నీకుఅంతా నేర్పిఉండును."

"మిమ్మల్ని తప్ప మరిఎవరినీ నేనెరగను. ఈ ఇంటికీ మిగతా ఇళ్లకూ ఇంత వ్యత్యాసం ఉంటుందని నేను ఊహించ లేకపోయినాను. నేను ఊహించగలిగేసంసారాలన్నీ ఈఇంటి అచ్చులో తయారైనవే, కనుక నాకు ఎటువంటి భయమూ లేక పోయింది. నాన్న అమ్మను అనేకసార్లు కష్టపెట్టాడు—నేనెరుగుదును. కాని నాన్న చేసినది అంతా బయటి అల్లరి, మన స్సును బాధించేది కాదు. నేనిప్పుడు పొందుతున్న అవమానం లోనిది, భరించ శక్యంకానిది."

విప్రదాసు ఏమీ అనలేదు, పెద్దనిట్టూర్పు విడిచాడు. మధుసూదన్ తమవంటివాడు కాడనీ అతనిది వేరుప్రకృతి అనీ వివాహ విధానం ప్రారంభించిన నాడే విప్రదాసు పోల్చు కొన్నాడు. దానివల్ల కలుగుతున్న మనోవేదనే అతనిజబ్బు తగ్గక పోవడానికి కారణం. ఈ దిగ్గజస్థూలహస్తంనుండి కుముదు విడిపించే ఉపాయంలేదు. అన్నిటికంటె గొప్పచిక్కు ఏమిటి

అంటే తాను పుచ్చుకున్న రుణానికి హామీగా తన ఆస్తిఅంతా అతని చేతిలో ఉన్నది. దీనివల్ల కుముకుకూడా బాధకలుగు తున్నది. జబ్బు-మంచముమీద పడుకొని ఇన్నాళ్లూ విప్రదాసు ఈ ఋణబంధంనుండి విడిపించుకోవడం ఏలాగు అని ఆలో చిస్తున్నాడు. కుము అత్తవారితో మర్యాదగా వ్యవహారం జర గదేమోఅని జడిసి, నూర్ నగర్ లోనే ఉండిపోవాలని నిశ్చ యించాడు. ప్రాణతుల్యంగా చూచుకొంటున్న చెల్లెలిపై అన్నకుగల అధికారానికి అడ్డువచ్చి, ఆప్రేమను మధుసూదన్ అవమానపరుస్తాడేమో అని భయపడి, విప్రదాసు నూరునగర్ విడిచిపెట్టకూడదని నిశ్చయించుకొన్నాడు. కాని ఇతరు లెవరి దగ్గరనైనా అప్పుకు ప్రయత్నం చేదామని కోరిక కలగడముచేత కలకత్తారాక తీరింది కాదు. అది బహుకష్టసాధ్యమైన పని అనే తలంపు గొప్పబరువయి విప్రదాసు గుండెమీద కూర్చొని ఉన్నది.

కొంతసేపయిన తరువాత కుము వెనుకకు ముఖం తిప్పి ఈలాగు అడిగింది అన్నను—"సరే అన్నయ్యా, నాకు ఒక మాట చెప్పు—భర్తఅంటే నాకు మనస్సులో ఎటువంటి ప్రసన్నతా పుట్టకుండా ఉన్నది, అది పాపమేనా?"

"పాపపుణ్యాలవిషయములో శాస్త్రాలకూ నా మతానికి పొందదు."

కుము ఇంగ్లీషు బొమ్మల మాసపత్రికపేజీలు పరధ్యా నంగా తిరగవేస్తున్నది. విప్రదాస్ ఈలాగు అన్నాడు—"ఇది

మంచిఅనీ, ఇది చెడ్డఅనీ సాధరణంగా అంటూఉంటాము. దానిని బట్టి కొన్ని నియమాలు మంచివనీ కొన్ని చెడ్డవనీ నమ్ముతూ వస్తున్నాము. కాని వేరువేరు అవస్థలనుబట్టీ, జీవితములో జరిగిన ఘటనలనుబట్టీ మనుష్యులలో గొప్పభేదాలు కలుగుతుండవచ్చు. మన మంచిచెడ్డలజ్ఞానము సంపూర్ణపరిపక్వత గలది అని అనుకొన్నట్లైతే నియమవిరుద్ధమైన నడవడిని పొరపాటువల్ల ధర్మవిరుద్ధమైన ప్రవర్తనఅని నిర్ణయించేస్తాము."

కుము కిందికి, మానపత్రికవైపు, తల దించి, "మీరాబాయిని గురించి కొందరు అంటూ ఉన్నట్టుగా," అని అన్నది.

కర్తవ్యానికీ అ-కర్తవ్యానికీ మనస్సులో జరుగుతున్న పోరాటం తీవ్రమయినప్పుడల్లా కుముకు మీరాబాయి మాట జ్ఞప్తికి వస్తుంటుంది, మీరాబాయియొక్క ఆదర్శం తనకు ఎవరైనా చక్కగా బోధపరచవలెనని కుము ఆశిస్తుండేది.

కుముకు తన సంకోచాన్ని జయించుకొని ఇట్లాగుఅన్నది, "మీరాబాయికి తన యథార్థ భర్త హృదయములో దొరికాడు గనుక ఆమె సాంఘికభర్తను విడిచిపెట్టిపోగలిగింది, కాని సంసారం విడిచిపెట్టిపోగలిగినంత గొప్ప అధికారం నాకు ఉన్నదీ?"

"నీ సర్వాంతఃకరణతో నీ దేవతను నీవూ పొందావు కుము," అని విప్రదాసు అన్నాడు.

"నేనూ ఆలాగే అనుకొన్నాను ఒక అప్పుడు. కాని చిక్కులు అధికము కాగానే ప్రాణాలు ఎండిపోతుంటవి, ఎంత ప్రయత్నంచేసినా 'దేవుడు సత్యము' అనే నమ్మకం పలచపడి పోతుంటుంది — అన్నిటికంటే ఇదే ఎక్కువగా దుఃఖం కలిగిస్తుంటుంది."

"మన మనస్సులలో పోటూపాటూ ఆటలాడుతుంటవి. రాత్రివస్తుంటుంది, ఆలాగనిచెప్పి పగలు మరిరాదని అనుకో కూడదు. ఇంతవరకు నీకు లభించినది నీ జీవనంతో కలిసి ఏకమయిపోయింది."

"అదే నేను కోరేది. భగవంతుని నేను విడిచిపెట్ట కుందును గాక అని ఆశీర్వదించు అన్నయ్యా — కాని నా సంగతే మాట్లాడుతూ నిన్ను చీకాకు పెడుతుఉన్నాను అన్నయ్యా."

"నీ చిన్నప్పటినుండీ నీ సంగతి ఆలోచిస్తూ ఉండడము నాకు అలవాటు, ఇప్పుడు నీ సంగతి తెలియకుండాఉన్నా, నీ గురించి ఆలోచించవద్దన్నా నాకు కష్టంగా ఉంటుంది, అంతా శూన్యం అని తోస్తుంది. ఆ శూన్యతలో చేతులతో తడుము కొని అలసిపోతుంటాను."

"నాగురించి నీవు ఆలోచిస్తూఉండకు అన్నయ్యా, నన్ను కాపాడేవాడు నాలోపలనే ఉన్నాడు, నాకు ఎటువంటి ఆపదారాదు," అని కుము అన్నయ్య కాళ్లు నొక్కుతూ అన్నది.

సరే పోనీ, ఆమాటలన్నీ ఎందుకు. నీకు పాటలు నేర్పే వాడను జ్ఞాపకం ఉన్నదా కుమూ, అదేమాదిరి ఇప్పుడుకూడా నేర్పాలని ఉన్నది.”

“అప్పుడు నేర్పావు అది నా అదృష్టమే అన్నయ్యా, ఇప్పుడు నా ప్రాణాలను కాపాడుతున్నది ఆ సంగీతమే. కాని ఇవాళ నీవు పాడకూడదు, ఒంట్లో కొంచెము బలం చేరనీ నేర్పుదువుగాని, నేనే పాట వినిపిస్తాను ఇవాళ.”

అన్న తలవైపు కూర్చొని కుము పాడింది—

“పియ ఘర ఆయె, సోయె, ప్యారీ పియ ప్యార్ రే!
మీరాకె ప్రభు గిరిధర నాగర,
చరణకమల బలిహారీ రె!”

విప్రదాసు కళ్లు మూసుకొని వింటున్నాడు. పాడుతూ ఉండగానే కుము మనోనేత్రాలకు ఒక దృశ్యం కనబడ్డది. ఆకాశం అంతా కాంతిమయం అయిపోయింది. ప్రియతముడు ఇంట్లోకి వచ్చాడు, అతని చరణకమలాల స్పర్శ ఆమె హృదయానికి లభించింది. అంతర్లోకము యథార్థలోకం అని తోచింది, అది ప్రియతముని కలుసుకోగలలోకం, తాను పాడుతున్న గీతికే కుమును అక్కడికి తీసుకొని పోయింది. “చరణకమల బలిహారీ రె”—ఆ చరణకమలాలే ఆమె సమస్తజీవితాన్ని నింపివేసినవి, దుఃఖానికిగాని అవమానానికిగాని కొంచెమైన తావు మిగలలేదు,—“పియ ఘర ఆయే—”అంతకంటె కుముకు

కావలసినదేమున్నది! ఈపాట ఎన్నటికీ ముగియకుండా ఉంటే కుము బ్రతికి పోయిందన్నమాటే.

గోకుల్ రొట్టె టోస్టూ, ఒక కప్పు బార్లీ, టీపాయ్ మీాద ఉంచి వెళ్లాడు. కుము పాట ఆపి అన్నతో ఇట్లా అన్నది—"కొన్నాళ్లబట్టి గురువు ఎవరైనా దొరికితే బాగుండు నని నాలో నేను అనుకుంటున్నాను అన్నయ్యా, కాని నీవు నాకు గాన-మంత్రం నేర్పావు, అయినా గురువు అవసరం ఉంటుంది అంటావా అన్నయ్యా ?"

"నాకు సిగ్గు తెప్పించకు కుమూ, నావంటి గురువులు ఊరూరికీ దొరుకుతారు, వీధివీధికీ దొరుకుతారు; వాళ్లు ఉప దేశించిన మంత్రానికి అర్థం వాళ్లకే తెలియదు. ఎన్నాళ్లు ఇక్కడ ఉండగలవు సరిగా చెప్పు కుమూ?"

"మళ్లీ కబురు వచ్చేవరకు."

"నీవే ఇక్కడికి వస్తానని వాళ్లతో అన్నావా ?"

"లేదు, అనలేదు."

"దాని అర్థం ఏమిటి చెల్లీ?"

"అర్థం ఏమిటి అని ఆలోచించి లాభంలేదు అన్నయ్యా, ప్రయత్నంచేసినా తెలుసుకోలేను. నీదగ్గిరికి రాగలిగాను, నాకు అంతే చాలును. ఎన్నాళ్లు ఉండగలిగితే అన్నాళ్లు ఉంటాను, అదే మంచిది—నీవు ఏమీా తినడంలేదు, ఆ రొట్టె తిను అన్నయ్యా."

నౌకరువచ్చి ముఖర్జీ బాబుగారు వచ్చారని చెప్పాడు- విప్రదాసు కొంచెం తడబడి, "తీసుకురా," అని అన్నాడు.

౪౧

కాలూ-దా గదిలోకి రాగానే కుము అతనికి ప్రణామం చేసింది.

"వచ్చావా చిన్నపిల్లా! అన్నయ్య ఒంట్లో ఇక తెరిపి కావచ్చును!" అని కాలూ అన్నాడు.

కుము కళ్లు తడిచేసుకొన్నది. ఏడుపు ఆపుకొని, "బార్లిలో నిమ్మకాయరసం పిండేదా అన్నయ్యా?" అని అడిగింది.

పిండకపోయినా పరవాలేదన్నట్టుగా నిరుత్సాహంగా తల ఊచాడు విప్రదాసు. అన్నయ్యకు బార్లి ఇష్టములేదని ఎరిగి, కుము అందులో నిమ్మకాయరసమూ, కొంచెము గులాబీ షరబత్తూ కలిపి ఇచ్చేది. కాని కుముతోనే ఆ ఏర్పాటు అంతా పోయింది. ఫలానా మోస్తరుగాచేస్తే తనకు ఇష్టము అని అతను ఎవరితోనూ చెప్పడు. ఏది ఇస్తే దానినే ఇష్టం లేక పోయినా తాగేస్తాడు.

బార్లి రుచిగా ఉండేటట్టుచేసి తీసుకువద్దామని కుము లోపలికి వెళ్లింది.

విప్రదాసు ఆత్రతతో అడిగాడు, "ఏమిటి సమాచారం కాలూదా?" అని.

"నీ ఒక్కడి సంతకముమీద అప్పు ఇవ్వడానికి ఎవరూ ఒప్పుకోకుండా ఉన్నారు, సుబోధ్ సంతకం కూడా కావాలి

అని అంటున్నారు. డబ్బుగల మార్వాడీలు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నారు కాని వాళ్లదగ్గిర తేవడం జూజం-ఆట మాదిరి—వడ్డీ బాగా ఎక్కించాలి—అది మనకు కుదరదు.”

“సుబోధ్‌ను రమ్మని టెలిగ్రామ్ పంపించు కాలూదా, ఇక ఆలస్యం చేయకూడదు.”

“నాకుకూడా బాగున్నట్టు తోచలేదు, ఆసారి నీ ఉంగరం అమ్మిన రూపాయలు తీసుకొని అసలులో కొంతభాగం చెల్లు కొట్టేదామని వెళ్లినప్పుడు, మధుసూదన్ రూపాయలు పుచ్చుకోనన్నాడు; అప్పుడే నాకు బోధపడ్డది ఆట్టే సవ్యంగా జరిగే వ్యవహారం కాదు అని; తనకు దయకలిగినప్పుడు ఎప్పుడో ఒకనాడు మన మెడకు ఉరివేస్తాడు.”

విప్రదాస్ ఊరుకొని ఆలోచిస్తూ కూర్చున్నాడు.”

కాలూ—“చిన్నపిల్ల ఉదయం హఠాత్తుగా వచ్చేసింది, పోట్లాడి వచ్చేయలేదు కదా అన్నయ్యా! మధుసూదన్‌తో దెబ్బలాడే అవస్థలో మనము లేము, ఆ మాట మరిచి పోకూడదు.”

“భర్త ఒప్పుకున్నా” డని కుము అన్నది.

“ఎట్లాంటి ఒప్పుకోవడమో తెలుసుకోనిదే నిశ్చింతగా కూర్చోలేము అన్నయ్యా, అతనితో ఎంత జాగ్రత్తగా నడుచుకోవాలో నీతో ఏమిచెప్పను, అన్నయా! కోపంతో ఒళ్లుఅంతా మండుతున్నప్పుడు కూడా అంతా చల్లగా

సహించి ఊరుకున్నాను, గౌరీశంకర శిఖములాగు—అక్కడ మిట్టమధ్యాహ్నపు ఎండలో కూడా మంచు కరగదు. మొట్ట మొదటి మాట—అతను వడ్డీవ్యాపారస్థుడు, మనకు అప్పు ఇచ్చాడు; రెండవది అతను చెల్లెలి మొగుడు—ఆలాంటి వాళ్లతో చిక్కు లేకుండా గడుపుకోవడం సులభమైన పనికాదు.

విప్రదాసు జబాబు ఆలోచిస్తూ కూర్చున్నాడు

కుము బార్లీ తెచ్చింది, అన్నయ్య పెదవులదగ్గిర పెట్టి "తాగేయి అన్నయ్యా," అన్నది.

విప్రదాసు ఉలికిపడి చూడగానే అన్నయ్య ఇంతసేపూ ఏదో చిక్కైనవిషయాన్ని గురించి ఆలోచిస్తున్నాడని కుము పోల్చుకున్నది.

కాలూ గదిలోనుండి బయటికివెళ్లగానే కుము అతని వెంటపడి, "కాలూదా, నాకు అంతా చెప్పాలి, ఏమీ దాచకుండా," అని అన్నది.

"ఏమిటి చెప్పాలి దీదీ† ?"

"మీరు ఇద్దరూ ఏమిటి ఆలోచిస్తున్నారు ?"

"విషయం ఉండి ఆలోచన లేకుండా ఉండడం సంభవమేనా చిన్నపిల్లా ? ముళ్లచెట్టున పళ్లు ఉంటవి, ఆకలిబాధ కొద్దీ ఎక్కి తీయబోతాము, ఒళ్లంతా గీరుకుపోతుంది."

---

† దీదీ = అక్క; చెల్లి

"ఆసామెతలన్నీ తరువాత చెప్పుదువుగాని, సంగతి ఏమిటో నాకు ఇప్పుడు చెప్పాలి కాలూదా."

"కొన్ని వ్యవహారనుగురించి ఆడవాళ్లతో చెప్ప కూడదు."

"నాకు తెలుసును మీరు దేనినిగురించి ఆలోచి స్తున్నారో—చెప్పేదా ?"

"చెప్పు—చూదాం."

మా అత్తవారి దగ్గిర అన్నయ్య అప్పుతెచ్చాడు—దాని సంగతి."

కాలూ జబాబుచెప్పక తన పెద్దపెద్దకళ్లను మరీ పెద్దవి చేసి, ఆశ్చర్యపడుతూ కుమువంక చూచాడు.

"నేను చెప్పినది నిజంఅవునో కాదో చెప్పు," అని కుము అడిగింది.

"నీవు మా అన్నచెల్లెలివి కావా, ఒక్కమాటఅయినా చెప్పకుండా సంగతి అంతా గ్రహించగలవు!"

పెళ్లిఅయిన పిమ్మట ఏనాడు మధుసూదన్ తాను విప్రదాస్‌కు అప్పుఇచ్చాడని బడాయికొట్టి అతనిమీద అధి కారం చలాయించబోయినాడో ఆనాడే కుముకు బోధపడ్డది, అన్న మర్యాద దక్కదని; కుము రోజూ మనసార కోరుతూ ఉండేది ఆ అప్పు ఎలాగైనా తీరిపోవాలి అని. అన్నయ్య దీనిని గురించి బాధపడుతున్నాడు, కుముకు ఆ విషయంలో ఏమీ సందేహం లేదు. అవాళ విప్రదాసువ్రాసిన ఉత్తరముమాట

నవీన్ చెప్పాడు—అప్పుడే కుము గ్రహించి ఆ ఋణమే అంతటికీ మూలము అని. అన్నయ్య రోగం ఎందుచేత రోజుకు రోజు ముదిరిపోతున్నదో, అన్నయ్య ఎందుకు కలకత్తా వచ్చాడో, కుముకు అంతా స్పష్టంగా బోధపడ్డది.

"అన్నయ్య రూపాయలు అప్పుచేదామని కలకత్తా వచ్చాడు, నాదగ్గిర దాచకు కాలూదా."

"అప్పుచేసే అప్పుతీర్చాలి, రూపాయలు ఆకాశముమీద నుండి పడవుకదా! దగ్గిరబంధువులవద్దనుండి అప్పుతేవడం మంచిది కాదు."

"అది నిజమే—అయితే అప్పు దొరికిందా?"

"నాలుగుచోట్లా చూస్తున్నాను దొరుకుతుంది, భయం లేదు."

"సులభంగా దొరకకుండా ఉన్నది—నేనెరుగుదును."

"అంతా ఎరుగుదువు కదా, నన్ను ఎందుకు అడుగుతావు చిన్నపిల్లా? చిన్నప్పుడు నీవు ఒకనాడు నామీసం లాగి మీసం ఎలాగు పుట్టింది అని అడిగావు. సమయం కనిపెట్టి విత్తనం వేశాను అని జబాబుచెప్పాను, ఆ జబాబు నిన్ను తృప్తి పరిచేసింది అప్పుడు. ఆ ప్రశ్నే ఇప్పుడు అడిగిఉంటే జబాబు చెప్పడానికి డాక్టర్‌ను పిలవవలసి ఉంటుంది. అన్నిసంగతులూ నీకు తెలియచేస్తూ ఉండాలని ఎక్కడా నియమం లేదే!"

"ఈ నా కోరిక జ్ఞాపకం ఉంచుకో కాలూదా, అన్నయ్య సంగతులన్నీ నాతో చెపుతుండాలి."

"అన్నయ్యకు మీసాలు ఎలాగువచ్చినవో అదీ కూడానా ?"

"అలా తప్పించుకోడానికి ప్రయత్నం చేయకు. అన్నయ్య ముఖం చూడగానే పోల్చుకున్నాను, అప్పు జతపడ లేదని."

"జతపడలేదని తెలుసుకుంటే నీకేమి లాభం ?"

"లాభం సంగతి నేను చెప్పలేను, కాని నాతో నీవు చెప్పితీరాలి—అప్పు దొరకలేదు నిజమేనా ?"

"లేదు, దొరకలేదు."

"సులభంగా దొరకదా ?"

"దొరుకుతుంది, అందుకు సందేహంలేదు, కాని సులభంగా దొరకదు. కనుక నీ ప్రశ్నలకు జబాబు ఈయడానికి ప్రయత్నించే కంటె అప్పు ప్రయత్నముమీద బయలుదేరితే పని త్వరగా నెరవేరుతుందేమో అమ్మా—నే నిక పోతా!"

కాలూ కొంచెము వెళ్ళి తిరిగివచ్చి కుముదను అడిగాడు— "నీవు ఇవాళ ఇక్కడికి రావడమువల్ల చిక్కు ఏమీ లేదు కదా!—నిజంగా చెప్పు చిట్టీ."

"ఉన్నదో లేదో చెప్పలేను."

"నీభర్త సమ్మతిమీదనే వచ్చావా ?"

"నే నడగనిదే సమ్మతించారు."

"కోపగించా?"

"అదీ చెప్పలేను. నేను తిరిగి కబురు పంపేవరకు రావద్దని కూడా అన్నారు."

"అది సరిఅయినమాట కాదు, అతను కబురు పంపకముందే వెళ్లిపోవాలి; నీ అంతట నీవే వెళ్లడం మంచిది అమ్మా."

"వెళ్లితే అతని ఆజ్ఞను మీరినట్టు అవుతుంది."

"అది అంతా నేను సరిచేస్తాను."

అన్నయ్య నేడు ఘోర విపత్తులో మునిగి ఉండడానికి కారణం తానే అని కుము నమ్మకుండా ఉండలేకపోయింది. తనను తాను శిక్షించుకుందామని గట్టికోరిక పుట్టింది ఆమె మనస్సులో—అదికూడా బహుకఠినశిక్ష. కంటకశయ్యపైని పడుకుండే సన్యాసులు ఉన్నారని ఆమె విని ఉన్నది—దానివల్ల ఏమైనా ప్రయోజనం ఉంటే తానుకూడ పడుకోడానికి సిద్ధంగాఉన్నది. ఏ యోగిగాని సిద్ధపురుషుడుగాని దారి చూపించ గలిగితే శాశ్వతకాలమూ అతనికి బానిసఅయి ఉండగలదు. అలాంటి మహాపురుషులు ఎక్కడో ఉంటారు, సందేహము లేదు. కాని వాళ్లు ఎక్కడ ఉంటారో! తాను ఆడది అయిపోయింది, లేకుంటే తప్పక ఏదో ఉపాయం కనిపెట్టి ఉండును.

అయితే చిన్నన్నయ్య ఏమి చేస్తున్నట్టు! భారంఅంతా పెద్దఅన్నయ్య నెత్తిమీద పెట్టేసి ఇంగ్లాండులో హాయిగా ఏలాగు కూర్చోగలిగాడు!

కుము గదిలో ప్రవేశించి చూచేసరికి విప్రదాస్ దూలాలవైపు మీదికి చూస్తూ ఏదో ఆలోచిస్తూన్నాడు, మంచముమీద పడుకొని ఈలాగు చేస్తూఉంటే ఏ జబ్బైనా కుదురుతుంది? విముఖముగా ఉన్న అదృష్టదేవత ఎదుట తల పగలకొట్టుకోవాలని కుముకు బుద్ధి పుడుతున్నది.

అన్నయ్య తలదగ్గిర కూర్చొని అతని తల నిమురుతూ, "చిన్న అన్నయ్య ఎప్పుడు వస్తాడు అన్నయ్యా?" అని అడిగింది.

"చెప్పలేను."

"అన్నయ్యను రమ్మని వ్రాయకూడదూ?"

"ఏమీ—ఎందుకు ఆలాగు అడుగుతున్నావు?"

"సంసార భారంఅంతా నీ తలమీద పెట్టేస్తే నీవు ఒక్కడివే, ఎలా మోయగలవు అన్నయ్యా? పూచీ అంతా నీ ఒక్కడిదేనా ?"

"లోకంలో కొందరికి పూచీలు ఉంటవి, కొందరికి హక్కులు ఉంటవి—ప్రపంచం నడిచే మోస్తరు అదేను. పూచీఅంతా నేను తీసుకొన్నాను—దానిలోవంతు ఇంకొకరికి ఎందుకు ఇస్తాను ?"

"నేను మగవాడినయిఉంటే బలవంతాన నీ దగ్గిరనుంచి తీసుకొని ఉందును."

"ఇప్పుడు తెలిసిందా, పూచీ నెత్తిమీద పెట్టుకుందామని కోరిక అందరికీ ఉంటుంది. నీ నెత్తిమీద పెట్టుకోడానికి

అవకాశంచిక్కకుండా ఉన్నచిన్నదని అన్నయ్యద్వారా ఆశ తీర్చుకోవాలని చూస్తున్నావు—అంతేనా? కాని నేనుచేసిన అపరాధం ఏమిటి కుమూ?"

"రూపాయలు అప్పుచేదామని నీవు ఇక్కడికి వచ్చావు కదూ అన్నయ్యా?"

"దేనినిబట్టి పోల్చావు?"

"నీ ముఖం చూచే పోల్చాను. నేను ఏమీ చేయడానికి వీలులేదా అన్నయ్యా?"

"ఏమిటి చేయగలవు?"

"ఏ పత్రములోనైనా నా సంతకంవల్ల ఉపయోగం ఉంటుందనుకో—నా సంతకానికి విలువలేదా?"

"ఉన్నది, మాదగ్గిర, కాని అప్పులవాళ్లదగ్గిర దానికి విలువలేదు."

"నీ కాళ్లుపట్టుకొని అడుక్కుంటున్నాను అన్నయ్యా, నన్ను ఏమైనా సాయము చేయనీ."

"బంగారు తల్లివి అయి, ఓర్చి ఉండు, ఏమీ గాబరా పడకు, అదీ ఒక గొప్పసాయమే, మరిచిపోకు. తుపానులో ఓడను స్థిరముగా ఉంచడము ఎంత అవసరమైనపనో మనస్సును కంగారులేకుండా ఉంచుకోవడంకూడా అంత ఆవశ్యకమైన పనే—నా ఎస్‌రాజ్ తీసుకురా అమ్మా—తెచ్చి కొంచెం వాయించు."

"నన్ను ఏమైనా చేయనీ అన్నయ్యా."

"వాయించడం మంచి పనికాదా!"

"కఠినమైన పని ఏదైనా చేయాలనిఉన్నది అన్నయ్యా."

"పత్రములో సంతకము చేయడముకంటె ఎస్‌రాజ్ వాయించడము చాలా కష్టమైన పని చెల్లీ, తీసుకు రా ఎస్‌రాజ్."

౪౯

మధుసూదన్ అంటే అందరూ జడిసేటట్టుగానే శ్యామా సుందరికూడా ఒకప్పుడు జడిసేది. కాని అతను లోలోపల తనవైపు అప్పుడప్పుడు ఒరుగుతున్నాడనికూడా ఆమె ఊహావల్ల పోల్చుకున్నది. అయినా ఎటువైపునఉండే అడ్డుపై దుమికి వెళ్లితే అతనికిదగ్గరగా రాగలదో సరిగా ఊహించలేక పోయింది. మధ్యమధ్యను హఠాత్తుగా ప్రయత్నించింది, కాని ప్రతిమారూ దెబ్బతిని తిరిగి పోవలసివచ్చింది. మధుసూదన్ గొప్పనిష్ఠతో వర్తకం చేసుకువచ్చాడు. కాంచనసంపాదన సాధనలో మునిగిఉన్న మధుసూదన్‌కు కామిని బహు తుచ్ఛమైన వస్తువుగా కనబడ్డది. కనుక స్త్రీలకు అతనుఅంటే చాలా భయము. కాని ఆభయంలోనే కొంత ఆకర్షణఉన్నది. గుండె బితుకుబితుకు మంటున్నప్పటికీ శ్యామ మధుసూదనుని చూచి ముగ్ధురాలయి, సంకోచిస్తూ సంకోచిస్తూ అతనికి దగ్గరగానే తిరుగుతుండేది. ఒకసారిమాత్రము ఆమెకు బాగా చనువు ఇచ్చాడు అతను, అప్పుడు నిజంగా జడవడానికి కారణం

ఉండెను. కాని అతిత్వరలోనే ముఖం అటుతిప్పి, "స్త్రీలంత హేయమైనవాళ్లు పృధ్విపైని ఉండరు," అని ఆచరణద్వారా ఋజువు చేయవలెనని అతను ప్రయత్నించాడు. కనుక ఇన్నాళ్లూ శ్యామాసుందరి తనను అణచుకొని ఉన్నది.

మధుసూదన్ పెళ్లిఆడి వచ్చినప్పటినుండి శ్యామ మరి ఉండలేకపోయింది. మధుసూదన్ కుమునుకూడా ఇతర స్త్రీలనువలెనే నిరసనగా చూస్తూఉంటే శ్యామకు అంత కష్టముగా ఉండకపోవునేమో. కాని మధుసూదన్‌కూడా అంథప్రేమలో పడి మైమరువవచ్చునని కుము వచ్చిన తరువాత కని పెట్టింది. అటుపైని మరి ఓర్చిఉండడం శ్యామకు సాధ్యం కాలేదు. కొద్దిరోజులబట్టి కొంచెము కొంచెము సాహసంచేసి దగ్గరకు వస్తున్నది, ప్రయత్నం నిష్ఫలము కాలేదు. అప్పు డప్పుడు ఆటంకం కలిగినా చివరకు తన పని నెరవేర్చుకోగలనని శ్యామకు ఆశకలిగింది. మధుసూదనుని దుర్బలం దొరికి పోయింది, కనుకనే శ్యామ మునపటివలె ఓర్చిఉండలేక పోయింది. కుము అన్నగారిఇంటికి వెళ్లడానికి ముందురాత్రి మధుసూదన్ శ్యామను బాగా దగ్గరకు లాగుకున్నాడు, అంతకుపూర్వం ఎన్నడూ అంతదగ్గరకు లాగుకోలేదు. తరు వాత దానివల్ల తగిలే తిరుగు దెబ్బకూడా గట్టిగా తగలవచ్చు నని శ్యామ జడిసింది. కాని పిరికితనం చూపించకపోతే భయ పడవలసిన అవసరం ఉండదని తెలుసుకొన్నది.

మధుసూదన్ ఉదయమే బయటికి వెళ్లిపోయినాడు, ఒంటిఘంట వేళాక ఇంటికి తిరిగివచ్చాడు. చాలారోజులబట్టి స్నానపానాదులకు ఇంత వేళతప్పడం ఎన్నడూ జరగ లేదు. ఇవాళ మిక్కిలి అలసి చీకాకుపడుతూ ఇంటికివచ్చాడు. ఇంటికి రాగానే, కుము అన్నగారిఇంటికి వెళ్లిపోయింది అని జ్ఞాపకం వచ్చింది, ఆవెళ్లిపోవడం బహుసంతోషంగా వెళ్లి ఉండాలి. ఇంత కాలమూ మధుసూదన్ తనబలము మీాదనే నిలబడగలిగాడు. ఈ మధ్యను ఎన్నడో ఆ బలము తగ్గిపోయింది, ఇప్పుడు మనస్సూ దేహమూ చంచలం అయినప్పుడల్లా స్త్రీయొక్క ప్రేమను ఆశ్రయించి శాంతి పొందుదామని వాంఛ కలుగు తున్నది. ఇన్నాళ్లూ అతని మనస్సులో నిద్రిస్తున్న ఈ వాంఛకు ఇప్పుడు మెలుకువ గలిగింది. కనుకనే ఇవాళ కుము అంత సునాయాసముగా వెళ్లిపోవడము చూచి అతనికి అంత కోపం వచ్చింది. ఇవాళ భోజనసమయములో శ్యామ కోరి వెనుకను ఉండిపోయింది; రోజూమాదిరి దగ్గిరికి వచ్చి కూర్చోలేదు. నిన్నరాత్రి తాను దొరికిపోయినాడు, అందుకని తనమీాద తనకే చీకాకుపుట్టి ఉండవచ్చు. భోజనం అయినతరువాత మధు సూదన్ ఖాలీగదిలోకి వచ్చి కొంచెముసేపు ఊరకనే ఉండి శ్యామను రమ్మని కబురుపంపాడు. శ్యామ ఎర్రశాలువ కప్పుకొని వచ్చి సంకోచిస్తున్నట్టుగా గదిలో ఒకపక్కను నిలుచున్నది.

“రా, వచ్చి ఇక్కడ కూర్చో,” అని అన్నాడు మధు సూదన్.

శ్యామ వచ్చి అతని తలదగ్గిర కూర్చొని, "ఇవాళ నీవు చాలా నీరసముగా కనబడుతున్నావు," అని అంటూ అతని మీదికి కొంచెము వంగి చేతితో అతని తల నిమురడం మొదలు పెట్టింది.

"ఆహా ఎంతచల్లగా ఉన్నది నీ చెయ్యి," అన్నాడు మధుసూదన్.

మధుసూదన్ రాత్రిపడుకోడానికి గదిలోకి వచ్చాడు. శ్యామ పిలవకుండానే వచ్చి, "ఆహా ఒంటరిగా ఉండాలి పాపం!" అని అన్నది.

శ్యామాసుందరి ముసుగూ మూతా తీసేసి కొంత సాహసంతో పనిచేయడం ప్రారంభించింది. అందరినీ సాక్ష్యంగా ఉంచి తనఅధికారం స్థాపించ నిశ్చయించుకొన్నది. ఆట్టే వ్యవధి లేదు, కుము ఏక్షణమైనా వచ్చేయవచ్చు, ఈలోగానే పూర్తిగా మధుసూదనుని లోబరుచుకోవాలి, ఇది అందరికీ తెలిసినట్లైతేనే ఆ అధికారము బలపడుతుంది. ఇప్పుడు ఏమాత్రం సిగ్గుపడినా లాభంలేదు.

చూస్తూ ఉండగానే నౌకర్లూ దాసీలూ కూడా వాళ్లలోవాళ్లు ఇదే చెప్పుకోవడం మొదలుపెట్టారు. మధుసూదన్ ఇన్నాళ్లపట్టి తన సహజప్రవృత్తిని, తనకోరికను, ఎంత గట్టిగా అణిచిఉంచాడో, అది ఇప్పుడు అంత నిర్భయంగా మండడం మొదలుపెట్టింది. అతను ఎవరినీ లక్ష్యపెట్టలేదు, ఉన్మత్తతను బహుస్వేచ్ఛగా వ్యక్తపరిచాడు.

ఈ ప్రవాహాన్ని ఆపడం ఎవరి శక్యమూ కాదని మోతీ తల్లీ నవీనూ అనుకొన్నారు.

"అక్కను తీసుకురావచ్చా, ఇంకా ఆలస్యం చేయడం మంచిది కాదు," అని మోతీతల్లి అన్నది.

"అదే ఆలోచిస్తున్నాను. కాని అన్నయ్య సెలవు లేనిదే ఉపాయం లేదు—ప్రయత్నంచేసి చూస్తాను."

యుక్తిగా అడుగుదామని ఒకనాడు ఉదయమే నవీన్ అన్నయ్యదగ్గిరికి వచ్చేటప్పటికి అన్నయ్య బయటికి బయలుదేరుతున్నాడు, గడపదగ్గిర బండి సిద్ధంగా ఉన్నది.

"ఎక్కడికైనా వెళ్లుతున్నావా ఏమిటి అన్నయ్యా?"

మధుసూదన్ సంకోచము కొంచెం విడిచిపెట్టి, "ఆ జ్యోతిష్కుడు, వెంకటస్వామి, దగ్గిరికి," అన్నాడు.

మధుసూదన్ తనబలహీనత తమ్ముడిదగ్గిర దాచవలెననే అనుకొన్నాడు కాని అతనిని తనతో తీసుకువెళ్లితే పని సుళువు అవుతుందని అనుకొని, "పద, నాతో రా," అని అన్నాడు.

నవీన్ కొంప మునిగింది అనుకొని, ఇట్లాగు అన్నాడు— "నేను ముందు చూచి వస్తాను అతను ఇంకా ఉన్నాడో లేదో, వాళ్లఊరికి వెళ్లిపోయిఉంటాడని నా అనుమానం— వెళ్లిపోతానని, అన్నట్టే జ్ఞాపకం."

"సరే మరీ మంచిది, చూచి వద్దాము పద."

నవీన్ అన్నయ్యతోకూడా బండి ఎక్కాడు—వేరే ఉపాయము లేకపోయింది, కాని నెత్తిమీద పిడుగు పడ్డదని అనుకుంటున్నాడు తనలోతాను.

బండి జోస్యతిష్కుని ఇంటి ఎదుట ఆగీఆగడంతోనే నవీన్ గబగబా దిగి కిటికిలోకి తొంగి చూచి, "ఎవరూ లేనట్టున్నది," అని అన్నాడు.

నవీన్ ఆమాట అన్నాడోలేదో పళ్లుదోముపుల్ల నములుతూ స్వయముగా వెంకటశాస్త్రి గడపదగ్గరకు వచ్చి నిలుచున్నాడు.

నవీన్ అతనికి, మీద పడిపోయినంత దగ్గరగా వచ్చి, నమస్కారంచేస్తూ మెల్లిగా అతనితో, "చాలా జాగ్రత్తగా జవాబులు చెప్పండి," అని అన్నాడు.

ఆ చిమ్మగదిలో కర్రమంచముమీద అంతా కూర్చున్నారు. నవీన్ మధుసూదన్ వెనుక కూర్చొని, ఎవ్వరూ ఏమీ అనకముందు, "మహారాజావారికి రోజులు చాలా కష్టంగా గడుస్తున్నవి. ఎన్నాళ్లు ఇంకా రోజులు ఈలాగు ఉంటవో చెప్పాలి శాస్త్రీజీ," అని నవీన్ అన్నాడు.

నవీన్ ఈ విధంగా అంతా బయలుపరిచేయడం చూచి మధుసూదన్ చీకాకుపడి అతని తొడమీద గట్టిగా ఒకగిల్లు గిల్లాడు.

వెంకటశాస్త్రి రాశిచక్రం గీసి స్పష్టంగా కనపరిచాడు మధుసూదనుని ధనస్థానంమీద శనిదృష్టి పడ్డది.

గ్రహాల పేర్లు తెలుసుకొని లాభంలేదని మధుసూదనుకు తోచింది, గ్రహాలతో రాజీనామా చేసుకోలేము, మాట్లాడ లేము. తనశత్రువు ఎవడో స్పష్టంగా తెలుసుకోవలెనని అతని కోరిక. ఏ వర్గమో ఏ వర్ణమో ఇప్పుడు బయట పెట్టమని కోరాడు, మధుసూదన్.

అన్నిటికంటె గొప్ప చిక్కు ఏమిటిఅంటే నవీన్‌కు మధు సూదనుని ఆఫీసు వ్యవహారాలు ఏమీ తెలియవు. కనుక సంజ్ఞల ద్వారా కూడా జ్యోతిష్కుడికి సాయం చేయలేదు. వెంకటశాస్త్రి వర్ణాలు ఏకరవు పెట్టడం మొదలు పెట్టాడు. మధ్య మధ్య దొంగతనంగా మధుసూదనుని ముఖమువంక చూస్తు న్నాడు, ముఖలక్షణాలవల్ల ఏమైనపోల్చుకోవచ్చునేమో అని. ఇవాళ భృగుముని మాటాడడంలేదు—వర్ణమాల మంత్రం ఇవాళ పారలేదు. శాస్త్రి చివరకు, "ఇప్పుడు మీకు శత్రు వుగా ఉన్నది స్త్రీ ఒక ఆమె," అని హఠాత్తుగా అన్నాడు.

నవీన్ బ్రతికిపోయినా ననుకొని పెద్దనిట్టూర్పు విడి చాడు. ఆ స్త్రీ శ్యామాసుందరి అని ఎట్లాగైనా చెప్పించగలి గితే మరి ఏ చింతా ఉండదు. పేరేమిటో తెలియాలి అన్నాడు మధుసూదన్. శాస్త్రీజీ వర్ణాలు ఏకరవు పెట్టడం ఆరంభించాడు. "క" ఉచ్చారణ చేసి అదృశ్యంగాఉన్న భృగుమునివైపు చెవి ఇచ్చి వింటున్నట్టు నటించి, పక్కచూపును మధుసూదనుని వంక తిప్పాడు. 'క' వినబడగానే మధుసూదన్ కొంచెం ఉలికి పడ్డాడు. వెనకనుంచి నవీన్ "కాదు" అంటూ కుడి ఎడమవైపు

లను, కిందికీ మీాదికీ, తల ఆడించాడు. మద్రాసీలు ఔను అనడా నికి అమాదిరి తల ఊపుతారని నవీన్ ఎరగడు. వెంకటశాస్త్రికి నమ్మకము కలిగి ధైర్యముగా 'క' వర్గము అన్నాడు, మధుసూద నుని ముఖంచూచి మరీ ధైర్యముగా 'క' వర్గములో మొదటి వర్ణమే అన్నాడు. దానికి మరికొంచెము వ్యాఖ్యానం చేస్తూ, మధుసూదన్‌కు కలిగే కీడంతా ఆ 'కు' ద్వారానే కలుగు తుంది అన్నాడు.

పేరు పూర్తిగా చెప్పమని కంగారుచేయక దానికి ప్రతీకారం ఏమిటి అని అడిగాడు.

వెంకటశాస్త్రి ముఖం గంభీరముచేసి, "కంటకేనైవ కంటకం—అనగా ఇంకొకస్త్రీయే నిన్ను కాపాడుతుంది అన్నమాట," అని అన్నాడు.

మధుసూదన్ ఆశ్చర్యపోయినాడు—వెంకటశాస్త్రిగారు మానవస్వభావవిద్య బాగా ఎరుగునని అతనికి నమ్మకం కలిగి పోయింది.

నవీన్ గాబరా పడుతూ, "పందేలలో మహారాజవారి గుర్రం గెలిచిందా శాస్త్రీజీ!" అని అడిగాడు.

గుర్రాలలో చాలాభాగం పీగిపోతుంట వని శాస్త్రి ఎరుగును, ఏదో లెక్క వేస్తున్నట్టు కొంచెము నటించి, "నష్టమే కనబడుతున్నది," అన్నాడు.

నాలుగురోజుల క్రితమే మధుసూదనుని గుర్రము పెద్ద పందెంలో గెలిచింది, మధుసూదనుకే ఏమీా అనడానికి వీలు

ఇవ్వకుండా నవీన్ వాడిన ముఖముతో మరి ఒకప్రశ్న అడిగాడు—"నా కుమార్తె గతి ఏమౌతుందో చెప్పండి స్వామీజీ!"—నవీన్‌కు కుమార్తె లేదని అంతా ఎరిగినదే.

అమ్మాయికోసం నవీన్ సంబంధం వెదుకుతుండవలెనని శాస్త్రి ఊహించాడు—నవీన్ ముఖంచూచి అమ్మాయి అప్సర కాదని అనుమానించి, "వరుడు త్వరలో చిక్కడు, చాలా డబ్బు ఖర్చుపెట్టవలసి ఉంటుంది," అని అన్నాడు.

మధుసూదన్‌కు సందు ఈయకుండా నవీన్ మరి పది పన్నెండు, ఒకదానితో ఒకదానికి సంబంధములేని, ప్రశ్నలు అడిగి వింతవింత జవాబులు శాస్త్రి దగ్గరనుంచి లాగి, "ఇక ఎందుకు అన్నయ్యా వెళ్లొదాము పద," అన్నాడు.

బండి ఎక్కుతూనే నవీన్ అన్నాడు—"వీడు బహు గడుసువాడు అన్నయ్యా, బలే టక్కర్," అన్నాడు.

"కాని అవాళ—"

"అవాళ నీవు అతని దగ్గిరికి వెళ్లకముందే నీసంగతి కనుక్కొని ఉంటాడు."

"నేను వస్తానని అతనికి ఎట్లా తెలుస్తుంది."

"అది నా తెలివి తక్కువ—నిన్ను అతని దగ్గిరికి తీసుకు వెళ్లడం నా పొరపాటు."

జ్యోతిష్కుని వంచన ఎంతస్పష్టమైనా, 'క' వర్గమువల్ల కలిగే కీడు మాట మధుసూదనుని గుండెలోనాటి అతనిని

బాధిస్తూఉన్నది. పనికిమాలిన చిల్లర ప్రశ్నలకు నక్షత్రాలు, అనాదరమువల్ల, నోటికివచ్చిన జవాబులు చెప్తుతూఉన్నా ముఖ్యమైన ప్రశ్నలకు మాత్రం సరిఅయిన జవాబులు చెప్తుతుంటవని అతనికి నమ్మకం కలిగింది. మధుసూదనుకు పెద్ద రోజులు పెళ్లితోనే ప్రారంభం అయినవి—దానికి ఏమీ సందేహం లేదు—ఇంతకంటె వేరే రుజువు ఏమిటి కావాలి?

కొంతసేపయిన తరువాత నవీన్ మెల్లి మెల్లిగా అన్నాడు- "రెండువారాలు అయిపోయింది అన్నయ్యా, వెళ్లి వదినను తీసుకు వస్తాను."

"ఏమిటి—తొందర ఎందుకు? చూడు నవీన్ ఇదే నీతో చెప్పడము—జ్ఞాపకం ఉంచుకో—ఈ ప్రసంగం నాతో ఇటుపైన ఎన్నడూ ఎత్తకు, నాకు ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడు నేనే తీసుకువస్తాను."

అన్న సంగతి బాగా ఎరుగును నవీన్, వదినమాట ఎత్తి మరి లాభం లేదని పోల్చుకున్నాడు.

అయినా సాహసించి కొంచెము సేపయిన పిమ్మట "తోటికోడలు ఆమెను చూడడానికి వెళ్లితే తప్పా?" అని అడిగాడు.

మధుసూదన్ "వెళ్లనీ" అని నిరసనతో జవాబు ఇచ్చాడు.

౫౦

విప్రదాసు అమిత కంగారు పడుతూ "ఒక కుర్చీని చూపించి, దయచేయండి నవీన్ బాబూ, ఇక్కడ కూర్చోండి," అని అన్నాడు.

నవీన్—"నేనెవరో పోల్చుకోలేదు అనుకుంటాను, రాజావారి ఇంటినుండి వచ్చిన పెద్దవారు ఎవరో" అని అను కుంటున్నారు కాబోలు. మీ చెల్లెలి అధమ సేవకుడను నేను. నన్ను ఈ విధముగా గౌరవంచేసి మీ ఆశీర్వాదం ప్రాప్తించ కుండా చేయకండి."

"కాని ఇది ఏమిటి—మీ ఒళ్లు ఈలాగు అయిపోయిం దేమిటి—అది శరీరంకాదు, కేవలం నీడ."

"శరీరము సత్యం కాదు, ఛాయ—ఆ సంగతి అప్పు డప్పుడు జ్ఞాపకం తెచ్చుకోవడం మంచిది—ఎప్పుడో ఒకనాడు అది మనము తెలుసుకోవలసి ఉంటుంది, ముందునుండే తెలుసు కోవడం మేలు కదా!"

కుము గదిలోకి వచ్చి, "ఫలహారంచేసి వత్తువుగాని పద అబ్బాయ్," అని అన్నది.

"చేస్తాను కాని ఒక షరతు ఉన్నది. ఆ షరతు పూర్తి కానంతకాలము ఈ బ్రాహ్మణాతిథి నీద్వారము ఎదుట భోజనం లేకుండానే పడిఉంటాడు."

"ఏమిటి ఆ షరతు చెప్పు విందాము."

"మనఇంట్లో ఉండగానే నీతో మనవిచేసుకున్నాను, కాని అక్కడ దృఢంగా అడగలేకపోయినాను. నాకు నీ ఫొటోగ్రాఫు దయచేయమని అడిగాను, లేదన్నావు అప్పుడు—ఇప్పుడు లేదన లేవు, అదిగో అక్కడే మీ అన్నయ్యగదిలో గోడను ఒకటి వేలగట్టిఉన్నది."

అదృష్టవశాత్ ఎప్పుడో గాని ఫొటోగ్రాఫులు బాగా రావు. అక్కడఉన్న కుము ఫొటోగ్రాఫు ఆలాగు అదృష్ట వశాత్ బాగా తీసిన వాటిలో ఒకటి. మనస్సులోఉండే వర్చస్సు నొసట కనబడితే ముఖాన వ్యక్తమయేవికాసం ఆ ఫొటోగ్రాప్‌లో స్పష్టముగా కనబడుతున్నది. బుద్ధివలన పుట్టిన నిర్మలదీప్తి ముఖములోనూ, సరళతా కరుణా కళ్లలోనూ కనబడుతున్నవి. ఖాలీకుర్చీ చెయ్యిమీద కుడిచెయ్యి పెట్టు కొని నిలబడి ఉన్నది కుము; పూర్వము ఎప్పుడో పడ్డ తన నీడనే చూచి హఠాత్తుగా నిలబడి పోయినట్టు కానవస్తున్నది.

ఈ ఫోటో అక్కడ ఉన్నట్టు కుము ఎరగదు, పెళ్లికి నాలుగురోజులు ముందు, కలకత్తానుండి ఒక ఫోటోగ్రాఫర్‌ను తెప్పించి అన్నయ్య తీయించిన ఫోటో అది, అన్నయ్య దానిని తన గదిలో పెట్టుకొన్నాడు. అది చూచి కుము మనస్సు కరిగి పోయింది. ఆ ఫోటో కాపీలు ఇంకా తప్పక ఉంటవి అని అను కొన్నట్టుగా, కుము అన్నయ్య ముఖమువంక చూచింది. "వదినకు దయపుట్టింది చూచారా విప్రదాసుబాబూ," అని

నవీన్ అన్నాడు—"చూడండి నేను అయోగ్యుడను అని ఆమె బాగా ఎరుగును కనుకనే నామీద మరీ దయ."

"కుముూ, ఆ చర్మము పెట్టెలో మరికొన్ని కాపీలు ఉన్నవి, నీభక్తుడికి ఈయాలనిఉంటే ఒకటి ఈయి," అని నవ్వుతూ అన్నాడు విప్రదాసు.

కుము నవీన్‌ను ఫలహారానికి లోపలికి తీసుకువెళ్లగానే కాలూ గదిలోకి వచ్చి, "చిన్న బాబును త్వరగా రమ్మని టెలిగ్రామ్ పంపెను" అని విప్రదాసుతో అన్నాడు.

"నా పేరుతో పంపేవా ?"

"ఆహా, నీ పేరుతోనే అన్నయ్యా. చివరవరకు ఒకమారు ఔననీ ఒకమారు కాదనీ అంటూఉంటావని నే నెరుగుదును, ఇవతల సమయంలేదు. డాక్టర్ చెప్పినదానినిపట్టి చూస్తే నీమీదను ఇంతభారం ఉంచడం చాలా అన్యాయమని తోచింది."

గుండెజబ్బు లక్షణాలు కనబడుతున్నవని డాక్టర్ అన్నాడు. చిన్నప్పుడు విప్రదాస్ కుస్తీ అభ్యాసముచేసేవాడట, మనోవ్యథ ఇప్పుడు దానితో కలియడమువల్ల ఈ అవస్థ వచ్చిందని డాక్టరుగారి అభిప్రాయం.

సుబోధ్‌ను ఇలా తొందరపెట్టి తెప్పించడం మంచిదానో కాదో నిర్ణయించలేక విప్రదాస్ ఆలోచిస్తూ కూర్చున్నాడు.

కాలూ—"వృథాగా ఎందుకు అలాగు గడబడపడతావు పెద్దబాబూ? డబ్బువిషయమై సరిఅయిన ఏర్పాటు తత్‌క్షణం

చేయడము చాలా అవసరము. కనుక చిన్నబాబు వెంటనే రాక వీలులేదు. నూటికి పన్నెండురూపాయలు వడ్డీ ఇస్తూ మార్వాడీలకు తల అమ్ముకుంటానంటే నేను ఒప్పుకోలేను. అదికాక ఇచ్చేదానిలో రెండులక్షలు వడ్డీకిగాను ముందుకొట్టుకొని మిగిలినదే ఇస్తారట. పైగా బ్రోకర్లకు ఈయవలసిన కమిషన్ ఉండనే ఉన్నది."

"సరే సుబోధ్ రానీ—కాని, వస్తాడా అని నేను సంశయించేది."

ఎంత పెద్దదొర అయినా నీ టెలిగ్రామ్ అందినతరువాత రాకపోవడమే! నీకు అభయం అక్కరలేదు. కాని ఇక ఆలస్యం చేయకూడదు అన్నయ్యా, చిన్నఅమ్మాయిని అత్తవారింటికి పంపించేనే ఏర్పాటు చేయి."

విప్రదాసు కొంచెముసేపు ఊరకొని, "మధుసూదన్ రమ్మని కబురుపంపనిదే వెళ్లడానికి వీలులేదు," అన్నాడు.

"ఏమి అది! అమ్మాయి మధుసూదనుని ఇంట్లో జీతానికి ఉన్న నౌకరా? తనఇంటికి తాను వెళ్లడానికి అతని సెలవు ఎందుకు?"

ఫలహారం అయిన తరువాత నవీన్ విప్రదాసు గదిలోకి వచ్చి కూర్చున్నాడు. విప్రదాస్, "నీవంటే చాలా ప్రేమ కుముదు," అని అన్నాడు.

"నేను అయోగ్యుడనని ఆమె ఎరుగును, కనుకనే నామీద అంత దయ," అని నవీన్ జవాబుచెప్పాడు.

"కొన్ని సంగతులు నిన్ను అడగవలెనని ఉన్నది, నాదగ్గిర నీ వేమీ దాచకూడదు."

"మీతో చెప్పడానికి నేను అనుమానించగల సంగతి ఒక్కటి లేదు."

"కుము ఇక్కడికి రావడములో ఏదో చిక్కు ఉన్నదని నా అనుమానం."

మీరు సరిగానే పోల్చుకొన్నారు. ఎవరికి ప్రపంచములో అనాదరణ కలగడం అసంభవమని అనుకుంటామో అలాంటి వాళ్లకే అనాదరణ కలుగుతుంటుంది."

"అనాదరణ జరిగిందన్నమాట, అయితే!"

"ఆ సిగ్గువల్లనే వచ్చాను. మీ పాదధూళి తీసుకొని నన్ను క్షమించమని కోరుకోవడమే నేను చేయగలది అంతా.

"కుము ఇవాళే మీ ఇంటికి వచ్చేయడమువల్ల హాని కలగవచ్చునా?"

"నిజం చెపుతున్నాను—నమ్మనడానికి తగిన సాహసం నాకు లేదు."

జరిగినదేదో సరిగా చెప్పుమని విప్రదాస్ నవీన్‌ను అడగ లేదు—అట్లా అడగడం అన్యాయమని అతని అభిప్రాయం, కుమును అడిగికూడా సంగతి కనుక్కోవడం మంచిది కాదని విప్రదాసుకు తోచింది. అతని మనస్సును మాత్రం తొట్రుపాటు విడవకుండా ఉన్నది. కొంతసేపు అయినతరువాత కాలూను

పిలిపించి, "నీవు వాళ్ల ఇంటికి వెళ్లివస్తుంటావు—మధుసూదన్ సంగతి నీకు కొంత తెలిసి ఉండాలి," అని అన్నాడు.

"సూచావాచా కొంత గ్రహించాను, కాని పూర్తిగా తెలియనిదే నీతో ఏమీ చెప్పడానికి ఇష్టములేదు. మరి రెండు రోజులు ఓర్చిఉండు అంతా చెప్తాను."

విప్రదాసుకు గొప్పబాధ కలిగింది. ప్రతీకారం చేసే ఉపాయం చేతిలో లేకపోవడముచేత మాటిమాటికి అతనికి గుండెలో పొడిచినట్లు అయింది.

## ౫౧

కుము ఎన్నాళ్లనుండో మనసార కోరుతుండేది ఇప్పుడు నెరవేరింది. తనకు పరిచయమైన గదులలోనికి, అన్నయ్య ప్రేమతోనిండిఉన్న ఇంటికి, తిరిగి వచ్చింది. కాని మునుపటిచనవు ఎక్కడా లేనట్టుగా తోచింది. "ఈమె తిరిగి ఎందుచేత వెళ్లడం లేదు? ఏమి అయింది ఈమెకు?" అని ఇంట్లోవారు అందరూ అనుకుంటున్నట్టుగా ఆమెకు స్పష్టం అయింది, కనుక అత్తవారింటికి తిరిగి వెళ్లిపోదామని కూడా అప్పుడప్పుడు తోచింది. అన్నయ్యకు ఆమెయెడలగల గాఢానురాగములో కొంత తత్తరుపాటు ఉండెను; అంతా తననుగురించే తమలోతాము అనుకుంటున్నారు, కాని ఆసంగతి ఆమె ఎదుట బయటికి రానీయకుండా ఉన్నారు.

సాయంకాలం కావస్తున్నది. పొద్దుకుంగి పోతున్నది. కుము కిటికీదగ్గిర కూర్చొని ఉన్నది. కాకులు అరుస్తున్నవి,

బయటిదారిలోనుండి బళ్ళశబ్దమూ మనుష్యుల మాటలూ వినబడుతున్నవి. నవవసంతవాయువులు కలకత్తానగరపు ఇటుక గోడలకు కొత్తరంగు తెప్పించలేకపోయినవి. ఇంటిముందరనున్న బాదంచెట్టు ఎదుటిఇంటిని కనబడనీయకుండాఉన్నది. గాలికి బాదంఆకులు ఉయ్యాళ్ళూగుతున్నవి. చట్టంగాఉన్న బాదం ఆకులు ఆడుతుండడమువల్ల ఎండ తునకలుతునకలయి నేల పడుతున్నది. అటువంటి సమయాలలో ఎప్పుడు లేళ్ళకుకూడా అడవులలోకి పారిపో బుద్ధి వేస్తుంది. ఆ వసంతఋతుస్పర్శ తగిలిన నాడే పృథ్వి, ఔత్సుక్యముతో, దూరాన నీలాకాశమువిూద నుండే దారిని వెదుకుతున్నట్టు చూస్తుంటుంది. హద్దులచే బంధించబడిన వస్తువులన్నీ మిథ్య అనిపిస్తుంది ఆసమయములో; హద్దులులేని అనంతమే సత్యమని తోస్తుంది. నేడు కుము మనస్సు ఊపిరి అందక బాధపడుతున్నది, అన్నీ విడిచిపెట్టి పారిపోతా నంటున్నది, తననుకూడా విడిచిపెట్టుకు పోతానంటున్నది. కాని ఏమిటి ఈ బంధాలు! ఈ ఇంట్లోకూడా ముక్తి ఉన్నట్టులేదే ఇవాళ! మృత్యువే ఊహాకు అన్నిటికంటె మధురమైనది అని తోస్తున్నది!

అన్నయ్య జబ్బు ముదిరిపోతున్నదని జ్ఞాపకం వచ్చింది. అన్నకు సేవచేదామని వచ్చింది కాని తనమూలానే అన్నజబ్బు ముదిరిపోయింది. ఇప్పుడు తాను ఏమిచేయబోయినా ఫలము విపరీతం అవుతున్నది. కుము రెండుచేతులలో ముఖం పెట్టుకొని తృప్తితీర ఏడ్చింది. దుఃఖం కొంచెం తగ్గగానే అత్తవారింటికి

వెళ్లిపోవలెనని నిశ్చయించుకొన్నది. ఏమిఅయితే అది అవుతుంది, ఏదిఅయినా భరించవచ్చును—చివరకు ముక్తి ఉండనే ఉన్నది, బహాంచల్లని ముక్తి—మధురమైనది, గాఢమైన! ఆ మృత్యువును స్పష్టంగా ఊహించుకోగలిగినకొద్దీ ఎటువంటి బాధఅయినా భరించగలనని ఆమెకు నమ్మకము కలిగింది.

మధ్యాహ్నం అన్నయ్య నిద్రపోవడంచూచి గదిలో నుంచి వచ్చేసింది కుము; మంచుపుచ్చుకొనే వేళకాగానే తిరిగి గదిలోకి వచ్చి చూచింది, అన్నయ్య లెటరు-ప్యాడ్ తీసి సుబోధ్‌కు పెద్దఉత్తరం వ్రాస్తున్నాడు. కుము అతనిని చీవాట్లు పెడుతూ, "ఇవాళ నీవు నిద్రపోలేదు అన్నయ్యా," అని అన్నది.

"నిద్రపోతేనే విశ్రాంతి దొరుకుతుందని పట్టుకు కూర్చున్నావు, ఉత్తరం వ్రాయడం అవసరమని మనస్సుకు తోస్తున్నంతసేపు ఉత్తరం వ్రాయకుండాఉంటే విశ్రాంతి కలగదు."

వ్రాసే అవసరము తనవల్లనే వచ్చిందని కుముకు బోధ పడ్డది. సముద్రానికి ఇవతలనున్న ఒకఅన్నకు బాధ కలిగిస్తున్నది, అవతలనున్న ఇంకొక అన్నను కూడా చీకాకు పెడుతున్నది! "ఎంత దురదృష్టంతో కలిసి పుట్టిన చెల్లెలిని నేను!" అని అనుకొంటూ కుము తనలో తాను దుఃఖిస్తున్నది. అన్నయ్య టీ తాగడంఅయిన తరువాత, "చాలా రోజులయింది అన్నయ్యా. ఇక వెళ్ళిపోదామని నిశ్చయించాను," అని అన్నది.

చెల్లి అన్నదాని భావమేమిటో తెలుసుకుందామని విప్రదాస్ కుముముఖంవైపు చూస్తున్నాడు. అన్నాచెల్లెలూ ఒకరి నొకరు స్పష్టంగా బోధపరుచుకుండేవారు ఇప్పటివరకు, కాని ఇప్పుడు అది లేదు మరి—భావం తెలుసుకోవాలంటే తడుముకోవలసి వస్తూఉంది. విప్రదాసు ఉత్తరం వ్రాయడము నిలిపి, చెల్లెలిని పక్కను కూర్చోపెట్టుకొని ఆమె చెయ్యిమీద తన చెయ్యిఉంచి మెల్లిగా నిమిరాడు, ఏమీ మాటలాడలేదు. కుము ఆ భాష ఎరుగును. సంసారబంధం కఠోరంఅయింది కాని అన్నాచెల్లెళ్ల ప్రేమలోమాత్రం మార్పురాలేదు. కుము కన్నీటిని ఆపుకొన్నది. ఆ ప్రేమమీద బరువు మోపకూడదని నిశ్చయించి, "వెళ్ళిపోదామని నిశ్చయించాను అన్నయ్యా," అని మళ్ళీ అన్నది.

విప్రదాసుకు ఏమి జబాబు చెప్పాలో తోచలేదు, వెళ్లడమే మంచిదేమో అని అతనికి తోచింది, మంచిదైనా కాకపోయినా వెళ్లడం కర్తవ్యము కాబోలు! అతను ఏమీ అనలేదు ఇంతసేపూ నిద్రిస్తున్న కుక్క లేచి కుము ఒళ్లో ముందు కాళ్లువేసి విప్రదాసువైపు చూచింది, మామూలుగా అతను ఇచ్చే రొట్టెముక్క కోసము.

నౌకరు, రామస్వరూప్, వచ్చి ముఖర్జీబాబు వచ్చారని చెప్పాడు. కుము గాబరాపడి అన్నది—"ఇవాళ నీకు నిద్ర లేనే లేదు అన్నయ్యా, కాలూడా వచ్చి నీతో వాదిస్తూ కూర్చున్నాడంటే మరీ ఆయాసంగా ఉంటుంది. నేను వెళ్ళి

మాట్లాడుతాను, అంతగా నీతో చెప్పవలసినది ఉంటే వీలైనప్పుడు చెప్తా."

"గొప్ప డాక్టర్‌వు కదూ! మనము వినవలసినమాట మనకు బదులుగా ఇంకొకరు వినేస్తే మన మనస్సుకు శాంతి కలిగిపోతుంది కదూ!"

"సరే అయితే, నాతో చెప్పనక్కరలేదు, కాని ఇవాళ మాత్రం కాలూదాతో మాట్లాడకు అన్నయ్యా."

"మన చెవిలోపడ్డ సంగీతం మధురం అనీ, పడనిది మధురతరమనీ ఇంగ్లీషు కవి ఒకడు అన్నాడు. ఆమాదిరిగానే చెవిని పడ్డమాట గాబరాపుట్టిస్తే పడనిది మరీ గాబరా కలిగిస్తుంది. కనుక వినవలసిన దేదో త్వరగా వినడమే మేలు."

"సరే అలాగే కాని, కాని పదిహేను నిమిషాలలో మళ్లీవస్తాను, అప్పటికి మీ మాటలు పూర్తిఅయిపోతే సరే సరి, ఇంకా మాటలు జరుగుతుంటేమాత్రం నా ఎస్‌రాజు తీసుకువచ్చి పాట ప్రారంభిస్తాను."

"అలాగే కాని."

అర ఘంట అయిన పిమ్మట కుము ఎస్‌రాజ్ పట్టుకొని గదిలోకి వచ్చింది, కాని అన్నముఖం చూడగానే ఎస్‌రాజ్‌ను గోడకు చేరవేసి, అన్నపక్కను కూర్చొని అతని చెయ్యిగట్టిగా పట్టుకొని, "ఏమిటిఅయింది అన్నయ్యా?" అని అడిగింది.

విప్రదాసు లోలోపల ఆందోళనపడుతున్నాడని కుము ఎరుగును—ఆ ఆందోళనలో గాఢవిచారం ఉండెను. అతను

చాలా దుఃఖమూ కష్టాలూ అనుభవించాడు కాని బయటికి కలత చెందడం ఎన్నడూ కానరాలేదు. ఎప్పుడూ ఏదో చదువుతూ ఉండేవాడు, పాటా వాద్యమూ అంటే సరదా, దుర్భిణీతో రాత్రి నక్షత్రాలు పరిశోధించేవాడు, గుర్రపుసవారికి వెళ్లేవాడు, దూరదేశాలనుండి కొత్తకొత్త మొక్కలూ, చెట్లూ తెప్పించి తోటలో వేసేవాడు—ఇటువంటిపనులలో అతనికిగల ఉత్సుకత వల్ల దుఃఖానికి అతని మనస్సులో తావుదొరకలేదు. ఇప్పుడు రోగపీడితుడయిపోయినాడు, దుర్బలత అతనిని నాలుగువైపులా బంధించేసింది. అతనికి సేవ అవసరము, బయటివాళ్ల సాంగత్యం అవసరము. అనుకున్నప్రకారం ఉత్తరాలు రాకపోతే చీకాకుపడుతున్నాడు, దగ్గిర ఎవ్వరూ లేకపోతే తోచదు, నానారకాల దుశ్చింతలు మనస్సును బాధిస్తున్నది, కనుక కుము అన్నకు కేవలం తల్లివలె అయిపోయింది. అంత ఆత్మసంయమనమూ, గాంభీర్యమూ, ఓర్మిగల అన్నయ్యలో పిల్లవాళ్లలో కనబడే చాంచల్యమూ, పంతమూ, నిర్లక్ష్యమూ, ఎక్కడనుంచి వచ్చినవో కుముకు బోధపడలేదు. వీటి అన్నిటితోపాటు గొప్ప పరితాపం కూడా అతనిలో కనబడుతున్నది.

అన్ననేత్రాలలో మండుతున్న అగ్ని శివుని మూడో నేత్రంలోని అగ్నివంటిది—తనవేదనవల్ల పుట్టిన కోపం కాదు, ఎదుటనుండే పాపాన్ని దగ్ధంచేదామనే కోరికవల్లపుట్టినది. చెల్లెలి ప్రశ్నకు జబాబుచెప్పక గోడవైపు చూస్తూ కూర్చున్నాడు.

మరికొంతసేపు అయినతరువాత కుముమ మళ్ళీ అడిగింది—
"ఏమిటిఅయింది అన్నయ్యా, చెప్పవూ ?"

విప్రదాసు దూరానఉన్న ఏదోగురివై చూస్తూన్నట్టుగా చూస్తూ అన్నాడు—"దుఃఖాన్ని తప్పించుకోవలెనని ప్రయత్నిస్తే దుఃఖం మనను వశపరుచుకొని కూర్చుంటుంది. దానిని దగ్గరకు రానిచ్చి ధైర్యంతో ఎదుర్కోవాలి."

"నాకు ఉపదేశం చేయి అన్నయ్యా, నేను భరించగలుగుతాను."

"మన సంఘములో స్త్రీకి జరుగుతున్న అవమానం ప్రత్యేకించి ఏఒక్క స్త్రీకో చేసిన అవమానము కాదు—సమస్త స్త్రీజాతికీ చేసిన అవమానము—ఈ సంగతి నాకు ఇప్పుడు బోధపడ్డది."

అన్నయ్య అన్నమాట కుముకు బాగా బోధపడలేదు.

విప్రదాసు—"బాధ నాఒక్కడిదే అనుకొని ఇన్నాళ్లూ చాలా కష్టపడ్డాను. అందరి తరఫునా పోట్లాడవలెనని ఇప్పుడు బోధ పడ్డది."

తెల్లబారిన విప్రదాసు ముఖము ఎర్రనయింది. అతని ఒడిలో పట్టుపువ్వులుఅల్లిన చిన్న చౌకము బాలీసు ఉండెను. దానిని విసిరివేసి, మంచముమీదినుండి లేచి పక్కనున్న కుర్చీ మీద కూర్చో బోతున్నాడు, కుముమ అతని చెయ్యి గట్టిగా పట్టుకొని, "లేవకు అన్నయ్యా జబ్బు ముదురుతుంది," అన్నది. అంటూ వెనకనుండే బాలీసుమీద అన్నయ్యను పడుకో పెట్టింది.

కందువాను చేతితో నులిపి పట్టుకొని విప్రదాస్ చెల్లితో అన్నాడు—"సహించి ఉండడము తప్ప స్త్రీలకు వేరు ఉపాయం లేదు గనుకనే వారిమీదపడే దెబ్బలు మరీ అధికం అవుతున్నవి. ఇక మేము సహించి ఊరుకోము అని చెప్పే రోజు వచ్చింది. 'ఇదే నా ఇల్లు' అనుకొని ఇక్కడ ఉండి పోగలవూ కుమూ ? ఆ ఇంటికి నీవు మరి వెళ్లకూడదు."

కాలూ చెప్పగా విప్రదాసు ఇవాళ చాలా సంగతులు విన్నాడు.

శ్యామాసుందరికీ మధుసూదనునికీ గల సంబంధములో రహస్యమేమీ లేదు. ఇద్దరికిద్దరూ సాహసముగలవారే. లోకులు వాళ్లను అపరాధులంటున్నారని తెలిసి మరీ సాహసం కనపరుస్తున్నారు. వాళ్లసంబంధములో సూక్ష్మమైనదిగాని, సున్నితమైనదిగాని ఏమీలేక పోవడముచేత వాళ్లకు ఇతరుల దగ్గరగాని ఒకరిదగ్గిర ఒకరికిగాని ఏదీ దాచుకు తిరగడం అవసరములేక పోయింది. అప్పుడప్పుడు మధుసూదన్ శ్యామను కొడుతున్నాడట కూడాను. శ్యామ నలుగురిఎదుటా గట్టిగా కేకలువేసుకొంటూ పోట్లాడినప్పుడు, "పో జాతీ నీతీ లేనిదానవు! మా ఇంట్లోనుంచి పో," అని అన్నాడట. కాని దానివల్ల ప్రయోజనం లేకపోయిందట. శ్యామపైని మధుసూదన్ పూర్తిగా అధికారం చలాయిస్తున్నాడు. మధుసూదన్ ఇచ్చిన దాని మీద తప్ప దేనిమీదనైనా ఆమె చెయ్యి వేసింది అనగానే

తిట్టుతింటున్నది. ఇంట్లో మోతీతల్లి పదవి తనకు వస్తుందని శ్యామ చాలా ఆశించింది. అక్కడా పరాభవమే అయింది, మధుసూదన్‌కు మోతీతల్లిమీద ఉన్న నమ్మకం శ్యామమీద లేదు. మధుసూదన్‌కు శ్యామతోగల సంబంధములో సౌకు మార్యము ఏమీ లేదు, మార్దవమూ లేదు. మధుసూదన్ ఆమెకు ఊహానిర్మితమైన రమ్యరూపమొకటి ఇచ్చి తనను తాను భ్రమపరచుకోలేదు. కాని అతని మనస్సులో మోటు తరహా కోరికమాత్రం బాగా ఉండెను. ఆమెను శీతకాలంలో మనము ఉపయోగించుకొనే దళసరి మురికి రొజాయితో సరి పోల్చవచ్చును—రొజాయిలో నగిషీపని కొంచెమైనా ఉండదు. జాగ్రతగా కాపాడుతుండవలసిన వస్తువు కాదు, మంచము మీదనుంచి కింద ధూళిలో పడవేసినా దానికేమీ నష్టం కలగదు, అయినప్పటికీ మనకు కొంత హాయిని ఇస్తూ ఉంటుంది. శ్యామ దగ్గిర జాగ్రత్తగా నడచుకోవడం అవసరము లేక పోయేది. అదికాక శ్యామ తనదేహాన్నీ మనస్సునూ పూర్తిగా మధుసూదన్‌కు ఇచ్చి అతనిని పెద్దగా భావిస్తున్నది, అతని కొరకు ఆమె చేయలేనిది లేదు, ఎంత సహించి అయినా ఉండ గలదు. ఈ సంగతి శ్యామచేసే ప్రతి పనిలోనూ స్పష్టమవు తుండేది. దీనివల్ల మధుసూదన్‌కు తనయెడలగల గౌరవానికి నష్టం కలుగకుండా ఉండేది. కాని కుము ఉన్నంతనే ప్రతి దినమూ తన ఆత్మగౌరవానికి ఏదో దెబ్బతగిలేది.

మధుసూదనుని ఈ ప్రస్తుతచరిత్ర తెలుసుకోడానికి కాలూ ఆట్టే కష్టపడవలసిన పని లేకపోయింది. ఇవిఅన్నీ ఆ ఇంట్లో అందరూ స్వేచ్ఛగా అనుకుంటున్న సంగతులే; రోజూ అనుకొని అనుకొని, విసిగి, ఇప్పుడు అనుకోడం మానేశారు కూడాను.

ఈ కథ అగ్నిబాణమయి విప్రదాసు హృదయములో గుచ్చుకున్నది. మధుసూదన్ తన దుర్నీతిని దాచడానికైనా ప్రయత్నిస్తుండ లేదు—భార్యను అవమానపరచడం అంత సులభము. భార్యపై దుర్నయము చేయపూనుకుంటే బయట నుండే ఆటంకాలు బహుస్వల్పము. ఎట్టి సాయమూ లేని భార్యను భర్తకు వశపరిచే యంత్రాలూ, యంత్రణాలూ, చిత్రహింసలూ, మన సంఘము చాలా ఎరుగును. శక్తిలేని భార్యను రక్షించగల మార్గము ఒక్కటైనా లేదు. యుగాల తరబడి ఇంటింటా వ్యాపిస్తున్న ఈ అవమానము, ఈ దారుణ దుఃఖము, విప్రదాసుకు ఒక్కక్షణములో కళ్లకు కట్టినట్టు స్పష్ట మయింది. సతీత్వాన్ని దట్టంగా బయట పూసి సంఘము ఆ బాధను చంప ప్రయత్నం చేస్తున్నది, కాని ఆ బాధ కలిగించ డానికి అవకాశము లేకుండా చేయదు. భార్యలు అంత చవక, అంత పనికిమాలినవస్తువులు!

విప్రదాస్—"అవమానము సహించిఉండడం కష్టం కాదు కాని సహించి ఊరుకోవడం అపరాధము కుమూ,

లోకంలో ఉండే అందరితరఫున లేచి నీ మర్యాద నీవు కాపాడుకోవాలి. సంఘము నిన్ను ఎంత బాధపెట్టినా సరే నీవు మాత్రము లొంగకూడదు కుమూ."

కుము—"నీవు ఏ అవమానము మాట అంటున్నావో నాకు బోధపడలేదు అన్నయ్యా."

"అయితే నీ కింకా అంతా తెలియదన్నమాట."

"తెలియదు."

విప్రదాసు కొంచెము ఊరుకొని జబాబు చెప్పాడు—"భార్యలకుజరుగుతున్న అవమానమువల్ల కలిగే దుఃఖమంతా నా మనస్సులో కూడి ఉన్నది కుమూ, ఎందుచేతనో తెలుసునా?"

కుము జబాబుచెప్పక అన్నముఖమువైపు చూస్తూ కూర్చున్నది. కొంతసేపయిన తరువాత విప్రదాసే అన్నాడు—"చిరకాలమూ అమ్మపడ్డబాధ నేను ఎన్నటికీ మరవలేను. కర్తవ్యజ్ఞానములేని మనసంఘానిదే ఆ పూచీ."

ఈ విషయంలో అన్నదీ చెల్లెలిదీ ఒక్క మతం కాదు. కుము తండ్రిని బహుప్రేమించేది, అతని హృదయం మిక్కిలి కోమలమైనదని కుము ఎరుగును. దోషాలన్నీ పోగా తండ్రిలో గొప్ప ఘనత ఉండేది—ఆ మాట ఒప్పుకోక తీరదని కుము నమ్మేది. అంతేకాదు—తండ్రి జీవితము చివరకు అంత దుఃఖకరంగా పరిణమించినందుకు తల్లినే కుము లోలోపల నిందించేది.

విప్రదాసుకూడా తండ్రియెడల భక్తి కలిగి ఉండేవాడు. కాని అతను పదేపదే నీతిమార్గము తప్పి అందరియెదుట తల్లిని అవమానపరచడానికి సంకోచించలేదు—ఇదిమాత్రం విప్రదాసు క్షమించలేక పోయినాడు. తన తల్లికూడా ఈ అవమానాన్ని క్షమించలేదని లోలోపల గర్వపడేవాడుకూడాను.

విప్రదాస్—"అమ్మకు జరిగిన అవమానము సమస్త స్త్రీజాతికీ కలిగిన అవమానము కుమూ. ఒక్క నీమాటే అనుకోక, స్త్రీజాతి అంతటిమాటా మనస్సులో పెట్టుకొని వాళ్ల పక్షమయి అవమానాన్ని ఎదిరించు, లొంగిపోకు."

"నాన్నకు అమ్మఅంటే చాలా ప్రేమ, ఆమాట మరిచిపోకు అన్నయ్యా. ఆ ప్రేమలో చాలా పాపాలు తుడుచుకుపోతవి," అని కుము ముఖము దించి నెమ్మదిగా జబాబు చెప్పింది.

"అది ఒప్పుకుంటాను, కాని అంతప్రేమఉన్నా అంత సులభంగా అమ్మకు సన్మానహాని కలిగించగలిగేవాడు నాన్న—ఈ పాపము సంఘానిది. అంటువంటిసంఘాన్ని నేను క్షమించలేను. సంఘానికి ప్రేమతో పనిలేదు, సంఘానికి కావలసినది విధానాలు, నియమాలు.''

"నీవు ఏమైనా విన్నావా ఏమిటి అన్నయ్యా?"

"ఔను విన్నాను, కాని ఆసంగతులు ముందెప్పుడో చెపుతాను మెల్లి మెల్లిగా."

"అదే మంచిది అన్నయ్యా. ఇవాళ ఏమేమో మాటలన్నీ విన్నావు, నీ ఒళ్లు మరీ పాడుఅయిపోతుంది."

"కాదు కుమూ, నీవు పొరపాటు పడుతున్నావు. ఇన్నాళ్లపట్టి దుఃఖం నన్ను క్రుంగదీసేస్తుండేది. శరీరంలో ప్రాణము ఉన్నన్నాళ్లు యుద్ధం చేయవలసిందని నామనస్సు ఇప్పుడు చెపుతున్నది—కనక లోపలనుండి శక్తిపుడుతున్నది."

"దేనికోసం యుద్ధం అన్నయ్యా?"

"స్త్రీకి ఆమె విలువనుఇయ్యక మోసపుస్తున్న సంఘంతో యుద్ధము చేయాలి."

"దానికి నీవు ఏమిచేయగలవు అన్నయ్యా?"

"మొట్టమొదటి పని, దానికి లొంగకుండా ఉండడము. అదికాక ఇంకేమి చేయగలనో ఆలోచించాలి కుమూ, కాని యుద్ధం ఇవాళే ప్రారంభము. ఈ ఇంట్లో నీకు స్థలము ఉన్నది. అది పూర్తిగా నీదేను, ఇంకెవరితో మంచిచేసుకొని నీవు ఇక్కడ ఉండనక్కరలేదు. స్వాధికారంతో స్వేచ్ఛగా ఇక్కడే ఉండు కుమూ."

"ఆలాగే గాని, అన్నయ్యా ఇవాళ నీవు ఇక మాట్లాడకూడదు."

సంభాషణ జరుగుతున్నది—మోతీతల్లి వచ్చింది అని దాసీ వచ్చి కబురుచెప్పింది.

గ౨

కుముమోతీతల్లీ పడకగదిలో కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు, చీకటి పడ్డది, నౌకరు దీపం వెలిగించడానికి వచ్చాడు. కాని కుము దీపం అక్కరలేదన్నది.

కుము వింటూ కూర్చున్నది, ఏమీ అనలేదు.

మోతీతల్లి—"మనఇంటికి దెయ్యముపట్టింది అక్కా, అక్కడ ఉండలేకుండా ఉన్నాను. నీవు అక్కడికి రావా?"

"పిలుచుకు రమ్మన్నారా?"

"పిలిపించాలని తోచనే లేదేమో. కాని నీవు రాకపోతే వీలు లేదు."

"వచ్చి నేను చేయవలసినది ఏమిటి?—నేను అతనిని తృప్తిపరచలేనే! బాగా ఆలోచించిచూస్తే అంతా మామూలాన్నే జరిగింది అని నాకు తోస్తున్నది, కాని దేనినీ ఆపే ఉపాయమూ నాచేతిలో లేదు. నేను ఈయగలిగినది అతను పుచ్చుకోలేక పోయినాడు, ఇవాళ శూన్యహస్తాలతో వెళ్లి నన్ను ఏమి చేయమన్నావు?"

"ఏమిటి నీవుఅనేది అక్కా, నీదే సంసారముఅంతా, నీవు దానిని వదలడానికి వీలులేదు."

"సంసారం అంటే ఏమిటి చెల్లీ!—ఇల్లూ, వాకిలీ, ఇంట్లోని సామానూ, మనుష్యులూ—అంతేనా! చెప్పడానికి

సిగ్గుగాఉన్నది, కాని నాకు వాటిమీద అధికారంలేదు. లోపలి అధికారము పోగొట్టుకొని ఈపై వాటికి కకూర్తి పడడము వల్ల ఏమిలాభం?"

"ఏమిటి అంటున్నావు అక్కా, ఇంటికి మరి రానే రానంటున్నావా?"

"అన్ని సంగతులూ పూర్తిగా బోధపరుచుకోలేకుండా ఉన్నాను, నాలుగురోజులక్రితం అయిఉంటే దేవుని అడిగి ఉందును—ఏదో సూచనద్వారా తనఆజ్ఞను తెలుపమని; లేదా జ్యోతిష్కుడి దగ్గిరికి వెళ్లిఉందును. కాని ఇప్పుడు ఆ నమ్మకా-లన్నీ నున్నగా కడుక్కుపోయినవి. ఆరంభంలో అన్నిలక్షణాలు శుభసూచకంగానే ఉండెను, కాని ఒకటీ ఫలించలేదే! ఇప్పుడు కూర్చొని ఎన్నోసార్లు అనుకుంటున్నాను—దేవునికంటె అన్నయ్యను నమ్మిఉంటే ఏ ఆపదా రాకపో నని. అయినా ఇప్పటికీ మనస్సులో సందేహం కలుగుతున్నా హృదయములో నుంచి మాత్రము దేవుని తప్పించుకోలేకుండా ఉన్నాను—తిరిగి తిరిగి వచ్చి అతని ఎదుటనే పడి దొర్లుతున్నాను."

"నీమాటలు వింటూఉంటే భయంవేస్తున్నది. ఇంటికి మరి రావా?"

"ఎన్నడూ రాను అని అనుకోడం కష్టమే, కాని వస్తానని చెప్పడంకూడా సులభంకాదు."

"సరే మీఅన్నయ్యతో మాట్లాడి చూస్తాను—చూదాము అతను ఏమిటి అంటాడో—ఆయనను చూడడానికి వీలు అవుతుందా?"

"పద చెల్లీ, ఇప్పుడే చూడువు గాని."

గదిలో ప్రవేశించి విప్రదాసును చూడగానే, మోతీ తల్లి నిర్ఘాంతపోయి నిలబడి పోయింది. భూకంపమువచ్చి, శిఖరము-విరిగిపడిన, దీపములేని దేవాలయం మాదిరి అతను కనబడుతున్నాడు. లోపల చీకటి, అదికాక నిస్తబ్ధత. మోతీ తల్లి ప్రణామముచేసి, పాదధూళి తీసుకొని నేల కూర్చున్నది.

విప్రదాస్ గడబడ పడుతూ, "ఇదిగో ఈ కుర్చీ మీద.—"

మోతీతల్లి తల ఆడిస్తూ, "వద్దు ఇక్కడే బాగుంది," అన్నది.

ముసుగులోనున్న మోతీతల్లికళ్లు తడి అయినవి. అన్న అవస్థచూచి కుము ఎంతబాధ పడుతుండాలో గ్రహించింది.

సంభాషణ సులభంగా నడిచేటట్లు చేదామని, కుమే ప్రారంభించింది—"ఆమె ముఖ్యంగా నీ అభిప్రాయం తెలుసు కొందామని వచ్చింది అన్నయ్యా."

"అబ్బే దానికి రాలేదు, ఆపని తరువాత చేయ వచ్చును, మీపాదదర్శనానికని ముఖ్యంగా వచ్చాను," అని మోతీతల్లి అన్నది.

"వాళ్లఇంటికి నేను వెళ్లుతానో లేదో కనుక్కుందామని వచ్చింది."

విప్రదాసులేచి కూర్చొని అన్నాడు—"అది పైవాళ్ల ఇల్లు, కుము అక్కడికి వెళ్లి ఎట్లాగు ఉంటుంది?" ఆ మాటలు

అతను కోపంగా అంటే మాటలలోపల ఉండేనిప్పు ఇంత తీవ్రముగా మండకపోను—అతని కంఠము అతి శాంతముగా ఉండెను, ముఖంలో ఉత్తేజనలక్షణాలు లేశమైనా లేవు.

మోతీతల్లి కుముచెవిలో ఏమోచెప్పింది. ఆమె ఉద్దేశం కుము అన్నయ్యపక్కను కూర్చొని తాను చెప్పినదంతా, అన్నయ్యచెవిలో చెప్పవలెనని, కాని కుము "నేను చెప్పను, నీవే గట్టిగా చెప్పు," అని అన్నది.

"తన పదార్థాన్ని ఎవరూ పరులదానిగా చేయలేరు, ఎంతటి వారికైనా ఆ అధికారంలేదు," అని గొంతుకఎత్తి అన్నది మోతీతల్లి.

విప్రదాస్—"నీవు పొరపాటు పడుతున్నావు. కుము అతనిని ఆశ్రయించి ఉన్నది, అంతేను—అధికారబలమువల్ల ఉండడంలేదు. ఆమెను అక్కడనుండి వెళ్లగొడితే నలుగురూ నిందించవచ్చును కాని ఎవరూ అడ్డు రాలేరే. అనుభవిస్తున్న శాస్తిఅంతా ఆమె ఒకతెదే. అయినా ఆశ్రయం పవిత్రమైనదీ, ఘనమైనదీ అయిఉన్నట్లైతే అతను కేవలం దయతలచి కుమును అక్కడ ఉండనిచ్చినా ఆమె ఆ మహదాశ్రమములో అంతా సహిస్తూ ఉండునేమో."

విప్రదాసు అన్నదానికి ఎటువంటి జబాబు చెప్పాలో మోతీతల్లికి తెలియలేదు. భార్య భర్తదగ్గిరికి వెళ్లబోతే విఘ్నాలు సంభవించినప్పుడు భార్యపక్షమువారు భర్తకాళ్లు

పట్టుకుంటారు—మోతీతల్లికి తెలిసినంతవరకు ఇదే లోకాచారం—కనుక ఆమెకు విప్రదాసు వ్యవహారం తలక్రిందుగా కనపడ్డది.

కొంచెం ఊరుకొని మోతీతల్లి జబాబుచెప్పింది—"తన ఇల్లు తన సంసారం అంటూ ఏవీ లేకపోతే స్త్రీలు బ్రతకలేరే! పురుషులు ఇక్కడా అక్కడా తిరిగి ఏలాగైనా బ్రతకగలరు. ఆడవాళ్లకు స్థిరమైన స్థానం ఒకటి అవసరం కదా."

"అవమానము మధ్యనా స్థిరమైన స్థానము, అగౌరవం మధ్యనా? నేను ఒక్కమాట చెపుతున్నాను జ్ఞాపకం ఉంచుకొండి—కుమును నిర్మించినవాడు నఖశిఖపర్యంతము బహు శ్రద్ధవహించి నిర్మించాడు. కుమును అవమానపరచగల యోగ్యత ప్రపంచంలో ఎవ్వడికీ లేదు—రాజులకు లేదు, చక్రవర్తులకు లేదు."

మోతీతల్లికి కుముఅంటే అమితానురాగం, ఎంతో భక్తి. కాని భర్తకుమించిన విలువ ఏ భార్యలోనైనా ఉన్నది అంటేమాత్రం ఆమె చెవులకు ఇంపుగా ఉండదు. స్త్రీ భర్తతో రోజూ పోట్లాడుతుండవచ్చు, భర్త భార్యను అనాదరణచేసి ఆమెను అవమానపరచవచ్చు, బాధ భరించలేక భార్యనల్లమందు తిని చచ్చిపోవచ్చు, పీకకు ఉరివేసుకొని చావవచ్చు—కాని భార్య భర్తను విడిచిపెట్టి తనశక్తిపైనే ఆధారపడి బ్రతుకుతానడం సిగ్గుమాలినతనమని మోతీతల్లి మతము.

ఆడవాళ్లకు అంత గర్వము కూడదు. మధుసూదన్ ఎంత అయోగ్యుడైనా, ఎంత అన్యాయం చేసినా మగవాడు కదా, ఆ ఒక్క విషయంలో అతను తనభార్యకంటె పెద్ద, అక్కడ మన విచారణకు తావు లేదు—భగవంతుడితో వాదించి, పోట్లాడి, ఎవరు నెగ్గగలరు?

"ఎప్పుడో ఒకనాడు అక్కడికి వెళ్లక తీరదే!" అన్నది మోతీతల్లి.

"'వెళ్లక తీరదు,' అని తనను తాను అమ్ముకొన్న బానిస అనవలసినమాట," అని జవాబు చెప్పాడు విప్రదాస్.

"మంత్రాలు వల్లించి భర్తకొనుక్కోలేదా భార్యను? ఏనాడు సప్తపది జరిగి ఏడుమార్లు తిరిగారో ఆనాడే ఇద్దరి దేహాలకూ మనస్సులకూ ముడిపడ్డది, అలాంటప్పుడు భార్య ఎక్కడికి పారిపోగలదు? మృత్యువుకూడా ఈ బంధాన్ని తెంచలేదు. ఆడజన్మఎత్తినతరువాత ఆడభాగ్యం తప్పించుకోవడం ఎట్లా?"

స్త్రీలను అందరికంటె తక్కువ సన్మానించేవాళ్లు స్త్రీలే అని విప్రదాసుకు స్పష్టమయింది. ప్రతి ఇంట్లోను స్త్రీలకు అంత సులభంగా అవమానం కలుగుతుండడానికి ఇదే కారణం అని వాళ్లు ఎరగరు. తమ దీపాలను తామే ఆరుపుకొని కూర్చున్నారు. చచ్చిపోతామేమో అనే చింతకొలదీ చచ్చిపోతామనే భయముకొలదీ, అయోగ్యులైన భర్తలచేత

దెబ్బలు తింటున్నారు, నోరుమూసుకొని ఆదెబ్బలు సహించి, ఆ విధంగా సహించి ఉండడమే స్త్రీజన్మయొక్క చరితార్థత అని వాళ్లు అనుకొంటున్నారు. అంత అవమానానికి ఎవ్వరూ ఒప్పుకోకూడదు. సంఘము ఎవరిని అంతకిందికి అధఃపతనం చేస్తుంటుందో వాళ్లుకూడా సంఘాన్ని రోజుకు రోజూ అంత క్రిందికీ లాగేస్తుంటారు.

కుము కిందికిచూస్తూ విప్రదాసు మంచముపక్కను కూర్చున్నది. విప్రదాసు మోతీతల్లితో ఏమీ అనక కుము తలపైని చెయ్యిఉంచి ఇలాగు అన్నాడు—"నీకు ఒక్కసంగతి చెపుతాను బోధపరుచుకోడానికి ప్రయత్నించు కుమూ. అధికారయోగ్యత మనలో ఉన్నదని ప్రమాణం కనపరచ నవసరంలేకుండా, దారిలో దొరికిన వస్తువును తీసుకొన్నట్టుగా, మనకు అధికారం ప్రాప్తిస్తే, అది మనలో హీనతను మాత్రమే సృష్టిస్తుంటుంది—నీతో ఈసంగతి అనేకసార్లు చెప్పాను, అయినా నీ సంకోచము నీవు వదులుకోలేకుండా ఉన్నావు; మనస్సును కష్టపెట్టుకుంటున్నావు. నీవు ఎంతో గొప్పగా బ్రాహ్మణులకు విందుచేస్తున్నప్పుడు నేను ఎన్నడూ ఆటంకపరచలేదు. కాని ఒక్కమాటమాత్రం మాటిమాటికి నీకు బోధపరచవలెనని ప్రయత్నించాను—జ్ఞాపకం ఉన్నదా — ఆలోచనలేకుండా అర్హతలేనివాళ్లను శ్రేష్ఠులని మనము అనడంవల్ల, ఒక్కవాళ్లకే నష్టంకాదు, శ్రేష్ఠతయొక్క ఆదర్శాన్నే న్యూనపరిచినవారం అవుతున్నాము. ఇటువంటి అంధభక్తివల్ల మన మనుష్యత్వాన్నే

అగౌరవపరుస్తున్నామని ఎవరూ తెలుసుకోలేకుండా ఉన్నా రెండుచేతనో? నీవు ఇంగ్లీషుపుస్తకాలు కొన్ని చదివావు—శాస్త్రాలూ సంఘాలూ కల్పించిన ఇటువంటి అధికారాన్ని ఎదిరిస్తూ దేశదేశాలలో అనేకరకాల సంస్థలు ప్రారంభం అవుతున్నట్టు చదివిఉంటావు. కోరితెచ్చుకొన్న దాస్యానికి పెద్దపెద్ద పేర్లుపెట్టి దానిని నిలబెట్టాలని మనుష్యులు ప్రయత్నిస్తుంటారు, వాటి ఆశ్రయాలను విరగగొట్టి నాశనము చేసే రోజు వచ్చింది."

కుము తలదించుకొనిఉండే అడిగింది—"భార్య భర్తను అతిక్రమించవలెననా నీ వనేది?"

"అన్యాయ అతిక్రమణే తప్పు—తాను భర్త కదా అని అతిక్రమించడం కూడా తప్పే అని నామతము."

"భర్త అన్యాయం చేస్తాడనుకో — చేశాడనిచెప్పి భార్య—"

కుము మాట పూర్తి కానియ్యకుండా విప్రదాస్ జబాబు ఇచ్చాడు—"భార్య ఆ అన్యాయం సహించి ఊరుకున్నట్లైతే ఆ అన్యాయం ఒక్క ఆ భార్యమీదనే కాదు, భార్యజాతి అంతటిమీదా చేసినట్టులెక్క. ఈవిధముగా ఒక్కొక్కరికి జరిగిన అన్యాయాలన్నీ కూడి మనసంఘము యొక్క దుఃఖం ఏర్పడ్డది—వౌజ్ఞాన్యానికి మార్గము స్థిరపడ్డది."

మోతీతల్లి ఓర్చిఉండలేక మధ్యను, "మా తోటికోడలు బంగారుతల్లి, సతీసావిత్రి, పతివ్రత—ఎవరైనా అన్యాయంచేసి నప్పటికీ ఆ అన్యాయం ఆమెను అంటనైనా అంటదు," అని అన్నది.

విప్రదాసుకు ఉద్రేకం పుట్టింది, జబాబు చెప్పాడు—"మీరు పతివ్రతమాటే అనుకుంటున్నారు కాని, ఆమెపై నిరంకుశాధికారం సంపాదించి దానిని రోజూ చలాయిస్తున్న ఆ పురుషుని దుర్గతిమాట ఎందుకు ఆలోచించకుండా ఉన్నారు?"

కుము లేచి నిలుచొని అన్నయ్య జొట్టులో వేళ్లు దూర్చి తల నిమురుతూ అన్నది—"నీవు ఇక మాట్లాడకు అన్నయ్యా, నీవు దేనిని ముక్తి అని అంటున్నావో, అది జ్ఞానముద్వారా లభించవలసినవస్తువు, అది మాకు లభించదు; మా ప్రకృతే వేరు, మేము మనుష్యులను వదలము నమ్మకాలను వదలము—మనుష్యులూ వాళ్లపైఉండే నమ్మకమూ రెండూ కలిసే ఉంటవి మా మనస్సులలో, ఎన్ని దెబ్బలుతిన్నా విడిచిపోలేము. మీకు ఎంతో తెలుసును, ఆ జ్ఞానమే మీకు విడుదలను ఇస్తుంది, మేము అన్నిటినీ మన్నిస్తుంటాము దానివల్ల మా మనస్సుల లోని శూన్యత నిండుతుంటుంది. నీవు బోధపరిచినప్పుడు అది తప్పుఅని బోధపడుతుంటుంది, కాని తప్పు బోధపరుచు కోవడమూ-తప్పు విడవడమూ ఒక్కటేనా? లతయొక్కనులి-తీగెలలాగు మా మమకారం మమ్మల్ని పట్టుకుంటుంది, అది

మంచికానీ చెడ్డకానీ దానిని విడిపించుకోవడం మా తరము కాదు."

విప్రదాసు—"కనుకనే లోకములో కాపురుషులూ కాపురుషులను పూజచేసేవారూ లెక్కలేనంతమంది ఉన్నారు, అపవిత్రమైనదిఅని తెలిసికూడా పూజచేస్తారు, పూజ ప్రారంభించిన తరువాత అది పవిత్రమైనది అని నమ్మడం మొదలు పెడతారు."

కుము—"ఏమి చేయమన్నావు అన్నయ్యా, సంసారాన్ని రెండుచేతులతో గట్టిగా పట్టుకొని ఉండవలెననే భగవంతుడు మమ్మల్ని సృష్టిచేశాడు. కనుక మేము చెట్టునూ కాగలించుకు కూర్చుంటాము గడ్డిపరకనూ కాగలించుకు కూర్చుంటాము. గురువును నమ్మడం మాకు ఎంత సులభమో వంచకుని నమ్మడం కూడా అంతసులభం. మాయాజాలం మా స్వభావములో దాగి ఉంటుంది. మమ్మల్ని దుఃఖమునుండి ఎవరూ రక్షించలేరు. దుఃఖము తప్పించుకోలేనప్పుడు, దానిని శిరసావహించి ఏలాగైనా దానిని దాటిపోవలెనని ప్రయత్నించాలి. కనుకనే మాకు మతము అవసరము, అందుకనే మతాన్నీ ఆచారాలనూ ఆడవాళ్లు అంత ఆశ్రయించుకు కూర్చుంటారు."

విప్రదాసు ఏమీ అనలేకుండా కూర్చున్నాడు.

అన్నయ్య నోరు విప్పకుండా కూర్చోవడము కూడా కుముకు కష్టంగాఉండెను. మనస్సు మరీ భారముగా ఉండబట్టి మాట్లాడడముకూడా లేదని కుము పోల్చుకొన్నది.

ఇంట్లోకి ఒకమారు వచ్చి మోతీతల్లి తిరిగి కుముదను అడిగింది, "ఏమిటి నిశ్చయించావు చెల్లీ!" అని.

"రా లేను—ఇంతకీ రావడానికి ఆయన అనుమతి లేదే," అని జబాబు చెప్పింది కుముద.

అత్తవారిల్లు అంటే మోతీతల్లికి మహాభక్తి ఉన్నదని కాదు, కాని చాలాకాలం అక్కడ ఉండడముబట్టి ఇల్లు తనది అనే మమత్వం ఒకటి ఆమె మనస్సులో ఏర్పడ్డది. ఇంటి కోడళ్లలో ఎవరైనా దానిని లక్ష్యపెట్టక పారిపోతానంటేమాత్రం ఆమెకు ఇష్టం ఉండదు. పురుషుల మనస్సులలో మృదుత్వం అంతగా ఉండదనీ, వాళ్లలో సంయమనశక్తి చాలా తక్కువనీ అంతా ఎరిగిన విషయమే. సృష్టి మనచేతిలో లేదు, కనుక మనకు లభించినదాన్ని వినియోగించుకోవడము తప్ప మనము చేయగలది లేదు. "వాళ్ల మోస్తరు అంతే" అనుకొని ఏదో ఒక విధముగా గడుపుకోవాలని ఆమె మతము. "సంసారము అంటే స్త్రీల ప్రపంచము అన్నమాట. భర్త మంచివాడైనా చెడ్డవాడైనా సంసారము నడిపించే బాధ్యత స్త్రీదే. అది కూడా అసాధ్యమైనప్పుడు చావుతప్ప వేరుమార్గం లేదు."

'పోనీ ఆలాగే అనుకో, చావులోఉన్న పాప మేమిటి?" అని నవ్వుతూ అన్నది కుముద.

కలవరపడుతూ, "ఆలాంటి మాటలాడకమ్మా" అని మోతీతల్లి అన్నది. కొద్దిరోజుల క్రిందట ఆ పేటలోనే పదిహేడేళ్ల అమ్మాయి ఒక ఆమె కార్బాలిక్ ఆసిడ్ తాగి

ఆత్మహత్య చేసుకొన్నదని కుము ఎరగదు. భర్త ఎమ్. ఏ. పాస్ అయినాడు, పెద్ద సర్కార్ ఉద్యోగంలో ఉన్నాడు, కొప్పులో దోపుకుండే వెండిదువ్వెన ఒకటి భార్య పారేసిందని తల్లి ఫిర్యాదుచేయగానే ఆమెను ఒక్కతాపు తన్నాడట. ఆ మాట జ్ఞాపకము వచ్చి మోతీతల్లికి ఒంట్లో గగుర్పు పుట్టింది.

అంతలో నవీన్ వచ్చి గదిలో ప్రవేశించాడు, కుము ఉల్లాసంతో, "అబ్బాయి రావడం ఆలస్యంచేయడని నే నెరుగుదును," అని అన్నది.

నవీన్ నవ్వుతూ అన్నాడు—"వదినకు న్యాయశాస్త్రం బాగా తెలుసును. మొదట శ్రీమతి 'ధూమదేవి'ని చూచింది, దానినిపట్టి శ్రీమాన్ 'అగ్నిస్వామి' త్వరలో బయట పడ తాడని సులభంగా ఊహించగలిగింది.''

మోతీతల్లి—"నీవు అతనికి బాగా చనువు ఇస్తున్నావని పోల్చుకున్నాడు అక్కా, తాను కనబడగానే నీవు సరదా పడ తావని ఆయనికి బోధపడిపోయింది, ఆ సాహసము కొద్దీ—"

"నన్ను చూచి సరదాపడేవారిలో ఉండేశక్తి సామాన్య మైనదికాదు. నన్ను ఎవడు సృజించాడో ఆతనే తన సృష్టిని చూచి అనుతపిస్తున్నాడు. నన్ను వివాహం చేసుకొన్న ఆమె యొక్క మనోభావము, 'దేవా న జానంతి కుతో మనుష్యాః!"

"మీ ఇద్దరూ మాట్లాడుకొంటుండండి అబ్బాయి, తృతీయవ్యక్తి మధ్యదూరడవల్ల ఛందస్సుకు భంగము కలుగు తుంది, నన్ను వెళ్లనియ్యండి," అని కుము అన్నది.

"అదేమిటి అక్కా! తృతీయ వ్యక్తి ఎవరు. నేనా నీవా? మీ మరిదిగారు అద్దెబండి చేసుకొని నన్ను చూడామని వచ్చారు అంటావా ఏమిటి ?"

"ఫలహారం తీసుకు వస్తాను," అని అంటూ లోపలికి వెళ్లింది కుము.

## ౫౩

"ఏమిటి సంగతి ?" అని మోతీ తల్లి అడిగింది భర్తను.

"చెపుతాను విను. ఆలస్యము కాకుండా నీ సలహా తీసుకుందామని తొందర తొందరగా వచ్చాను. నీవూ వెళ్లావు— అన్నయ్య హఠాత్తుగా నాగదిలోకి వచ్చి నిలుచున్నాడు— అతి చీకాకుగా కనబడుతున్నాడు. టేబిల్ సొరుగులో ఉండే గిల్టు సిగరెట్ *ఆష్-ట్రె కనబడలేదట. ప్రస్తుతము అది ఎవరి అధికారంలో ఉన్నదో, ఆమె అది బంగారపుదిఅనుకొని దొంగలించి ఉండాలి, లేకపోతే అంతపాపం చేయడానికి సిద్ధపడదు. దాని ఖరీదుకూడా తక్కువే. కాని అన్నయ్య సంగతి నీ వెరగనే ఎరుగుదువు—ఎంత పనికిరాని వస్తువైనా సరే, కనబడక పోగానే తన సంపదఅంతా పునాదులతోసహా కూలి పడిపోయిందనుకుంటాడు, సహించి ఒక్కనిమిషం ఉండలేడు. ఇవాళ ఉదయం ఆఫీసుకు వెళ్లేటప్పుడు శ్యామను మన గ్రామానికి పంపించేయమని నాతో చెప్పాడు. బహు ఉత్సాహంతో ఆ పవిత్ర కార్యలోకి దిగాను. అన్నయ్య ఆఫీసునుంచి తిరిగి

---

* Ash-tray = సిగరెట్ దులిపే పళ్లెము

రాకముందే పని పూర్తిచేసేదామని నిశ్చయించుకున్నాను, ఇదీ అదీ ఏర్పాటు చేస్తున్నాను, ఒంటిఘంటన్నర అయింది, అన్నయ్య హఠాత్తుగా నా గదిలోకి వచ్చి, "పోనీ అక్కర లేదులే ఇవాళకి ఊరుకో!" అని అన్నాడు. గదిలోనుంచి వెళ్లి పోతున్నాడు, అంతలో నా టేబిల్ మీదనున్న వదిన ఫొటోగ్రాఫు అతని కంట పడ్డది. ఉలికిపడి నిలబడి పోయినాడు. దొంగచూపును తిన్నచేసి ఫొటోను చూడ్డానికి అన్నయ్యకు సిగ్గువేసింది. "ఒక్క నిమిషం కూర్చో అన్నయ్యా ఢాకాచీర ఒకటి నీకు చూపించాలి," అని అన్నాను. మీ మరదలు తన తమ్ముడి భార్యకు పురుడు వచ్చేలోగా చీర ఒకటి ఇవ్వ వలెనట. గణేశ్ రామ్ టోపీవేస్తున్నట్టున్నాడు—నీవు చూచి ఖరీదుకట్టాలి, చీరవెల పదిహేను రూపాయలు అంటున్నాడు, తొమ్మిది, తొమ్మిదిన్నరకు జాస్తీ కాకూడదని నాకు తోస్తున్నది."

మోతీ-తల్లి ఆశ్చర్యపోయి "నీకు ఆ బుద్ధి ఎందుకు పుట్టింది?" అని అడిగింది. "మా మరదలికి పురు డేమిటి! మొన్న మొన్న పురుడు అయింది, పిల్లవాడికి రెండోనెల. కల్పించి చెప్పడానికి నీకు ఏ జంకూ లేనట్టున్నదే—ఈ కొత్తవిద్య ఎక్కడ నేర్చావు?"

"కాళిదాసు ఏ వీణాపాణిదగ్గిర నేర్చుకొన్నాడో, ఆ సరస్వతీదేవి దగ్గిరే నేనూ నేర్చుకొన్నాను."

"వీణాపాణి నిన్ను వదలనంతకాలం నీతో సంసారము చేయడము కష్టము."

"స్వర్గారోహణ చేసేటప్పుడు నరకదర్శనముచేసి మరీ వెళ్లవలెనని శపథం చేసుకున్నాను—అబద్ధమాడడానికి అదే కారణం—వదిన పాదాలకు నేనర్పించగల పూజ అదేను."

"అయితే తొమ్మిది రూపాయల ఢాకాచీర అప్పటికి అప్పుడు ఎక్కడ దొరికింది నీకు?"

"ఏమీలేదు. ఇరవై నిమిషాలైన తరువాత తిరిగివచ్చి గణేశ్ రామ్ నాతో చెప్పకుండా ఆ చీర తీసుకు వెళ్లిపోయినా" డని అన్నయ్యతో చెప్పాను. ఈ లోగా అన్నయ్య ఆ ఫొటోగ్రాఫ్ మనసారా చూచాడు, అది అతని మస్తిష్కంలో దూరి స్వప్నరూపం ధరించింది—అన్నయ్యముఖం చూడగానే ఆ సంగతి నాకు బోధపడిపోయింది. ఎంచేతనో చెప్పలేను కాని, నాదగ్గిర అన్నయ్యకు చాలా బిడియదు— ఆ ఫోటో ఇంకెవరిదైనా అయి మాత్రం తీసుకు వెళ్లిపోయితే ఉండును."

"లోభత్వములో నీవు అన్నగారిని తీసిపోవు—అది అన్నయ్యకు ఇచ్చేస్తే నీకేమి పోయింది!"

"ఇచ్చాను, కాని ఆనందిస్తూ ఇయ్యలేదు. ఇస్తూ, "ఈ ఫోటో నుంచి ఆయిల్ పేంటింగ్ ఒకటి వేయించి నీ పడక గదిలో వేలకడితే బాగుండదు అన్నయ్యా?" అని అన్నాను. "సరే చూదాములే," అని నిర్లక్ష్యముగా జబాబు చెపుతున్నట్టు అని ఫోటో పట్టుకొని మీద గదిలోకి వెళ్లిపోయినాడు. తరువాత ఏమిఅయిందో తెలియదు. అన్నయ్య మరి

ఆఫీసుకు వెళ్ళలేదు, నాఫోటో నాకు దొరకుతుందనే ఆశ వదులుకున్నాను."

"వదినగారికోసము స్వర్గంకూడా వదులుకోడానికి సిద్ధపడ్డావు పాపం, కాని ఒక్క ఫోటోతో సరిపోయింది."

"స్వర్గం వదులుకుందునో లేదో సందేహం కాని ఫోటో పోవడములో సందేహంలేదు. అటువంటి ఫోటోతీయడం అదృష్టవశాత్ జరగవలసినదే గాని మామూలుగా జరగదు. ఏదో దుర్లభలగ్నములో లక్ష్మి ఆమెముఖములో అవతరించింది; సరిగా ఆ శుభలగ్నమే ఆ ఫోటోలో దొరికిపోయింది. ఒకొక్కనాడు రాత్రి వేళ నిద్రలేచి దీపము వెలిగించి దానిని చూస్తుంటాను, దీపము వెలుతురులో దానిలోపల దాగిఉన్న రూపు మరీ స్పష్టంగా వ్యక్తం అవుతుంటుంది."

"నీకు భయమేమీ లేదా—అక్కనుగురించే మరీ అంత మాట్లాడుతున్నా!"

"భయం ఉంటే నీవేమిటి అనుకుంటూఉంటావో అనే ఆలోచనకూడా ఉండేది. వదినను చూస్తూఉంటే నా ఆశ్చర్యం ఎన్నటికీ తగ్గకుండా ఉన్నది. ఆమెను వదినా అని పిలవగలిగానని అనుకున్నప్పుడల్లా నా ఒంట్లో పులకరింపు పుడుతుంటుంది— మనకు ఈ భాగ్యం ఎట్లా ప్రాప్తించిందో అని ఆలోచిస్తూ ఉంటాను. నావంటి సామాన్యుడిదగ్గిర కూర్చోపెట్టుకొని నవ్వుతూ కబుర్లుచెప్పుతూ భోజనము పెట్టుతున్నదే—

ఇటువంటిది ఈ విశ్వబ్రహ్మాండంలో ఇంతసులభంగా ఎట్లాగు జరిగిందా అని ఆలోచిస్తున్నాను. మన ఇంట్లో అన్నయ్యకంటె భాగ్యహీనుడు ఎవడూ లేడు—సులభంగా దొరికినదానిని జబర్దస్తీమూలంగా కట్టి ఉంచబోయి పోగొట్టుకున్నాడు.'

"పోని ఇక చాలించు, అక్కమాట ప్రారంభించావంటే మరి దానికి అంతం ఉండదు."

"వదినమాట గడిగడికీ ఎత్తుతుంటే నీకు కొంచెము కష్టంగా ఉంటుంది, నేనెరుగుదును."

"ఎన్నడూ లేదు—ఉత్త అబద్ధము."

"అట్టే లేదుగాని కొంచెము; ఒక్కసంగతి మరిచిపోకు— నూర్‌నగర్ స్టేషన్‌లో వదిన అన్నగారిని మొట్టమొదటి మారు చూచినప్పుడు అతనిని ఎంత గొప్పగా వర్ణించావో జ్ఞాపకం తెచ్చుకో."

"సరే, ఆవాదనఅంతా ఎందుకు, ఏదో చెప్పబోయి నావు చెప్పు."

"ఇవాళో రేపో రమ్మని వదినకు కబురు వస్తుందని నా నమ్మకము. వదిన ఇంత ఆత్రంతో ఇక్కడికి వచ్చేయడమూ, ఇక్కడినుంచి తిరిగి వెళ్లడానికి తొందరపడక పోవడమూ చూచి అన్నయ్య సహించి ఊరుకోలేడు, అతని ఆత్మాభిమానానికి దెబ్బతగిలింది అని నాకు తోస్తున్నది. బంగారు పంజరము చూడగానే అందులో దూరుదామనే కోరిక పక్షికి

పుట్టకపోవడం ఎందుచేతనో అన్నయ్యకు బోధపడడంలేదు——పక్షికి బుద్ధిలేదు, కృతజ్ఞతా లేదు!"

"మంచిదే, కబరు రానీ——మనము అనుకున్నది అంతే కదూ!"

"అన్నయ్య కబురు పంపకముందే వదిన వస్తే మంచిది అని నాకు తోస్తున్నది——తానే గెలిచాడని అన్నయ్య అనుకోనీ, అదికాక విప్రదాసుబాబుగారి అభిప్రాయముకూడా వదిన వెళ్లాలనే——నేనే వద్దు అన్నాను."

మోతీతల్లి, విప్రదాసుబాబుకూ తనకూ జరిగిన సంభాషణ మాట, చెప్పక "అయితే వెళ్లి అతనితో చెప్పు," అని అన్నది.

"వెళ్లుతున్నాను, విని అతనూ సంతోషిస్తాడు."

" గదిలోకి రా వచ్చునా," అని బయటినుంచి కుము మాట వినబడ్డది.

" నీ రాకకే ఎదురుచూస్తున్నారు మీ మరిదిగారు," అన్నది మోతీతల్లి.

" జన్మజన్మాలనుండి నీ రాకకు ఎదురుచూస్తున్నాను," అన్నాడు నవీన్.

"ఎప్పటికప్పుడు ఏలాగు ఇంత కల్పించగలుగుతున్నావో అని ఆలోచిస్తున్నాను," అని కుము అన్నది.

"నాకే ఆశ్చర్యం కలుగుతున్నది, కాని నాకూ తెలియకుండా ఉన్నది," అని నవీన్ అన్నాడు.

"పోనీ అయితే, కొంచెము ఫలహారము చేదువుగాని పద."

"ఫలహారము చేయకముందు మీా అన్నయ్యగారితో కొంచెము మాట్లాడి రావాలి."

"వీలుపడదు."

"వీలుపడకపోవడ మేమి ?"

"అన్నయ్య ఇవాళ చాలాసేపు మాట్లాడాడు, ఇప్పుడు మరి మాట్లాడ కూడదు."

"చెప్పవలసినసువార్త ఉన్నది వదినా."

"సువార్త రేపు చెప్పవచ్చును, ఇవాళ మరి మాట్లాడ వద్దు."

"రేపు నాకు సెలవు దొరకక పోవచ్చు, లేక ఏదైనా ఆటంకం రావచ్చు. నీ పుణ్యం ఉంటుంది, ఒక్క అయిదునిమిషాలు మాట్లాడి వచ్చేస్తాను."

"సరే అయితే, ఫలహారం చేసివెళ్లు."

ఫలహారము కాగానే కుము నవీన్‌ను అన్నయ్య గదిలోకి తీసుకు వచ్చింది, అన్నయ్య ఇంకా నిద్ర పోలేదు. గదిలో చీకటి; మిణుకు మిణుకు దీపము చిన్నది వెలుగుతున్నది. కిటికీ తెరిచి ఉన్నది, నక్షత్రాలు కనబడుతున్నవి. ఉండుండి దక్షిణపు గాలి కిటికీలోనుంచి వస్తున్నది. ద్వారాలకు కట్టిన ఫరదాలూ, మంచము జాలరూ, స్టాండుమీాద వేలాడుతున్న బట్టలూ—ఇవిఅన్నీ గాలికి కొట్టుకుంటున్నవి. వీటి నీడ నానారూపాలతో

నృత్యం చేస్తున్నది, వార్తాపత్రిక పుటలు గాలికి ఇటూఅటూ విచ్చలవిడిగా పరుగెత్తుతున్నవి. విప్రదాసు సగము పడుకొని సగము కూర్చున్నట్టుగా మంచముమీద ఉన్నాడు. నవీన్‌కు ముందుకు అడుగు పడకుండా ఉన్నది. విప్రదాసు దేహము బాగా శీర్ణించి ఉన్నది, ఆ మసగ మసగ వెలుతురులో చూచే టప్పటికి అతను సంసారంనుంచి ఎంతో దూరం వెళ్ళిపోయి, వేరేదో ప్రపంచములో నుంచి చూస్తున్నట్టుగా నవీన్‌కు తోచింది. అంత ఏకాకిఅయిన మనిషి ప్రపంచములో ఇంకె వరూ ఉండ రేమో!

నవీన్ దగ్గిరికి వచ్చి విప్రదాసుపాదధూళి తీసుకొని అన్నాడు—"మీరు విశ్రాంతి తీసుకొనేవేళ, నేను ఆట్టేసేపు ఉండను, ఒక్కమాట చెప్పి వెళ్ళిపోదామని వచ్చాను, నాలుగు రోజులయింది వదిన ఇంటికి తిరిగివస్తుందని చూస్తున్నాము.'

విప్రదాసు జబాబు ఈయలేదు.

కొంతసేపు ఊరుకొని, "మీ సెలవులయితే వదినను తీసుకువెళ్ళే ఏర్పాటు చేస్తాను," అని అన్నాడు.

ఇంతలో కుము వచ్చి అన్నయ్య కాళ్ళదగ్గిర కూర్చున్నది. విప్రదాసు కుమువైపు చూస్తూ, "వెళ్ళవలెనని ఉంటే వెళ్ళు కుమూ," అని అన్నాడు.

"లేదు అన్నయ్యా, వెళ్ళను," అని అంటూ కుము అన్నయ్య మొడుకులమీద ముఖము పెట్టుకొని పడుకున్నది.

అంతా నిశ్శబ్దము. ఉండుండిమాత్రము విరిగిన కిటికీ తలుపు గాలికి టుక్కుటుక్కుమని కొట్టుకుంటున్నది, గాలికి ఆడుతున్న చెట్లఆకుల మర్మరశబ్దము తోటలోనుంచి వస్తున్నది.

కుము లేచి నిలుచొని, "ఇక వెళ్లుదాము," అని నవీన్‌తో అని, "నీవు ఇక నిద్రపో అన్నయ్యా," అని విప్రదాసుతో అన్నది. కుమూ నవీనూ—ఇద్దరూ బయటికి వచ్చేశారు.

## ౫౪

మోతీతల్లి ఇంటికి తిరిగివచ్చిన తరువాత, "అక్క ఈలాగు చేయడము బాగులేదు సుమా!" అని నవీన్‌తో అన్నది.

"అనగా కంట్లో పొడవడముమాట ఏలాగున్నా, కళ్లు ఎర్రగా కావడముమాత్రము అన్యాయం—అంతేనా!"

"కాదు అయ్యా, కాదు! అది తమ గొప్పను చాటించుకోవడం! మాకు తగినవారు లోకంలో ఎక్కడా దొరకరు, అందరికంటే మీాదిస్థానం మాదే అని చెప్పడము!"

"ఆ గొప్ప అందరిలో రాణించకపోవచ్చును గాని వాళ్ల మాట వేరు."

"ఆలాగని చెప్పి తనవాళ్లను విడిచిపెట్టి పోవచ్చా!"

"తనవాళ్లు అనగానే తనవాళ్లయిపోరు. వాళ్లది మన తరగతి కాదు, వాళ్లు కేవలము ఇంకొకశ్రేణికిచెందిన వాళ్లు—చుట్టరికము కలిసిందనిచెప్పి దగ్గిరికి వెళ్లడానికి నాకు ఎంతో సంకోచముగా ఉంటుంది."

"ఎంత ఉత్తములైనా, ఎంత పెద్దవాళ్లైనా మనకూ వాళ్లకూ సంబంధం ఏర్పడ్డది—ఆ మాట మరిచిపోకు."

భార్య ఆలాగు అనడములో కొంత ఈర్ష్యకూడా ఉన్నదని నవీనకు బోధపడ్డది. అదికాక బాంధవ్యబంధం మొగవాళ్లలోకంటె ఆడవాళ్లలో దృఢంగా ఉంటుంది. కనుక దీనిని గురించి భార్యతో వాదించి ప్రయోజనములేదని ఎరిగి, "వదిన నాలుగు రోజులుఉండి రానీ, అన్నయ్య ఆతురతకూడా కొంచెము హెచ్చనీ," అని అన్నాడు.

## ౫౬

మధుసూదనుని సంసారములో తనకు స్థిరమైన స్థానం దొరికింది అని శ్యామాసుందరికి ధైర్యము కలిగింది, కాని ఇంటి నౌకర్లూ చాకర్లూ క్రమేణ ఆమె ప్రభుత్వానికి లోబడి ఉండనట్టుగా కనబడ్డది. ఆ సంగతి బయటికి స్పష్టముగా తెలియచేయడముదాకా వచ్చినవి పరిస్థితులు. కనుక శ్యామ వాళ్లను మాటిమాటికి అనవసరంగా తిట్టడమూ, పనిలేనిదే ఈపనీ ఆపనీ పురమాయించడమూ చేస్తుండేది. వాళ్లలో తప్పులు పట్టేది, మీ అమ్మలు ఈలాంటివాళ్లు, మీ అయ్యలు ఆలాంటి వాళ్లు అని దూషించేది. ఈ ఇంట నాలుగురోజుల క్రితం వరకూ తానుకూడా నౌకరుమాదిరే ఉండేదన్న మాట ఎవ్వరికీ జ్ఞప్తిలో ఉండకుండా వాళ్ల మనస్సులలోనుంచి తుడిచేదామని శ్యామ చాలా ప్రయత్నంచేసింది. ఎవరూ ఇది

సహించి ఊరుకోలేదు. పాతనౌకరు ఒకతె పని విడిచి వెళ్లి పోతానన్నది. అందుకని తరవాత శ్యామే తిట్లుతినవలసి వచ్చింది. దానికి కారణం ఉన్నది—మధుసూదన్‌కు ధనార్జన సంబంధములో కొన్ని మూఢ నమ్మకాలు ఉన్నవి. అతనికి ధనాభివృద్ధి కలిగినరోజులలో ఏయే నౌకర్లుఉండేవారో వాళ్లు చనిపోయినా, వాళ్లు పనివిడిచి వెళ్లిపోయినా అది అశుభ శకున మని అతని నమ్మకము. ఆ నమ్మకముచేతచే సిరామచ్చ-లతో నిండిన పాత డెస్కును జాగ్రత్తగా కాపాడి ఇప్పటి మంచిమంచి విలువైన సామానుల మధ్యను ఆఫీసుగదిలో ఉంచాడు; ఆ డెస్కుమీద పూర్వపు సత్తుసిరాబుడ్డి ఒకటీ, పాత పాలీకలం ఒకటీ ఇప్పటికీ ఉన్నవి—ఆ కలంతో వ్రాసిన ఉత్తరమువల్లనే పెద్దలాభం కలిగిందిఅట. ఆ రోజులనాటి ఒడియా నౌకరు 'దధి' పనిమానేసి వెళ్లిపోతానన్నాడు—మధుసూదన్‌కు కోపం రాలేదు—పైగా వాడి జీతం హెచ్చు చేయడం కూడా జరిగింది, శ్యామ వద్దని ఆటంకముపెట్టింది, కాని ఆమెమాట సాగలేదు. చివరకు శ్యామ దధి నవ్వు ముఖము చూడవలసికూడా వచ్చింది. మధుసూదనుని శ్యామ నిజంగా ప్రేమిస్తున్నది, కనుక అంతగా బలవంతము చేయ డానికి జడుస్తున్నది, అట్టే చనువుఇస్తే అవమానపరచవచ్చునని భయముకొద్దీ చాలా జాగ్రత్తగా ప్రవర్తిస్తున్నది. శ్యామను సంతోషపరచడము ఎట్లాగు అని అతను అట్టే సమయం వృథా పుచ్చు నక్కరలేదు, ఆమె విషయమై ఆలోచిస్తూ కూర్చో

నక్కరలేదు అని మధుసూదన్ బాగా ఎరుగును, మంచిమాటలాడడం తగ్గించినా కూడా ఆమె పారిపోతుందనే భయంలేదు. శ్యామపైని మధుసూదన్‌కు మోటుతరహా మోహం ఉన్నది, దానిని పూర్తిగా అనుభవించగలడు; అయినా అవసరమయినప్పుడు సునాయాసంగా దానిని అణుచుకొని ప్రవర్తించగలడు—అందుచేత అతని మనశ్శాంతికి భంగంకలగడం లేదు, ఆనందానికి కొరతలేదు. ఇటువంటి మనోభావం ఉండబట్టిగాని, లేకుంటే వాళ్లబంధం తెగిపోయేదే. మధుసూదన్‌కు పనికంటె ప్రియమైన దేదీ లేదు. పనిబాగా చేస్తుండడానికి ఉత్సాహాన్ని ఇచ్చేది తనకు అన్నివిషయాలలో సంపూర్ణాధికారం ఉన్నదనే జ్ఞానము. అతని ప్రభుత్వములోకి దూరడానికి శ్యామకు సాహసము కలగలేదు; అడుగుపెట్టబోయి మొగ్గవేసి తిరిగి వచ్చేస్తున్నది. కనుక శ్యామ తనను సమర్పించుకొంటున్నది గాని, ఎటువంటి హక్కునూ కోరడంలేదు. హక్కు అనగానే పరాభవం పొందవలసివస్తున్నది. డబ్బు, ముస్తాబు, ఆభరణాలు మొదలైనవి ఆమెకు ఎన్నడూలేవు, వాటిమీద ఆమెకుఉండే కోరికకు అంతులేదు. కోరికఉన్నా చాలా జాగ్రత్తగా నడుచుకోవలసి వస్తున్నది. అటువంటి ధనికునిఇంట్లో ఉన్నప్పటికీ సునాయాసంగా ఇది కావలెననీ అదికావలెననీ కోరడం అసాధ్యం అయింది. అప్పుడప్పుడు సరదాపుట్టి మధుసూదన్ ఆమెకు బట్టలూ చిన్నచిన్న నగలూ తెచ్చిఇస్తున్నాడు, కాని వాటితో ఆమె ఆకలి తీరకుండాఉన్నది. చిన్నచిన్న వస్తువులమీద

సరదాపుట్టేది, సంపాదించాలని మనస్సు కొట్టుకుపోతుండేది, కాని కోరిక సఫలంఅయేదికాదు. అటువంటి సామాన్యమైన దేదో ఈనడుమ జరగడంవల్ల ఆమెను అక్కడనుండి పంపేయ మని మధుసూదన్ ఆజ్ఞాపించాడు. కాని ఆమెతో కలిసి ఉండడం అలవాటు అయిపోయింది, ఆమె సేవకు అలవాటు పడిపోయినాడు — తంబూలానికీ, గుడుగుడుకీ అలవాటు పడ్డట్టుగా—వీటివల్ల ఖర్చుజాస్తీకాదు—అవిలేకుండా ఉండ లేము. మామూలు అలవాటుకు ఏమాత్రం విఘ్నము కలిగినా పని నిలిచిపోవచ్చునని భయంవేసి ఆసారికి క్షమించాడు, కాని శిక్ష ఏక్షణమైనా నెత్తిమీద తిరిగి పడవచ్చును.

అటువంటి పటుత్వంలేని అధికారముతో కూర్చున్న శ్యామకు కుము తిరిగి ఎప్పుడు తన సింహాసనమీదికి వచ్చేస్తుందో అని, సదా భయముగానే ఉన్నది. ఈ ఈర్ష్యచేత పీడింపబడు-తుండడమువల్ల శ్యామకు మనశ్శాంతిఅన్నమాట లేదు. కుముతో పోటీగావచ్చి లాభములేదని శ్యామకు తెలుసును— ఆమెదీ తనదీ సమాన పదవులు కావు. కుము మధుసూదన్ పరి పాలించే రాజ్యానికి బయటనున్నది—అక్కడ ఆమె బలానికి మితిలేదు. శ్యామ కేవలము అతని ఆధీనములో ఉన్నది— ఆమె అతనికి వినియోగపడుతుంది, కాని విలువైనది కాదు. అందుకని శ్యామ ఎంతో ఏడ్చింది, చస్తే బాగుండునని అను కొన్నది, ఏలాగు ఇంతచవక అయిపోయినా ననుకొంటూ నెత్తి బాదుకొన్నది. చివరకు బోధపరుచుకొన్నది—చవకగనుకనే

తనకు స్థలము దొరికింది, ధర హెచ్చయిన వాళ్లకు ఆదరము అధికముగా దొరుకుతుంది; చవకవాళ్లకు చవకగనుకనే జయం కలుగుతుంది కాబోలు.

శ్యామ మధుసూదన్‌కు అవసరము లేకున్నంతకాలము ఆమెకు ఇటువంటి భరింపరాని దుఃఖము లేకపోయింది, ఉపవాసమే తనభాగ్యం అనుకొని మనస్సును సమాధాన పరుచుకొన్నది. అప్పుడప్పుడు దొరికిన సామాన్యమైన వాటితోనే తృప్తిపొందేది. నేడు అధికారము కలిగిఉండడానికీ లేకుండా ఉండడానికీ భేదమేమీ తెలియడములేదు. ఎప్పుడు తన పరిపాలనపోతుందో అని ప్రతిక్షణమూ భయపడుతూ ఉన్నది. కొత్తగా వేసిన రేల్‌రోడ్డువలె ఉన్నది ఆమె అదృష్టం. బండి ఏ క్షణములోనైనా *డిరైల్ అయిపోవచ్చు, ఎక్కడైనా పడి పోవచ్చును. మోతీతల్లితో మనస్సు విప్పి మాట్లాడి, లోపలి భారము తగ్గించుకొందామని ఒకసారి ప్రయత్నంచేసే సరికి ఆమె ఒకజోడింపు జోడించి ఆ పక్కనుంచి వెళ్లిపోయింది. చేతనైతేమాత్రము శ్యామ ఘోరముగా కసి తీర్చుకొనేది, కాని సంసారవ్యవహారాలలో మోతీతల్లికి విలువఉన్నది, ఇంటి విషయాలలోమాత్రం మధుసూదన్ ఎవరినీ మోతీతల్లి జోలికి వెళ్లనిచ్చేవాడు కాడు. అప్పటినుండి ఇద్దరికీ మాటలు లేవు, వీలైనంతవరకు ఒకరి ముఖం ఒకరు చూచుకోకుండానే గడుపుకొని వస్తున్నారు. ఈ విధంగా ఈ ఇంట్లో శ్యామస్థానం

* Derail= పట్టా తప్పడం.

మునుపటికంటె కూడా ఇరుకయిపోయింది, ఎక్కడా ఎటువంటి స్వచ్ఛందతా లేకపోయింది.

ఇట్లాగు ఉంటూఉండగా ఒకనాడు సాయంకాలము శ్యామ మధుసూదనుని పడకగదిలోకి వచ్చేసరికి ఆమెకు కుము ఫోటోగ్రాఫ్ టేబిల్ మీాద కనబడ్డది. ఏ పిడుగు నెత్తిమీాద పడ బోతున్నదో దాని మెరుపే కంట్లో పడ్డది. గుండె దబదబ కొట్టు కోవడము ప్రారంభించింది. పటముమీాదినుంచి దృష్టి మళ్లించ లేకుండా ఉన్నది. కళ్లు నిప్పులయి పోతున్నవి, ముఖం తెల్లబారి పోతున్నది, పిడికిళ్లు గట్టిగా బిగించేసింది. దేనినో ఒకదానిని విరిచి గుండపిండి చేసేదామని బుద్ధి పుట్టింది. దేనినైనా చించి పారేదామని బుద్ధి పుట్టింది. ఆ గదిలో ఇంకా ఉంటే ఏదో ప్రమాదం జరగవచ్చునని భయపడి బయటికి వచ్చేసింది. తన గదిలోకి వచ్చి పరుపుమీాద బోరగిల పడుకొని దుప్పటి ముక్కలు ముక్కలుగా చించేసింది.

రాత్రి అయిపోయింది. మహారాజావారు పిలుస్తున్నా రని †బెహారా వచ్చి శ్యామతో బయటినుండి చెప్పాడు. రానని చెప్పడానికి సాహసములేదు. తొందర తొందరగా లేచి ముఖము కడుక్కొని బుటాల ఢాకాచీర కట్టుకొని, అత్తరవు కొంచెము రాసుకొని పడకగదిలోకి వచ్చింది. కుము ఫోటో కంటపడకుండా ఉండాలని ప్రయత్నిస్తూ వచ్చింది, కాని సరిగా ఫోటోముందరనే లైట్ ఉన్నది—ప్రత్యేకం ఆ బొమ్మ

† నౌకరు.

స్పష్టంగా కనపడడానికి లైట్ అక్కడ ఉంచినట్టు కనబడ్డది. గది అంతటిలోకీ చూడదగినది ఈ ఫోటో ఒక్కటే అన్నట్టు తట్టింది. మామూలు ప్రకారం శ్యామ తాంబూలముడబ్బా తీసి మధుసూదన్‌కు తాంబూలం ఇచ్చి పక్కను కూర్చొని కాళ్లు నొక్కడం ప్రారంభించింది. ఎందుచేతనో గాని మధుసూదను మనస్సు ఇవాళ ఉల్లాసంగా ఉన్నది, దొరల దుకాణమునుంచి వెండి ఫోటోఫ్రేమ్† ఒకటి కొని తెచ్చాడు. దానిని తీసి, "ఇదిగో నీకోసము తెచ్చాను," అని అంటూ దానిని శ్యామ చేతిలో పెట్టాడు. శ్యామను ఆదరిస్తూ మధురరసం ఒలకబోసే టప్పుడుకూడా లోభత్వం వదులుకోలేదు, మధుసూదన్——ఏమాత్రం చనువు ఇచ్చినా శ్యామ మర్యాద ఉంచుకోలేదని మధుసూదన్ ఎరుగును. ఆఫ్రేమ్ బ్రౌన్ కాగితములో కట్టి ఉండెను, మెల్లి మెల్లిగా కాగితం విప్పుతూ, "ఏమిటి ఇది?" అని అడిగింది శ్యామ.

"తెలియదూ? ఫొటోగ్రాఫ్ ఉంచడానికి."

"ఎవరి ఫోటో?"

"నీది——అవాళ తీయించాము, అదీ!"

"అంత ముద్దు ఎందుకు నాకు," అని అంటూ ఆ ఫ్రేమును నేలమీద వేసికొట్టింది శ్యామ.

"ఏమిటి దాని అర్థము?" అని అడిగాడు మధుసూదన్ ఆశ్చర్యపడుతూ.

---

†ఫోటో పెట్టుకొనే చట్టం.

"అర్థమేమీలేదు," అని ముఖం చేతులలో పెట్టుకొన్ని, ఏడుస్తూ, మంచముమీదనుంచి దిగి తల నేలను కొట్టుకోవడం మొదలుపెట్టింది. ఇంత చవక వస్తువు శ్యామకు నచ్చలేదు, మంచి విలువైన ఆభరణం ఏదైనా కావలెనని కాబోలు ఆమె కోరిక అని మధుసూదన్ అనుకొన్నాడు. రోజంతా ఆఫీసులో పనిచేసి పనిచేసి రాగానే ఈ నాటకం మధుసూదన్‌కు ఉల్లాసకరంగా కనబడలేదు. అది హిస్టీరియామాదిరి కనబడ్డది అతనికి—హిస్టీరియా అంటే అతనికి పరమ అసహ్యము. గట్టిగా ఒక్కగదుము గదిమి, "లేచి కూర్చో, తత్ క్షణం, లేస్తావా లేవవా?" అని అన్నాడు.

శ్యామ లేచి గబగబా గదిలోనుంచి వెళ్లిపోయింది. "ఈ వేషాలు నాదగ్గిర పనికిరావు," అన్నాడు మధుసూదన్.

శ్యామ సంగతి బాగా ఎరుగును మధుసూదన్. కొంచెం సేపుఅయినతరువాత ఆమె తిరిగివచ్చి తన కాళ్లమీదపడి క్షమాపణ కోరుకుంటుందని అతని నమ్మకము. అట్లాంటప్పుడు గట్టిగా నాలుగు మాటలు వినిపించవలెనని నిశ్చయించుకున్నాడు.

పది ఘంటలు కొట్టారు; శ్యామ రాలేదు. "మహారాజావారు పిలుస్తున్నారమ్మా," అని చప్రాసీ మాట ద్వారము దగ్గిర వినబడ్డది.

"ఒంట్లో బాగులేదని మహారాజావారికి చెప్పు," అన్నది శ్యామ.

చాలా పొగరుగా ఉన్నదే, పిలిపించినా రాలేదు, అని మధుసూదన్ అనుకొన్నాడు.

కాని మరి కొంతసేపయినతరువాత తప్పక వస్తుందని అనుకొన్నాడు. కాని ఆమె రాలేదు. పదకొండుకి పావుఘంట తక్కువ, మధుసూదన్ మంచముదిగి తొందరతొందరగా శ్యామ గదిలోకి వచ్చాడు. గదిలో దీపంలేదు; శ్యామ నేలమీదపడు కొనిఉన్నది. ఇది అంతా మురిపంపు అనీ, తన ఆదరం సంపాదించాలని చేస్తున్నదనీ మధుసూదనుని నమ్మకము.

“లేచి రా, తత్‌క్షణము లేచి రా ముద్దు చాలించు!” అని మధుసూదన్ గర్జించాడు.

శ్యామ ఏమీ అనకుండా, లేచి అతని వెంటవచ్చింది.

## ౨౭

మర్నాడు ఆఫీసుకు వెళ్లకముందే, భోజనముచేసి కాస్త విశ్రాంతి తీసుకుందామని మధుసూదన్ పడకగదిలోకి వెళ్లాడు. టేబిల్‌మీద కుముఫొటోగ్రాఫ్ కనబడలేదు. శ్యామ రోజూ వలె తాంబూలము పట్టుకొని రాలేదు—ఆమె అసలు కనబడనే లేదు. ఆమెను రమ్మని కబురు పంపాడు. వచ్చింది. మధుసూదన్ ముఖం భారముచేసుకొని, “టేబిల్‌మీదనుఉండే ఫోటో ఏది?” అని అడిగాడు.

శ్యామ ఆశ్చర్యపడుతున్నట్టు నటిస్తూ, “ఫొటోగ్రాఫా! ఎవరి ఫొటోగ్రాఫు?” అని అడిగింది. నటన కొంచెము జాస్తీ

అయింది. ఆడవాళ్లకు మగవాళ్లబుద్ధి అంటే అట్టే గౌరవం సాధారణముగా ఉండదు, శ్యామ ప్రవర్తనకు అదే కారణము.

"ఫోటో నీవు చూడలేదా?" అని మధుసూదన్ కోపంగా అడిగాడు. శ్యామ అతి అమాయకంగా, "లేదు, చూడలేదు," అని అన్నది.

"అబద్ధం ఆడుతున్నావు," అని గట్టిగా కేకవేశాడు మధుసూదన్.

"అబద్ధం ఎందుకాడుతాను ? ఫోటో నేనేమి చేసుకొంటాను?"

"ఎక్కడ దాచావో తీసుకురా, నీమంచికే చెపుతున్నాను, విను."

"ఇది ఏమి ప్రమాదము అమ్మా, నీ ఫొటోగ్రాఫ్ నాకు ఏలాగు దొరుకుతుంది, తీసుకు రావడానికి?"

మధుసూదన్ బెహారాను పిలిచి, "చిన్నబాబును పిలుచుకురా," అన్నాడు.

నవీన్ వచ్చాడు, "పెద్దకోడలిని తీసుకురా," అని మధుసూదన్ అన్నాడు.

శ్యామ మాటి విరుచుకొని కర్రబొమ్మలాగు నిశ్చలంగా నిలుచున్నది. కొంచెముసేపు ఊరుకొని, తలగోకుకుంటూ నవీన్, "నీవు ఒక్కమారు వెళ్ళి పిలుస్తే బాగుండదూ, అన్నయ్యా, వదిన సంతోషిస్తుంది," అని అన్నాడు.

మధుసూదన్ నాలుగుసార్లు గుడుగుడు పీల్చి, "సరే రేపు ఆదివారం, రేపుఉదయం నేనే వెళ్లుతాను," అన్నాడు.

మోతీతల్లిదగ్గిరికి వచ్చి నవీన్," నేను ఒక చిన్నపని చేశాను," అని అన్నాడు.

"నా సలహాలేకుండానే ?"

"సలహాకు వ్యవధి లేకపోయింది."

"అయితే వెనక్కు తిరగవలసివస్తుందేమో ?"

"తిరగవలసి రావచ్చును, నాజాతకంలో బుధిస్థానములో భార్య ఉన్నది, మరి ఏగ్రహమూ లేదు, కనుక నిన్ను దగ్గర ఉంచుకోనిదే ఎప్పుడూ ఏపనీ చేయను. వదినను తీసుకురమ్మని అన్నయ్య ఆజ్ఞ అయింది, "నీవే వెళ్లి తీసుకువస్తే బాగుంటుంది," అని నేను ఛటీమని అనేశాను. అన్నయ్య మనస్సు ఇవాళ ఏలాగున్నదో గాని అన్నయ్య దానికి సమ్మతించాడు. కాని ఇది ఎలా పరిణమిస్తుందో అని ఇప్పుడు ఆలోచిస్తున్నాను."

"దానివల్ల మంచి కలగదని నా అనుమానం, విప్రదాసుబాబుధోరణి చూచాను కదూ! ఒకటి చెప్పబోయి ఒకటి చేప్పేస్తాడు, చివరకు కురుక్షేత్రయుద్ధము ఆరంభ మవుతుందని నాభయం—అలాంటి పని ఎందుకు చేశావు?"

"మొదటి కారణం, నా జాతకచక్రములో నా బుద్ధిఇల్లు ఆవేళకు ఖాళీగా ఉండడమూ, నీవు ఇంకెక్కడో ఉండడమూ; రెండో కారణమేమిటి అంటే— మొన్న వదినను రమ్మన్నప్పుడు, "నేను రాను," అని అన్నది. దాని అర్థం నాకు బోధపడ్డది. అంత

జబ్బుతో వాళ్ల అన్నయ్య కలకత్తా వచ్చాడు, మహారాజా వారు అతనిని చూడడానికైనా వెళ్లలేదు—ఈ అనాదరణ వదినను బాగా బాధించి ఉండాలి."

వింటూనే మోతీతల్లి తడబడ్డది—ఆసంగతి ఇంతవరకు ఎందుకు తనకు తట్టలేదని ఆశ్చర్యపడ్డది. నిజం ఏమిటిఅంటే అత్తవారిఇంటి గొప్పతనాన్ని గురించి తానే ఎరగని అహంకారం మోతీతల్లికి ఉన్నది. బంధువులకు మర్యాదచేయడం సామాన్యులకర్తవ్యము కాని మధుసూదనునివంటి మహారాజుల కర్తవ్యము కాదు అని ఆమె ధోరణి.

నవీన్ భార్యను ఎత్తిపొడుస్తూ వెనుక తనకూ భార్యకూ జరిగిన వాదనమాట ఎత్తాడు—"నాబుద్ధికి తట్టలేదు, నీవే నాతో అన్నావు జ్ఞాపకం ఉన్నదా?" అన్నాడు.

"ఏ విషయమై ?"

"మనను మనము మర్యాద చేసుకోవడముకంటె ఇతరులను మర్యాదచేయడము గొప్ప అని నీవు అవాళ అన్నావు జ్ఞాపకం ఉన్నదా? కనుకనే అన్నయ్య ఎంతపెద్ద మహారాజా అయినా విప్రదాసుబాబుగారని ఒకమారు చూచి రావలసి ఉండెనని అనుకోడానికి సాహసించాను."

తాను ఓడిపోయినానని ఒప్పుకోడానికి ఇష్టములేక మోతీతల్లి భర్తనే ఎదురు చీవాట్లుపెట్టింది—"అవసరమున్న పనిని గురించి ఆలోచించక పొల్లుమాటలు ఆడుతుండడం నీకు చాలా

చేతనవును—దానికంటె ఇప్పుడు చేయవలసినదేమిటో చెపితే బాగుంటుంది.”

“చివరవరకు ఏమేమి చేయాలో మొట్టమొదటనే నిశ్చయించుకుంటే పరాభవం కలగవచ్చును. ప్రారంభం ఎక్కడ చేయాలో దానినిగురించి బాగా ఆలోచిస్తేచాలును. విప్రదాసు బాబును చూడడానికి వెళ్లడం అన్నయ్య చేయవలసిన మొదటి పని అని నా అభిప్రాయం, తరువాత ఏమి చేయవలసిఉంటుందో అని ఇప్పుడే ఆలోచిస్తూ కూర్చోవడంవల్ల మనము చింతాశీలుర మని వెల్లడిచేసుకోవడముతప్ప వేరే ఉపయోగం ఉండదు.”

“ఏమోగాని ఏదో చిక్కు వచ్చేటట్టుగానే ఉన్నది.”

## ౫౭

ఆనాటి ఉదయం కుము అన్నయ్యగదిలో కూర్చొని చాలాసేపు పాటపాడింది, ఎస్రాజ్ వాయించింది. ఆ ప్రాతః కాలపు సంగీతంతో కలిసిపోయిన ఆమె హృదయవేదన నలు దిక్కులా వ్యాపించి సీమారహితమైన రూపాన్ని ధరించి, విశ్వసంపత్తు అయిపోయింది. ఆమెబంధము విడిపోయింది. సర్పాలు ఈశ్వరుని జట్టులో భూషణాలవలె కనబడుతున్నవి. దుఃఖప్రవాహాలు దుఃఖసముద్రములో పడి నిలిచిపోవడంవల్ల వాటికి గొప్పశాంతి కలిగింది. వాటి రూపమే మారిపోయింది, చలనానికి మారుగా వాటికి గభీరత లభించింది.

“సంసారములో అనిత్యకాలము వాస్తవమైనదానివలె కనబడు తుంటుంది, శాశ్వతమైనది దానివెనుక దాగి ఉంటుంది

కుమూ, సంగీతములో నిత్యమైనది ముందుకు వచ్చి అనిత్య కాలము తుచ్ఛమైనదని తెలిసిపోతుంది.”

విప్రదాసు ఈ మాటలు అంటున్నాడు, నౌకరు వచ్చి, “మధుసూదన్ మహారాజావారు దయచేశారు,” అని చెప్పాడు.

కుము ముఖం రెప్పపాటులో వెల్లబారింది, విప్రదాసుకు గొప్ప బాధకలిగి, “నీవు ఇంట్లోకి వెళ్లిపో చెల్లీ, ఇక్కడ నీ అవసరం ఉండ దనుకుంటాను,” అని అన్నాడు.

తొందరతొందరగా లోపలికి వెళ్లిపోయింది కుము. ముందు కబురు పంపకుండా రావలెననే మధుసూదనుని ఉద్దేశము. ముందుగా తెలియజేస్తే తగిన సన్నాహముచేసి తన రాకకు ఎదురుచూస్తూ ఉంటారు, తానొక గొప్ప ఇంటి వాడనని విప్రదాసు అనుకొంటున్నాడని మధుసూదనుని నమ్మకము. ఇది సహించడం కష్టముగా ఉన్నది మధుసూదన్‌కు— కనుక నేడు అతను దర్శనం చేయడానికి రాలేదు; దర్శనం ఈయడానికి వచ్చాడు.

బహు చిత్రమైన వేషంతో వచ్చాడు మధుసూదన్— ఇంటినౌకర్లూ దాసీలూ చూచి నిర్ఘాంతపోయినారు. డోరియాల కమీజోమీద రంగుబుటాల సిల్కు వేస్టుకోటు తొడిగాడు, భుజముమీద మడతపెట్టిన కండువా వేసుకున్నాడు, బహుశ్రద్ధతో పింజపెట్టిన శాంతిపూర్ ధోవతికట్టాడు, నిగనిగలాడుతున్న దర్బార్ స్లిప్పర్లు తొడుక్కున్నాడు, వేళ్లను పెద్ద పెద్దవజ్రాలూ పచ్చలూ తాచిన ఉంగరాలు జిగజిగ మెరుస్తున్నవి.

గోళాకారంగా చక్కగా పెరిగిఉన్న పొట్టమీదను మోటు బంగారు వాచీగొలుసు వేలాడుతున్నది, హస్తిముఖం పిడిగల చేతికర్ర పట్టుకున్నాడు, దాని బంగారపుపిడినిండా కెంపులూ పచ్చలూ తాపిఉన్నది. తొందర తొందరగా వంక నమస్కారముచేస్తూ దగ్గరనున్న కుర్చీమీద కూర్చొని, "ఒంట్లో ఏలాగున్నది విప్రదాసు బాబూ, అట్టే బాగున్నట్టు కనబడడం లేదే!" అని అన్నాడు.

"మీరు బాగా ఆరోగ్యంగానే కనబడుతున్నారు, కులాసాగా ఉన్నారు కదూ?" అని అన్నాడు విప్రదాస్, మధుసూదన్ ప్రశ్నకు జబాబు ఈయడానికి బదులుగా.

"బాగా కులాసాగా ఉన్నానని చెప్పలేను—సాయంకాలం అయేటప్పటికి కొంచెం తల నొస్తుంటుంది, ఆకలికూడా బాగా ఉండడంలేదు, భోజనము కొంచెం ఇటూ అటూ అయేసరికి ఏదో అవుతున్నది. అన్నిటికంటె బాధ మధ్యమధ్య నిద్రపట్టక పోవడము."

శుశ్రూషకొరకు ఎవరైనా ఎల్లప్పుడూ ఉండవలెనని చెప్పడానికి ఈ భూమిక.

"ఆఫీసు పని అధికంగా ఉన్నదనుకుంటాను," అన్నాడు విప్రదాస్.

"అంత ఏమీ లేదు—ఆఫీసుపని ఆఫీసువాళ్లు చేసుకుంటారు, నేను చూడవలసిన అట్టే ఉండదు. అక్కడి పని పూచీ

విశేషభాగము మ్యాకిటన్ దొరమీదను ఉంటుంది, అదికాక సర్ ఆర్థర్ పిబడీ నాకు చాలా సాయం చేస్తుంటాడు."

గుడుగుడు వచ్చింది, తాంబూలం దగ్గిరపెట్టి నౌకరు మూలను నిలుచున్నాడు. తాంబూలము - పళ్లెములోనుంచి ఒక్క ఏలకగింజ నోట్లో వేసుకున్నాడు మధుసూదన్. గుడుగుడు గొట్టము పట్టుకొని రెండుమార్లు మృదువుగా గుడుగుడు పీల్చాడు, తరువాత ఆ గొట్టము పట్టుకొన్న ఎడమచెయ్యిని ఒడిలో ఉంచాడు, మరి గుడుగుడు పీల్చలేదు. అంతఃపురములోనుంచి కబురువచ్చింది ఫలహారం సిద్ధమయింది అని. చీకాకుపడుతూ మధుసూదన్ అన్నాడు—"తినలేను, నేను మొదటనే చెప్పాను భోజనవిషయములో చాలా జాగ్రత్తగా ఉండవలెనని."

విప్రదాసు రెండోమారు వేడలేదు తినమని. "పిన్నితో చెప్పు ఒంట్లో బాగులేదు, ఫలహారము చేయరని" అని నౌకరుతో చెప్పాడు.

విప్రదాసు ఇంకేమీ అనలేదు. కుముమాట దాన అంతట అదే మాటలసందర్భములో వస్తుందని మధుసూదన్ అనుకొన్నాడు. ఇన్నాళ్లయింది కుము ~~అత్తవారింటినుండి~~ వచ్చేసింది, విప్రదాసు గడబిడపడుతూ తానే కుమును పంపడముమాట ఎత్తుతాడని అనుకున్నాడు—కాని అన్న కుము పేరే ఎత్తలేదు, మధుసూదన్‌కు లోలోపల కొంచెము కోపము ఆరంభమయింది, రావడం పొరపాటు చేశానని అనుకొన్నాడు.

ఇదిఅంతా నవీన్ తెలివితక్కువవల్ల జరిగినది. ఇంటికివెళ్లి గట్టిశిక్ష విధించాలి అని మధుసూదనుని మనస్సు తొందరపడుతున్నది.

ఆ సమయములో సన్నని నల్లంచు సాదాచీర కట్టుకొని ముసుగు తలమీదికి లాగుకొని కుము గదిలో ప్రవేశించింది. విప్రదాసు కుము వస్తుందని అనుకోలేదు, చూచి ఆశ్చర్యపోయినాడు. మొదట భర్తపాదధూళి తీసుకొన్నది, తరువాత అన్నయ్యదితీసుకొని మధుసూదన్‌తో ఇట్లాగుఅన్నది—

"అన్నయ్య ఒంట్లో ఏమీ బాగులేదు, ఆట్టే మాట్లాడించకూడదని డాక్టరుగారు చెప్పారు, ఈ పక్కగదిలోకి మనము వెళ్లిపోదాము."

మధుసూదన్ ముఖం ఎర్రచేసుకొని తొందర తొందరగా కుర్చీమీదనుంచి లేచిపోయినాడు. ఒళ్లోనుంచి గుడుగుడు గొట్టం నేల పడ్డది, విప్రదాసు వంకచూడనైనా చూడకుండా, "సరే నేను వస్తాను," అని అంటూ బయటికి వచ్చేశాడు.

మొదటికోపములో బండిఎక్కి గబగబ ఇంటికి వెళ్లిపోదామని అనుకున్నాడు, కాని మనస్సు అడ్డువచ్చింది. చాలా రోజులకు కుమును చూచాడు ఇవాళ. రోజూ మామూలుగా కట్టుకుండేసాదాచీరతో కుమునుచూడడము ఇదే మొదటిసారి. ఇంతకుముందు ఎన్నడూ అతనికంటికి ఆమె ఇంత అందంగా కనబడలేదు; ఎంతో స్వేచ్ఛగాను, చనువుగాను మసులుతున్నట్టుగా కనబడ్డది. తన ఇంటిదగ్గర ఆమె ఒకపెంపుడు పిల్ల మాదిరి ఉండేది, బయటి అమ్మాయివలె ఉండేది, ఇక్కడ ఇంటి

పిల్లలాగు ఉన్నది. ఇవాళ ఎంతో దగ్గిరగా కనబడ్డట్టు అతనికి తట్టింది. ఆ మనోహర స్వరూపం చూడగానే తత్ క్షణమే ఆ మెను ఇంటికి తీసుకువెళ్లిపోదామని బుద్ధిపుట్టింది. ఆమె నాది, ఆమె నాదేను, ఆమె నా ఐశ్వర్యమూ_ర్తి, నా దేహానిది, నా మనస్సుది—ఈ మాటలే పదిమార్లు తిరగాబోర్లావేసి అంటూ ఉండాలని అతనికి కోరికపుట్టింది.

పక్కగదిలోకి వెళ్లాక కుము అతనికి సోఫా చూపించి కూర్చోమన్నది. లేదనలేక కూర్చున్నాడు, అది బయటిగది అయిపోబట్టిగాని లేకపోతే కుమును పట్టుకొని సోఫామీద, తనపక్కను, కూర్చోపెట్టుకుండేవాడు. కుము కూర్చోలేదు, ఒక కుర్చీవీపుమీద చెయ్యివేసి నిల్చొని, "నాతో ఏమైనా చెప్పవలసింది ఉన్నదా ?" అని అడిగింది.

ఆ అడగడము మోస్తరు మధుసూదన్‌కు మర్యాదగా తోచక "ఇంటికి రావా ?" అని అడిగాడు."

"రాను."

మదుసూదన్ ఉలికిపడి, "అదేమిటి ఆ మాట !" అన్నాడు.

"నా అవసరము నీకు లేదే !"

శ్యామకథ ఆమె చెవిని పడిఉండాలనీ, అభిమానము కొద్దీ ఆమె ఆలాగు అంటున్నదనీ మధుసూదన్ అనుకొన్నాడు—అభిమానం ఉండడము మంచిదే అనుకొన్నాడు, పైకిమాత్రము ఈ విధముగా అన్నాడు—"నీవు అనేదేమి

బాగులేదు సుమా, అవసరము లేకపోవడం ఏమిటి—ఎవ్వరూ లేని శూన్యగృహం బాగుంటుందా ?"

ఈ విషయమై వాదించడానికి బుద్ధిపుట్టక కుము క్లుప్తంగా మరిఒకమారు, "నేను రాను," అని అన్నది.

"దాని అర్థ మేమిటి-ఇంటికోడలు ఇంటికి రాను అని—"

మధుసూదనుని మాట పూర్తి కాకుండానే కుము తిరిగి "రాను," అని నిరుత్సాహంగా అన్నది.

సోఫామీదినుండి లేచి, "ఏమిటీ ! రావా ? వచ్చి తీరాలి !" అన్నాడు మధుసూదన్.

కుము జవాబీయ లేదు - మధుసూదన్ ఇలాగు అన్నాడు— "పోలీస్ వాళ్లను తీసుకువచ్చి మెడపట్టుకు లాగించుకు వెళ్లగలను ఎరుగుదువా ? లేదు అనగానే అయి పోయిం దనుకున్నావా ?"

కుము జవాబీయ లేదు. మధుసూదనే తిరిగి అన్నాడు, "అన్నగారి నూర్ నగర్ పద్ధతులు మళ్లీ ఆరంభము అయినవి," అని.

కుము అన్నయ్యగదివైపు ఒక్కమారు చూచి, "ఊరుకో ఆలాగు బిగ్గరగా మాట్లాడకు," అని అన్నది.

"ఏమి మీ అన్నయ్యకు వినబడకుండా మెల్లిగా మాట్లాడాలా ? ఈ క్షణమే మీ అన్నయ్యను ఇంట్లోనుంచి బయటికి తోలివేయగలను—ఆసంగతి ఎరుగుదువా ?"

ఆ క్షణమే కుము ద్వారమువైపు ముఖము తిప్పేసరికి అన్నయ్య ద్వారముదగ్గిర నిలబడి ఉన్నాడు—పొడవుగా

ఉన్నాడు, శీర్ణించిపోయిన శరీరము, ముఖము తెల్లబారి పోయింది, పెద్దపెద్ద కళ్లు, చింతనిప్పులలాగు మండుతున్నవి, కప్పుకొనిఉన్న మోటు†'చాదర్' కొస నేల పడిఉన్నది; కుమును పిలిచి, "రా చెల్లీ, నాగదిలోకి రా," అని అన్నాడు.

"నీ పొగరు జ్ఞాపకము ఉంచుకో, నీ నూర్ నగర్ నోరు మూయిస్తేనే నాపేరు మధుసూదన్, చూస్తూఉండు," అని మధుసూదన్ గట్టిగా కేకలువేశాడు.

గదిలోకి వచ్చి మంచముమీద కూర్చోబడ్డాడు విప్రదాసు. కళ్లుమూసుకొన్నాడు, నిద్రపోవాలని కాదు, అలసి పోయి ఉన్నాడు, ఆలోచిస్తున్నాడు. కుము విసురుతూ అన్నయ్య తలదగ్గిర కూర్చున్నది. చాలాసేపు అయినతరువాత క్షేమఅత్త వచ్చి, "భోజనానికి రా అమ్మా కుమూ, చాలాపొద్దు పోయింది," అని అన్నది.

"వెళ్లు అమ్మా, భోజనముచేసి రా; కాలూ - దాని పంపించు."

"నీ కాళ్లమీద పడుతున్నాను అన్నయ్యా, ఇప్పుడు కాలూదా వద్దు అన్నయ్యా, కొంచెము నిద్రపోడానికి ప్రయత్నము చెయ్యి."

విప్రదాసు ఏమీ అనలేదు, గాఢవేదనతో నిండిఉన్న కళ్లను కుమువైపు తిప్పి కొంతసేపయినతరువాత పెద్ద నిట్టూర్పు

† బంగాళీలు కప్పుకొనే కండువా, దుప్పటీ మొదలైనవి.

విడిచి కళ్లు మూసుకొన్నాడు. కుసుమ లేచి మెల్లిగా బయటికి వచ్చి తలుపులు దగ్గరగా లాగింది.

కొంతసేపుఅయిన పిమ్మట కాలూడా కబురుపంపాడు, రావచ్చునా అని. విప్రదాసు లేచి బాలీసుమీద చేరబడి కూర్చున్నాడు. కాలూ అడిగాడు—"అల్లుడుగారు వచ్చి వెంటనే వెళ్లిపోయినారు, ఏమిటి జరిగింది బాబూ? కుసుమను పంపడముమాట ఏమైనా అన్నాడా?"

"ఆహా, అడిగాడు, కుసుమ రానని జబాబు చెప్పింది."

"అది ఏమిటి అన్నయ్యా, కొంపముంచిన మాటే!" అని భయపడిపోయి అన్నాడు కాలూడా.

"కొంపమునిగితే జడవవలసిన వాళ్లము కాము—ఎన్నడూ మేము దానికి జడవలేదు, అసన్మానము అంటే మాకు అమితభయము."

"అట్లాగైతే సిద్ధంగాఉండు నాయనా, ఇక ఆట్టే వ్యవధి లేదు. అది మీ రక్తములో ఉన్నది, ఎక్కడికిపోతుంది. మేజస్ట్రేటును నిరసనచేసి మీనాన్న ఏమిలేదన్నా రెండులక్షలు ఖర్చుపెట్టాడు—ఛాతీ విరుచుకొని నెత్తిమీదికి ఆపద తెచ్చుకోవడం మీకు పిత్రార్జితం. కాని మా వంశములో అది లేదు గనుక మీ పిచ్చివ్యవహారాలన్నీ చూస్తూ ఊరికే కూర్చోలేను. కాని ఎవడు రక్షించగలడు మీలాంటివాళ్లను?"

ఎడమకాలు ముడిచి, ముడుకుమీద కుడికాలుఉంచి, బాలీసుమీదికి కొంచెం జరిగి, కళ్లుమూసుకొని, ఆలోచిస్తున్నాడు

విప్రదాసు. కొంతసేపయాక కళ్లు తెరిచి అన్నాడు—"షరతుల ప్రకారం మధుసూదన్ మనకు ఆరునెలలనోటీసు ఇయ్యనిదే రూపాయలు వసూలు చేయలేడు, ఈలోగా ఆషాఢమాసానికి ముందే సుబోధ్ వచ్చేస్తాడు, అప్పుడు ఏదో ఉపాయం చేయవచ్చును."

కాలూ చీకాకు పడుతూ జబాబు చెప్పాడు—"ఉపాయం చేయవచ్చు సందేహమేమిటి! వత్తులన్నీ ఘుప్పున ఒక్కమారుగా ఆరిపోయి ఉండేవి, ఇప్పుడు ఒక్కొక్కటిగా ఆరుతవి, అంతే!"

"వత్తులు కాలిపోయినవి, అడుగున చమురు లేదు, నౌకరువచ్చి వాటిని వాడిఇష్టమువచ్చినట్లు ఆరపనీ, దానిని గురించి మనము ఏడుస్తూ కూర్చో నక్కరలేదు. మంట అడుగుకు దిగిపోయిన దీపాలను ఎగత్రోస్తూ కూర్చోడమువల్ల హాయిలేదు, దానికంటె అంధకారములో కూర్చుంటేనే శాంతి."

కాలూ గుండెలో రాయిపడ్డది, అవి జబ్బుమనిషి అనవలసినమాటలు—చుక్కాను విడిచిపెట్టి నిరాశ చేసుకొని కూర్చొనే స్వభావముకాదు విప్రదాసుది. ఆపద తప్పించుకుందామని ఇన్నాళ్లూ నానారకాల ప్రయత్నాలు చేశాడు, ప్రయత్నాలు సఫలము కావచ్చునని నమ్మాడు. ఇప్పుడు ఆలోచించే శక్తిపోయింది, నమ్మడానికి మరి బలములేదు.

కాలూ బహు ప్రీతితో విప్రదాసువంక చూస్తూ, "నీవేమీ భయపడకు బాబూ, చేయవలసినది నేను చెస్తాను-ఒక్కమారు దలారి-సమాజానికి వెళ్లిరానీ," అని అన్నాడు.

మర్నాడు విప్రదాసుకు ఉత్తరం ఒకటి వచ్చింది మధుసూదనుని వద్దనుంచి—స్లీడర్లు వ్రాసే కోర్టుభాషప్రయోగించి వ్రాసిన ఇంగ్లీషు ఉత్తరం. కుము తన ఇంటికి వస్తుందో రాదో తెలియచేయమని కోరుతూ రాదలచుకోనియెడల జరపవలసిన చర్య జరిపిస్తానని వ్రాసిఉన్నది ఆ ఉత్తరములో.

"అంతా బాగా ఆలోచించి చూచుకో కుమూ," అన్నాడు విప్రదాసు.

"బాగా ఆలోచించుకున్నాను, మరి ఆలోచించవలసినది ఏమీలేదు, అందుచేతనే నేను ఇవాళ ఇంత నిశ్చింతగా ఉన్నాను. మునుపు ఇక్కడ ఏలాగు ఉండేదాననో ఆలాగే ఉన్నానని నాకు అనిపిస్తున్నది—మధ్యను జరిగినదంతా కల అనిపిస్తున్నది."

"బలవంతాన నిన్ను లాక్కుపోబోయేవాళ్లను ఎదిరించి ఉండిపోగలవూ?"

"నీకు ప్రమాదము లేకపోతే నిశ్చయంగా ఉండగలను."

"చివరకు వెళ్లడము తప్పకపోయినప్పుడు, ఆలస్యం చేయడం మంచిదికాదు — ఎంత ఆలస్యం చేస్తామో అంత అసహ్యకరమవుతుంది మన అవస్థ—నే నడిగేది అందుకు. వాళ్లే

బాంధవ్యసూత్రము నీమనస్సులో ఏమూలనూ కట్టబడలేదా?"

"లేనే లేదు, నవీన్, మోతీతల్లి, హాబ్లూ—వీళ్లంటే మాత్రం నాకు అమితానురాగము, కాని వాళ్లు నావాళ్లు అని చెప్పలేను, ఎంతయినా పైవాళ్లేకదా!"

"ఒక్కటి ఆలోచించుకో కుమూ, వాళ్లు ఘోర అన్యాయముచేయ ప్రయత్నిస్తారు. సంఘాన్నీ, రాజ్యశాసనాలనూ ఊతచేసుకొని దౌర్జన్యము చేసేశక్తి వాళ్లకు ఉన్నది. కను కనే వాటి అన్నిటినీ ధిక్కరించే అవసరంవస్తుంది. కాని తిరుగు బాటు చేయదలచుకుంటే మాత్రం, సిగ్గూ, సంకోచమూ, భయమూ—అన్నీ వదులుకొని సంఘముఎదుట నిలుచోవాలి. ఇంటా బయటా, నలుదిక్కులా, తుపాను గాలివలె దూషణ దుర్భాషలు వినబడుతుంటవి—వాటిమధ్యను తల ఎత్తుకొని నిలుచోవాలి—ఆ ధైర్యం ఉన్నదా నీకు?"

దానివల్ల నీకు అశాంతిగాని కీడుగాని కలగదా?"

"దేనిని నీవు కీడూ, అశాంతీ అని అంటున్నావు కుమూ? నీవు అవమానములో మునిగి ఉండడముకంటె నాకు దుఃఖమూ అశాంతీ కలిగించేవి ఏమి ఉండగలవు! నీవు ఉండే ఇల్లు నీ ఇల్లు కాకపోయి, ఆ ఇంటి అధికారి నీకు పైవాడయిఉండేకంటే అశాంతికి వేరేకారణము ఉంటుందని నేను ఊహించలేను. నీవు అంటే నాన్నకు ఎంతో ముద్దు, ఎంతో ప్రేమ, కాని అప్పటి రోజులలో తండ్రులు దూరదూరముగానే ఉండేవారు. నీకు చదువు సంధ్యలు అవసరమని నాన్నకు తట్టనేలేదు. నీచదువు భారము

నామీద పెట్టుకొన్నాను, నిన్ను పెద్దదానిని చేసినది నేను. నీకు అమ్మా నాన్నవంటివాడనే నేను, అంతకు తక్కువకాదు. ఆ పూచీ ఎంత కష్టమయినదో ఇవాళ నాకు బోధపడుతున్నది. నీవు అందరి అమ్మాయిల మోస్తరుదానవు అయిఉంటే, నీ మనస్సును ఇవిఅన్నీ బాధించకపోయేవి. నీ స్వాతంత్ర్యము ఎవరికీ బోధపడదు, నిన్ను ఎవరూ గౌరవించరు. యమబాధ పడతావు అందుచేతనే, నిన్ను అక్కడికి పంపించి, నేను ఎట్లాగు బ్రతికి ఉండగలను? నీవు నాతమ్ముడివే అయిఉంటే ఏమాదిరి నా దగ్గిరే ఉండిఉందువో అదేమాదిరి శాశ్వతంగా ఉండిపో చెల్లీ."

కుము, అన్నగుండెకు దగ్గరగా, మంచముమీద, తల పెట్టి, ముఖం అటుతిప్పి అడిగింది, "ఇక్కడఉంటే మీ అందరి నెత్తిమీది బరువయి ఉండనూ అన్నయ్యా—నిజము చెప్పు."

కుము తలను నిమురుతూ విప్రదాసు అన్నాడు—

"భారము ఏలాగు అవుతావు చెల్లీ? నీచేత బాగా పనిచేయిస్తాను, నా పనులన్నీ నీకే అప్పచెపుతాను—ఏ ప్రైవేట్ సెక్రిటరీ కూడా నీలాగు పనిచేయలేదు కుమూ; నాకు రోజూ నీపాటూ, వాయిద్యమూ వినిపిస్తుండాలి, నా గుర్రము పూచీకూడా నీదే. అదికాక, నీవు ఎరగనే ఎరుగుదువు, చదువుచెప్పడమంటే నాకు చాలాసరదా, నీలాంటి శిష్యురాలు నాకు ఎక్కడ దొరుకుతుంది కుమూ! ఇంకొకటికూడా చేదాము—చాలాకాలమునుండి ఫ్రెంచి చదవాలని నాకు అభిలాషగా ఉన్నది, ఒక్కడనే చదవ

బుద్ధి పుట్టడంలేదు. ఇద్దరమూ కలిసి చదువుదాము, నాకంటె నీవు త్వరగా నేర్చుకోగలవు, నే నెరుగుదును—అయినా నాకు కొంచెమైనా ఈసుఉండదు, చూదువుగాని.”

వింటూ ఉంటే కుముమనస్సు పులకరించింది. అంతకంటె సుఖము జీవితములో ఏమిటి ఉండగలదు.

కొంచెము ఊరుకొని విప్రదాసు మళ్లీ అన్నాడు— “ఇంకొక మాట నీతో చెప్పాలి కుమూ, కొద్ది రోజులలోనే మన అవస్థఅంతా మారిపోతుంది, మన అలవాట్లు అన్నీకూడా మార్చుకోవాలి. మనము కేవలము సామాన్య సంసారుల మాదిరి ఉండాలి కుమూ—అప్పుడు నిరుపేదలమైన మాకు నీవు గృహలక్ష్మివై ఉంటావు చెల్లీ.”

కుము కళ్లవెంట నీళ్లు బొటబొట కారినవి—“నాకు అంతకంటె అదృష్టము ఏమి ఉన్నది అన్నయ్యా,” అని ఆమె అన్నది.

మధుసూధనుని చీటి విప్రదాసు తన దగ్గరనే ఉంచుకున్నాడు—దానికి జబాబు ఈయలేదు.

## ౫౮

రెండురోజులయిన తరువాత హాబ్లూను తీసుకొని నవీనూ, మోతీతల్లీ వచ్చారు. వస్తూనే హాబ్లూ కుము ఒడిలోకి వచ్చి ఆమె గుండెమీద ముఖము పెట్టుకొని ఏడ్చేశాడు. ఎందుకు ఏడ్చాడో చెప్పడము కష్టము. దొడ్డమ్మ ఇక్కడికి వచ్చి ఉండిపోయిందని అభిమానముకొద్దీ కలిగిన

దుఃఖమువల్లనా, చాలాకాలానికి కనబడ్డదని ముద్దుకొద్దిన్నా, ఇంటికి తిరిగివస్తుందో రాదో అనే అనుమానమువల్లనా ?

హేబ్లూను గట్టిగా కాగలించుకొని కుము ఈలాగు ప్రారంభించింది—"సంసారము బహుక్రూరమైనది హేబ్లూ, ఏడుపులకు అక్కడ అంతుండదు. పిల్లల ఏడ్పు శాంతిపరచగలది నా దగ్గిర ఏమిఉన్నది. నేను ఏడ్చి ఇతరులకు ఏడ్పు ఓదార్చాలి— అంతకు మించిన శక్తి నాలోలేదు. ఏప్రేమ తనను తాను దానము చేసుకోవడంతప్ప ఇతరదానమేదీ చేయలేదో, అట్లాంటి ప్రేమ నేను మీకు ఇస్తున్నది. దొడ్డమ్మ శాశ్వత కాలమూ ఉండదు కాని ఈమాట మాత్రము జ్ఞాపకం ఉంచుకో, జ్ఞాపకం ఉంచుకో, జ్ఞాపకం ఉంచుకో." ఈలాగు అంటూ హేబ్లూ బుగ్గమీద ముద్దుపెట్టింది.

నవీన్—"ఇక రజబ్‌పూర్ వెళ్లిపోతాము వదినా, మా ఇంటికి—ఇక్కడి కాపురం ముగించినట్టే."

"నేను అభాగ్యురాలను, నేను వచ్చి మిమ్మల్ని కూడా వెళ్లగొట్టాను," అని కుము దుఃఖముతో అన్నది.

"అది వట్టి భ్రమ, చాలా రోజులయింది వెళ్లిపోదామని బుద్ధిపుట్టి, మూటా ముల్లె కట్టుకు సిద్ధంగా కూడా ఉన్నాము, ఆలాంటి సమయములో నీవు మాఇంటికి వచ్చావు ఆశతీరా అనుభవించాము. అయితేనేమి భగవంతుడు చూచి ఓర్వలేకపోయినాడు."

ఆవాళ ఇంటికి తిరిగివచ్చి మధుసూదన్ పెద్ద గొడవ చేశాడని స్పష్టమయింది.

నవీన్ ఏమిఅన్నప్పటికీ, కుము వచ్చి తను సంసారమంతా తారుమారు చేసేసిందని మోతీతల్లి అభిప్రాయము—దానికేమీ సందేహము లేదు. ఈ అపరాధం ఎన్నటికీ ఆమె క్షమించదు. కుము తత్ క్షణము తలవాల్చుకొని అత్తవారింటికి వచ్చేయాలనీ, వచ్చిన తరువాత అక్కడ ఎంత అవమానం కలిగినా ఓర్చిఉండాలనీ ఆమె మతము. కంఠము కొంచెము కఠినము చేసుకొని మోతీతల్లి, "అయితే నీవు అత్తవారింటికి రాననే నిశ్చయించావా?" అని అడిగింది.

కుము కూడా గట్టిగానే, "రాను," అని జవాబు చెప్పింది.

"అట్లాగైతే ఎక్కడ నీగతి?"

"ఈ విశాల పృథ్వి! ఇందులో తల దాచుకోడానికి ఎక్కడో రవంతస్థలము దొరకకపోదు. జీవితంలో ఎంతో పోగొట్టుకుంటుంటాము—అయినా ఏదో కొంతఅయినా మిగిలి ఉంటుంది."

మోతీతల్లి మనస్సు తనను విడిచిపెట్టి దూరముగా వెళ్లిపోయిందని కుముకు బోధ పడిపోయింది. నవీన్‌వైపు తిరిగి, "అయితే ఇప్పుడు ఏమిచేయ తలచుకొన్నావు అబ్బాయి?" అని నవీన్‌ను అడిగింది.

"ఏటి ఒడ్డున కొంత భూమి ఉన్నది, అక్కడఉంటే నాలుగు మెతకబియ్యము మెతుకులు దొరుకుతవి, కొంచెము గాలికూడా తగులుతుంటుంది."

మోతీ తల్లి కొంచెం తీవ్రంగా జబాబు చెప్పింది— "దాని విషయమై నీకు భయంఅక్కరలేదయ్యా. అన్న-పానాదులకు మిర్జాపూర్ ఇంటిమీదను మనకు ఉండే హక్కు పోలేదు—ఆ హక్కు తప్పించడం ఎవరి శక్యమూ కాదు. బావగారు పొమ్మనగానే బైరాగులమై ఇల్లువదిలి పోవలసినంత గొప్పవాళ్లముకాము. ఇవాళ కాకపోతే రేపైనా మనను తిరిగి పిలిపించకా మానడు, మనము రాకా మానము— ఈరెండు రోజులూ సహించి ఉంటే తప్పులేదు."

నవీన్ కొంచెము చిన్నబుచ్చుకొని జబాబు చెప్పాడు. "అది నేనూ ఎరుగుదును, కాని ఇంత గొప్పపని చేశానని బడాయి కొట్టుకోను. పునర్జన్మ అంటూ ఉంటేమాత్రము కాస్త స్వగౌరవముతో పుట్టవలెనని నా కోరిక, దానివల్ల అన్న వస్త్రాదులకు ఇబ్బందికలిగితే కలుగునుగాక?"

నిజముకూడా ఏమిటి అంటే, నవీన్ అనేకసార్లు అన్న గారి ఆశ్రయము విడిచిపెట్టి స్వగ్రామానికి పోయి వ్యవసాయము చేసుకు బ్రతుకుదామని సంకల్పించుకున్నాడు. భార్య నోటికివచ్చినట్లు కేకలువేసి చిట్టచివరకు వెళ్లకుండా ఏదో ఆటంకం పెట్టేది. బావగారిమీద తనకు హక్కు ఉన్నదని ఆమె నమ్మకము, బావగారు మామగారి మోస్తరే కదా. బావగారు

అన్యాయము చేయవచ్చునుకాని దానిని మనము అవమాన-మని అనుకోకూడదని ఆమె అభిప్రాయము. భర్త ఏలాగు ప్రవర్తించినా భార్య భర్తఇల్లు విడిచి వెళ్లిపోవడ మనేది ఎన్నడూ కూడనిపని అని మోతీతల్లి మతము.

డాక్టరుగారు వచ్చారని తెలియగానే, "ఒక్క క్షణము కూర్చోండి డాక్టరుగారు ఏమంటారో కనుక్కొని వస్తాను," అని చెప్పి కుము బయటికి వెళ్లింది.

నాడి బాగులేదని డాక్టరుగారు చెప్పారు, "రాత్రి బాగా నిద్రపోతున్నట్టు లేదు, పగలైనా విశ్రాంతి దొరక నట్టుగా ఉన్నది," అని కూడా అన్నారు.

కుము—తిరిగి అతిథుల దగ్గిరికి రాబోతున్నది, దారిలో కాలూ కనబడి ఇట్లాగన్నాడు— "ఒక్క సంగతి నీతో చెప్పక వీలులేదు. అన్నివైపులా చిక్కులు మరీ బిగిసిపోతున్నవి, ఇట్లాంటప్పుడు నీవు తత్ క్షణము అత్తవారింటికి వెళ్లకపోతే మాత్రము ప్రమాదము ఎవ్వరూ తప్పించలేరు—నా కేమీ తోచకుండా ఉన్నది."

కుము మాటాడక నిలుచున్నది, కాలూ తిరిగి అన్నాడు—"నీ భర్తదగ్గరనుండి నోటీసు వచ్చింది, అతని ఇచ్ఛకు విరుద్ధముగా నడుచుకొనే శక్తి మనకు ఏదీ? పూర్తిగా అతని పిడికిలిలో ఉన్నాము మనము."

కుము వరండా కటకటాలు పట్టుకొని నిలబడి, "నా కేమీ బోధపడడము లేదు కాలూదా, నాగుండె ఆగిపోతు న్నది—

నాకు చావుతప్ప వేరేదారి లేదని తోస్తున్న," దని అంటూ తొందరతొందరగా లోపలికి వెళ్లిపోయింది.

కుము అన్నయ్యగదిలో ఉంటూఉండగా మోతీతల్లీ క్షేమఅత్తా ఏమేమో మాట్లాడుకున్నారు. లక్షణాలనుబట్టి చూస్తే కుము గర్భిణిగా ఉన్నదని ఇద్దరూ స్థిరపరిచారు. మోతీతల్లి ఆనందించి కాళీదేవికి ప్రణామంచేసి, "అదే నిజమవుగాక," అని తనలో తా ననుకొన్నది. ఇకను అవుతుంది తగినపని అనుకొంటూ సంతోషించింది. "అహంకారి అయి, అత్తవారింటిని అవమానపరిచి వెళ్లిపోవాలనుకొన్నది, ఇప్పుడు ఎక్కడికి వెళ్లుతుంది, ఇది పైటచెంగుకూ పంచకొనకూ వేసిన ముడి మాత్రమే కాదు, నాడీబంధము కూడాను."

మోతీతల్లి కుమును పక్కను తీసుకువెళ్లి తన అనుమానాన్ని గురించి చెప్పింది. కుముముఖము తెల్లపారిపోయింది, పిడికిళ్లు బిగించి, "కాదు కాదు, ఎంత మాత్రము కాదు, ఎన్నటికి కానేరదు," అని అన్నది.

మోతీతల్లి చీకాకు పడి జవాబు చెప్పింది—"ఎందుకు కాకూడదు తల్లీ—నీవు ఎంత పెద్దఇంటి పిల్లవైనా సంసార నియమాలు నీకోసము తారుమారు అయిపోవు. నీవు ఘోషాల్‌లఇంటి ఇల్లాలువు, ఘోషాల్‌వంశ ఇష్టదేవత నిన్ను సులభముగా వదిలేస్తుందనుకొన్నావా? దారికి అడ్డుగా నిలుచొని ఉన్నది దేవత."

కుము ఇప్పటికి మూడు మాసాలు కాపురముచేసింది, సాంగత్యము రోజుకిరోజూ లోలోపల వికృత రూపముధరిస్తూ వచ్చింది. గర్భభయము కలిగినప్పటినుంచీ ఈ మూడుమాసాల జీవితంఅంతా కంటికి కట్టినట్టు కనబడుతున్నది. మనిషికీ మనిషికీ స్వభావాలలో గొప్ప భేదాలు ఉంటవి. ఎంతప్రయత్నించినా వాటి అన్యోన్య వైరుధ్యాన్ని పోగొట్టలేము—కాని ఆ వైరుధ్యానికి కారణాలు తరుచుగా చిన్నచిన్న సామాన్య భేదాలే అయిఉంటవి. మాటలలోనూ, మాటాడే విధములోనూ, ఇంట్లో మసులుతుండే రీతిలోనూ, ఏమీ పని చేయకుండా కూర్చుండేటప్పుడు మనలో వ్యక్తమవుతుండే మనోభావములోనూ, కంఠస్వరములోనూ, రుచులలోనూ, నడవడిపద్ధతులలోనూ, జీవితాదర్శాలలోనూ - అన్నిటిలోనూ పలుపలువిధాల ఆ భేదాలు వ్యాపించి ఉంటవి. మధుసూద నునిలో ఉండేవి ప్రత్యేకముగా ఏదో కూడనిది ఒకటి కుముకు బాధకలిగించింది అని అనుకోకూడదు—అతని గుణాలూ, అతని సహవాసమూ ఆమెకు తీవ్రమైన సిగ్గు తెప్పిస్తున్నవి, ఆమెలో అశ్లీలభావము పుట్టిస్తున్నవి. ఒకప్పుడు మధుసూదన్ నిరుపేద, భరించలేని దారిద్ర్యములో ఉండేవాడు. కనుక ఇప్పుడు మాటమాటకూ డబ్బుయొక్క ప్రభావాన్నిగురించి అంటూ ఉంటాడు. అతని బడాయి మాటలో దాగి ఉన్నది అతని పూర్వపు రక్తగత దారిద్ర్యమే. కుము పితృకులాన్ని చిన్నపుచ్చవలెననే ఉద్దేశములో డబ్బుప్రభా

వము మాట మాటిమాటికి ఎత్తుతున్నాడు. మధుసూదనుని స్వభావసిద్ధమైన నైచ్యమూ, మాటల కరుకూ, బడాయీ, ఎట్టిమార్దవమూ సుహృద్భావమూ లేని అతని మనస్సూ, ప్రతి దినమూ కుముమనస్సునూ, దేహాన్నీ, సంకోచముతోనూ, అసహ్యముతోనూ నింపేది. కుము, ఇవి తన కంటపడకుండా ఉండేటట్టు సాధ్యమైనంతవరకు తప్పించుకు తిరిగేది, వీటిని మనస్సులోనుంచి తొలగించుకోవలెనని ప్రయత్నించేది. కాని ప్రయత్నిస్తున్నకొలది ఆ దోషాలు మరీ స్పష్టమవుతూ వచ్చినవి. అతని విషయమై మనస్సులో పుడుతుండే అసహ్యముతో గొప్ప పోరాటము చేసింది. పతిపూజ తనకర్తవ్యమని నమ్మి పవిత్రమైన మనస్సుతో పూజచేదామని కుముచేసిన ప్రయత్నాలకు అంతములేదు. కాని అంతా వృథాఅయిందని ఇవాళ తెలిసినంత స్పష్టముగా ఇంతకు పూర్వం తెలియలేదు.

మధుసూదనునికీ తనకూ రక్తమాంససంబంధము స్థిరపడిపోయిందని తెలిసినప్పటినుండీ కుముమనస్సుకు భరింపరాని బాధ కలిగింది; దుఃఖిస్తూ మోతీతల్లిని, "నిశ్చయంగా ఏలాగు చెప్పగలవు?" అని అడిగింది.

మోతీతల్లికి అమితకోపం వచ్చింది, కాని కోపం ఆపుకొని జవాబు చెప్పింది—"పిల్లలతల్లిని నాకు తెలియకపోతే ఎవరికి తెలుస్తుంది? బాగా నిశ్చయంగా చెప్పడానికి ఇంకా కొన్నాళ్లు పడుతుంది, అయినా మంచి మంత్రసాన్ని పిలిపించి పరీక్ష చేయించుకోవడం మంచిది."

నవీన్, మోతీతల్లీ, హాబ్లూ వెళ్ళిపోయేవేళ అయింది. కాని దేవుడు తనకు చేసిన ఈ ఘోరఅన్యాయముమాట తప్ప కుము వేరు దేనిమాటా ఎంత ప్రయత్నించినా నేడు ఆలోచించలేకుండా ఉన్నది. కనుక అత్తవారింటివాళ్లను సాగనంపినప్పుడు మామూలు మాటలు రెండు తప్ప ఏమీ అనలేకపోయింది. "వదినా, ప్రపంచములో అన్నీ ఎప్పుడో ఒకనాడు అంతమవుతవి కాని నీ సేవచేయడానికి నాకుఉన్న అధికారము ఎన్నడో హఠాత్తుగా ఆగిపోతుందని నేను ఊహించలేను, త్వరలో కలుసుకుంటాము," అని నవీన్ అన్నాడు. అతను ప్రణామము చేశాడు, హాబ్లూ నిశ్శబ్దముగా ఏడుస్తున్నాడు, మోతీతల్లి ముఖం కఠినం చేసుకొని ఏమీ అనకుండా వెళ్ళిపోయింది.

౫౬

సమాచారము విప్రదాసు చెవినిపడ్డది. మంత్రసాని వచ్చింది, సందేహము పోయింది, కుము గర్భిణి అని స్థిరమైనది. మధుసూదనుకు కూడా ఈ కబురు తెలిసింది. మధుసూదన్ ధనం కోరాడు, కావలసినంత ధనం కూడింది, ధనానికి తగిన బిరుదు కూడా దొరికింది, ఇక తన మహిమను వంశపరంపరగా నిలబడేటట్టు చేయగలిగితే తన కర్తవ్యము నెరవేరినట్టే. మనస్సులో ఉల్లాసము పెరుగుతున్నకొలది చీకాకులన్నిటికీ మూలము విప్రదాసే అని నిశ్చయించాడు. విప్రదాసుకు ఇంకొకనోటీసు పంపాడు—Where as మొదలైన కోర్టుభాషతో ఆరంభించి,

I shall have the painful necessity మధ్యను పెట్టి, Your obedient servant తో ముగించి వ్రాసిన రెజిస్టర్డ్ ఉత్తరము అది. చాటర్జీ వంశస్థులపైని ఇటువంటి జడిపించు ఉత్తరాలఫలము అనుకున్నదానికి వ్యతిరేకం అవుతుంది, ముఖ్యముగా వాటి పరిణామం ప్రమాదకరం కావచ్చునని తెలిస్తేమాత్రము లొంగే స్వభావము కాదు చాటర్జీలది. ఉత్తరం కాలూకు చూపించాడు విప్రదాసు, కాలూముఖం ఎర్రగా అయిపోయింది. ఉత్తరం చూడగానే, "ఈలాంటి ఉత్తరం చదివితే నావంటి సామాన్యునికి కూడా శిరాల్లో రక్తం ఉడుకుతుంది, రాజులకూ చక్రవర్తులకూ అయినట్టుగా; ఎదుటనుండే సిపాయిని పిలిచి †'శిర్ లేవ్ ఉస్కా,' అని అన బుద్ధిపుడుతుంది," అని అన్నాడు.

పగటిపూట విప్రదాసుకు నానారకాల వ్రాతపని ఉండెను, అంతా ముగించుకొని సాయంకాలము కుమును రమ్మని కబురు పంపాడు, నేడు రోజంతా కుము అన్నయ్యదగ్గిరికి రానేలేదు. ఎక్కడో వెనకవెనకనే తిరుగుతున్నది.

విప్రదాసు మంచముమీదనుంచి లేచి కుర్చీమీద కూర్చున్నాడు, జబ్బుమనిషిలాగు పడుకొనేఉంటే మరీ దుర్బలంగా ఉంటుంది, కుముకోసము కుర్చీఒకటి ఎదుట వేయించాడు. దీపం గదిమూలను పెట్టించి ఏదో అడ్డు పెట్టించాడు. మీదను పంకా ఒకటి తిరుగుతున్నది. వైశాఖమాసాంతము, వేడి ఇంకా తగ్గలేదు, ఉండుండి వేడిగాలి మెల్లిగా వచ్చి ఆగి

† వాడి తల తీసేయి.

పోతున్నది, చెట్లఆకులు మనస్సిచ్చి ఏదో బహుశ్రద్ధగా వింటూ ఉన్నట్టుగా నిశ్శబ్దంగా ఉన్నవి. గంగ సముద్రములో పడిన చోట సముద్రపు నీలిజలానికిఉండే నీటికావిరంగు అంధకారములో అప్పుడు కనబడుతున్నది. చీకటిలో గోధూళి కాంతి ఇంకా అక్కడక్కడ కలిసిఉన్నది. తోటలోఉన్న చెరువు చెట్లునీడవల్ల కనబడడంలేదు. కాని పెద్దనక్షత్ర మొకటి నీటిలో ప్రతిబింబిస్తుండడముచేత ఆకాశము చెరువును తన వేలితో చూపిస్తున్నట్టున్నది. చెట్ల నడుమనుండి ఉండుండి నౌకర్ల రాకపోకలు జరుగుతున్నవి. గుడ్లగూబఅరుపు వినబడుతున్నది.

కుము, కొంచెం తడబాటుపడి, ఆలస్యం చేసింది, వచ్చి అన్నయ్యదగ్గిర కుర్చీమీద కూర్చొని అన్నది—"ఏమోగాని నాకేమీ బాగుండలేదు అన్నయ్యా, ఎక్కడికో వెళ్ళిపోదామని బుద్ధిపుడుతున్నట్టు ఉన్నది."

"పొరపాటుపడుతున్నావు కుమూ, బాగా సుఖంగా ఉంటావు, నాలుగురోజులు పోయాక బాగా సంతోషంగా ఉంటావు."

"అయితే—" అని ప్రారంభించి మరేమీ అనలేక పోయింది కుము.

"నాకు బోధపడ్డది, నీ బంధము ఎవరు తెంపగలరు ఇప్పుడు?"

"అయితే వెళ్లవలెనా అన్నయ్యా?"

"వద్దు అని చెప్పే అధికారం నాకికలేదు. నీసంతానాన్ని స్వగృహానికి వెళ్లకుండా చేయగలసాహసం నాకులేదు.

చాలాసేపటివరకు కుము ఏమీ అనలేదు, విప్రదాసూ మాట్లాడలేదు.

చివరకు కుము నెమ్మదిగా అడిగింది, "అలాగైతే ఎప్పుడు వెళ్లేది అన్నయ్యా ?"

"రేపే వెళ్లు, ఆలస్యం మంచిది కాదు."

"ఒక సంగతి నీకు తెలిసే ఉంటుందిఅనుకుంటాను అన్నయ్యా, ఈసారి వెళ్లితే నిన్నుచూడడానికి నన్ను ఎప్పుడూ ఇక్కడికి రానియ్యరు."

"అహా, అది నేనూ బాగా ఎరుగుదును."

"అయితే సరే. ఇంకొకసంగతి నీతో చెప్పాలి అన్నయ్యా—ఎన్నడూ దేనికైనాకూడా నీవు వాళ్ల ఇంటికి రాకూడదు, నిన్నుచూడాలని నాప్రాణాలు కొట్టుకుపోతుంటవి, అయినా నిన్ను ఎప్పుడూ చూడలేను, నీవు అక్కడికి వస్తే చూచి భరించలేను."

"ఆవిషయమై భయపడకు కుమూ."

"నిన్ను కష్టాలలో పెట్టాలని అనేకప్రయత్నాలు చేస్తారు."

"వాళ్లు చేయగలదంతా చేసేసరికి వాళ్లశక్తికూడా సన్నగిలిపోతుంది. అప్పుడు నాకు పరిపూర్ణస్వాధీనతవస్తుంది. అటువంటివాటికి కష్టాలని అంటావెందుకు?" అని విప్రదాసు అన్నాడు.

"అప్పటికి నాకుకూడా స్వాధీనత వస్తుంది అన్నయ్యా, వాళ్ల బిడ్డను వాళ్లకు అప్పచెప్పేస్తాను—బిడ్డకొరకై శాశ్వత

కాలమూ మనము ఆ ఇంటిని పట్టుకొని ఉండవలసిన అవసరం ఉండదు కదా !"

"సరే, అది అంతా ఆలోచిద్దాము తరువాత, ముందు బిడ్డ పుట్టనీ."

"నీవు నమ్మవుగాని నిజము ఏమిటో తెలుసునా—అమ్మ, కోరి మరీ చచ్చిపోయింది. సంసారములో తనకు తన యథార్థ స్థానం దొరకలేదు, కనుకనే తనకొడుకులనూ, కూతుళ్లనూ అంతసులభంగా వదిలిపెట్టి పోగలిగింది. నిజంగా ముక్తిని కోరేవారిని ఎంతమాత్రం మనము పట్టిఉంచలేము. నేను నీ చెల్లెలినే అన్నయ్యా, నాకూ ముక్తి కావాలి. నా బంధం ఏనాడు తెంపుకుంటానో ఆనాడు అమ్మ నన్ను ఆశీర్వదిస్తుంది—నేను చెపుతున్నాను జ్ఞాపకం ఉంచుకో."

తరువాత చాలాసేపటివరకు ఇద్దరిలో ఎవరూ మాట్లాడలేదు, ఝెం మని హఠాత్తుగా ఒకవిసురుగాలి వచ్చింది. విప్రదాసు చదువుతుండే పుస్తకం టీపాయ్ మీదనున్నది—దాని కాగితాలు ఫర్ ఫర్ మని తిరగబడ్డవి, పూలతోటలో నుంచివచ్చిన మల్లిపువ్వులవాసనతో గది నిండింది.

కుము—"వాళ్లు నన్ను కోరి దుఃఖపెడుతున్నారనుకోకు అన్నయ్యా, వాళ్లు నన్ను సుఖపెట్టలేరు—నా పుట్టుకే ఆవిధము ! నేనూ వాళ్లను సుఖపెట్టలేను, వాళ్లను ఎవరు సుఖపెట్టగలరో వాళ్లస్థానాన్ని నేను ఆక్రమించుకొని కూర్చోవడంవల్ల ఏదో ఒక కష్టం సంభవించడమేతప్ప ఏమీ ప్రయోజనం లేదు.

అట్లాంటప్పుడు నటనా మోసమూ ఎందుకు ? అపరాధంఅంతా నాదే, వాళ్లతప్పేమీ లేదు. కాని ఎప్పుడో ఒకనాడు వాళ్లకు ముక్తిని ఇస్తాను, నేనూ ముక్తి పొందుతాను. నేను తప్పక వచ్చేస్తాను ఒకనాడు—చూస్తూ ఉండు. నేను 'మిథ్య' అయి, మిథ్యమధ్యను జీవితం గడపడం నాకు సాధ్యంకాదు. కుముద్నై ఉండక, వాళ్లఇంటి పెద్దకోడలనై ఉండమంటే దానికేమైనా అర్థమున్నదీ ? 'దేవుడు అంటే నీకు నమ్మకము లే' దన్నయ్యా, నాకు ఉన్నది. మూడుమాసాలక్రితం ఉండేనమ్మకంకంటె గట్టి నమ్మకం కలిగింది ఇప్పుడు. ఇవాళ రోజంతా ఒక్కసంగతి ఆలోచిస్తూ కూర్చున్నాను—నాలుగువైపులా అన్నీ తక్కిరిబిక్కిరిగా ఉన్నవి, అయినా ఈ కనబడే గందరగోళముతప్ప జగత్తుఅంటూ వేరేదీ లేదని నాకు అనిపించడంలేదు. ఇది పోగా మిగిలినజగత్తు సూర్యచంద్రుల సాయమువల్ల తనపని తాను చేసుకుపోతున్నది. ఆ మిగిలినదానిలోనే వైకుంఠం ఉన్నది, అక్కడే ఉన్నాడు నా దేవుడు. ఇవన్నీ నీతో చెప్పడానికి సిగ్గువేస్తుంది అన్నయ్యా, కాని ఇప్పుడు చెప్పకపోతే మరి చెప్పడమేకాదు. కనుక ఇవాళ చెప్పేయనీ—లేకుంటే నీవుకూడా నాగురించే ఆలోచిస్తూ విచారిస్తుంటావు. అంతాపోయినా, మిగిలిఉన్నది ఉంటుంది అని నాకిప్పుడు బోధపడ్డది—అదే నాఅనంతము, నాదేవుడు—ఆ సంగతి నాకు బోధపడి ఉండకపోతే ఈక్షణమే నీపాదాలదగ్గిర తల పగలగొట్టుకొని చచ్చిపోయి ఉండేదానను, ఆ ఖైదులోకి తిరిగి దూరబోను ! నీవు ఉండబట్టే, ఇది నేను బోధపరుచుకో

గలిగాను అన్నయ్యా." ఇలాగు అంటూ కుము అన్నయ్య కాళ్లకు ప్రణామం చేసింది. బాగా రాత్రి అయింది. కిటికీలో నుంచి బయటికి చూస్తూ ఏదో ఆలోచిస్తూ చాలాసేపు కూర్చున్నాడు విప్రదాసు.

## ౬౦

మర్నాడు ఉదయమే విప్రదాసు కుముకు కబురు పంపాడు రమ్మని. కుము వచ్చింది, విప్రదాసు ఒళ్లో ఎస్‌రాజ్ పెట్టుకొని, మంచముమీద కూర్చొని ఉన్నాడు, ఇంకొక ఎస్‌రాజ్ పక్కను పడుకోబెట్టి ఉన్నది. "ఇది పట్టుకో ఇద్దరం కలిసి వాయిద్దాము," అన్నాడు అన్నయ్య. ఇంకా బాగా వెలుతురు రాలేదు. చల్లగాలి రావిచెట్టుఆకులమధ్య జరజర మంటున్నది, కాకులఅరుపులు ఆరంభంఅయినవి. తోడి రాగముమీద ఆలాపన ప్రారంభించారు—శాంతంగానూ, గంభీరంగానూ ఉన్నది—మనసును కరిగిస్తున్నది. వాయిస్తూ ఉండగానే పూలతో నిండిఉన్న తురాయిచెట్టుఆకులమధ్యనుండి వెలుతురు పడుతున్నది, తోట ప్రహారీమీదినుండి సూర్యుడు ఉదయిస్తున్నాడు. నౌకరు ద్వారందాకా వచ్చి తిరిగి వెళ్లి పోయినాడు, గది తుడవడం జరగలేదు. క్రమక్రమంగా గదిలోకి ఎండవచ్చింది, దర్వాన్ నెమ్మదిగా వచ్చి వార్తా పత్రికను టేబిల్‌మీద ఉంచి తిరిగి మెల్లిగా వెళ్లిపోయినాడు. వాయిద్యం ఆపి చివరకు విప్రదాసు, "నాకు మతం అంటూ ఏమీ లేదని నీఅభిప్రాయమా కుమూ ?" అని కుముని అడిగాడు

మాటలద్వారా నామతాన్ని వర్ణించబోతే నాలుగు మాటలలో అంత అయిపోతుంది, అందుచేతనే నేను ఏమీ అనను. దానిరూపాన్ని నేను సంగీతములో చూడగలుగుతున్నాను—ఎంతో దుఃఖమూ, ఆనందమూ అందులో మిళితమై ఉన్నవి—దానికి పేరుపెట్టడం సాధ్యముకాదు. నీవు ఇవాళ వెళ్లిపోతున్నావు కుమూ, మరి నాకు కనబడవేమో. నిన్ను, ఈవాళ అన్నిరకాల అపస్వరాలనూ, అర్థములేని కలయికలనూ దాటించి, తీసుకువెళ్లవలెనని నా కోరిక. శాకుంతలము చదివావు కదూ కుమూ?—దుష్యంతుని ఇంటికి శకుంతల బయలుదేరినప్పుడు, కణ్వమహాముని ఆమెతో కొంతదూరము వచ్చాడు. ఆమె చేరవలసినలోకం చేరుకోకముందు ఎంతో దుఃఖమూ అవమానమూ అనుభవించవలసి వచ్చింది—కాని శకుంతల ఆ దుఃఖములోనే ఉండిపోలేదు చివరకు ఆమెకు పరిపూర్ణమైన శాంతిగల తావు దొరికింది. మనము ఇప్పుడు పాడిన పాటలో అనుభవించినది ఆశాంతే. అటువంటి పరిపూర్ణతే నీవు పొందుదువు గాక అని సర్వాంతఃకరణముతో నేను నిన్ను ఆశీర్వదిస్తున్నాను, ఆ పరిపూర్ణతే నిన్ను బయటనూ లోపలనూ నింపి నీ దుఃఖాన్నీ, నీ అవమానాన్నీ తనలో ముంచివేసుకొనును గాక!”

కుము మాటాడలేదు, అన్నపాదాలమీద తలనుఉంచి ప్రణామముచేసింది, లేచి బయటికి చూస్తూ కిటికీదగ్గర నిలబడ్డది. కొంతసేపుఅయిన తరువాత, “నీకు రొట్టె టీ తెచ్చిస్తానన్నయ్యా,” అని అంటూ బయటికి వెళ్లింది.

మధుసూదన్ ఉదయమే జ్యోతిష్కుని పిలిపించి వెళ్ల డానికి ముహూర్తం నిర్ణయించాడు—ఇవాళే పది తరువాత మంచిదిఅట. జరీపనిచేసిన ఎర్రబనాతు బురకాతో పల్లకీ శుభముహూర్తాన విప్రదాసుగారి ఇంటి ఎదుటికి వచ్చి ఆగింది. ఇత్తడికట్ల లాఠీలు చేతుల్లో పట్టుకొన్న దవాలీ బంట్రోతులు అనేకమంది వచ్చారు, గొప్పసందడి చేసుకొంటూ మహారాణిని మిర్జాపూర్ మధు ప్రాసాదానికి తీసుకువచ్చారు. నహాబత్ సనాయిలు వాగుతున్నవి, బ్రాహ్మణ సంతర్పణకు ఏర్పాటు జరిగింది.

౬౧

విప్రదాసు గదిలోకి 'మాణిక్' గిన్నెతో బార్లీ తీసుకు వచ్చాడు, విప్రదాసు మంచముమీదను లేడు, కిటికీదగ్గిరికి కుర్చీ లాగుకొని నిశ్చలంగా కూర్చొని ఉన్నాడు, నౌకరు బార్లీ తేవడం అతను చూడనే లేదు. మరి కొంతసేపటికి క్షేమఅత్త పథ్యం తీసుకొని వచ్చి, విప్రదాసు భుజముమీద చెయ్యివేసి, "విపూ చాలా వేళఅయింది బాబూ," అన్నది.

విప్రదాసు కుర్చీమీదనుంచి లేచి, మెల్లిగా వచ్చి, మంచముమీద పడుకున్నాడు. కుముదను వాళ్లు ఎంత వైభవంగా, బాజా బజంత్రీలతో, ఇంటికి తీసుకు వెళ్లారో అది అంతా వర్ణిద్దామని క్షేమ వచ్చింది. కాని విప్రదాసు గంభీరంగా ఉండడము చూచి ఏమీ చెప్పలేక పోయింది. విప్రదాసు అడుగందని శూన్యత లోనికి చూస్తున్నాడని అనిపించింది క్షేమకు.

"కాలూను పిలిచేయి పిన్నీ," అన్నాడు విప్రదాసు. ఈ సామాన్యమైన మాటలుకూడా క్షేమఅత్తకు ఎక్కడో అదృష్టముయొక్క నిశ్శబ్దఛాయలలోనుండి వస్తున్నట్టుగా తోచింది, ఆమె ఒంట్లో గగుర్పు పుట్టింది.

కాలు రాగానే విప్రదాసు అతని చేతిలో ఉత్తరం పెట్టాడు—సుబోధ్ సీమనుంచి వ్రాసిన ఉత్తరం అది. ఆఖరి †బార్ డిన్నర్ కాక పూర్వమే వచ్చేస్తే, దానికని తిరిగి ఇంగ్లాండ్ వెళ్ళవలసి ఉటుందనీ, దానివల్ల వృథా ఖర్చులవుతవనీ, తాను మాఘ ఫాల్గున మాసాల లోపుగా రావచ్చుననీ సుభోద్ ఆ ఉత్తరములో వ్రాశాడు—డబ్బు ఏర్పాట్లు అటు పిమ్మట చేసుకోవచ్చును, దానివల్ల ఆట్టే ఇబ్బంది ఉండకూడదని ఆశిస్తున్నానని కూడా ఉత్తరములో తెలియజేశాడు.

విప్రదాసుతో డబ్బువిషయమై మాట్లాడుతూ అతని మనస్సుకు మరీ బాధ కలిగించడం కాలూకు ఇష్టములేక, ఈలాగు అన్నాడు—

"అప్పు తత్క్షణం తీర్చవలసిన అవసరంలేదు బాబూ, ఈలోగా మనము ఏమీ గందరగోళము చేయకపోతే ఎటువంటి తొందరా ఉండకూడదు—ఏమైనప్పటికీ నీవేమీ భయపడకు బాబూ."

"నాకేమీ భయంలేదు కాలూ, ఏమాత్రమైనా లేదు."

---

† Bar dinner.

విప్రదాసు భయపడడం చూస్తే కాలూకు చాలా కష్టంగా ఉండేది, భయపడకపోవడం చూస్తే మరీ కష్టంగా ఉన్నది.

వార్తాపత్రిక తీసి చదవడం ప్రారంభించాడు విప్రదాసు. అప్పువిషయమై మాట్లాడడానికి అతనికి ఇష్టములేదని కాలూ బోధపరుచుకొన్నాడు. వ్యవహారం సంగతులు ముగించి కాలూ మామూలుగా వెళ్ళిపోయేవాడు, కాని ఇవాళ వెళ్లలేదు, నెమ్మదిగా పక్కను కూర్చున్నాడు. ఏదో సేవచేయాలని బుద్ధి పుట్టి కొంతసేపైనతరువాత, "ఆ కిటికీ వేసేసేదా బాబూ, ఎండ పడుతున్నది?" అని అన్నాడు.

చెయ్యి ఆడించాడు విప్రదాసు, వద్దని తెలియజేస్తూ.

కాలూ అక్కడే కూర్చున్నాడు. అన్నగదిలో ఇవాళ కుము లేదు, ఆశూన్యతే అన్నహృదయాన్ని నింపి ఉన్నది. మంచముకింద పడుకొనిఉన్న కుక్క, టామ్, హఠాత్తుగా ఏడ్చింది—టామ్ కుము వెళ్ళిపోవడము చూచింది, ఏదో కొంత తెలిసింది దానికి, కాని బాగా బోధపడ్డట్లు లేదు.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1954.

# గృహప్రవేశం

ప్రేమతో నిండిఉన్న పూర్ణ జీవనము సార్థక మానవజీవనము. ఆజీవనము సంపాదించుటకు మానవుడు చేయవలసిన ప్రయత్నము మనలోపురికొల్పి దానికి తగిన ఉత్సాహము మనలో పుట్టించడానికి విశ్వహృదయము సదా కనిపెట్టుకొని ఉంటుంది. అట్టి విశ్వహృదయము ఠాకూర్ గారువ్రాసిన ఈనాటకములో, అక్కబిడ్డలకు తనసర్వమునూ అర్పించి తనజీవనము సార్థకపరుచుకొనగోరుతున్న పిన్నిహృదయముద్వారా వ్యక్తమవుతున్నది. బాహ్యచక్షువుకు కనబడని సంపదకోసమూ, స్థూలనేత్రానికి కనబడని సహవాసము కోసమూ మనుష్యుడు తన యావదాస్తి ధారపోసి ప్రయత్నముచేస్తున్నప్పుడు అటువంటి పిన్నిహృదయము, పూర్తిగా స్వార్థరహితమైనది కావడముచేత, వివేకముబోధపరచడానికి బయలుదేరదు. తనకు చేతనైనంతవరకు ఆప్రయత్నములో తోడ్పడుతుంది.

అక్కకొడుకు తనడబ్బంతా ఖర్చుపెట్టి ఊర్వసివంటి తనభార్య మణియెడల తనకుగల అనురాగాన్ని ఎల్లకాలమూ లోకానికి చాటించగలిగే "తాజ్ మహల్"ను కట్టించబోయినప్పుడు, అది కేవలము వృథాప్రయాస అని తెలిసినా, మనస్ఫూర్తిచేసే ఏప్రయత్నమూ వృథాకానేరదని నమ్మి పిన్నిచేసిన హెచ్చరిక అతి మనోహరమైనది.

పూర్తికాని, ఆ తాజ్ మహల్ లో గృహప్రవేశం చేయించబోయిన పిన్ని హృదయాన్ని మనహృదయాలలో గృహప్రవేశం చేయించి, షాజహాన్ చక్రవర్తి కట్టించిన తాజ్ మహల్లు ఎన్నైనా ఇవ్వలేని శాశ్వతపదవిని ఆ పిన్నిహృదయానికి ఈనాటకముద్వారా రవీంద్రుడు ఇస్తున్నాడు.

1-4-0

రవీంద్రనాథ ఠాకూర్ గారి

# కథాగుచ్ఛము

రవీంద్రుని కథాగుచ్ఛాలలో ఉండే కథలు కొన్ని చాలాచిన్నవి, కొన్నిచాలా పెద్దవి. పద్దెనిమిది పేజీల 'కాబూలివాలా' అందులోదే. ఎనభై పేజీల 'రాసమణికొడుకూ' అందులోదే. 1892-వ సంవత్సరములో వ్రాసిన "సెలవులు" అనేచిన్నకథలో నైతేనేమి, 1917-వ సంవత్సరములో రచియిం చిన "ఒకటవనంబరు"లో నైతేనేమి, రవీంద్రుడు కవీంద్రుడని సార్థకపరచిన అద్భుతశక్తి పూర్తిగా వ్యక్తమవుతున్నది. కథలుచెప్పేనైపుణ్యములో రవీం ద్రునితో పోలినవారు ఎక్కడో గాని ఉండరు. కాని, రవీంద్రునిలో ఉన్నది అట్టి అపూర్వరచనానైపుణ్య మొక్కటే కాదు. మనహృదయములోని రహస్యాలు కనుగొన్నవాడు ఆయన, కనుక ఇతరుల అనుభవాలు అతను చెప్పే ప్రతిచిన్నసంగతిద్వారా, ప్రతికథద్వారా మన అనుభవములో ప్రవేశించగలవు. రవీంద్రుడు మనకు కథలుచెపుతూఉన్నప్పుడు ఆయన చేసేది కేవలము మనచేత తనయింపైన కథలను వినిపించడమే కాదు; సజీవు లైన స్త్రీపురుషులమధ్యనూ మన అన్నదమ్ములు అక్కచెల్లెళ్ల మధ్యనూ, తలి తండ్రులమధ్యనూ, మిత్రులమధ్యనూ శత్రువులమధ్యనూ, మనసు తీసుకువెళ్లి కూర్చోబెడతాడు. వారి ఆనందము మన ఆనంద మవుతుంది, వారిదుఃఖము మనలో మానవదుఃఖమును నివారణచేసే ఉద్యమము పుట్టిస్తుంది; వారికికలిగే ఆశాభంగము మనకు ఆశలేనివారిగా చేయడానికి మారుగా మనలో క్రొత్త ఉత్సాహము పుట్టించి, మానవహృదయములోని ఆశలను సఫలముచేసే క్రొత్త యత్నము మనలో పురికొల్పుతూఉంటుంది.

మొదటి భాగము

1 రాసమణికొడుకు. 2 కాబూలీవాలా. 3 భాయిఫోటా. హైమంతి. 5 ఎండానీడా. (220-పుటలు) 2-8-0

## రెండవ భాగము

1 ప్రతిజ్ఞాపాలన. 2 సెలవులు. 3 అపరిచిత. 4 మాస్టరుగారు. 5 భార్యవ్రాసిన ఉత్తరము. 6 ఒకటవ నంబరు. (230-పుటలు) 2-8-0

## మూడవ భాగము

1 అక్క. 2 చిక్కు. 3 నోటుబుక్కు. 4 రామకనయ్యని బుద్ధిహీనత. 5 నగదు. 6 హేమమృగము. 7 అతిథి. 8 దానప్రతిదానములు. 9 చివరరాత్రి. 10 దాలియా. 11 అనధికారప్రవేశము. (230-పుటలు) 2-8-0

## నాల్గవ భాగము

1 మానభంజనం. 2 ఆ ఒక్కరాత్రి. 3 యుక్త వయస్సు. 4 పోస్టుమాస్టర్. 5 శాస్తి. 6 బిరుదు వెర్రి. 7 ముక్తి. 8 మహామాయ. (176-పుటలు) 2-8-0

# పోస్టాఫీస్

మనుష్యుడు ప్రయోగిస్తూఉన్న శిక్షవల్ల లోపునఉన్న జీవనావేగము పూర్తిగా చల్లారని చిన్నపిల్లవాడు చేసేపనులవల్లా, కోరే కోరికలవల్లా, కనపరిచే అనురాగమువల్లా, పూర్ణవికాసముపొందినజీవనము ఏరీతిగా ఉంటుందో సూచించే నాటకము.

యింపైన కథ చెపుతూ మన మనస్సులను వేదనతో నింపి, ఆవేదన ద్వారా ముక్తజీవనము సంపాదించడానికి చేయవలసిన ప్రయత్నము మనలో పురికొల్పే శక్తి రవీంద్రునిలో చాలా ఉన్నది. ఆశక్తి ఈనాటకములో అతి మనోహరముగా వెల్లడి అవుతున్నది. 0-12-0

# స్టిల్ మాంద్ మేజిస్ట్రేట్

## బెల్జియమ్‌కవి మేతర్‌లింక్ రచియించిననాటకం

మాతృభూమి పేరు చెప్పి, నాగరికత విస్తరింపజేయడమని వంకపెట్టి, నిజముగా తమను తాము భ్రమలో పెట్టుకొని కొందరూ, కేవలము ఇతరులను మాత్రము భ్రమలో పెట్టి స్వార్థమును కోరేవారు కొందరూ, మానవహృదయములో ఉండే మధురమైనదానిని కాళ్లక్రింద వేసి నలిపివేయు ప్రయత్నము చేస్తున్నారు. తమలోగాని, ఇతరులలోగాని, గొప్పవారిలోగాని, బీదవారిలోగాని, తమదేశస్థులలోగాని, ఇతరదేశస్థులలోగాని, విలువైనది విలువైనదే గనుక సంరక్షించనగినదని నమ్మి, తమప్రాణాలనైనా ఇచ్చి కాపాడిఉంచడానికి సిద్ధముగా ఉండేవారుకూడా ఈ లోకములో లేకపోలేదు.

ఈ రెండుతరహాల స్వభావాలుగల మనుష్యులలోఉండే, వ్యత్యాసమూ, వారువారు చేయగల న్యాయాన్యాయాలూ మనస్సును కరిగించే నాటకరూపముగా మేతర్‌లింక్ మహాకవి ఈ పుస్తకములో సూచించాడు.

మేతర్‌లింక్ రవీంద్రనాథునివలె 'నోబెల్ ప్రైజ్' అనే బహుమానమును 1911-వ సంవత్సరములో పొందాడు. 1-0-0

# ప్రాయశ్చిత్తము

వేరువేరు తరహాల స్త్రీపురుషుల స్వభావములతో నిర్మింపబడ్డ చక్కని కథ. ఎవరికైనను కోపము తెప్పించు దుర్మార్గత కనపరిచే స్వభావముగలవారు ఈలోకములో లేకపోలేదు, 'ఇంత సాధుత్వము ఈ మానవప్రపంచములో ఉండగలదా?' అనుఊహను మనలో కల్పించు నైజముకూడ అక్కడక్కడ లేకపోలేదు.

వీరును ఈరెండుజాతులమధ్యను ఉండు అనేక తరగతుల స్త్రీ పురుషులును తమతమ స్వభావానుసారముగా వర్తించుటవలన ఏర్పడ్డ ప్రపంచము ఈ నవల. [300 పుటల నవల] 3-0-0

నిరుపమాదేవి రచియించిన

# అన్నపూర్ణమందిరము

దారిద్ర్యపిశాచము మనుష్యులను పడదోసి నాశనముచేయ నిశ్చయించుకొన్నను మానిహాని కలుగజేయుచునట్టి ఎట్టి ప్రలోభనమునకును లోబడక సనాతన మానవసంప్రదాయములు తన మనస్సున నాటించియుంచిన ఆత్మశక్తియే ఆధారముగా చేసికొని, నిజమైన స్వగౌరవమును నిలువబెట్టుకొనుటకు మానవుడు చేయగల అసాధారణప్రయత్నము నిరుపమాదేవి రచియించిని 'అన్నపూర్ణమందిర' మను ఈ నవలలో మిక్కిలి దీనమగు కుటుంబమునందు స్త్రీ పురుషుల సామాన్యజీవితమువూలమున మిగుల మనోహరముగ సూచింపబడుచున్నది. అజ్ఞానమువలన మనసంఘమున పుట్టిన దురాచారములకు బలియగుచున్న మనకుకలుగు బాధను, దుఃఖమును వెల్లడిచేయుచున్నను, సరియైన శిక్షనొందినచో మానవునియాత్మ నీచమార్గముల నవలంబింపక చావునకైనను సిద్ధపడి సంపూర్ణతను బొందయత్నించునని నిరుపమాదేవి ఈ నవలలో నిరూపించుచున్నది. ఏదేశమునకైన అధికముగ దుఃఖమొందువారు స్త్రీలే కాబోలు! పాఠకుల హృదయములను వేదనతోను నేత్రములను శత్రువులతోనునింపు కథమూలమున స్త్రీయే అట్టి దుఃఖమును ఈ నవలలో వర్ణించుచున్నది. **3-0-0**

# ఇంటా బయటా

ముగ్గురు ముఖ్యపాత్రలు తమతమ అవస్థలనుండి వేరువేరుగా చెప్పి కలిపిఅల్లిన మూడు హాయలజట ఈ కథ.

కవులలో అగ్రస్థానానికి అర్హుడైన రవీంద్రనాథుని గ్రంథాలలో మొదటివరుసను ఉంచదగిన గ్రంథము ఈ "ఇంటా బయటా". **4-0-0**

# విశ్వభారతి గ్రంథమాల

**రవీంద్రనాథ ఠాకూర్ రచనః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యోగవియోగములు | | ... | 4 | 8 | 0 |
| పడవమునుక (నవల 560 పుటలు.) | | | | | |
| ఆట్టబైండు - గ్లేజుకాగితం | 560 పుటలు | | 5 | 0 | 0 |
| ,, 1-భాగం | 280 ,, | | 2 | 8 | 0 |
| ,, 2-భాగం | 280 ,, | | 2 | 8 | 0 |
| ఇంటాబయట | నవల | ... | 4 | 0 | 0 |
| ప్రాయశ్చిత్తము | ,, | ... | 3 | 0 | 0 |
| గృహప్రవేశం | నాటకం | ... | 1 | 4 | 0 |
| పోస్టాఫీస్ | ,, | ... | 0 | 12 | 0 |
| కథాగుచ్ఛము | మొదటిభాగం | ... | 2 | 8 | 0 |
| కథాగుచ్ఛము | రెండవభాగం | ... | 2 | 8 | 0 |
| కథాగుచ్ఛము | మూడవభాగం | ... | 2 | 8 | 0 |
| ,, | ,, | ప్రథమఖండం | 1 | 4 | 0 |
| ,, | ,, | ద్వితీయఖండం | 1 | 4 | 0 |
| కథాగుచ్ఛము | నాల్గవభాగం | ... | 2 | 8 | 0 |
| కథాగుచ్ఛము | ఐదవభాగం | ... | 2 | 8 | 0 |
| కథాగుచ్ఛము | ఆరవభాగం | ... | 2 | 8 | 0 |
| చతురంగం | | ... | 1 | 8 | 0 |
| **నిరుపమాదేవి రచన:** అన్నపూర్ణమందిరము నవల | | | 3 | 0 | 0 |

**మారిస్ మేతర్ లింక్:**

(నోబెల్ ప్రైజుపొందిన బెలిజియం దేశపు కవి)

| | | | | |
|---|---|---|---|---|
| స్టీల్ మాంద్ మాజిస్ట్రేట్—నాటకం | ... | 1 | 0 | 0 |
| శరత్ చంద్ర చట్టోపాధ్యాయ—చిన్నక్క | | 0 | 8 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.